

ప్రచురణ సంఖ్య : 957

ప్రతుల సంఖ్య : 2050

ప్రథమ ముద్రణ : ఫిబ్రవరి, 1980

వెల : రు. *10-00*

ముద్రణ :

స్వతంత్ర ఆర్టు ప్రింటర్సు,

విజయవాడ-520004.

# విషయ సూచిక

# ప్రవేశిక

రష్యన్ విప్లవంగా పేరుపొందిన 1917 అక్టోబరు సోషలిస్టుమహా విప్లవం, జారిస్టు రష్యా సామ్రాజ్య నిగళబద్ధులయిన ప్రజలకు సంబంధించినంతవరకు గతంతో పూర్తిగా తెగతెంపులే అయింది. అటుతర్వాత సోవియట్ దేశ ప్రజానీకం పూర్తిగా వినూత్నమైన సమాజ— సోషలిస్టు సమాజ— నిర్మాణానికి ఉపక్రమించారు. దీంతో పాత సామాజిక విలువలన్నిటికీ చెల్లుచీటీ యిచ్చి, అనాదిగా మహా మనీషులైనవారు కలలు గనడానికీ, ఊహించడానికి మాత్రమే సాహసించిన నూతన విలువలను పాదుకొల్పేందుకై సోవియట్ ప్రజ నడుం బిగించింది.

వారు నిర్మించిన సమాజం ఎటువంటిది? ఈ నవసమాజంలో వ్యక్తికి వ్యక్తికి మధ్య ప్రభుత్వానికీ—వ్యక్తికి మధ్యగల సంబంధాలను నియంత్రిత మొనర్చే ప్రమాణా లెట్టివి? ఈ సమాజంలో వ్యక్తికి ఆస్తికి గల సంబంధ మెలాంటిది? ఆలోచనాపరులైన వారందరిలోనూ ఆసక్తిని రేకెత్తించే ప్రశ్నలివి. అక్టోబరు మహా విప్లవాన్ని జ్వాలలలో ప్రభవించిన సోషలిస్టు సోవియట్ యూనియన్, అరవై యేళ్ళపాటు మనగలగడమే కాదు, దినదిన ప్రవర్ధమానమై బలోపేతమయింది; అతితీవ్రమైన సవాళ్ళను విజయవంతంగా ఎదుర్కొంది; తన అజేయమైన శక్తిని నిరూపించుకుని, సకల మానవాళి హృదయాల్లోనూ ఆశా జ్యోతిని వెలిగించింది. అందుకనే యీ ప్రశ్నలకు మౌలిక ప్రాధాన్యత వుంది. 1977 సోవియట్ రాజ్యాంగం పీఠిక ఇలా పేర్కొంది: "దేశభక్త మహాయుద్ధంలో చారిత్రాత్మకవిజయం సాధించిన సోవియట్ ప్రజల వారి సాయుధ బలగాల అజరామర వీర కృత్యం సోషలిజం బలాన్ని విస్పష్టంగా నిరూపించింది. ఈ విజయం సోవియట్ దేశ అంతర్జాతీయ ఖ్యాతిని, పలుకుబడిని సుదృఢమొనర్చడమే

గాక ప్రపంచ వ్యాప్తంగా సోషలిజం, జాతీయ విముక్తి, ప్రజాస్వామ్యం, శాంతి శక్తులు మరింత బలోపేతమయ్యేందుకు దోహదం చేసింది" మానవజాతి పెట్టుబడిదారీ విధానం నుండి సోషలిజానికి యుగారంభమైన మలుపు తిరిగి, సోవియట్ ప్రజలకు సంబంధించినంతవరకు మానవాళిని యుగయుగాలుగా పట్టి పల్లారుస్తున్న సమస్యలను పరిష్కరించిన ప్రవర్తిత సోషలిస్టు సమాజ నిర్మాణంవైపు అది పురోగమించడం సాధ్యమొనర్చిన కొత్త తరహా రాజ్యవ్యవస్థ అయిన సోవియట్ రాజ్యవ్యవస్థ అంతర్నిర్మాణం గురించి తెలుసుకోవాలనే గాఢమైన కోర్కె ఎవరికైనా వుండడం సహజమే. సోవియట్ ప్రజలు సాధించిన విజయాలు ప్రపంచ మానవాళి ఆశలు, ఆశయాలకు ప్రతీకలు.

సోవియట్ న్యాయ వ్యవస్థ రూపురేఖలను దిఙ్మాత్రంగా చిత్రించడానికి యత్నించాను. సోవియట్ రాజ్యాంగ చట్ట మౌలిక లక్షణాలను కొన్ని ప్రధాన జీవన రంగాలకు వర్తించే సోవియట్ చట్టాల మౌలికాంశాలను వివరించేందుకు ఇందు పూనుకోవడం జరిగింది.

1977 నాటి సోవియట్ రాజ్యాంగ చట్టాన్ని ప్రపంచంలోకెల్లా అత్యంత శైశవ ప్రాయపు రాజ్యాంగచట్టమని న్యాయమూర్తి హరి స్వరూప్ అన్నారు. కాని, ఈ రాజ్యాంగచట్టం ఆకాశం నుండి వూడిపడలేదు. గత సోవియట్ రాజ్యాంగచట్టాలు, కొత్త రాజ్యాంగచట్టానికి ప్రాతిపదికలయిన 1918 రాజ్యాంగ చట్టానికి పూర్వపు డిక్రీలు (వీటి పేరు అక్టోబరు డిక్రీలు)– వీటి నుండి రూపొందినదే ప్రస్తుత రాజ్యాంగచట్టం. వీటిలో ప్రతిఒక్కటీ. ఒక్కొక్క నిర్దిష్ట దశలో సోవియట్ సమాజ అభివృద్ధిని ప్రతిబింబిస్తూ, దానికి సంబంధించిన ప్రమాణాలనూ, విలువలనూ తనలో పొందుపరచుకొని వుంది.

సోవియట్ ప్రభుత్వం తొలిరోజులనుండే, సకల పౌరులకు దేశానికంతటికీ, వర్తించే మౌలికమైన చట్టాలను చేయడం గమనార్హం. విప్లవ నాయకులకు భవిష్యదభివృద్ధి పథం విషయమై స్పష్టమైన అభిప్రాయాలుండినాయి. అంతేగాదు, దాన్ని సాధించేందుకు వెంటనే ఏమి చేయాలో కూడా వారికి బాగా తెలుసు. రష్యాదేశపు కార్మిక, కర్షకులు అధికారం హస్తగతం చేసుకున్ననాడే 1917 అక్టోబరు 25 (నవంబరు–7) న

ప్రారంభమైన అఖిల రష్యా సోవియట్ల మహాసభ విప్లవానికి చట్టబద్ధత చేకూర్చడమేగాక, మహోత్సాహంతో అనేక చట్టాలను ఆమోదించి, విడుదల చేసింది. ఈ మహాసభ నిర్ణయాలు విజ్ఞప్తులు, డిక్రీలు తీర్మానాలుగా పిలువబడ్డాయి. వాటి ప్రాధాన్యత ఎంతో మహత్తరమైనది. కార్మికులు, సైనికులు రైతులకు అది చేసిన మొట్టమొదటి విజ్ఞప్తిలోనే సోషలిజం విజయం సాధించిందని ప్రకటించి అధికారాన్ని హస్తగతం చేసుకుంది. రాజ్యాధికారం కార్మికులు కర్షకుల హస్తగతం కావడంతో సామాజిక మౌలికమైన పరిణామం జరిగింది: ఈ సత్యం విస్పష్టం గావించబడింది. పాత సామాజిక వ్యవస్థకు అంకితమైపోయిన సేనా నాయకుల ఆధిపత్యంలోనున్న జారిష్టు సైన్యంపై కార్మికులు, కర్షకులు సహజంగానే ఆధారపడలేకపోయారు. నేటి సోవియట్ సైన్యానికి కేంద్రకమయిన కార్మిక, కర్షక ఎర్ర సైన్యాన్ని ఏర్పరుస్తూ, 1918 జనవరిలో సోవియట్లు డిక్రీ జారీ చేశాయి. అంతకుముందే, 1917 డిసెంబరులో జారీ అయిన డిక్రీలో ప్రజాకోర్టుల వ్యవస్థ చటబద్ధం గావించబడింది. తద్వారా జారిష్టు న్యాయస్థానాలకు స్వస్తి జరిగింది.

ఆర్థికవ్యవస్థలో మౌలికమైన మార్పులకు కారణభూతమైన డిక్రీలు, చట్టాలకు ఎనలేని ప్రాధాన్యత వుంది. జారు చక్రవర్తి కుటుంబీకులకు, ప్రభువర్గాలకు, చర్చిలకు చెందిన జమీలన్నీ జాతీయం చేయబడి, స్థానిక సోవియట్లకు, భూకమిటీలకు స్వాధీనపర్చబడ్డాయి. తొలి దశలోనే 17.5 మిలియన్ హెక్టారుల భూమి రైతులకు పంపిణీ చేయబడింది. రైతులు ఏటా జమీందారులు, భూస్వాములకు చెల్లించాల్సిన 500 మిలియన్ల బంగారు రూబుళ్ళ కౌలు భారం వారి మూపులనుండి శాశ్వతంగా తొలగించబడింది. దీంతో సోవియట్ ప్రభుత్వం రైతుల విశ్వాసం చూరగొన్నది. సహకార వ్యవసాయ క్షేత్రాల అవతరణకు ఇది ప్రాతిపదిక అయింది. 1917 డిసెంబరులో బ్యాంకులు జాతీయం చేయబడ్డాయి. ఇవీ, వాణిజ్య నౌకలను, నూనె పరిశ్రమను కూడా జాతీయం చేస్తూ జారీఅయిన డిక్రీలూ కలిసి సోషలిస్టు రాజ్యవ్యవస్థ నిర్మాణానికి ప్రథమ సోపానాలయ్యాయి. శాంతి డిక్రీలో, విడిపోయి స్వతంత్ర రాజ్యంగా యేర్పడే హక్కుతో సహా జాతుల స్వయం నిర్ణయ హక్కు గుర్తించబడింది. ఈ

డిక్రీ కేవలం కాగితం ముక్కగానే మిగిలిపోలేదు. ఇది అక్షరశః అమలు జరిగింది. ఈ ప్రకటన, ఫిన్‌లాండు స్వాతంత్ర్యాన్ని, ఆర్మీనియన్ల స్వయం నిర్ణయాధికారాన్ని ధృవపర్చడమేగాక, జారిష్టు ప్రభుత్వపు అప్పులను కూడా రద్దుపరచింది. శ్రమించే, దోచుకోబడే ప్రజల హక్కుల ప్రకటన చిత్తుప్రతిని లెనిన్ స్వయంగా రాశారు. దీన్ని అఖిల రష్యా కేంద్ర కార్యనిర్వాహక సమితి 1918, జనవరి 3న పరిశీలించి, ఆమోదించింది. దీన్ని తృతీయ అఖిల రష్యా కార్మిక, సైనిక ప్రతినిధుల సోవియట్ల మహాసభ జనవరి 12వ తేదీన ఆమోదించింది; అఖిల రష్యా కార్మిక, సైనిక, కర్షక ప్రతినిధుల సోవియట్ల మూడవ మహాసభ దీన్నే జనవరి 18న ఆమోదించింది. ఈ ప్రకటన పాఠమే 1918 నాటి రష్యన్ సోవియట్ ఫెడరేటివ్ సోషలిస్టు రిపబ్లిక్ (ఆర్. ఎస్. ఎఫ్. ఎస్. ఆర్.) రాజ్యాంగ చట్టానికి పీఠికగా రూపొందింది. వివిధ జాతుల మధ్య సంపూర్ణ సమానతను నెలకొల్పే విషయంలో నూతన సోవియట్ ప్రభుత్వ చిత్తశుద్ధిపై ఆయా జాతుల ప్రజల్లో ఇది పూర్తి విశ్వాసం కలుగజేసింది. ఇందు మూలంగా వివిధ జాతుల మధ్య ఐక్యత దృఢతరమయింది.

అక్టోబరు డిక్రీలలో 8 గంటల పనిదినం, సాంఘిక భీమా, పౌర విద్య, ప్రజా విశ్వాసం కోల్పోయిన ప్రజా ప్రతినిధులను వెనక్కి పిలిపించే హక్కు, సివిల్ వివాహాలు, మత లేదా నాస్తిక విశ్వాసాలు కలిగివుండే హక్కు, పత్రికా స్వేచ్ఛ పీటిని గురించిన డిక్రీలు— సోవియట్ దేశంలో కార్మికవర్గానికి సంక్రమించిన నాయకత్వ స్థానానికి చట్టబద్ధత కల్పించిన డిక్రీలు వున్నాయి.

ప్రప్రథమ రాజ్యాంగ చట్ట పత్రాలుగా పేర్కొనదగిన ఈ అక్టోబరు డిక్రీల చారిత్రక ప్రాధాన్యత ఏమిటంటే, అవి ఆర్థిక రంగంలో దోపిడీదారులను దోచిపేశాయి, రాజ్యాంగ వ్యవస్థలో పెట్టుబడిదారుల, భూస్వాముల ఆధిపత్యానికి స్వస్తి వాచకం పలికాయి, ఇంతేగాక, కార్మిక కర్షక అధికారాన్ని అమలుజరిపే యంత్రాంగాన్ని కూడా ఇవిసృష్టించాయి. పూర్తిగా వినూత్నమైన రాజ్యాంగ వ్యవస్థ పునాదుల నుండి నిర్మింపబడిందని చెప్పడం అతిశయోక్తి కాదు. దేశ పాలకులైన కార్మికుల, కర్షకుల హక్కులకది పూర్తి గుర్తింపునిచ్చింది.

*1 వ ప్రకరణము*

# సోవియట్ - రాజ్యాంగ చట్టం

## 1918 నాటి ఆర్.ఎస్.ఎఫ్.ఎస్. ఆర్. రాజ్యాంగ చట్టం

రాజ్యాంగ చట్ట సంబంధమైన పరిణామ క్రమంలోని తరువాతి దశ, 1918 నాటి ఆర్. ఎస్. ఎఫ్. ఎస్. ఆర్. రాజ్యాంగ చట్టాన్ని అమలు జరపడం అఖిల రష్యా సోవియట్ల తృతీయ మహాసభ రాజ్యాంగచట్ట సమగ్ర పాఠపు మౌలిక ప్రతిపాదనలను రూపొందించి తదుపరి మహాసభలో ప్రతిపాదించే అధికారాన్ని అఖిల రష్యా కేంద్ర కార్యనిర్వాహక వర్గానికి అప్పగించింది. అయితే కార్య నిర్వాహక వర్గంగాని, నాల్గవ సోవియట్ల మహాసభగాని యీ విషయమై యెక్కువ శ్రద్ధ చూపజాలక పోయాయి. ఎందువల్లనంటే సోవియట్ రిపబ్లిక్కుపై జర్మనీ బాహాటమైన దాడి ప్రారంభించడంతో దేశ అంతర్జాతీయ పరిస్థితి తీవ్రంగా క్షీణించింది. అయితే బ్రెస్ట్ - లితోవ్స్క్ సంధి కుదరడంతో వూపిరి పీల్చుకుందుకు కొద్దిపాటి అవకాశం లభించగానే, దాన్ని నూతన రాజ్యాంగ చట్ట రచనకు వినియోగించడం జరిగింది. లెనిన్ ఆధ్వర్యంలో యేర్పడిన ప్రత్యేక ఉపసంఘం, 5వ అఖిల రష్యా సోవియట్ల మహాసభ ఉపసంఘాలు, విస్తృత సమావేశాలు యీ చట్టం నిబంధనలను చర్చించేందుకు అంకితంకావడాన్ని బట్టి చూస్తే, యీ రాజ్యాంగ చట్ట రచనకు యివ్వబడిన ప్రాధాన్యత యెవరికైనా అవగత మవుతుంది. ఆర్. ఎస్. ఎఫ్. ఎస్. ఆర్. రాజ్యాంగ

చట్టం 1918, జులై 10వ తేదీన ఆమోదించబడింది. అనేక రాజ్యాంగ పరమైన డిక్రీల స్థానంలో ఒకే శాసనంగా రూపొందిన యీ రాజ్యాంగ చట్టం. వాటన్నింటినీ గుదిగుచ్చడమే గాక వాటిని క్రమబద్ధము, సమన్వయీకృతమునయిన వ్యవస్థగా తయారించింది. అంతకు ముందలి శాసనాలలో కంటె యీ రాజ్యాంగ చట్టంలోని కొన్ని సూత్రీకరణలు మరింత నిర్దుష్టంగాను మరింత సమగ్రంగాను రూపొందాయి. కొన్ని కొత్త నిబంధనలు కూడా చేర్చబడ్డాయి. ఈ నిబంధనలలో కొన్ని, మునుపటిచట్టాలు మరికొన్ని శ్రామిక ప్రజలు కలకాలంనుండి కలలుగంటున్న వాంఛలకు మౌలికము, నిర్దుష్టమూనయిన రూపాన్నిచ్చాయి. అంచాతనేయివి రాజ్యాంగచట్టపరిణామ క్రమంలో వివిధ దశలలో సజీవంగా నిలిచి, యీనాటికీ అమలునందున్నాయి. ఏకీకృత రాజ్యాంగచట్టాన్ని అమలుజరపడంవల్ల, అంతకు పూర్వపు డిక్రీలలోని కీలకమైన నిబంధన లన్నింటినీ అందులో చేర్చేందుకు వీలు కలిగించింది.

రాజ్యాంగచట్టం తన ప్రధాన కర్తవ్యాన్ని సాధారణ నిబంధనలలో నిర్వచించింది. ఈ నిబంధనలు సోవియట్ల అధికారానికి శాసన బలం చేకూర్చాయి. దాంతో బాటు సోవియట్ పౌరుల ప్రాథమిక హక్కులు, విధులకు అక్షర రూపమిచ్చాయి. సోవియట్లు తమ వర్గ స్వభావరీత్యా శ్రామికవర్గ సంస్థలని అవి స్పష్టపరచాయి; గత కాలపు జారిస్టు సామ్రాజ్య వ్యవస్థలో శ్రామిక ప్రజలకు వ్యతిరేకంగా రాజకీయ, ఆర్థిక గుత్తాధిపత్యం చెలాయించిన వివిధ సముదాయాల హక్కులకు యీ రాజ్యాంగ చట్టం భరతవాక్యం పలికింది.

కేంద్రంలోను, స్థానికంగాను సోవియట్ల అధికార వ్యవస్థీకరణ కార్యవిధానాన్ని ఈ రాజ్యాంగ చట్టం మరింత వివరంగా నిర్దేశించింది.

ఇంతకుముందే పేర్కొన్నట్లు, లెనిన్ ప్రతిపాదనపై పీడిత జాతుల హక్కుల ప్రకటన నూతన రాజ్యాంగ చట్టం పీఠికగా చేర్చబడింది. జాతుల మానవ వంశాల సమానత్వానికి పూర్తి హామీ యివ్వబడింది, ప్రాంతం, మానవ వంశం ప్రాతిపదికపై యేవిధమైన ప్రత్యేక హక్కులుగాని, ప్రయోజనాలుగాని యెవరికీ సమకూరవని స్పష్టపరచబడింది. ఆర్.ఎస్.ఎఫ్.ఎస్.ఆర్.లో నివసించే పరాయిదేశాలవారి రాజకీయ హక్కు

లకు, తమ రాజకీయ మతవిశ్వాసాల మూలంగా తమ స్వదేశాల్లో హింసించబడుతూన్న వారికి రాజకీయ ఆశ్రయం యివ్వడానికి సంబంధించిన నిబంధనలను గురించి లెనిన్ చేసిన ప్రతిపాదన యీ రాజ్యాంగ చట్టంలో చేర్చబడింది. మత స్వాతంత్ర్యం గురించిన నిబంధన స్పష్టంగా రూపొందించబడింది. "అన్ని రూపాల్లోను, అన్ని ప్రయోజనాలకు" సంఘనిర్మాణ స్వాతంత్ర్యమనే అస్పష్ట పదజాలానికి బదులుగా, ఆస్తిపరవర్గాల రాజకీయ, ఆర్థిక ఆధిపత్యానికి స్వస్తి చెప్పడం ద్వారా ఆర్. ఎస్. ఎఫ్. ఎస్. ఆర్. కార్మికులు, పేద రైతులు తమ నిజమైన సంఘనిర్మాణ స్వాతంత్ర్యాన్ని వినియోగించుకుని, సుసంఘటితంగా ఐక్యమయ్యేందుకు పాదార్థిక సహాయంతోసహా సకలవిధాలా సాయపడుతుందని నిర్దిష్టము, మౌలికము అయిన నూతన నిబంధన యీ రాజ్యాంగ చట్టంలో చోటు చేసుకుంది.

పూర్వపు జారిస్ట్ రష్యాలోని భూభాగాలలో నెలకొల్పబడిన తక్కిన సోవియట్ రిపబ్లిక్కులకు యీ రాజ్యాంగ చట్టం నమూనా అయింది. ఆ రాజ్యాంగచట్టాలన్నీ 1924 దాకా అమలునందుండినాయి.

# 1924 ఆర్. ఎస్. ఎఫ్. ఎస్. ఆర్. రాజ్యాంగ చట్టం

సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్కుల సమాఖ్య నిర్మాణం గురించిన సంధిపై కేంద్రీకరించడమే యీ రాజ్యాంగ చట్టం ప్రత్యేక ప్రాధాన్యత. సమాఖ్య నుండి విడిపోయ్యే హక్కుకు సంబంధించిన నియమాన్ని, ఈ సంధిని గురించిన నిబంధన ధ్రువీకరించింది. అన్ని రిపబ్లిక్కుల ఆమోదము లేనిదే దీనిని సవరించుటకు యేమాత్రమూ వీలుకాదని కూడా విస్పష్టంగా పేర్కొనింది. ఈ విధంగా సకల రిపబ్లిక్కుల మౌలిక సమానత్వానికి హామీ కల్పించబడింది. ఇట్టి పరిస్థితుల్లో, యూనియన్ రిపబ్లిక్కుల పౌరులందరికీ ఉమ్మడి సమాఖ్య పౌరసత్వం కల్పించడం సులభసాధ్యమయింది. నూతన సమాఖ్య రాజ్యవ్యవస్థ మౌలిక సూత్రాలను పాదుకొల్పడంపైనే సమాఖ్య రాజ్యాంగ చట్టం ప్రధాన భాగాలు కేంద్రీక

తించాయి. సోవియట్ అధికార వ్యవస్థ, దాని ఆర్థిక స్థానాలు, ఆర్థికశక్తి పటిష్ఠం కావడాన్ని యీ రాజ్యాంగ చట్టం ప్రతిబింబించింది.

దేశ జీవనంలో త్వరితగతిని వచ్చిన మార్పుల కనుగుణంగా 1924–1936 మధ్యకాలంలో సోవియట్ యూనియన్ రాజ్యాంగ చట్టంలో అనేక సవరణలు, చేర్పులు చేయబడ్డాయి. నూతన రిపబ్లిక్కుల చేరిక, స్వయం పాలిత రిపబ్లిక్కుల, మండలాల, జాతీయ ప్రాంతాల నిర్మాణం వంటి రాజ్య-మాండలిక వ్యవస్థీకరణకు సంబంధించినవి. వివిధ ప్రభుత్వ అంగాల, సంస్థల అధికారపరిధి స్పష్టంగా నిర్వచింపబడింది. ప్రధానంగా సోవియట్ దేశ ఆర్థికాభివృద్ధి, సాంస్కృతిక విజయాలు మూలంగా, రాజ్యాధికార సంస్థల స్వాతంత్ర్యం విషయంలో ముఖ్యమైన వ్యవస్థాత్మక మౌలిక మార్పులు చేయబడ్డాయి. ఇందుకు యూనియన్ రిపబ్లిక్కుల పరిపాలనా, ప్రాదేశిక అధికార పరిధులను కొత్తగా నిర్ణయించడం అవసరమయింది.

## 1936 సోవియట్ యూనియన్ రాజ్యాంగ చట్టం

ఆర్థిక వ్యవస్థలోనూ, సమాజంలోనూ వచ్చిన మౌలిక మార్పులు, వాటి ప్రాతిపదికపై వచ్చిన సాంస్కృతిక విప్లవం – వీటి మూలంగా నూతన రాజ్యాంగచట్టం అవసరమయింది. అంటే, సోవియట్ రాజ్యం సోషలిస్టు సమాజ నిర్మాణమనే సంశ్లిష్ట కర్తవ్య నిర్వహణ, సోషలిజం నుండి కమ్యూనిజానికి క్రమ పరివర్తన అనే దశలో ప్రవేశించిందన్న మాట.

నవసోషలిస్టు వ్యవస్థ స్థాపన, సమిష్టి వ్యవసాయ క్షేత్ర విధాన విజయము, సోషలిస్టు సమాజ ప్రాతిపదికగా సోషలిస్టు ఆస్తి స్థాపన, విస్తృత రైతాంగ ప్రయోజనాల దృష్ట్యా ప్రవేశపెట్టబడిన సంస్కరణ లను అడ్డగొట్టి, భగ్నం చేయడానికి ప్రయత్నించిన సంపన్న భూస్వామ్య వర్గాల (కులక్కుల) ఓటమి – యివన్నీ నూతన రాజ్యాంగ చట్టంలో ప్రతిఫలించాయి – అందులో, సామాజిక – ఆర్థిక పునాది మరింత నిర్దిష్టంగా నిర్వచింపబడింది. ఈ రాజ్యాంగ చట్టం మరింత విస్తృతమైన

ప్రజాస్వామ్యాన్ని నిర్దేశించింది: రాజ్యాంగ చట్టంలో చేర్చిన నూతన ప్రకరణాల్లో సామాజిక వ్యవస్థ, స్థానిక రాజ్యాధికార అంగాలు, ఎన్నికల పద్ధతి, రాజ్యాంగ చట్టం సవరణ విధానాలకు సంబంధించిన వున్నాయి. న్యాయ స్థానాలకు, వాటికి సంబంధించిన ప్రొక్యూరేటరు పదవికి సంబంధించిన ఒక ముఖ్యమైన కొత్త ప్రకరణం కూడా చేర్చబడింది. ఈ రాజ్యాంగ చట్టం, పౌర హక్కులు, బాధ్యతలను కూడా నియమబద్ధం చేసింది. సామాజిక వ్యవస్థపైగల ప్రకరణంలో మొట్టమొదటిసారిగా, సమాఖ్యయొక్క సోషలిస్టు స్వభావము సోవియట్ రాజ్యవ్యవస్థయొక్క రాజకీయ, ఆర్థిక పునాది అత్యంత సాధారణ రూపంలో నిర్వచింపబడ్డాయి. వ్యక్తిగత ఆస్తి కలిగి వుండేందుకు పౌరులకుగల హక్కును (యీ ఆస్తిని యితరులను దోపిడీ చేసేందుకు వినియోగించరాదు), ప్రజాశిక్షా సూత్రాన్ని, ప్రతి పౌరుడు పనిచేయవలసిన రాజ్యాంగపరమైన కర్తవ్యాన్ని ఇది నిర్దేశిస్తూంది. రాజ్యవ్యవస్థకు సంబంధించిన నియమాలన్నీ ఒకే ప్రకరణంలో గుదిగుచ్చ బడ్డాయి. సోవియట్ సమాఖ్య వ్యవస్థ అభివృద్ధి క్రమానికి అనుగుణమైన నూతన నిబంధనలు యీ ప్రకరణానికి చేర్చబడ్డాయి.

ఈ రాజ్యాంగ చట్టంలో పౌరుల ప్రాథమిక హక్కులు, బాధ్యతలు, స్వేచ్ఛలు, ఒకే ప్రకరణంలో క్రమబద్ధంగా రూపొందించ బడ్డాయి. అనేక కొత్త హక్కులు, స్వేచ్ఛలు జతచేర్చబడ్డాయి. వాటితోబాటు కొన్ని బాధ్యతలు కూడా చేర్చబడ్డాయి పౌరులకు యివ్వబడిన ప్రాథమిక హక్కులలో ప్రత్యేకించి చేర్చినవి పని హక్కు, విశ్రాంతి హక్కు, ముసలితనంలోను, అశక్తత ప్రాప్తించినప్పుడు పాదార్థిక భద్రత పొందేహక్కు మొదలైనవి ఉన్నాయి. అలాగే శ్రామిక క్రమశిక్షణ, చిత్తశుద్ధితో పౌర విధుల నిర్వహణ, సోషలిస్టు సామాజిక జీవిత నియమాల పాటింపు, సోషలిస్టు ఆస్తిని కాపాడి, పెంపొందించడం ఈ రాజ్యాంగ చట్టములో చోటు చేసుకొన్న విధులలో కొన్ని, హక్కులు, స్వేచ్ఛలకు హామీ కల్పించుటకే ఇందెక్కువ ప్రాధాన్యత ఇవ్వబడింది. సార్వజనిక, ప్రత్యక్ష, సమాన, రహస్య ఓటింగు పద్ధతి ప్రవేశపెట్టబడింది.

సోవియట్ రాజ్యవ్యవస్థలోను, రాజ్యాధికార సంస్థలోనూ ప్రవేశ పెడుతూ వచ్చిన అతి ముఖ్యమైన మార్పులను సోవియట్ రాజ్యాంగ చట్టం మరింత ముందుకు తీసుకుపోతూనే వచ్చింది: పౌరుల ప్రాథమిక హక్కులు, విధులకు, ఎన్నికల వ్యవస్థకు సంబంధించిన ప్రకరణంలోను సవరణలు కొనిరాబడ్డాయి.1936 రాజ్యాంగ చట్టంలో ఇట్టి నిర్దిష్ట అంశాలపై అనేక మార్పులు వచ్చాయి.

1977 రాజ్యాంగ చట్టం ఆమోదించబడడానికి ముందు సోవియట్ యూనియన్‌లోని రాజ్యాంగపరమైన పరిణామ క్రమంలోని వివిధ దశలను నూతన రాజ్యాంగ చట్టం పీఠికలో క్లుప్తంగా సమీక్షించడం జరిగింది. అయితే ఈ దశలను రాజ్యాంగపరమైన, లేదా న్యాయపరమైన పరిభాషలో ప్రస్తావించలేదు.

ఉదాహరణకు అక్టోబరు డిక్రీలు ఏమి ప్రతిబింబిస్తున్నాయో ఈ క్రింది పదాల్లో తెలపడం జరిగింది: "రష్యా దేశపు కార్మికులు, కర్షకులు, లెనిన్ ఆధ్వర్యం వహించిన కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన జరిపిన అక్టోబరు సోషలిస్టు మహా విప్లవం పెట్టుబడిదారుల, భూస్వాముల పాలనను కూలద్రోసింది; పీడనా సంకెళ్ళను ఛేదించింది; శ్రామికవర్గ నియంతృత్వాన్ని నెలకొల్పింది; విప్లవ ఫలితాల పరిరక్షణకు, సోషలిజం-కమ్యూనిజాల నిర్మాణానికి మౌలిక సాధనమైన క్రొత్త తరహా రాజ్యాన్ని-సోవియట్ రాజ్యాన్ని - సృష్టించింది. దీంతో మానవ జాతి, పెట్టుబడిదారీ విధానం నుండి సోషలిజానికి యుగారంభకమైన కొత్త మలుపు తీసుకుంది."

శ్రామిక వర్గ నియంతృత్వ నిర్మాణం, ఆ దశకు చెందిన కీలక కర్తవ్యం. సోవియట్ దేశ జనాభాలో అత్యధిక సంఖ్యాకులైన కార్మికులు, కర్షకులు, వారి ఆశలతోను, ఆశయాలతోను, మమేకం చెందిన మేధావులు కలిసి పరిపాలన సాగించడం, ఇందులో గర్భితం. ఈ విధంగా ఈ పరిపాలనా విధానం అత్యంత ప్రజాతంత్రయుతమైనది. అయితే పెట్టుబడిదారీ ప్రజాస్వామిక రాజ్యాలవలె పూర్వపు దోపిడీ, యాజమాన్య వర్గాలైన పెట్టుబడిదారుల, భూస్వాముల ప్రయోజనాలను ఈ రాజ్యం ఏమాత్రము ప్రతిబింబించదని దాపరికమన్నది లేకుండా చెప్పబడింది.

పెపెచ్చు అది వారి మౌలిక ప్రయోజనాలకు వ్యతిరేకంగా ఎక్కు పెట్టబడింది దనీ, పెట్టుబడిదారీ భూస్వామ్య విధానాలను మట్టుపెట్టడమే దాని విశిష్ట లక్ష్యమనీ పేర్కొనబడింది. కార్మిక, కర్షక ప్రజానీకాన్ని పెట్టుబడిదారీ, భూస్వామ్య బంధనాల నుండి విముక్తి చేయడం ద్వారానే సామాజిక వైరుధ్యాల బెడదలేని సోషలిస్టు సమాజ నిర్మాణం సాధ్యమవుతుందని చెప్పబడింది. ఈ మౌలిక కర్తవ్యాన్ని నిర్వర్తించనిదే, "ప్రతి ఒక్కరి కోసం అందరు, అందరి కోసం ప్రతి ఒక్కరు" అన్న మానవతాలక్ష్య సాధన దిశలో పురోగమించడం సాధ్యం కానే కాదు. దీనిని మనం బూర్జువా ప్రజాస్వామ్యంతో పోల్చిచూడాల్సి ఉంది. బూర్జువా ప్రజాస్వామ్యం పీడక, పీడిత వర్గాల మధ్యగల మౌలిక వైరుధ్యాన్ని మరుగు పరస్తూనే, వాస్తవంలో దానిని శాశ్వతం చేస్తూంది. బూర్జువా ప్రభుత్వం ఆచరణలో ఆస్తి పర వర్గాల కార్యనిర్వాహక వర్గంగా పని చేస్తుంది; అంచేతనే అది కోట్లాది శ్రామిక ప్రజల మౌలిక ప్రయోజనాలకు బద్ధ శత్రువు.

ఇక రెండవ దశ ఈ క్రింది మాటలలో వివరించబడింది:

"అంతర్యుద్ధంలో విజయం సాధించి, సామ్రాజ్యవాద జోక్యాన్ని తిప్పికొట్టిన తరువాత సోవియట్ ప్రభుత్వం, మౌలికమైన సామాజిక ఆర్థిక మార్పులను ప్రవేశపెట్టింది. మనిషిని మనిషి దోచుకోవడాన్ని, వర్గాల మధ్య వైరుధ్యాలను, జాతుల మధ్య వైమనస్యాలను శాశ్వతంగా అంతమొందించింది."

ఇది 1918 నాటి రాజ్యాంగ చట్టం సాధించిన విజయం.

"సోవియట్ రిపబ్లిక్ లన్నింటిని సోవియట్ యూనియన్ రూపంలో ఏకం చేయడం, సోషలిజం నిర్మాణంలో సోవియట్ దేశ పందలి సకల, జాతుల ప్రజల శక్తినీ, వారికి గల అవకాశాలనూ ఇనుమడింప జేసింది." 1924 రాజ్యాంగ చట్టం అమలులో ఉండగా సాధించిన విజయమిదీ.

1936 రాజ్యాంగ చట్టం అమలులోకి వచ్చినప్పుడు, "ఉత్పత్తి సాధనాలపై సామాజిక యాజమాన్యాన్నీ, శ్రామిక ప్రజల సార్వజనిక ప్రజాస్వామ్యాన్నీ పాదుకొల్పడం జరిగింది. మానవ జాతి చరిత్రలోనే తొట్టతొలిసారిగా సోషలిస్టు సమాజం నెలకొల్పబడింది." ఈవిధంగా, రాజ్యాంగ చట్టపు మొదటి నిబంధన, సోవియట్ యూనియన్‌లో కార్మిక

శ్రేణి సోషలిస్టు రాజ్య వ్యవస్థ నెలకొల్పబడిందని ఎలుగెత్తి చాటింది. అలాగే, మూడవ నిబంధన సోవియట్ దేశంలో సమస్త రాజ్యాధికారము పట్టణాలు, పల్లెలలో నివసించే శ్రామిక ప్రజల వశమైందనీ, దాన్ని వారు శ్రామిక ప్రజా ప్రతినిధుల సోవియట్ల ద్వారా నిర్వహిస్తున్నారనీ పేర్కొన్నది. పెట్టుబడిదారుల, భూస్వాముల పాలనను కూలదోయడంతో తలెత్తి, అభివృద్ధి చెంది శ్రామిక వర్గ నియంతృత్వాన్ని స్థాపించిన శ్రామిక ప్రజా ప్రతినిధుల సోవియట్లే సోవియట్ దేశపు రాజకీయ పునాది సోవియట్ దేశానికి 1941–1945 మధ్య, దేశభక్త మహా యుద్ధ కాలంలో అన్నిటి కన్నా పెద్ద సవాలు ఎదురయింది. సోవియట్ దేశం మానవ జాతి చరిత్రలోకెల్లా పెద్దదీ, అతి క్రూరమూనయిన దండయాత్రను ఎదుర్కోవలసి వచ్చింది.

యుద్ధానంతరం "సోవియట్ ప్రజ తమ సృజనశీల కార్యకలాపాలను దృఢ దీక్షతో కొనసాగిస్తూ దేశ సర్వతోముఖాభివృద్ధికి, సోషలిస్టు వ్యవస్థ పురోగతికి గట్టి హామీని కల్పించింది. కార్మిక వర్గం, సమిష్టిక్షేత్రరైతాంగం, ప్రజా మేధావి వర్గాల ఐక్యతనిది దృఢతరం గావించింది; సోవియట్ దేశపు సకల జాతుల, ఉపజాతుల స్నేహాన్ని అభేద్యమైనర్చింది. కార్మిక వర్గం నాయకశక్తిగా ఉన్న సోవియట్ సమాజపు సామాజిక,రాజకీయ, సైద్ధాంతిక ఏకతను సాధించడం జరిగింది. శ్రామికవర్గ నియంతృత్వ లక్ష్యాలు పరిపూర్తి అయ్యాయి; సోవియట్ రాజ్య వ్యవస్థ సకల ప్రజల వ్యవస్థగా రూపొందింది."

ఇది గొప్ప పురోగతి. 1936 రాజ్యాంగ వ్యవస్థలో పేర్కొన్న శ్రామిక వర్గ నియంతృత్వ పరిణతిచెంది, "సోవియట్ దేశంలో సకల రాజ్యాధికారము ప్రజలదే" అన్న ఉచ్చతర దశకు చేరుకుంది (నూతన రాజ్యాంగ చట్టంలోని రెండవ నిబంధన) ఇది అత్యంత సహజమైన పరిణామం. ఈనాడు సోవియట్ యూనియన్‌లో దోపిడీ వ్యవస్థ సమూలంగా అంతరించింది. పరుల శ్రమను దోచుకుంటూ, అనార్జిత సంపదను అనుభవించేవారెవరూ సోవియట్ యూనియన్‌లో లేరు. ఈనాడక్కడ ప్రతిఒక్కరూ కండబలంతోను, బుద్ధిబలంతోనూ పనిచేస్తున్నారు. ఈనాడా సోషలిస్టు దేశంలో సోమరిపోతంటూ లేడు, ఉండజాలడు కూడా.

ఈనాడు వాస్తవ పరిస్థితి ఏమిటంటే, "సోవియట్ దేశంలో ప్రవర్తిత సోషలిస్టు సమాజం నిర్మింపబడింది. సోషలిజం తన సొంత పునాదులపై అభివృద్ధిచెందుతూన్న ఈ దశలో ఈ నూతన వ్యవస్థ, సృజనాత్మక శక్తులూ, సోషలిస్టు జీవన విధాన ప్రయోజనాలు నానాటికీ మరింత స్పష్టమవుతున్నాయి; తమ మహత్తర విప్లవ ఫలితాలను శ్రామిక ప్రజలు అధికాధికంగా అనుభవిస్తున్నారు.

"ఇది అత్యంత శక్తివంతమైన ఉత్పత్తిశక్తులు, ప్రగతిశీల విజ్ఞాన శాస్త్రము, సంస్కృతీ సృజించబడిన సమాజం, ప్రజా సంక్షేమం నిరంతరాయంగా అభివృద్ధి చెందుతూన్న సమాజం, వ్యక్తి సర్వతోముఖాభివృద్ధికి అవసరమైన అనుకూల పరిస్థితులు అధికాధికంగా సమకూర్చబడుతూన్న సమాజం.

"ఇది , పరిపక్వ సోషలిస్టు సామాజిక సంబంధాలు నెలకొని ఉన్న సమాజం, సకల వర్గాల, సామాజిక విభాగాల ప్రజలందరినీ ఒకే త్రాటిపైకి తెచ్చి వారిమధ్య చట్టపరంగానే కాక, వాస్తవ జీవితంలో కూడా సంపూర్ణ సమానతను నెలకొల్పి, సకల జాతుల, ఉపజాతుల సోదర సహకారాన్ని ప్రోదిచేసి, సోవియట్ ప్రజ అనే నూతన చారిత్రక ప్రజా కుటుంబాన్ని సృజించబడిన సమాజమిది.

"నిర్మాణ సామర్థ్యమూ సిద్ధాంతిక నిబద్ధతా, దేశభక్తులూ, అంతర్జాతీయతావాదులూ అయిన శ్రామిక ప్రజల చైతన్యమూ ఉన్నత స్థాయిలో ఉన్న సమాజమిది.

"ప్రతి ఒక్కరు ఎల్లరి మేలుకొరకు, ఎల్లరు ప్రతి ఒక్కరికొరకు శ్రద్ధవహించడం జీవితనియమంగా ఉన్న సమాజ మిది."

## 1977 నాటి నూతన రాజ్యాంగం

ఉత్తేజకరమైన యీ పరిణామాల మూలంగానే అక్టోబరు సోషలిస్టు మహావిప్లవ 60 వ వార్షికోత్సవానికి ముందుగా నూతన రాజ్యాంగ చట్టం ఆమోదించబడింది. సోవియట్ కమ్యూనిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శి, సోవియట్ యూనియన్ అధ్యక్షుడూ అయిన లియొనిద్ బ్రెజ్నెవ్ యిలా అన్నారు: "ఈ నూతన రాజ్యాంగ చట్టం మొత్తం గత 60 యేళ్ళ అభి

శ్రేణి సోషలిస్టు రాజ్య వ్యవస్థ నెలకొల్పబడిందని ఎలుగెత్తి చాటింది. అలాగే, మూడవ నిబంధన సోవియట్ దేశంలో సమస్త రాజ్యాధికారము పట్టణాలు, పల్లెలలో నివసించే శ్రామిక ప్రజల వశమైందనీ, దాన్ని వారు శ్రామిక ప్రజా ప్రతినిధుల సోవియట్ల ద్వారా నిర్వహిస్తున్నారనీ పేర్కొన్నది. పెట్టుబడిదారుల, భూస్వాముల పాలనను కూలదోయడంతో తలెత్తి, అభివృద్ధి చెంది శ్రామిక వర్గ నియంతృత్వాన్ని స్థాపించిన శ్రామిక ప్రజా ప్రతినిధుల సోవియట్లే సోవియట్ దేశపు రాజకీయ పునాది సోవియట్ దేశానికి 1941–1945 మధ్య, దేశభక్త మహా యుద్ధ కాలంలో అన్నిటి కన్నా పెద్ద సవాలు ఎదురయింది. సోవియట్ దేశం మానవ జాతి చరిత్రలోకెల్లా పెద్దదీ, అతి క్రూరమూనయిన దండయాత్రను ఎదుర్కొవలసి వచ్చింది.

యుద్ధానంతరం "సోవియట్ ప్రజ తమ సృజనశీల కార్యకలాపాలను దృఢ దీక్షతో కొనసాగిస్తూ దేశ సర్వతోముఖాభివృద్ధికి, సోషలిస్టు వ్యవస్థ పురోగతికి గట్టి హామీని కల్పించింది. కార్మిక వర్గం, సమిష్టిక్షేత్ర రైతాంగం, ప్రజా మేధావి వర్గాల ఐక్యతనిది దృఢతరం గావించింది; సోవియట్ దేశపు సకల జాతుల, ఉపజాతుల స్నేహాన్ని అభేద్యమొనర్చింది. కార్మిక వర్గం నాయకశక్తిగా ఉన్న సోవియట్ సమాజపు సామాజిక,రాజకీయ, సైద్ధాంతిక ఏకతను సాధించడం జరిగింది. శ్రామికవర్గ నియంతృత్వ లక్ష్యాలు పరిపూర్తి అయాయి; సోవియట్ రాజ్య వ్యవస్థ సకల ప్రజల వ్యవస్థగా రూపొందింది."

ఇది గొప్ప పురోగతి. 1936 రాజ్యాంగ వ్యవస్థలో పేర్కొన్న శ్రామిక వర్గ నియంతృత్వ పరిణతిచెంది, "సోవియట్ దేశంలో సకల రాజ్యాధికారము ప్రజలదే" అన్న ఉచ్చతర దశకు చేరుకుంది (నూతన రాజ్యాంగ చట్టంలోని రెండవ నిబంధన) ఇది అత్యంత సహజమైన పరిణామం. ఈనాడు సోవియట్ యూనియన్‌లో దోపిడీ వ్యవస్థ సమూలంగా అంతరించింది. పరుల శ్రమను దోచుకుంటూ, అనార్జిత సంపదను అనుభవించే వారెవరూ సోవియట్ యూనియన్‌లో లేరు. ఈనాడక్కడ ప్రతిఒక్కరూ శరీరబలంతోను, బుద్ధిబలంతోనూ పనిచేస్తున్నారు. ఈనాడా సోషలిస్టు దేశంలో సోమరిపోతంటూ లేడు, ఉండజాలడు కూడా.

ఈనాడు వాస్తవ పరిస్థితి ఏమిటంటే, "సోవియట్ దేశంలో ప్రవర్తిత సోషలిస్టు సమాజం నిర్మింపబడింది. సోషలిజం తన సొంత పునాదులపై అభివృద్ధిచెందుతూన్న ఈ దశలో ఈ నూతన వ్యవస్థ, సృజనాత్మక శక్తులూ, సోషలిస్టు జీవన విధాన ప్రయోజనాలు నానాటికీ మరింత స్పష్టమవుతున్నాయి; తమ మహత్తర విప్లవ ఫలితాలను శ్రామిక ప్రజలు అధికాధికంగా అనుభవిస్తున్నారు.

"ఇది అత్యంత శక్తివంతమైన ఉత్పత్తిశక్తులు, ప్రగతిశీల విజ్ఞాన శాస్త్రము, సంస్కృతి సృజించబడిన సమాజం, ప్రజా సంక్షేమం నిరంతరాయంగా అభివృద్ధి చెందుతూన్న సమాజం, వ్యక్తి సర్వతోముఖాభివృద్ధికి అవసరమైన అనుకూల పరిస్థితులు అధికాధికంగా సమకూర్చబడుతూన్న సమాజం.

"ఇది , పరిపక్వ సోషలిస్టు సామాజిక సంబంధాలు నెలకొని ఉన్న సమాజం, సకల వర్గాల, సామాజిక విభాగాల ప్రజలందరినీ ఒకే త్రాటిపైకి తెచ్చి వారిమధ్య చట్టపరంగానే కాక, వాస్తవ జీవితంలో కూడా సంపూర్ణ సమానతను నెలకొల్పి, సకల జాతుల, ఉపజాతుల సోదర సహకారాన్ని ప్రోదిచేసి, సోవియట్ ప్రజ అనే నూతన చారిత్రక ప్రజా కుటుంబాన్ని సృజించబడిన సమాజమిది.

"నిర్మాణ సామర్థ్యమూ సిద్ధాంతిక నిబద్ధతా, దేశభక్తులూ, అంతర్జాతీయతావాదులూ అయిన శ్రామిక ప్రజల చైతన్యమూ ఉన్నత స్థాయిలో ఉన్న సమాజమిది.

"ప్రతి ఒక్కరు ఎల్లరి మేలుకొరకు, ఎల్లరు ప్రతి ఒక్కరికొరకు శ్రద్ధవహించడం జీవితనియమంగా ఉన్న సమాజ మిది."

## 1977 నాటి నూతన రాజ్యాంగం

ఉత్తేజకరమైన యీ పరిణామాల మూలంగానే అక్టోబరు సోషలిస్టు మహావిప్లవ 60 వ వార్షికోత్సవానికి ముందుగా నూతన రాజ్యాంగ చట్టం ఆమోదించబడింది. సోవియట్ కమ్యూనిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శి, సోవియట్ యూనియన్ అధ్యక్షుడూ అయిన లియొనిద్ బ్రెజ్నెవ్ యిలా అన్నారు: "ఈ నూతన రాజ్యాంగ చట్టం మొత్తం గత 60 యేళ్ళ అభి

వృద్ధి యొక్క సంక్షిప్తరూపం ఈ కాలంలో దేశ ఆర్థిక వ్యవస్థ గురించ శక్యంగానంతగా మారిపోయింది. ఇందు సోషలిస్టుయాజమాన్యానిదే పూర్తి పై చేయి. ఏకీకృతమూ, శక్తివంతమూనైన జాతీయార్థిక వ్యవస్థ విజయవంతంగా పురోగమిస్తోంది. సోషలిస్టు వ్యవస్థ సమకూర్చే సౌలభ్యాలతో శాస్త్రీయ, సాంకేతిక విప్లవాన్ని సంయోగించడం ద్వారా యిది దినదిన ప్రవర్ధిత మవుతోంది. దేశ సామాజిక స్వరూపం కూడా మార్పుచెందింది. నానాటికీ వృద్ధిచెందుతూన్న సోవియట్ సమాజ ఏకరూపత యీ మార్పు లన్నిటిలోనూ ప్రతిబింబిస్తూన్న ఉమ్మడి అంశం, కార్మిక వర్గం సమిష్టి క్షేత్ర రైతాంగం, ప్రజా మేధావి వర్గం, వృత్తికారుల అభేద్య ఐక్యత మరింత సుదృఢమయింది. మౌలిక సామాజిక బృందాల మధ్య గల అంతరం క్రమంగా నిర్మూలింపబడుతోంది. ప్రజా జీవన స్రవంతియే సకల జాతులను, జాతీయ సముదాయాలను మరింత సన్నిహితంగావిస్తోంది. సోవియట్ ప్రజఅనే నూతన చారిత్రక ప్రజా కుటుంబం నిర్మితమయింది."

ఈ చారిత్రక ప్రజా కుటుంబం అవసరాలకు పూర్తిగా సరిపడిన రాజ్యాంగచట్టం రచన అంత సులభమైన పనేమీకాదు. మహత్తరమైన, విస్తృతమైన సమిష్టి కృషి ఫలితమే యీ రాజ్యాంగచట్టం. రాజ్యాంగచట్ట ఉపసంఘ అధ్యక్షుడుగా బ్రెజ్నెవ్ యీ విషయాన్నే చక్కగా వ్యక్తీకరించారు. రాజ్యాంగచట్టం చిత్తుప్రతిపై దేశవ్యాప్త చర్చ జరిగింది. ఇందు 140 మిలియన్ల మంది స్త్రీ, పురుషులు, అంటే సోవియట్ దేశ వయోజనుల్లో 80 శాతం పాల్గొన్నారు. కర్మాగారాలు, సమిష్టి క్షేత్రాలు, సైనిక దళాలు, నివాస ప్రాంతాల్లో జరిగిన దాదాపు ఒకటిన్నర మిలియన్ల సమావేశాలలో శ్రామిక ప్రజలు యీ చిత్తుప్రతిని ఉత్సాహంగా చర్చించారు. ఈ సమావేశాల్లో మూడు మిలియన్లమందికిపైగా మాట్లాడారు. గ్రామీణ సోవియట్లనుండి యూనియన్ రిపబ్లిక్కుల సుప్రీం సోవియట్లవరకు గల సోవియట్లన్నీ ఈ చిత్తుప్రతిని చర్చించాయి. అంటే, వివిధ స్థాయిలలో గల రెండు మిలియన్లమంది ప్రజా ప్రతినిధులు చర్చించారన్నమాట. ఈ వేదికలన్నింటిలోనూ యీ నూతన రాజ్యాంగచట్టం చిత్తు ప్రతిని లోతుగా అధ్యయనం చేసి, ఆమోదించడం జరిగింది. అనేకమంది కొత్త కొత్త సవరణలు కూడా సూచించారు. ఇట్టి ప్రతిపాదనలు 4 లక్షలకు పైగా

వున్నాయి. అయితే యీ ప్రతిపాదనల్లో చాలభాగం చర్విత చర్వణాలు. రాజ్యాంగచట్ట ఉపసంఘం వీటన్నింటిని శ్రద్ధగా అధ్యయనంచేసి, చిత్తు రాజ్యాంగచట్టంలోని 110 నిబంధనలను సవరించాలని, ఒక నిబంధనను కొత్తగా చేర్చాలని సిఫార్సు చేసింది. అలాగే కొన్ని ప్రతిపాదనలను మినహాయించడంకూడా జరిగింది. సకారణంగానే ఇలా చేసింది.

ఈ విధంగా అక్షరాలా సోవియట్ ప్రజలే, తమ రాజ్యాంగ చట్టాన్ని విరచించుకున్నారు. ఈ రాజ్యాంగచట్టం న్యాయవాదులూ, ఇతర పై శ్రేణులవారూ రూపొందించినది కాదు. ఇది ప్రజాతంత్ర పద్ధతుల ద్వారా రూపొందించిన ప్రజాతంత్ర రాజ్యాంగచట్టమనే విషయాన్ని ముందు ముందు మనం చూడగలము.

## సోవియట్ యూనియన్ సమాజ నిర్మాణ స్వరూపానికీ, విధానానికీ సంబంధించిన సూత్రాలు

రాజ్యాంగచట్టం 9 విభాగాలుగా విభజింపబడింది. ఈ విభాగాల్లో మళ్ళీ అధ్యాయాలున్నాయి. ప్రతి అధ్యాయం కొన్ని నిబంధనల సముదాయం. మొత్తంపై 174 నిబంధనలున్నాయి.

మొదటి విభాగంలో సోవియట్ యూనియన్ సమాజ నిర్మాణ స్వరూపానికీ, విధానానికీ సంబంధించిన సూత్రాలు చేరి వున్నాయి. ఇందు అయి అధ్యాయాలున్నాయి. అవి 1) రాజకీయ వ్యవస్థ, 2) ఆర్థిక వ్యవస్థ, 3) సామాజిక ప్రగతి, సంస్కృతి, 4) విదేశాంగ విధానం, 5) సోషలిస్టు మాతృదేశ రక్షణ.

సోవియట్ యూనియన్ రాజకీయ పునాది, "ప్రజాప్రతినిధుల సోవియట్. ఇది అత్యున్నత రాజ్యాంగ సంస్థ. తక్కినవన్నీ దీని అజమాయిషీకి లోబడివుంటాయి, దీనిక బాధ్యత వహిస్తాయి. (రెండవ నిబంధన). సోవియట్ల సభ్యులందరూ సార్వజనీన, సమాన, ప్రత్యక్ష, రహస్య ఓటింగుపద్ధతిద్వారా యెన్నుకోబడతారు (95 వ నిబంధన). దీన్ని బట్టే, యీ వ్యవస్థ అత్యుత్తమ ప్రజాతంత్ర స్వభావం తేటతెల్లమవుతుంది. ఈ విధంగా చివరకంటూచూస్తే, సోవియట్ యూనియన్‌లో

అధికారం అంతా ప్రజలదే. వాస్తవంలో, యింతకుముందే పేర్కొన్నట్లుగా, సోవియట్ దేశం ఇప్పటికప్పుడే సకల ప్రజల సోషలిస్టు రాజ్యంగా రూపొందింది. ఈ రాజ్యం కార్మికుల, కర్షకుల, మేధావుల ప్రయోజనాలను, అభీష్టాలను వ్యక్తం చేస్తూంది. ఈ సత్యమే ఒకటవ నిబంధనలో స్పష్టం చేయబడింది.

క్రింది స్థాయినుండి అత్యున్నతస్థాయి వరకు రాజ్యాధికార సంస్థలన్నీ యెన్నికలద్వారా యేర్పడతాయి. ఉన్నత సంస్థలు తమ క్రిందిస్థాయి సంస్థలకంటె ఉన్నతమైన అధికారాన్ని, హోదాను కలిగి వుంటాయి. క్రిందిస్థాయి సంస్థలకు అధికతరమూ, ఉన్నతమూనైన బాధ్యతగల ఉన్నత రాజ్యాంగ సంస్థల మార్గదర్శకత్వం లభింప జేసేందుకే యిలా చేయబడింది. సమస్త సోవియట్ ప్రజాజీవితాన్ని ఆదరించియున్న ప్రజాతంత్రయుత కేంద్రీకరణ సూత్రంనుండే ప్రజలచే యెన్నిక, ఉన్నత సంస్థలయెడ బాధ్యత అను జంట లక్షణాలు ఉద్భవించాయి.

రాజ్యాంగచట్టం దేశ అత్యున్నత న్యాయచట్టం. ఇతర చట్టాలన్నీ దానికి అనుగుణంగా వుండాల్సిందే. సోవియట్ రాజ్యము, దాని అధికార సంస్థలన్నీ రాజ్యాంగచట్టాన్ని, యితర సోవియట్ చట్టాల్ని అనుసరించి పని చేస్తాయి. ఈవిధంగా చట్టబద్ధపాలన పూర్తిగా నెలకొన్నది. సోవియట్ యూనియన్‌లో నేడిది యితర దేశాలకంటె అధికతర వాస్తవం. ఎంచాతనంటే చట్టం, కేవలం జీవిత సాధారణ, బాహ్యాచట్రాన్నేగాక, ప్రతి జీవితరంగాన్ని, ప్రతి జీవిత విభాగాన్ని శాసిస్తోంది. పుట్టుకనుండి మరణించేవరకు ప్రతి స్త్రీ, పురుషుడు యే హక్కులు కలిగి వుంటాడో చట్టం స్పష్టంగా నిర్దేశిస్తోంది. ఏ వ్యక్తీ తన యజమాని దయా, దాక్షిణ్యాలపై ఆధారపడి బ్రతకనక్కరలేదు. అతడు తన స్వయంకృతాపరాధానికిగాక మరేకారణం చేతనయినా తన్నేనాడు పనినుండి తొలగించి వేస్తాడో, తన నోటికాడి కూడు తీసివేస్తాడో, లేదా పై ఉద్యోగి తన ప్రమోషనును నిరాకరించి, అతని చిత్తాయత్తంగా బదిలీ వగైరాలకు పాల్పడతాడోనని భయపడనక్కరలేదు.

ప్రజాతంత్రయుత రాజ్య వ్యవస్థకు తోడుగా, దేశ ప్రధాన సమస్యలను దేశ వ్యాప్త చర్చలకు, రిఫరెండానికి పెట్టవలసిన విధిని

రాజ్యాంగ చట్టం తప్పనిసరిగా విధిస్తోంది. ఈ విధంగా అన్ని ప్రధాన నిర్ణయాలతోను ప్రజల సజీవ సంబంధానికి పూర్తి హామీ కల్పించ బడుతోంది.

కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన సోవియట్ యూనియన్ కార్మికులు, కర్షకులు సమాజంలో విప్లవకర పరిణామాలను గొనితెచ్చారు. తాను పుట్టినదాదిగా సోవియట్ రాజ్యం సామ్రాజ్యవాద, పెట్టుబడిదారీ దేశాల క్రూరమైన దాడులను కుట్రలకు తట్టుకుని నిలబడాల్సివచ్చింది. వాటిని తిప్పి కొడుతూ, ప్రణాళికాబద్ధ నిర్మాణాన్ని కొనసాగించవలసి వచ్చింది. అంతకుమును పెవ్వరూ త్రొక్కని మార్గాన ముందుకు సాగాల్సి వచ్చింది. దీనికంతా కమ్యూనిస్టుపార్టీయే నాయకత్వం వహించింది. అందువల్లనే పార్టీ సమస్త సోవియట్ ప్రజల పరిపూర్ణ విశ్వాసాన్ని చూరగొని, బలీయమైన శక్తిగా రూపొందింది. ఈ సత్యాన్ని రాజ్యాంగ చట్టపు 6 వ నిబంధన బహిరంగంగాను, నిర్ద్వంద్వంగాను యిలా గుర్తిస్తోంది: "సోవియట్ సమాజపు నాయక, మార్గదర్శక శక్తి.... సోవియట్ కమ్యూనిస్టు పార్టీ." సో. యూ. క. పా. ప్రజలకోసం మనుతుంది, ప్రజలకు సేవచేస్తుంది అని ఆ నిబంధన పేర్కొంది. ఈ నిబంధన శత్రువర్గాల తీవ్ర విమర్శకు గురవుతోంది. సోవియట్ కమ్యూనిస్టుపార్టీ సోవియట్ ప్రజా పురోగతికి అగ్రగామిదళంగా యెనలేని త్యాగాలు చేస్తోందన్న సత్యాన్ని వారు విస్మరిస్తున్నారు, అంతేగాక పార్టీ సభ్యులు, ఆ సమాజంలో కెల్లా అత్యంత చైతన్యవంతులు, ప్రగతిశీలురు అన్న వాస్తవాన్ని వారు మరుగుపరుస్తున్నారు. పార్టీ అక్టోబరు విప్లవాన్ని నడిపింది. ఆటు తర్వాత యుద్ధం, శాంతి–రెండింటిలోను తన శక్తి, సామర్థ్యాలను, నాయకత్వ పాత్రను ఆచరణలో నిరూపించుకుంది. అందువల్లనే అచంచల ప్రజా విశ్వాసాన్ని చూరగొని, ప్రతి ఎన్నికలోను దాన్ని పదే పదే నిరూపించుకొంది. సోవియట్ ప్రజా ప్రయోజనాలు తప్ప పార్టీకి మరే ప్రయోజనాలూ లేవు. అందుకే చిత్తు రాజ్యాంగ చట్టం గురించి ప్రసంగిస్తూ బ్రెజ్నేవ్ యిలా అన్నారు: "పార్టీ నియంతృత్వం గురించి గొంతులు చించుకుంటూ పార్టీని ప్రజలకు పోటీగా నిలబెట్టడమంటే, గుండెను మిగతా శరీరం నుండి వేరు చేయడం వంటి

వేరేమీ కాదు." రాజ్యాంగచట్టం పార్టీని నాయకత్వ, మార్గదర్శకశక్తిగా గుర్తించినా, ప్రజామోధము, ప్రజల ఓటింగు బలము లేకుండా చిన్న మెత్తు పని చేసేందుకన్నాడా వీల్లేదని నొక్కి చెప్పాల్సి వుంది. అయితే సోవియట్ దేశం ఒక కొత్త తరహా ప్రజాతంత్ర రాజ్యం నిర్ణయాలకు ప్రజామోదం ఉండాలన్నదే కాక, యీ నిర్ణయాలు గైకొనే క్రమంలో ప్రజలు చురుగ్గా పాల్గొనేలా చేసేందుకు గట్టి ఏర్పాట్లున్నాయి. ట్రేడ్ యూనియన్లు, తదితర ప్రజాసంస్థలు ప్రభుత్వ, పౌర కార్యకలాపాల నిర్వహణలోను, రాజకీయ, ఆర్థిక, సామాజిక సాంస్కృతిక సమస్యల పరిష్కారంలోను మరింత చురుగ్గా పాల్గొనాలనే నిబంధన రాజ్యాంగ చట్టంలో చేర్చడంద్వారా ప్రజల పాత్రను మరింత పెంపొందించడం జరిగింది. స్థూలమైన ప్రతిపాదనలు చేయడానికే దీన్ని పరిమితం గావించ లేదు. ప్రభుత్వ, పౌర వ్యవహారాలను చర్చించి, నిర్ణయాలు గైకొనడంలో, ప్రణాళిక, ఉత్పత్తి, సామాజికాభివృద్ధి రంగాల్లో సిబ్బందికి శిక్షణ నిచ్చి, నియామకాలు గావించడంలో, ఆయా కర్మాగారాలు, సంస్థల నిర్వహణ వ్యవహారాలను చర్చించి, నిర్ణయాలు గైకొనడంలో, ఉత్పత్తిని అభివృద్ధి పరచడంకోసమూ, సామాజిక, సాంస్కృతిక ప్రయోజనాలకోసమూ, పాదార్థిక ప్రోత్సాహకాలకోసమూ పని పరిస్థితులను, జీవన పరిస్థితులను మెరుగు పరచడంలో రాజ్యాంగచట్టం సమిష్టి శ్రామిక సంస్థలకు పాత్ర కల్పించింది. ఈవిధంగా ప్రత్యక్షంగా పనిచేస్తూన్న సమిష్టి శ్రామిక సంస్థలు, తమ జీవితాలకు సంబంధించిన ప్రధాన విషయాలను నిర్ణయించు కుందుకు, చక్కని అవకాశం కల్పించబడింది: దైనందిన జీవితంలో ప్రజాతంత్రయుత పని విధానానికి హామీ కల్పించబడింది. వాస్తవానికి రాజ్యాంగ చట్టంలోని 9 వ నిబంధన, సోవియట్ ప్రజాతంత్ర వ్యవస్థ ప్రధాన పోకడ, సోషలిస్టు ప్రజాస్వామ్యాన్ని మరింత విస్తృత మొనర్చ డమే, అంటే ప్రభుత్వ నిర్వహణలోను, సామాజిక వ్యవహారాల్లోను పౌరులు మరింత విస్తృతంగా పాల్గొందుకు అవకాశం కల్పించడమేనని విస్పష్టంగా పేర్కొంటూంది. ఇందువల్ల ప్రభుత్వ యంత్రాంగం నానాట మరింత మెరుగవుతూవుంది. దానిపై ప్రజలు అజమాయిషీ బలపడుతూవుంది. ఇటు, నిరంతరం అధికాధికంగా ప్రజాభిప్రాయానికి

చెవి యెుగడానికి, పనియెడ నిరంకుశాధికార దృక్పథం అధికాధికంగా దెబ్బతిని పోయేందుకూ ఇది దారితీస్తూంది.

సోవియట్ దేశ ఆర్థిక వ్యవస్థ పునాది, ఉత్పత్తి సాధనాలపై సోషలిస్టు యాజమాన్యం, అంటే అవి ప్రభుత్వ ఆస్తిగానో, సమిష్టి క్షేత్ర ఆస్తిగానో, సహకార సంఘాల ఆస్తిగానో వుండటం. అలాగే ట్రేడ్ యూనియన్లు, తదితర ప్రజాసంస్థలు తమ నిర్దిష్ట విధుల నిర్వహణకై భవనాలు, క్లాసు వగైరా అన్నులుంటాయి. సోషలిస్టు ఆస్తి రూపాల్లో దీన్ని కూడా ఒకటిగా భావించవచ్చు. ప్రభుత్వం సోషలిస్టు ఆస్తిని కాపాడి, దాన్ని మరింత పెంపొందించేందు కనువైన పరిస్థితులను ఏర్పరుస్తుంది. ఈ సోషలిస్టు ఆస్తి మొత్తం ప్రజలందరి ఆస్తి. అంచాత, దాన్ని వ్యక్తిగత లాభానికి, యితర స్వార్థప్రయోజనాలకు ఎవరైనా వాడడాన్ని రాజ్యాంగ చట్టం నిషేధిస్తోంది. దీనర్థం, వ్యక్తిగత ఆస్తి అన్నది లేనేలేదని కాదు. సోవియట్ పౌరులు, తాము సంపాదించిన సొమ్మును పైనందిన వినియోగం కోసం అవసరమైన వస్తువులను. వ్యక్తిగత వాడకానికి, సౌకర్యాలకు, వినియోగించుకోవచ్చు. అలాంటి వాటిల్లో తమ పెరటి తోటల్లో వాడకానికి కావలసిన పనిముట్లు, ఇల్లు, డబ్బు నిల్వలు వగైరాలు చేరి వుంటాయి. ఇట్టి వ్యక్తిగత ఆస్తికి వారసత్వహక్కు వుంది. ఇట్టి ఆస్తికి, వార సత్వపు హక్కులకు ప్రభుత్వ రక్షణ వుంది. పౌరులకు స్వంత వినియోగానికి యింటి స్థలం, పెరటి తోటల పెంపకానికి భూఖండాలు (పశువులు, కోళ్ళు, పళ్ళ చెట్లు, కూరగాయల పెంపకానికి, స్వంతయింటి నిర్మాణానికి) కేటాయించబడతాయి. తమ పెరటి తోటల పెంపకానికి పౌరుల కవసరమైన సాయాన్ని అటు ప్రభుత్వము, యిటు సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు అందిస్తాయి.

అయితే, వ్యక్తుల అధీనంలోని ఆస్తిని అనార్జిత ఆదాయాన్ని సమకూర్చుకుందుకో, సమాజానికి హానికరమైన పనులు చేసేందుకో, వినియోగం చేసేందుకు ఏవిధంగాను వీల్లేదు. ఈనాడు సోవియట్ దేశంలోవున్న పరిస్థితుల్లో పూర్తిగా దిగజారిపోయిన వాళ్ళో, సోమరిపోతులోతప్ప మరెవరూ యిలా అనార్జిత ఆదాయాల్ని ఆకట్టుకోవాలని చూడరు. పనిచేసే ప్రతివాడికి సోవియట్ సమాజం జీవనోపాధిని గ్యారంటీ చేస్తోంది. రాజ్యాంగ చట్టపు 15వ

నిబంధన సోషలిజం, సామాజికోత్పత్తుల అత్యున్నత లక్ష్యం, నానాటికీ పెరుగుతూన్న ప్రజల పాదార్థిక సాంస్కృతిక, బౌద్ధిక అవసరాలను తీర్చడమేనని ప్రకటిస్తూంది. రేపంటే ఆందోళన, సంశయము లేన్నాడు, తన స్వంత భవిష్యత్తుగురించో తన బిడ్డల భవిష్యత్తుగురించో యెవరూ ఆదురా, ఆందోళన చెందవలసిన అవసరం లేన్నాడు మరింత సంపదనుత్పత్తి చేయగల సంపదను కూడబెట్టవలసిన అవరసమెక్కడుంది?సోవియట్ దేశంలో,దోపిడీ అంటే ఏమిటో యెరుగని ప్రజల శ్రమ సామాజిక సంపదనూ, ప్రతి వ్యక్తి యొక్క ప్రజలందరి యొక్క సంక్షేమాన్నీ పెంచుతూంది. "శక్తినిబట్టి పని, పనినిబట్టి ప్రతిఫలం" అన్నది సోషలిజంలోని మౌలిక సూత్రం. అంచాత సోవియట్ యూనియన్‌లో ప్రతివ్యక్తి తన శ్రమను సమర్పిస్తాడు. దాని పరిమాణం, గుణాలకు తగినట్లుగా ప్రతిఫలం పొందుతాడు. సమాజంలో వ్యక్తి హోదా కూడా, అతడు చేసే సామాజికంగా ఉపయోగకరమైన పని మీద, అదిచ్చే ఫలితాలమీద ఆధారపడి వుంటుంది.

భూమంతా ప్రభుత్వానిది సమిష్టి వ్యవసాయ క్షేత్రాలకు కావలసిన భూమిని వారు శాశ్వతంగా, ఉచితంగా వినియోగించుకుందుకై ప్రభుత్వం యిస్తుంది. మన మింతకుముందే చూచినట్లుగా, పౌరులకు వ్యక్తిగతంగా, చట్టంలో చూపిన విధంగా భూఖండాలను వినియోగించుకుందుకు ప్రభుత్వం అనుమతిస్తుంది. భూమి, ఖనిజాలు, నీటివనరులు, వృక్ష, జంతుసంపదలను హేతుబద్ధంగాను, శాస్త్రీయంగాను వినియోగించేందుకు, వాతావరణం కలుషితం కాకుండా, మరింత మెరుగుపడేందుకు అవసరమైన చర్యలన్నిటినీ ప్రభుత్వం చేబడుతుంది.

పైన పేర్కొన్న వివరాలన్నీ, సోవియట్ దేశ ఆర్థిక వ్యవస్థ ఒక సమగ్ర, సంశ్లిష్ట ఆర్థిక వ్యవస్థ అనీ, ఆ దేశ భూభాగంపైనున్న సామాజికోత్పత్తి, పంపిణీ, మారకాలకు సంబంధించినవన్నీ అంతర్భాగాలుగా వున్నాయనీ విశదం చేస్తున్నాయి. ఆర్థిక, సామాజిక అభివృద్ధి ప్రణాళికల ప్రాతిపదికపై దేశ ఆర్థిక వ్యవస్థను ప్రభుత్వమే నిర్వహిస్తుంది. వీలయినంతవరకు, దేన్నీ యాదృచ్ఛికతకు వదలివేయడం జరుగదు. సోషలిస్టేతర ప్రపంచంలోవలె ఉత్పత్తి సంక్షోభాలు అక్కడ లేవు.

సోవియట్ దేశ సామాజిక పునాది, కార్మిక, కర్షక, మేధోపజీవుల సంఘటన వర్గ విభేదాలు అంతరించడంతో పల్లెలకు పట్టణాలకు మధ్య, శారీరక శ్రమకు, మానసిక శ్రమకు మధ్యగల తేడాలను తగ్గించివేస్తూ, వివిధ జాతుల, ఉపజాతుల ఐక్యతను సుదృఢం గావించి, పెంపొందిస్తూ సామాజిక ఏకరూపతను పెంచేందుకు సోవియట్ సమాజం పట్టువీడని కృషి సల్పుతోంది. గ్రామీణ ప్రాంతాల్లో పట్టణవాసపు సౌకర్యాలను అధికాధికంగా కల్పించడంద్వారా పల్లెకు, పట్నానికి మధ్యగల వ్యత్యాసాన్ని కుదించడం జరుగుతోంది. పల్లెసీమలలో విద్యా, సాంస్కృతిక, వైద్యసంస్థలను విరివిగా నెలకొల్పడంద్వారాను, వ్యాపార, జనోపయోగ, హోటలు వసతులను విస్తరింపజేయడంద్వారాను, గ్రామాలు, పట్టణాలను పథకం ప్రకారం నిర్మించిన ఆవాసాలుగా పునర్నిర్మించడంద్వారాను వ్యావసాయక శ్రమ ఒకవిధమైన పారిశ్రామిక శ్రమగా పరిణతి చెందించేందుకు ప్రయత్నం జరుగుతోంది. శాస్త్రీయ, సాంకేతిక పురోగతిద్వారా శారీరక శ్రమయొక్క విసుగుపుట్టించే స్వభావాన్ని, కండలవిసే కష్టాన్ని తగ్గించి, శారీరక శ్రమలో పాలొనేవారుకూడా విజ్ఞానాన్ని ఆర్జించి, మేధోపజీవుల స్థాయికి ఎదిగేందుకు వీలుకలుగుతోంది.

ప్రజల వేతనాల స్థాయీలనూ, వాస్తవ ఆదాయాలనూ స్థిరంగా పెంపొందించే విధానానికి ప్రభుత్వం అచంచలంగా కట్టుబడివుంది. ఉత్పాదకశక్తి పెరుగుదలవల్ల ఇది సాధ్యమవుతూవుంది. పెట్టుబడిదారీ దేశాల్లో పారిశ్రామిక కార్యకలాపాలకు చోదకశక్తి లాభతృష్ణయే. పోటీని నిర్మూలించి గుత్తసంస్థలు ఆధిపత్యం వహించడంతో, కృత్రిమమైన కొరతలను సృష్టించి విపరీతమైన లాభాలను గుంజడం జరుగుతోంది. దాంతో ఒక చెంప అపార సంపదలు మురుగుతూన్నా, మరోచెంప కటిక దారిద్ర్యం తాండవిస్తోంది. వినియోగ వస్తువులను పెద్ద యెత్తున ఉత్పత్తి చేసి, కుప్పలుబోసే బ్రహ్మాండమైన పారిశ్రామిక సముదాయాలు, వాటిని సామాన్య ప్రజలకు అందుబాటులో లేకుండా చేస్తున్నాయి. తద్వారా తమ లాభాలను పెంపొందించుకుంటూ, ప్రజా సంక్షేమాన్ని కాలరాస్తున్నాయి. ఇందుకు పూర్తి విరుద్ధంగా సోవియట్ యూనియన్‌లో కార్మికులకు పాదార్థిక, నైతిక ప్రోత్సాహాలిచ్చి పనియెడల సృజనాత్మక దృక్పథం,

అన్వేషణాభిలాష పెంపొందిస్తున్నాయి. ప్రతి కార్మికుడు తన సర్వశక్తులను సామాజిక ప్రయోజనంకోసం వినియోగించేలా ప్రోత్సహిస్తున్నాయి. సామాజిక ప్రయోజనంకోసం అతడు చేసే కృషి, దాని ఫలితాలే సమాజంలో ఆ వ్యక్తి హోదాని, గౌరవాన్ని నిర్ణయిస్తున్నాయి. కనుకనే, కార్మిక జనసామాన్యం అత్యుత్తమ కార్మికులను అనుసరించేందుకు పాటుబడతారు. ఉత్పత్తి అభివృద్ధి చెందేకొద్దీ మొత్తం సమాజ కల్యాణం పెంపొందటంతోపాటు వ్యక్తుల సర్వతోముఖ వికాసం జరుగుతూంది. శాస్త్రీయ, సాంకేతిక రంగాల్లోని నిరంతర ప్రగతి, ఆర్థిక వ్యవస్థ సర్వతోముఖ వికాసానికి, ప్రజాసంక్షేమానికి అనుగుణంగా మలచబడుతూంది. తత్ఫలితంగా అభివృద్ధి అనంతంగా సాగుతూంది. అందువల్ల సహజంగానే, వ్యక్తుల జీతనాతాలు అందుకు తగినట్లుగా పెరగడమేగాక, సామాజిక వినియోగ నిధులు నానాట పెరుగుతున్నాయి. ప్రభుత్వం, ప్రజాసంస్థల సమిష్టి గ్రామికసంస్థల సహాయ, సహకారాలతో ఈ నిధులను మరింత పెంపొందించడానికి, వృద్ధాప్య పెన్షను వికలాంగులయినవారికి జీవన భృతి, ఆరోగ్య విశ్రాంతి కేంద్రాలలో ఉండే ఏర్పాట్లు, జీతంతో కూడిన శెలవలు మొదలైన వాటిద్వారా వాటిని న్యాయసమ్మతంగా పంపిణీ చేయడానికి గట్టి చర్యలు తీసుకొంటోంది.

ప్రజల ఆరోగ్య రక్షణకు, సామాజిక భద్రతా కల్పనకు, సమిష్టి భోజనశాలల, సామాజిక సేవల, సౌకర్యాల కల్పనకు అవసరమైన పథకాలు అమలుజరుగుతున్నాయి. ఈ సౌకర్యాలను నిరంతరం పెంచడం జరుగుతూంది. ఇట్టి సేవలు ప్రభుత్వ సంస్థలేకాక సహకార తదితర సంస్థలు కూడా చేస్తున్నాయి. పెద్ద ఎత్తున ప్రజలందరికీ క్రీడ, వ్యాయామ కార్యకలాపాలకు గొప్ప ప్రోత్సాహం లభిస్తోంది.

సోవియట్ యూనియన్‌లో పౌర విద్యావిధానం, సకల పౌరులకు సాధారణ విద్య, వృత్తి శిక్షణ సౌకర్యం కల్పిస్తోంది. ఈ వసతులు అనుదినం విస్తృత మొనర్చబడుతూన్నాయి. సోవియట్ యూనియన్‌లో విద్యావిధాన లక్ష్యం జ్ఞానాన్ని సమకూర్చడం ఒక్కటేకాదు, విద్యార్థుల్లో సౌశీల్యాన్ని పెంపొందించడం కూడా. ప్రతివ్యక్తి అవసరాలు పూర్తిగా
సౌశీల్యాన్ని పెంపొందించటం కూడా ప్రతి వ్యక్తి అవసరాలు పూర్తిగా

తీరాలనే మహోన్నత లక్ష్య ప్రేరితమైన కమ్యూనిజం విలువలు ప్రతి విద్యార్థిని ప్రభావిత మొనర్చేలా చేసేందుకు ఈ విద్యావిధానం పాటుపడు తూంది. నానాటా పెరుగుతూన్న సామాజిక అవసరాలన్నింటినీ తీర్చేందుకై విజ్ఞాన శాస్త్రాభివృద్ధికి సోవియట్ ప్రభుత్వం ప్రత్యేక ప్రాధాన్యత నిస్తూంది. శాస్త్రీయ పరిశోధనా ఫలితాలన్నింటిని క్రమబద్ధంగా వినియోగించి, ఆర్థిక వ్యవస్థను ఎప్పటికప్పుడు అధునాతనం చేయడానికి సోవియట్ ప్రభుత్వం పూనుకొన్నది. ప్రజలలో నైతిక, కళాత్మక విద్యలను పెంపొందించి, వారి సాంస్కృతిక స్థాయిని పెంపొందింపడం కూడా ప్రభుత్వం తన విధిగా భావిస్తోంది. దేశ సాంస్కృతిక సంపత్తిని సంరక్షించి, సుసమృద్ధం గావించి, సద్వినియోగం చేసేందుకై ప్రభుత్వంపాటు బడుతూంది. సోవియట్ యూనియన్‌లో ఈనాడు జానపద, ఔత్సాహిక, వృత్తి కళలను అన్ని విధాలా అభివృద్ధి పరచేందుకు గట్టి ప్రయత్నాలు జరుగుతున్నాయి. సోవియట్ సాంస్కృతిక ప్రతినిధి వర్గాల ప్రదర్శనలు చూచిన వారి కెవరికైన ఈ విషయం తేటతెల్లం కాకమానదు.

సోవియట్ దేశ రాజకీయ, ఆర్థిక, సామాజిక వ్యవస్థ అభివృద్ధికై స్వభావరీత్యానే సుస్థిరశాంతి అత్యావశ్యకం. ఆర్థికాభివృద్ధి ఫలితాలలో అత్యధిక భాగాన్ని స్వాయత్తం గావించుకోవాలనే అల్ప సంఖ్యాక పరాన్నభుక్కుల కక్కడ స్థానంలేదు. అలాంటి దోపిడీ వర్గం లేకపోవ డంతో ఆ దేశ ఆర్థిక వ్యవస్థ నిరాఘాటంగా పెంపొందడానికిని, సామాజిక సాంస్కృతిక పురోభివృద్ధికి అపూర్వమైన అవకాశాలు సమకూరాయి. కాని యుద్ధం రావడమంటూ జరిగితే ప్రజల సృజనాత్మక కృషి మట్టిపాలు కావడమేకాక, అమూల్యమైన మానవ సంపద,అపారమైన పదార్థిక సంపద సర్వనాశనమవుతాయి. రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో సోవియట్ దేశానికి కలిగిన మానవ బలగం నష్టమే 20మిలియన్ల మంది. ఇక పదార్థిక, ఉత్పాదకసంపత్తికి జరిగిన నష్టం చెప్పనలవి కానిది. అందుచేతనే సోవియట్ దేశం తాను పుట్టిన నాటినుండీ శాంతి స్థాపనకు, సకల దేశాల భద్రతకు, విస్తృత అంతర్జాతీయ స్నేహ సహకారాల పెంపుదలకు అచంచల దీక్షతో అంకితమై పాటుపడుతూంది. సోవియట్ ప్రభుత్వ సంస్థాపకుడైన లెనిన్, వేర్వేరు సామాజిక వ్యవస్థలుగల దేశాల మధ్య శాంతియుత సహజీవన సూత్రా

లకు రూపకల్పన చేయడం యాదృచ్ఛికం కాదు. అలాగే,అలనాడు నానాజాతి సమితిలో శాంతి అవిభాజ్యమని ఎలుగెత్తి చాటిన ఘనత సోవియట్ విదేశాంగ మంత్రి లిత్వినోవ్‌కే దక్కింది. ఈనాడు సోవియట్‌దేశం, బ్రెజ్నెవ్ నాయకత్వాన స్థిరమైన శాంతి విధానాన్ని అనుసరిస్తూ, మూడవ ప్రపంచ యుద్ధంరూపంలో మరో మారణ హోమం ప్రపంచాన్ని పట్టి పెట్టకుండా కాపాడుతూ, హెల్సింకీ శిఖరాగ్ర సమావేశం జయప్రదమయ్యేందుకు కారణభూతమైంది. ఇట్టి సోవియట్ దేశ రాజ్యాంగ చట్టంలో, విదేశాంగ విధానంపై ఒక ప్రకరణమే చోటు చేసుకోవడంలో అబ్బురమేమీ లేదు. 28 వ నిబంధన ఈ సందర్భంగా ఇలా చెబుతూంది:"సోవియట్ విదేశాంగ విధానం స్వదేశంలో కమ్యూనిజం నిర్మాణానికి సానుకూలమైన అంతర్జాతీయ పరిస్థితులను ఏర్పరచేందుకు, సోవియట్ రాజ్య ప్రయోజనాలను కాపాడేందుకు,ప్రపంచ సోషలిస్టువ్యవస్థ స్థానాలను పదిలపరచేందుకు,జాతీయ విముక్తి, సామాజిక ప్రగతి సాధన కోసం వివిధ దేశాల ప్రజలు సాగిస్తూన్న పోరాటానికి మద్దతు సమకూర్చేందుకు, దురాక్రమణ యుద్ధాలను నివారించేందుకు, సార్వత్రిక, సంపూర్ణ నిరాయుధీకరణ సాధించేందుకు, విభిన్న సామాజిక వ్యవస్థలుగల దేశాలమధ్య శాంతియుత సహజీవనాన్ని వృద్ధి చేసేందుకు ఉద్దేశించబడినట్టిది."

సోవియట్ దేశంలో యుద్ధ ప్రచారం నిషిద్ధం.

సోవియట్ రాజ్యాంగ చట్టంలోని 29 వ నిబంధన కూడా ముఖ్యమైనది. అదిలా చెబుతూంది: "ఇతర దేశాలతో సోవియట్ యూనియన్ సంబంధాలు ఈక్రింది సూత్రాలపై ఆధారపడి ఉన్నాయి: సార్వభౌమిక సమానత్వం; బలప్రయోగాన్ని, బలప్రయోగ బెదిరింపులను పరస్పరం నిషేధించుకోవడం; ఆయా దేశాల సరిహద్దుల అనుల్లంఘనీయత; భౌగోళిక సమగ్రత; వివాదాల శాంతియుత పరిష్కారం; ఒక దేశ అంతరంగిక వ్యవహారాలలో మరో దేశం జోక్యం చేసుకోకపోడం; మానవ హక్కుల యెడ, మౌలిక స్వేచ్ఛలయెడ సంపూర్ణ గౌరవం; సకల జాతులకు సమాన హక్కులు; తమ భవితవ్యాన్ని నిర్ణయించుకొందుకు వారికిగల సంపూర్ణ స్వేచ్ఛ; దేశాలమధ్య పరస్పర సహకారం; సర్వత్రా గుర్తించిన అంతర్జాతీయ న్యాయ శాస్త్ర సూత్రాలూ, నిబంధనాలను బట్టి, సోవియట్

యూనియన్ సంతకం చేసిన అంతర్జాతీయ సంధులనబట్టి సంక్రమించే బాధ్యతలను చిత్తశుద్ధితో అమలుపరచడం."

రెండవ ప్రపంచ యుద్ధానికి ముందు సోవియట్ యూనియన్ ఏకైక సోషలిస్టు దేశంగా ఉండేది. కాని ఆ తర్వాత యూరప్, ఆసియా, ఆఫ్రికా, దక్షిణ అమెరికాలలో అనేక సోషలిస్టు దేశాలు అవతరించాయి. అంటే ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ, సోషలిస్టు రాజ్యాల కుటుంబం నెలకొన్నాయి. సోవియట్ రాజ్యాంగ చట్టంలో సోషలిస్టు దేశాల మధ్య స్నేహం, సహకారం, పరస్పర సహాయాలను బలోపేత మొనర్చాలనే సుదృఢ వాంఛ వ్యక్తమవుతూంది. ఒక ప్రపంచ శక్తిగా సోషలిస్టు వ్యవస్థ బలపడడం, జాతీయ విముక్తి, స్వేచ్ఛ, ప్రగతి శక్తులను ప్రపంచ వ్యాప్తంగా దృఢతరం గావిస్తుంది.

ఈ సందర్భంలో భారత రాజ్యాంగ చట్టంలోని 51 వ నిబంధన కూడా దాదాపు ఇటువంటిదిగా ఉండడం మనం గమనించవచ్చు. అందిలా పేర్కొనబడింది:

(అ) అంతర్జాతీయ శాంతి. సహకారాల పటిష్ఠం చేసేందుకు;

(ఆ) దేశాల మధ్య న్యాయ సమ్మతమైన, గౌరవప్రదమైన సంబంధాలను నెలకొల్పేందుకు;

(ఇ) సంఘటిత ప్రజలు పరస్పర వ్యవహారాల్లో అంతర్జాతీయ న్యాయశాస్త్రం పట్ల, సంధి బాధ్యతల పట్ల గౌరవాన్ని పెంపొందించేందుకు;

(ఈ) అంతర్జాతీయ వివాదాలను మధ్యవర్తిత్వం ద్వారా పరిష్కరించుకోవడాన్ని ప్రోత్సహించేందుకు రాజ్యం కృషి చేస్తుంది.

సోవియట్ రాజ్యాంగచట్టం సోషలిస్టు వ్యవస్థ శాంతియుత విదేశాంగ విధానాన్ని ప్రకటించగా, ఒక అలీనదేశ శాంతియుత విదేశాంగ విధానాన్ని భారత రాజ్యాంగచట్టం వ్యక్తీకరించిందని చెప్పవచ్చు. ఈ రెండు రాజ్యాంగ చట్టాలలోని విదేశాంగ విధానానికి సంబంధించిన నిబంధనలను పరిశీలించినట్లయితే వాటి లక్ష్యాల మధ్యగల సారూప్యత స్పష్టమవుతుంది. కొన్ని శతాబ్దాలపాటు సాగిన సామ్రాజ్యవాద పాలన మూలంగా తమకు ప్రాప్తించిన ఆర్థిక, సామాజిక వెనుకబాటుతనాన్ని అధిగమించేందుకు

అలీన దేశాలు నడుము బిగించాయి. సోషలిస్టు దేశాలకు లాగానే వీటికీ శాంతి, పరస్పర సహకారము ఒక మౌలికావసరం.

శాంతిని కాపాడాలని సోవియట్ యూనియన్ ఎంతో ఆదుర్దా చెందుతూన్నప్పటికీ, అదే సమయంలో, సామ్రాజ్యవాదులు, సోషలిజం శత్రువులు చరిత్రగతిని తిరోముఖం పట్టించేందుకు, సామాజిక ప్రగతిని నిరోధించేందుకు పొంచి ఉన్నారన్న సత్యాన్ని అది ఒక క్షణమైనా మరువదు. అందుకే 31, 32 నిబంధనలలో సోషలిస్టు మాతృదేశ రక్షణను గురించి నొక్కి చెప్పబడింది.

## *రెండవ విభాగం*

# రాజ్యవ్యవస్థా, వ్యక్తి

సోవియట్ రాజ్యాంగ చట్టానికి గుండెవంటిదైన ఈ విభాగానికి ఎంతో ప్రాముఖ్యత ఉంది. ఈ విభాగానికి "రాజ్యవ్యవస్థా, వ్యక్తి" అని పేరుపెట్టడం ఎంతో గమనార్హం. ప్రవర్తిత సోషలిస్టు సమాజంగల సోవియట్ యూనియన్‌లో రాజ్య వ్యవస్థ, ఒక సమిష్టిసంస్థ అంగమేగాని ప్రజలకు అతీతమైనది కాదు. అందువల్ల సహజంగానే సమిష్టిప్రయోజనాలయిన రాజ్య ప్రయోజనాలను, పౌరుల వ్యష్టి ప్రయోజనాలను సమన్వయించడం సాధ్యమూ, అత్యావశ్యకమున్నూ. అందుకే రాజ్యాంగ చట్టంలోని 39 వ నిబంధన ఇలా పేర్కొంటున్నది: ఒక చెంప "సోషలిస్టు వ్యవస్థ పౌరుల హక్కులూ, స్వేచ్ఛలూ పెరిగేందుకు, సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక అభివృద్ధి కార్యక్రమాలు అమలు జరిగేకొద్దీ వారి జీవన ప్రమాణాలు నిరంతరం మెరుగయేందుకు హామీ చేకూర్చుతుంది;" మరో చెంప "పౌరులు తమ హక్కులు, స్వేచ్ఛలను అనుభవించడం సమాజ, రాజ్య ప్రయోజనాలకు భంగకరమైన విధంగా ఉండరాదు, ఇతర పౌరుల హక్కులకు నష్టకరంగా ఉండరాదు."

ఈ రెండవ విభాగంలో రెండు ప్రకరణాలున్నాయి. ఒక ప్రకరణంలో సోవియట్ దేశ పౌరసత్వం, పౌరుల సమాన హక్కులు గురించి చెప్పబడింది. రెండవ ప్రకరణంలో సోవియట్ దేశ పౌరుల హక్కులు, విధుల గురించి వివరించబడింది.

సోవియట్ దేశంలోని స్వయంపాలిత మండలాలు, ప్రాంతాలతో సహా అన్ని రిపబ్లిక్కులకు చెందిన పౌరులందరూ సోవియట్ పౌరులే. సోవియట్ దేశ పౌరులు, వారి పుట్టుక, సామాజిక, ఆస్తి, అంతస్థులు, నరవంశము, జాతి, లింగము, విద్య, భాష, మత దృక్పథము, వృత్తి స్వభావము, నివాసము తదితర భేదాలతో నిమిత్తం లేకుండా చట్టంముందు సర్వసమానులు. ఈ సమానత్వం ఆర్థిక, రాజకీయ, సామాజిక, సాంస్కృతి కాది సమస్త రంగాలకు వర్తిసుంది. కనుకనే గొప్పలు చెప్పుకునే పాశ్చాత్య ప్రజాస్వామికాలలోని సమానత్వంకంటె ఈ సమానత్వం ఎక్కువ సమగ్రమైనది. వాస్తవానికి, ఆస్తి, ఆ కారణాన హక్కులను అనుభవించే సాధనాలులేని అటువంటి ప్రజాతంత్ర దేశాలలోని ప్రజలకు సమానత్వ మన్నది వట్టి పిచ్చిభ్రమ, వంచన తప్ప వేరేమికాదు. ఇలాంటి అనేక దేశాలలో చట్టం మహా గొప్పగా సామాన్యులకు, కోటీశ్వరులకు కూడా ఒక వంతెనక్రింద పడుకొందుకు, బ్రహ్మాండమైన భవనాలకు యజమానులై వాటిలో నివసించేందుకు సమానమైన హక్కు నిస్తుంది. కాని, కటిక దరిద్రులు, తలదాచుకొన గూడులేనివారు తమ జీవితాలలో గృహవాసానికే నోచుకోక, ఫుట్‌పాత్‌లపైన, వంతెనలక్రింద జీవించే హక్కునే అనుభ వించగలరు. ఇదీ అక్కడి దయనీయ పరిస్థితి. వారికి చట్టం ప్రసాదించే హక్కులు కాగితంమీద చూసి మురిసిపోయేందుకేగాని, నిత్యజీవితంలో అనుభవించేందుకు ఉద్దేశించినవి కావు. ఒక్క సోషలిస్టు దేశాల్లో మాత్రమే సమానత్వం ఆర్థికమూ, రాజకీయమూ, సామాజికమూ, సాంస్కృతికమూ అయినదిగా ఉంది. అంతేకాదు. సోవియట్ యూనియన్‌వంటి సోషలిస్టు దేశంలో జన్మతః అసమానులైనవారి మధ్య కూడా సమానత్వం నెల కొంది. మహిళలు బిడ్డలను కనడం, పెంచడం వంటి సహజ అసౌకర్యా లకు గురిఅవుతుంటారు. అందుకే, కొన్ని ప్రత్యేక శ్రామిక, ఆరోగ్య సంరక్షణా చర్యలు స్త్రీలకొరకై ప్రభుత్వం చేపట్టింది. పురుషులతోపాటు మహిళల సమాన హక్కులకు చట్టపరమైన రక్షణ కల్పించడం ద్వారాను, పాదార్థిక, నైతిక మద్దతును సమకూర్చుట ద్వారాను స్త్రీలు పనిచేసేందుకు సమాన అవకాశాలు కల్పించబడ్డాయి. పిల్లల తల్లులకు జీతంతోకూడిన సెలవులు, గర్భవతులకు ఇతర సౌకర్యాలు కల్పించబడ్డాయి. వీటితోపాటు

చిన్నపిల్లల తల్లులకు పని గంటలు క్రమంగా తగ్గించబడుతున్నాయి. ఈ విధంగా అసమానత్వానికి దారితీసే అంశాలను ప్రభుత్వము, చట్టము జోక్యం కలిగించుకొని క్రమంగా కుదించి, తొలగిస్తున్నాయి. అలాగే అక్టోబరు విప్లవం నాటికి సోవియట్ యూనియన్‌లోని వేర్వేరు ప్రాంతాలు విభిన్న, ఆర్థిక తదితర అభివృద్ధి దశలలో ఉండినాయి. అందుకే రాజ్యాంగ చట్టంలోని 36 వ నిబంధన తెలుపుతున్నట్లు, వెనుకబడిన ప్రాంతాల మూలమట్టమైన అభివృద్ధి సాధనకై ప్రత్యేక కృషి జరిగింది. అంతేకాక, సోవియట్ పౌరులను దేశభక్తి, సోషలిస్టు అంతర్జాతీయత భావాలతో చైతన్యవంతులను గావించి సకల జాతులు, ఉప జాతులకు చెందినవారిని పరస్పరం సన్నిహితం చేసేందుకు కృషిచేయడం జరిగింది. సకల ప్రాంతాల సర్వతోముఖాభివృద్ధి సాధించడంద్వారా సమానహక్కులనుభ వించే అవకాశం ప్రజలందరకు కల్పించబడింది. సకల శ్రామిక ప్రజల సౌభ్రాతృత్వం పునాదిగాగల సోషలిస్టు అంతర్జాతీయత, సకల జాతులపట్ల గౌరవభావాన్ని ప్రోదిచేస్తుంది. అంతేగాక ప్రతివారికి తన మాతృ భాషను, అలాగే ఇతర ప్రజల భాషలను కూడ వినియోగించేందుకు పూర్తి అవకాశం కల్పించబడింది. జాతి, నరవంశ ప్రాతిపదికపై వేర్పాటు తత్వాన్ని, విద్వేషాలను, వ్యతిరేకతను రెచ్చగొట్టడం, అలాగే ప్రత్య క్షంగాగాని, పరోక్షంగాగాని జాతి, నరవంశం ప్రాతిపదికగా ప్రత్యేక హక్కుల పరికల్పన చట్టరీత్యా శిక్షార్హాలవుతాయి.

సోవియట్ దేశం విదేశీయులకు చట్టబద్ధమైన రక్షణ, రాజ్యాంగ విహితమైన స్వేచ్ఛలకు హామీనిస్తుంది. 38వ నిబంధనలో శ్రామిక ప్రజల ప్రయోజనాల సంరక్షణకు పాటుపడుతున్నందుకు, శాంతి సాధనకై కృషి చేస్తున్నందుకు, విప్లవ, జాతీయ విముక్తి ఉద్యమాలలో పాలు పంచుకున్నందుకు, ప్రగతిశీల సామాజిక, రాజకీయ, శాస్త్రీయ తదితర సృజనాత్మక కార్యకలాపాలలో చురుగ్గా పాల్గొంటున్నందుకు స్వదేశాల్లో నిర్బంధాలకు వేధింపులకు గురయ్యే విదేశీయులకు, ఆశ్రయ మిచ్చేందుకు వీలుకల్పించబడింది. మనమిక 1977 రాజ్యాంగచట్టం సోవి యట్ పౌరులకిచ్చిన హక్కులను, స్వేచ్ఛలను పరిశీలిద్దాం. క్రింది పట్టికను

పరిశీలిస్తే ఈ హక్కులెంత విలువైనవో తేటతెల్లమవుతుంది. ఆ హక్కులివీ:

1. పనిహక్కు (నిబంధన. 40)

2. విశ్రాంతి, విరామ హక్కు (ని. 41)

3. ఆరోగ్య సంరక్షణ హక్కు (ని. 42)

4. వృద్ధాప్యంలో జబ్బుపడినపుడు, సంపూర్ణ, అసంపూర్ణ, అశక్తత ప్రాప్తించినపుడు, కుటుంబ పోషకుడు మరణించినపుడు పోషణ హక్కు (ని. 43)

5. గృహవసతి హక్కు (ని.44.)

6. విద్యాహక్కు [ని.45]

7. సాంస్కృతిక ప్రయోజనాలను అనుభవించే హక్కు [ని.46]

8. పరిపాలనా పౌరవ్యవహారాల నిర్వహణలోను, మొత్తం దేశ, స్థానిక ప్రాధాన్యతగల చట్టాలు, చర్యలపై జరిగే చర్చలు, నిర్ణయాలలో పాలు పంచుకొనే హక్కు [ని.48]

9. ప్రభుత్వ సంస్థలకు, ప్రజా సంస్థలకు వాటి కార్యకలాపాలను మెరుగు పరచేందుకు ఉద్దేశించిన ప్రతిపాదనలను సమర్పించుటకు, వాటి లోపాలను విమర్శించుటకు, అట్టి విమర్శలను, ప్రతిపాదనలను ఆయా అధికారులు పరిశీలించి వాటికి తగు సమాధానాలిచ్చి అనువైన చర్య సకాలంలో గైకొనేలా చేసేందుకుగల హక్కు [ని.49]

10. ప్రజాసంఘాలలో పాల్గొని. వాటి రాజకీయ కార్యకలాపాలను, చొరవను పెంపొందించేందుకు వాటికి సంబంధించిన వివిధ ప్రయోజనాలను నిర్దిష్టం చేసేందుకు గలహక్కు. [ని. 51]

11. అధికారుల, ప్రభుత్వసంస్థల, ప్రజాసంస్థల చర్యలపై ఫిర్యాదులు సమర్పించేందుకు, అట్టి ఫిర్యాదులపై చట్టంలో నిర్దేశించిన కాల పరిమితి లోపల పరిశీలన జరిపి చట్టవిహితమైన చర్య తీసుకొనేలా చూచేందుకుగల హక్కు. [ని.58]

పని హక్కు లేదా ఉద్యోగ హక్కు 1936 రాజ్యాంగచట్టంలోనే గ్యారంటీ చేయబడింది. ఆనాటికే సోషలిజం విజయం సాధించి, ప్రతి పౌరునికి జీవనోపాధి సాధనాలను పొందేందుకు పూర్తి అవకాశం కల్పించ

బడింది. అయితే ఈనాటి రాజ్యాంగచట్టంలో ఈ హక్కు ఇంకా మెరుగు పరచబడింది. ఈనాడు సోవియట్ పౌరులకు తమ అభిరుచులు, సామర్థ్యం, శిక్షణ, విద్యల కనుగుణంగా, సమాజావసరాలను దృష్టిలో ఉంచుకొని తమ కిష్టమైన వృత్తిని, పనిని, ఉద్యోగ తరహాను ఎంపిక చేసుకొనే హక్కు ప్రస్తుత రాజ్యాంగచట్టం కల్పించింది. పౌరులకు తమ పని పరిమాణము, గుణాల కనుగుణంగా, చట్టం నిర్దేశించిన కనీస వేతనానికి ఏమాత్రం తగ్గకుండా ప్రతిఫలం పొందే హక్కు ఉన్నది. సోషలిస్టు ఆర్థిక వ్యవస్థ ఉండడం వల్లను, 1936-1977 మధ్యకాలంలో ఉత్పత్తి శక్తులు బ్రహ్మాండంగా అభివృద్ధి చెందడంవల్లను ఈ హక్కుకు హామీ ఏర్పడింది. ఉద్యోగంలో చేరాక కూడా ఉచిత వృత్తివిద్యాశిక్షణ పొంది, నైపుణ్యాన్ని పెంపొందించుకొని, కొత్త వృత్తులను, పని పాటలను చేపట్టేందుకు పౌరులకు కల్పించబడిన అవకాశం గురించి ప్రత్యేకంగా చెప్పుకోవలసి ఉన్నది.

గృహవసతి హక్కు కొత్తది. దీనిని ప్రసాదించిన దేశం ఇప్పటికి ఒక్క సోవియట్ యూనియనే. ఆ దేశం సాధించిన ప్రవర్ధిత సోషలిజం మూలంగానే ఇది సాధ్యమయింది. ప్రపంచంలో మరే దేశము ఇట్టి హక్కును ఇవ్వలేదు.

పైన పేర్కొన్న హక్కులే గాక, అత్యంత ప్రవర్ధిత కమ్యూనిస్టు సమాజ నిర్మాణలక్ష్యాన్ని సాధించుటకై శాస్త్రీయ, సాంకేతిక, కళాత్మక కృషిలో సంపూర్ణస్వేచ్ఛ పౌరుల కివ్వబడింది [నిబంధన : 47]. వీటికి తోడు పౌరులకు వాక్సభా పత్రికా స్వాతంత్ర్యం, ప్రదర్శనలు జరిపే స్వేచ్ఛ కల్పించబడ్డాయి [నిబంధన : 50]. మతస్వేచ్ఛ అనగా ఏ మతాన్నయినా విశ్వసించడానికి, లేదా దేనినీ విశ్వసించక పోవడానికి, స్వేచ్ఛ ఉంది. పూజలు, మత ప్రచారం, లేదా నాస్తిక ప్రచారం గావించేందుకు పూర్తి హక్కు ఉంది. అయితే, మత ప్రాతిపదికపై ప్రజల మధ్య విద్వేషాలను, పరస్పర వ్యతిరేకతను రెచ్చగొట్టడం నిషేధించబడింది. రాజ్య వ్యవస్థ నుండి చర్చి, చర్చి నుండి పాఠశాల వేరు చేయబడ్డాయి [నిబంధన : 52]

పైన పేర్కొన్న హక్కులు, స్వేచ్ఛలు అన్నీ వాస్తవమైనవి. అవి కేవలం కాగితంపై ఉండి పోయేవి కావు. ఎందువల్లనంటే రాజ్యాంగంలో వాటికిఆయా నిబంధనల క్రింద వాటిని అమలు జరిపేందుకు అవసరమయిన సాధనాలు, విధానాలు గ్యారంటీ చేయబడ్డాయి.

ఇంతకుముందే చూపినట్లుగా, వస్తువుల కొరతను సృష్టించి లాభాలను పెంపొందించు పెట్టుబడిదారీ లాభతృష్ణ ఉత్పత్తి శక్తుల అభివృద్ధికి ఆటంకం కాకుండా నివారించగలది సోషలిస్టు ఆర్థిక వ్యవస్థయే. ఇది మాత్రమే ప్రజలందరికి పని చూపుతుంది. ప్రజలకు ఏ వృత్తి చేపట్టేందుకైనా, ఎలాంటి విజ్ఞానాన్ని సముపార్జించేందుకైనా అన్ని అవకాశాలు కల్పించబడతాయి. అందుచేత తమకు అభిరుచి ఉన్న, తాము ఎంచుకున్న ఏ వృత్తికైనా, పనికైనా అవసరమైన నైపుణ్యాన్ని ఆర్జించేందుకు వారికి పూర్తిగా అవకాశం లభిస్తుంది.

వారానికి నలభై ఒకటికి మించి పనిగంటలు ఉండటానికి వీలు లేదు. పని భారం ఎక్కువగా ఉండే కొన్ని ప్రత్యేక పరిశ్రమలలోను, వృత్తులలోనూ, రాత్రులందు పనిచేయవలసి వచ్చిన సందర్భాలలోనూ, ఈ పనిగంటల సంఖ్య ఇంకా తగ్గుతుంది. ప్రతివాటికి వారాంతపు శెలవులు, వార్షిక శెలవులు లభిస్తున్నాయి. సాంస్కృతిక, విద్యా, ఆరోగ్య సంరక్షణా సంస్థలు అనుదినం విస్తరిస్తున్నాయి. క్రీడలు, వ్యాయామ సౌకర్యాలు- సాంస్కృతిక కార్యక్రమాలూ, విహార విశ్రాంతి సౌకర్యాలు పెద్ద ఎత్తున పెంపొందింపబడుతున్నాయి. ఈ విధంగా, విశ్రాంతికిగల హక్కు వాస్తవ రూపం ధరిస్తూంది.

సమర్థమైన, ఉచిత వైద్యసేవ ప్రతి ఒక్కరికి అందుబాటులో వుంది. జబ్బులను నివారించేందుకు, ప్రజల జీవన కాలాన్ని దీర్ఘమొనర్చేందుకు అవసరమైన పరిశోధనను ప్రభుత్వం పట్టుదలగా ప్రోత్సహిస్తుంది. పాల్యాంశంలో భాగంగా తప్ప పిల్లలచేత శ్రమ చేయించటం పూర్తిగా నిషేధించబడింది. మానవ పరిసరాల కాలుష్యాన్ని నివారించడానికి, స్వచ్ఛతను పెంపొందించడానికి అన్ని ప్రయత్నాలు జరుగు

తున్నాయి. ఈ విధంగా ప్రజలు తమ ఆరోగ్య హక్కును అనుభవించేం దుకు ప్రాతిపదికలు నిర్మించబడ్డాయి.

కార్మికులకు, ఉద్యోగులకు, సమిష్టిక్షేత్ర రైతులకు సామాజిక బీమా సౌకర్యం కల్పించబడింది. తాత్కాలిక అశక్తత ఏర్పడినపుడు, అలవెన్సులు లభిస్తాయి. ప్రభుత్వం, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు రిటైరయిన వారికి పెన్షన్‌లు, అశక్తులయినపుడు పింఛను, కుటుంబ పోష కుడు మరణించినపుడు పింఛను ఇస్తాయి. పాక్షిక అశక్తతకు గురైనవారికి వారు చేయగల పనిని చూపిస్తారు. అలాగే ముసలివారికి, పూర్తిగా అశక్తులైపోయిన వారికి అన్ని విధాలయిన వసతులను కల్పించడం జరుగు తుంది. ఈ సౌకర్యాలన్నీ ఆయా వ్యక్తుల ఖర్చుపైగాక ప్రభుత్వం, లేదా సమిష్టి వ్యవసాయ క్షేత్రాల వనరుల నుండి కల్పించబడుతున్నాయి. ఈ విధంగా, ప్రభుత్వమూ, సమష్టి వ్యవసాయ క్షేత్రాలూ తగు బాధ్యతలు స్వీకరించడంవల్ల, ముసలితనంలోను, జబ్బుపడినప్పుడు పోషణ పొందే హక్కు ఆచరణయుక్తమయింది.

అన్నివిధాలయిన విద్యలను నేర్పుటకు అనువగు సంస్థలు ఏర్పాటు చేయబడ్డాయి. సోవియట్ యూనియన్‌లో విద్య ఉచితం. సార్వజనీన నిర్బంధ సెకండరీ విద్యావిధానం అమలులో ఉన్నది. వృత్తి, సెకండరీ ఉన్నత, ప్రత్యేక విద్యా సంస్థలను విరివిగా నెలకొల్పి విద్యా బోధన ఆచరణాత్మకంగా మలచబడింది. ఉత్పత్తి విధానానికి అనుసంధానం గావించబడింది. సాయంకాల పాఠశాలలు, ఉత్తర ప్రత్యుత్తరాలు, విశ్వ విద్యాలయేతర విద్యాబోధ మున్నగు పద్ధతులు బాగా అభివృద్ధి చెందాయి. విద్యార్థులకు ప్రభుత్వ ఉపకార వేతనాలు, గ్రాంట్లు లభిస్తున్నాయి. పాఠ్య పుస్తకాలు ఉచితంగా ఇవ్వబడుతున్నాయి. ప్రతి పౌరునికి పాఠశాలకు హాజరయ్యేందుకు పూర్తి అవకాశం కల్పించబడింది. విద్యాబోధన మాతృ భాషలో జరుగుతుంది. వ్యక్తులు సొంతంగా చదువుకునేందుకు అవసర మయిన సౌకర్యాలన్నీ కల్పించబడ్డాయి. అందువల్ల విద్యాహక్కును సమస్త ప్రజలు అనుభవిస్తున్నారు.

సోవియట్ దేశమంతటా సాంస్కృతిక మ్యూజియంలు, విద్యా సంస్థలు నెలకొని ఉన్నాయి. అత్యధిక సంఖ్యాక సోవియట్ ప్రజలకు

రేడియో, టెలివిజన్ సెట్లు ఉన్నాయి. అనేక ఛానల్స్ ద్వారా టెలివిజన్, రేడియో ప్రసారాలు కొనసాగుతున్నాయి. ఏ ఇతర దేశంలో కనీవినీ ఎరుగనంతటి స్థాయిలో పుస్తకాలు, పత్రికలు ప్రచురింపబడుతున్నాయి. ఉచిత గ్రంథాలయ సేవలు అందరికీ అందుబాటులో ఉన్నాయి. స్నేహ సంబంధాలు గల దేశాలన్నింటితో సాంస్కృతిక ఆదాన ప్రదానాలు జరుపుకోవడంలో సోవియట్ యూనియన్ ప్రత్యేక శ్రద్ధ చూపుతూంది. ఈ విధంగా ప్రతి సోవియట్ పౌరునకు అత్యున్నత సాంస్కృతిక విలువలు అనుభవించి, ఆనందించేందుకు అవకాశాలున్నాయి. ఆ విధంగా సాంస్కృతిక హక్కు వాస్తవ రూపం ధరించింది.

శాస్త్రీయ, సాంకేతిక, కళాత్మక కృషికి సంపూర్ణ స్వేచ్ఛ ఉన్నది. ఇందుకోసం శాస్త్రీయ పరిశోధనా సౌకర్యాలు నానాటికీ విస్తరిస్తున్నాయి; అంతేగాక క్రొత్త విషయాలను కనిపెట్టడానికి, బౌద్ధిక చొరవను చూపేందుకు తగు ప్రోత్సాహాలు లభిస్తున్నాయి; సాహిత్యం, కళలు శరవేగంతో అభివృద్ధి చెందుతున్నాయి. ఇందుకు అవసరమయిన పాదార్థిక పరిస్థితులను ప్రభుత్వం కల్పిస్తోంది. అంతేగాక, స్వచ్ఛంద సంస్థలకు, కళాకారుల సంఘాలకు అవసరమయిన సహాయాన్నంతా అందిస్తోంది. ఉత్పత్తి, తదితర సృజనాత్మక రంగాలలో నూతన ఆవిష్కరణలను, చొరవలను ప్రదర్శనల రూపంలో విస్తృతంగా ప్రజలందరికీ ఎరుకపరుస్తోంది. ఈ విధంగా సోవియట్ యూనియన్‌లో ప్రాథమిక హక్కుల, స్వేచ్ఛల పరికల్పన కేవలం కాగితాలపై ఉండిపోయే శుష్కవాగ్దానం కానేకాదు.

49 వ నిబంధన క్రింద పౌరులు సమర్పించిన ప్రతిపాదనలను పరిశీలించి, అందుకు సంబంధించిన అధికారులు నిర్ణీతకాలంలో, జవాబివ్వాలి, తగు చర్య గైకొనాలి ఇది వారి విధి. ఈ విధ గా పౌరుల హక్కులు, పెట్టుబడిదారీ దేశాలలోవలె సోవియట్ యూనియన్‌లో ఎన్నికల రోజు ప్రారంభమై, ఆరోజే అంతం కావు. ప్రజలు ప్రభుత్వ పని విధానాన్ని నిరంతరం గమనిస్తూ అజమాయిషీ చేస్తారు. ఒకతూరి ఎన్నుకోబడిన ప్రజాప్రతినిధుల పని విధానం అసంతృప్తికరంగా ఉంటే వారిని వెనక్కు పిలిపించే హక్కుకూడా ప్రజలకున్నది. అధికారులు, ప్రభుత్వ సంస్థలు, ప్రజా సంస్థలు చేపట్టే చర్యలు సరైనవి కావని తోచినప్పుడు,

ఇంతకుముందే చెప్పినట్లుగా 58 వ నిబంధన క్రింద ప్రజలు ఫిర్యాదులు చేయవచ్చు. ఈ విధంగా నిరంకుశాధికార ధోరణులను అరికట్టేందుకు అవకాశం కల్పించబడింది. అధికారులు చట్ట విరుద్ధంగా వ్యవహరించి నపుడు, పౌరుల హక్కులకు భంగకరంగా ప్రవర్తించినపుడు, తమ అధికార పరిమితులను మరచిపోయినపుడు పౌరులు చేసిన ఫిర్యాదులవల్ల ఫలితం కన్పించకపోతే, పౌరులు తగు చర్యకై న్యాయస్థానాలను అర్థించవచ్చు. ప్రభుత్వ సంస్థలు, ప్రజా సంస్థలు లేదా ప్రభుత్వోద్యోగులు తమ విధినిర్వహణ సందర్భంగా, కలిగించే కష్ట, నష్టాలకు వారు నష్టపరిహారం కూడా కోరవచ్చు. వివిధ దేశాల్లో తమ విధినిర్వహణలో ప్రజలకు ఇబ్బందులు కల్గించిన ఉద్యోగులపై ఉన్నతాధికారుల అనుమతి లేకుండా చర్య గైకొనేందుకు చట్టాలు అనుమతించవు. సోవియట్ శాసనాలతో దీనిని పోల్చి చూడండి. అధికారులు చట్ట విరుద్ధమైన చర్యలకు పాల్పడినా, పౌరులు తగు చర్య గైకొనుటకు ఉన్నతాధికారులు అనుమతిని నిరాకరించ వచ్చుననే విషయం జగద్విదితమే. సోవియట్ శాసనాల్లో ఇటువంటి ఆంక్ష లేదు.

సోవియట్ రాజ్యాంగ చట్టం క్రింద, కోర్టు ఉత్తర్వుగాని, ప్రొక్యు రేటర్ వారెంట్‌గాని లేనిదే ఎవరిని అరెస్టు చేయడానికి వీలులేదు. సోవియట్ యూనియన్‌లో ప్రొక్యురేటర్ అత్యంత ప్రాధాన్యత గల ఉద్యోగి. ప్రభుత్వ అధికారానికి లోబడని స్వతంత్ర ప్రతిపత్తి ఆయనకు ఉంది. సోవియట్ పౌరుల గృహ అనుల్లంఘనీయతకు, అలాగే తమ ఉత్తర, ప్రత్యుత్తరాల, టెలిగ్రాఫ్ సందేశాల, టెలిఫోన్ సంభాషణల గోప్యాన్ని భద్రపరచుకుందుకు పూర్తి హక్కు ఉంది. (56 నిబంధన) 57 వ నిబంధన క్రింద తమ పరువు ప్రతిష్ఠలను కాపాడుకొనుటకు, ఆరోగ్యము, మాన, ప్రాణాలను సంరక్షించుకొనుటకు, వ్యక్తి స్వాతం త్ర్యము, ఆస్తి భద్రతలకు న్యాయస్థానాల రక్షణ పొందే హక్కు ఉంది. 58 వ నిబంధన క్రింద లభించే హక్కుకు ఇది తోడుగా ఉంటుంది.

పౌరులు ఈ క్రింది విధులను నిర్వర్తించవలసి ఉంటుంది.

1. తాము ఎంచుకొన్న, సామాజికంగా ఉపయుక్తమయిన వృత్తిలో చైతన్యపూర్వకంగా పనిచేయాలి; శ్రామిక క్రమశిక్షణను ఖచ్చితంగా పాటించాలి.

2. సోషలిస్టు ఆస్తిని పదిలపరచి, కాపాడాలి.

3. సోవియట్ రాజ్య ప్రయోజనాలను సదా సంరక్షిస్తూ, దాని శక్తిని, ప్రతిష్ఠను పెంపొందించాలి.

4. సోషలిస్టు మాతృదేశాన్ని రక్షించాలి.

5. సోవియట్ దేశ సాయుధ దళాలలో సైనికసేవ చేయాలి.

6. తోటి పౌరుల జాతీయ ప్రతిష్ఠను గౌరవించాలి; బహుళజాతి సోవియట్ యూనియన్‌కు చెందిన వివిధ జాతులు, ఉపజాతుల మధ్య స్నేహాన్ని బలపరచాలి.

7. ఇతరుల న్యాయమైన ప్రయోజనాలను హక్కులను గౌరవించాలి.

8. తమ బిడ్డల పెంపకంపట్ల శ్రద్ధ వహించాలి.

9. సామాజికంగా ఉపయుక్తమయిన పనిని తమ బిడ్డలు చేపట్టేలా శిక్షణ ఇవ్వాలి.

10. ప్రకృతిని సంరక్షిస్తూ, దాని సంపదలను భద్రపరచాలి.

11 చారిత్రక, స్మృతి చిహ్నాలను, తదితర సాంస్కృతిక విలువలను కాపాడడంలో శ్రద్ధ చూపాలి.

అన్నిటికంటే ముఖ్యంగా సోవియట్ పౌరులు ఇతర దేశాల ప్రజలతో స్నేహ, సహకారాలను పెంపొందించాలి. ప్రపంచ శాంతిని రక్షించి, పదిల పరిచేందుకు తోడ్పడాలి (ని. 69).

రాజ్యాంగ చట్టంలోని 28, 29, 30 వ నిబంధనల ననుసరించి సోవియట్ యూనియన్ అనుసరించే విదేశాంగ విధానానికిది అనుగుణం.

పౌరుల హక్కులు, స్వేచ్ఛలు, వారు నిర్వర్తించవలసిన విధులు, బాధ్యతల నుండి అవిభాజ్యాలని, సోవియట్ రాజ్యాంగచట్టం సుస్పష్టంగా ప్రకటిస్తోంది. అలాగే ప్రతి సోవియట్ పౌరుడు రాజ్యాంగ చట్టాన్ని సోవియట్ శాసనాలను తుచ తప్పక పాటించాలి. సోవియట్ ప్రవర్తనా

నియమావళికి తగిన స్థాయిలో నడచుకోవాలి, సోవియట్ పౌరసత్వగౌరవ ప్రతిష్టలను నిలబెట్టాలి.

ఈ విధంగా సోవియట్ రాజ్యాంగచట్టము పౌరుల విధులను గురించి పేర్కొనడం, పాశ్చాత్య రాజ్యాల వారి విమర్శలకు ఎక్కువగా గురయింది. ముఖ్యంగా గుత సంస్థల బాకాలు ఈ విషయమై గొంతుచించుకొంటున్నాయి. కాని, సోవియట్ చట్టాలంటే లెక్క చేయనివారు వాటి నుండి రక్షణ కూడా పొందజాలరు. సోవియట్ చట్టాలు సమిష్టి శ్రేయస్సును కాపాడేందుకు ఉద్దేశించబడినట్టివి. అట్టి సమిష్టి శ్రేయస్సును దెబ్బతీయ యత్నించేవారు అందుకుతగ్గ మూల్యాన్ని తప్పక చెల్లించవలసి ఉంటుంది. ఈ సందర్భంలో బ్రెజ్నేవ్ చేసిన ఈ క్రిందివ్యాఖ్యగమనార్హమైనది: "ఐక్యరాజ్యసమితి సార్వజనీన మానవ హక్కుల ప్రకటన నిర్ద్వంద్వంగా ఇలా చెబుతూంది. — 'ఏ పౌరుని' వ్యక్తిత్వమైన నిరాటంకంగా, సమగ్రంగా వికసించడమన్నది సమాజంలోనే సాధ్యమవుతుంది. అట్టి సమాజం పట్ల ప్రతి వ్యక్తికి కొన్ని విధులుంటాయి. పౌరులు తమ హక్కులూ, స్వేచ్ఛలను పూర్తిగా అనుభవించాలంటే వారు ఇతరు హక్కులను, స్వేచ్ఛలను తగు విధంగా గుర్తించి, గౌరవించడ మవసరం. ప్రజాతంత్ర సమాజంలో సర్వజన సంక్షేమాన్ని, శాంతి భద్రతలను, నైతిక విలువలను కాపాడడం పట్ల ప్రతివ్యక్తి బాధ్యత వహించాలి." జాతి వ్యతిరేక కార్యకలాపాలలో గూఢచారి కార్యకలాపాల్లోకూడ పాల్గొన్న ష్చరాన్‌స్కీ గిన్స్ బెర్గ్‌లు శిక్ష నుండి తప్పించుకోజాలరు.

మూడవ విభాగం

## సోవియట్ యూనియన్ యొక్క జాతీయ రాజ్యాంగ నిర్మాణ స్వరూపం

సోవియట్ యూనియన్ ఒక సమైక్య, సమాఖ్య రూప బహుళ జాతి, బహు భాషారాజ్యం. వివిధ రాజ్యాల స్వయంనిర్ణయాధికారము, స్వేచ్ఛాయుత సమ్మేళన ప్రాతిపదికగా సోషలిస్టు సమాఖ్యవాద సూత్రంపై

రూపొందిన రాజ్యమిది. ఈ క్రింది యూనియన్ రిపబ్లిక్కులు ఇందు ఏకమై ఉన్నాయి.

1. రష్యన్ సోవియట్ ఫెడరేటివ్ సోషలిస్టు రిపబ్లిక్ [ఆర్.ఎస్.ఎఫ్.ఎస్.ఆర్.]

2. ఉక్రైన్ సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్.

3. బైలో రష్యన్ సో సో.రి.

4. ఉజ్బెక్ సో సో.రి.

5. కజక్ సో.సో.రి.

6. జార్జియా సో సో.రి.

7. అజర్‌బైజాన్ సో.సో రి.

8. లిథువేనియా సో.సో.రి.

9. మోలావియా సో.సో.రి.

10. లాత్వియా సో.సో.రి.

11. కిరిజ్ సో.సో.రి.

12. తజిక్ సో.సో.రి,

13 ఆర్మీనియా సో.సో.రి.

14. తుర్క్మన్ సో.సో.రి.

15. ఇస్తోనియా సో.సో.రి.

ఈ రిపబ్లిక్కులన్నింటికి సోవియట్ యూనియన్ నుండి స్వేచ్ఛగా విడిపోయేందుకు హక్కు ఉంది. రాజ్యాల సమాఖ్య యొక్క ఐచ్ఛిక స్వభావానికి ఇవి హామీ. ఇలాంటి హామీతో కూడిన సమానత్వంవల్లనే ప్రపంచంలోని ఇతర సమాఖ్య రాజ్యాలకంటె సోవియట్ యూనియన్‌లో ఉన్నత సమైక్యత సాధించబడింది. ఈ రిపబ్లిక్కులన్నీ కలిసి సోషలిజాన్ని స్థాపించుకున్నాయి. దానిని, ప్రవర్థితమొనర్చి కమ్యూనిజం పథాన ముందుకు సాగిపోతున్నాయి. "శక్తిని బట్టి పని, అవసరాలను బట్టి అనుభవం" అన్నది. కమ్యూనిస్టు సమాజ సూత్రం. ఇట్టి సంపూర్ణ స్వేచ్ఛాయుత సమైక్యతవల్లనే సోవియట్ యూనియన్ మాటకు ఇంత గొప్ప విలువ లభించింది. సోవియట్ దేశయూనియన్ రిపబ్లిక్కుల మౌలికచట్టాలను రూపొందించడం ద్వారా శాసనపరమైన ఏక రూపతను సాధించడం, ఒకే

విధమైన సామాజిక, ఆర్థిక విధానాన్ని అనుసరించేలా చేయడం, సమాఖ్య పరిధిలో గల పారిశ్రామిక సంస్థలను, ఆర్థిక వ్యవస్థలను నిర్దేశించడము, యూనియన్ రిపబ్లిక్కుల అధిపత్యంలోగల పారిశ్రామిక సంస్థలకుసాధారణ దిశానిర్దేశం చేయడం, యుద్ధము,శాంతికి సంబంధించిన నిర్ణయాలను గైకొనడం, సోవియట్ రాజ్య భద్రతా సమస్యలను పరిష్కరించడం,సోవియట్ యూనియన్ నిర్వర్తించే ముఖ్య విధులలో కొన్ని రిపబ్లిక్కుల చట్టాలపై యూనియన్‌చట్టాలదే పైచెయ్యిగా ఉంటుంది. ఒకవేళ వాటి మధ్య తేడాలుంటే, యూనియన్ చట్టమే చెల్లుతుంది.

పైన చెప్పిందాన్నిబట్టి మహోన్నత లక్ష్యాల సాధనలో వివిధ రిపబ్లిక్కులు ఇష్టపూర్వకంగా భాగస్వాములవడంవల్ల అత్యుత్తమమైన ఏకరూపతను, కేంద్రీకృత దిశానిర్దేశాన్ని కల్పించేందుకు వీలు కలిగింది. పాశ్చాత్య ప్రజాస్వామిక సమాఖ్య రాజ్యాలలోను, తదితర పెట్టుబడిదారీ సమాఖ్య రాజ్యాలలోను అంతర్గతమై ఉన్న వైరుధ్యాలు సోవియట్ సోషలిస్టు సమాఖ్య వ్యవస్థలో కనబడవు. గమనార్హమైన మరో ముఖ్య విషయమేమంటే యూనియన్ రిపబ్లిక్కులకు తామే రచించుకొన్న స్వంత రాజ్యాంగ చట్టాలున్నాయి. అంతేగాక సోవియట్ దేశ సుప్రీం సోవియట్ దాని అధ్యక్షవర్గము, ప్రభుత్వము. తదితర అత్యున్నత సంస్థలు సోవియట్ యూనియన్ అధికారపరిధి కిందికివచ్చే విషయాలపై నిర్ణయాలు చేయడంలో యూనియన్ రిపబ్లిక్కులన్నీ పాలు పంచుకుంటాయి.

ఈ విధంగా సోవియట్ యూనియన్‌లో కేంద్రీకృత దిశానిర్దేశాన్ని చేస్తూ ఉండే యూనియన్ పని విధానంలో యూనియన్ రిపబ్లిక్కుల మాట చెల్లుబడి అవుతున్నది. అంతేగాక రిపబ్లిక్కులకు కొన్ని ప్రత్యేక హక్కులు కూడా వున్నాయి. వాటి అనుమతి లేకుండా ఆయా రిపబ్లిక్కుల హద్దులను మార్చేందుకు వీలులేదు. యూనియన్ ప్రభుత్వ అధికారపరిధికి వెలుపల నున్న రంగాలన్నిట ఆయా రిపబ్లిక్కులు సంపూర్ణ స్వతంత్ర అధికారాన్ని కలిగి ఉన్నాయి. మరో అసాధారణ విషయమేమిటంటే ఏ యూనియన్ రిపబ్లిక్కయినా సరే ఇతర రాజ్యాలతో నేరుగా సంబంధాలు పెట్టుకోవచ్చు; సమిష్టి సంధులను చేసుకోవచ్చు; రాయబారులను, దౌత్య సిబ్బందిని మార్పిడి చేసుకోవచ్చు: అంతర్జాతీయ సంస్థల కార్యకలాపాల్లో

భాగస్వాములవచ్చు. సర్వసత్తాక యూనియన్ రిపబ్లిక్కుల హక్కులను సోవియట్ యూనియన్ సదా కాపాడుతుంది.

కొన్ని యూనియన్ రిపబ్లిక్కులలో భాగంగా స్వయంపాలిత రిపబ్లిక్కులున్నాయి. రష్యన్ సోవియట్ ఫెడరేటివ్ సోషలిస్టు రిపబ్లిక్కు భూభాగంలో 16 స్వయంపాలిత రిపబ్లిక్కులుండగా, ఉజ్బెక్, జార్జియన్ అజర్బైజాన్ రిపబ్లిక్కులలో ఒక్కొక్క స్వయంపాలిత ప్రాంతముంది. యూనియన్ రిపబ్లిక్కులోని ఒకభాగమయిన స్వయంపాలిత రిపబ్లిక్కుకు సోవియట్ రాజ్యాంగపట్టం ఒక ప్రత్యేక ప్రతిపత్తి నిస్తోంది. ఇట్టి స్వయంపాలిత రిపబ్లిక్, సోవియట్ యూనియన్, యూనియన్ రిపబ్లిక్కుల రాజ్యాంగ చట్టాలకు అనుగుణమైన రీతిలో తన స్వంత రాజ్యాంగ చట్టాన్ని కలిగివుండవచ్చు. తన భూభాగంలో సోవియట్ యూనియన్ ఆయా యూనియన్ రిపబ్లిక్కుల, అధికారాల అమలుకు పూర్తి అవకాశం కల్పిస్తూనే తన అధికార పరిధిలోని విషయాలలో యిట్టి స్వయంపాలిత రిపబ్లిక్ తన భూభాగంపై నున్న సోవియట్ యూనియన్‌కు యూనియన్ రిపబ్లిక్కుకు చెందిన కర్మాగారాల, సంస్థల, కార్యకలాపాలను సమన్వయ పరచి, అజమాయిషీ చేయవచ్చు. దాని అనుమతి లేనిదే స్వయంపాలిత రిపబ్లిక్ సరిహద్దులను మార్పుచేయుటకు వీల్లేదు.

యూనియన్ రిపబ్లిక్కుల, లేదా ప్రాంతాలలో భాగాలుగా స్వయం పాలిత మండలాలున్నాయి. ఇలాంటి స్వయంపాలిత మండలాలు రష్యన్ ఫెడరేషన్‌లో ఆరున్నాయి. జార్జియా, అజర్‌బైజాన్, తజక్‌స్తాన్‌లలో ఒక్కొక్క స్వయంపాలిత మండలముంది. ఇంకా స్వయంపాలిత ప్రాంతాలు ప్రదేశాలు కూడా వున్నాయి.

పైన పేర్కొన్న యేర్పాట్లు ప్రత్యేక సంస్కృతులు గలిగి, వేర్వేరు ప్రాంతాల్లో వసించే వివిధజాతుల ఉపజాతుల ప్రజలు నిరాఘాటంగా అభివృద్ధి చెందేందుకు హామీ నిస్తున్నాయి.

నాలుగో విభాగం

# ప్రజా ప్రతినిధుల సోవియట్ ఎన్నిక పద్ధతి

ఈ విభాగంలో మూడు ప్రకరణాలున్నాయి. ఇందు 12వ ప్రకరణం ప్రజా ప్రతినిధుల సోవియట్ల నిర్మాణ విధానం, వాటి పని సూత్రాల గురించినది; 13 వ ప్రకరణం ఎన్నికల పద్ధతి గురించినది, 14 వ ప్రకరణం ప్రజా ప్రతినిధుల హక్కులు, బాధ్యతల గురించినది.

సోవియట్ యూనియన్‌లో రాజ్యాధికారమంతా వివిధ స్థాయిలలో గల ప్రజాప్రతినిధుల సోవియట్ల చేతిలో వుంటుంది. అవి క్రిందినుండి పై వరకు ఒకే సుసంఘటిత వ్యవస్థగా పనిచేస్తాయి. వీటికి అత్యగ్రభాగాన సోవియట్ యూనియన్ సుప్రీం సోవియట్, రిపబ్లిక్కుల స్థాయిలో ఆయా యూనియన్ రిపబ్లిక్కుల సుప్రీం సోవియట్లు వుంటాయి. అదే విధంగా స్వయంపాలిత రిపబ్లిక్కులకు, ఆయా స్వయంపాలిత ప్రదేశ, మండల ప్రజాప్రతినిధుల సోవియట్లు, జిల్లా, నగర, నగర విభాగాల, జనపదాల, గ్రామాల సోవియట్లు ఉంటాయి. ఈ సోవియట్లలోని ప్రజా ప్రతినిధులందరూ. వయోజన ఓటింగు పద్ధతిపై ప్రత్యక్ష రహస్య బాలట్ పై ఎన్నుకోబడతారు. ఓటర్ల కనీస వయసు 18 సంవత్సరాలు. అలాగే ప్రజాప్రతినిధులుగా ఎన్నుకోబడేవారి కనిష్ఠ వయసు కూడా, ఒక్క సోవియట్ యూనియన్ సోవియట్ విషయంలో తప్ప 18 సంవత్సరాలే. సోవియట్ యూనియన్ సుప్రీం సోవియట్‌కు ఎన్నుకోబడేవారి కనిష్ఠ వయసు మాత్రం 21 సంవత్సరాలు.

సోవియట్ యూనియన్‌కు, పెట్టుబడిదారీ దేశాలకు ఎన్నికల పద్ధతిలో ఒక ముఖ్యమైన తేడావుంది. సోవియట్ దేశంలో అభ్యర్థుల ఎంపికను సమిష్టి శ్రామిక సంస్థలు, ట్రేడ్‌యూనియన్లు, సహకార సంఘాలు, సైనిక విభాగాలలో పనిచేస్తున్నవారి సమావేశాలు చేబడతాయి. కమ్యూనిస్టుపార్టీ, యువ కమ్యూనిస్టు లీగ్ కూడ అభ్యర్థులను ప్రతిపాదించవచ్చు. ఆచరణలో కమ్యూనిస్టులు, కమ్యూనిస్టుపార్టీ సభ్యులు

కానివారు కూడా అభ్యర్థులుగా ఎంపిక చేయబడటం, అధిక సంఖ్యాక ప్రజల అభిమానం వారికి ఉన్నప్పుడు ఎన్నుకోబడటం జరుగుతూఉంది. ప్రజాసంస్థలు ఆయా అభ్యర్థుల గుణగణాలను, రాజకీయ సామర్థ్యాన్ని సవివరంగా చర్చించి సభలు, పత్రికలు, రేడియో, టెలివిజన్ల ద్వారా వారికి ప్రచారం చేయవచ్చు. ఎన్నికల సందర్భంగా ఖర్చులను రాజ్యాంగ చట్టంలోని 100 వ నిబంధనక్రింద ప్రభుత్వమే భరిస్తుంది. ఈ విధంగా పౌర వ్యవహారాల్లో డబ్బు వహించే పాత్ర అవశేషాలను పూర్తిగా తుడిచి పెట్టడం జరిగింది ఒక పౌరుడు రెండు సోవియట్ సంస్థలకంటె ఎక్కువ వాటికి ఎన్నుకోబడకూడదు. ఎన్నికల సమయంలో ఓటర్లు తమ ప్రతి నిధులకు కొన్ని ప్రత్యేక ఆదేశాలను అందజేస్తారు. తమ బడ్జెట్‌ను రూపొందించుకొనే సందర్భంగాను, ఆర్థిక, సామాజిక అభివృద్ధి పథకాలను రూపొందించుకునే సందర్భంగానూ ఆయా సోవియట్లు ఓటర్ల ఆదేశాలను తమ దృష్టియందు ఉంచుకోవాలి. ఈ ఆదేశాల అమలుకు తగు చర్యలు గైకొని, ఆ విషయాన్ని పౌరులకు తెలియజేయాలి. ఈ ఆదేశాల ప్రాధాన్యతను అర్థం చేసుకుందుకు ఒక ఉదాహరణ సరిపోతుంది. నూతన రాజ్యాంగ చట్టము ఆమోదించబడటానికి ముందు రెండేళ్ళ కాలంలో, ఏడు లక్షలకుపైగా ఇట్టి ఓటర్ల ఆదేశాలు అమలు జరుపబడ్డాయని చెబితే, వీటికిగల ప్రాముఖ్యం అర్థమవుతుంది చిత్తు రాజ్యాంగ చట్టంపై బ్రెజ్నెవ్ సమర్పించిన నివేదికలో ఇలా పేర్కొనబడింది : "ఈ ఆదేశాలు ఎంతో వైవిధ్యంగల ప్రజావసరాల వ్యక్తీకరణ. ఆయా శ్రామిక ప్రజా బృందాల, లేదా మొత్తం సమాజపు నిర్దిష్ట ప్రయోజనాలను ఇవి ప్రతి బింబిస్తాయి. అందుకే ఈ ఆదేశాల పరిపూర్తి సోవియట్లు, ప్రజాప్రతినిధులు చేపట్టే కార్యక్రమంలో ఒక ముఖ్యభాగంగా ఉంటుంది."

ఈ విధంగా ప్రజాతంత్ర కార్యసరళి ఎల్లెడల కొనసాగుతోంది. రాజ్యాంగ చట్టంలోని 107 వ నిబంధన ప్రకారం ప్రజాప్రతినిధులు తామూ, తమ సోవియట్లూ చేసిన పనులనుగూర్చి తమను ఎన్నుకున్న నియోజకవర్గాలకు, తమను ప్రతిపాదించిన ప్రజాసంస్థలు, సమిష్టి శ్రామిక సంస్థలకు నివేదిక లివ్వాలి. నియోజకవర్గ ప్రజల విశ్వాసాన్ని కోల్పోయిన ప్రజాప్రతినిధులను రాజ్యాంగ చట్టములో నిర్దేశించిన పద్ధతి ననుసరించి,

అధిక సంఖ్యాక ఓటర్ల నిర్ణయం మేరకు వెనక్కు పిలిపించవచ్చు.
10. వ నిబంధనలో దీనికి సంబంధించి వివరములు అన్నీ ఉన్నాయి.

పెట్టుబడిదారీ దేశాలలోవలె సోవియట్ యూనియన్‌లో ఎన్నికైన ప్రతినిధులు తమ పనులను కోల్పోరు. పెట్టుబడిదారీ దేశాలలో శాసన సభల్లోకి ప్రభుత్వ నిర్వహణ సంస్థలలోకి కార్మికులు, మధ్యతరగతి ఉద్యోగులు ప్రవేశించకుండా నిరోధించేందుకే ఈ పనులను కోల్పోవడమన్న నిబంధన ప్రవేశపెట్టబడింది. ఇలాంటి పరిస్థితుల్లో రాజకీయాలు, బాగా సంపన్నవంతులై, ప్రత్యేక హక్కులు గలిగిన కొద్దిమంది గుత్త హక్కుగా పరిణమిస్తాయి. రాజకీయాలే వృత్తిగా గలవారు, ఎంత గొంతు చించుకున్నా తమ పార్టీల నిర్వహణకు, ఎన్నికల నిధులకోసం ఇట్టి ధనిక వర్గాల ప్రాపుకోసం పడిగాపులుండక తప్పదు. అంచేత ప్రజాస్వామికాలని చెప్పబడుతున్న దేశాలలో కూడా కార్మికులు, మధ్యతరగతి ఉద్యోగులు, నిర్దిష్ట కాలంలో – తమ ఓటు హక్కును వినియోగించుటనే నిష్క్రియాపరమైన హక్కునే కలిగి ఉంటారు. సోవియట్ యూనియన్‌లో పరిస్థితి ఇందుకు పూర్తి విరుద్ధంగా ఉంది. సోవియట్ల సమావేశాలు జరిగే సందర్భంలో ప్రజాప్రతినిధులకు తాము పని చేసే చోట పూర్తి శెలవు లభిస్తుంది. ప్రజా ప్రతినిధులు తమ అధికారాలు, విధులు, నిర్వర్తించేందుకు వీలుగా ఇతర సందర్భాలలో కూడా వారిని పని నుండి విడుదల చేయవలసి ఉంటుంది. ఈ సందర్భాలన్నింటిలోనూ తాము పని చేసేచోట వారికి తమ మామూలు ఆదాయం లభిస్తుంటుంది. సోవియట్ల సభ్యులు, తమ నెన్నుకున్న ప్రజలకు సర్వాధికార సమన్వితులగు ప్రతినిధులు. వారు ప్రభుత్వ వ్యవహారాలు, ఆర్థిక, సాంస్కృతిక అభివృద్ధికి సంబంధించిన సమస్యలు చర్చించి నిర్ణయిస్తారు. ప్రభుత్వ సంస్థల, కర్మాగారాల, ప్రజాసంస్థల, ఇన్‌స్టిట్యూట్ల పనిని అజమాయిషీ చేస్తారు. ప్రభుత్వ సంస్థలనుండి, అధికారులనుండి, సమాచారం కోరే హక్కు వీరికుంది. అలా కోరుతూ వ్రాసినపుడు, ప్రభుత్వాధికారులు సోవియట్ల సమావేశాలలో వాటికి తప్పక సమాధాన మివ్వాలి. ఏ ప్రభుత్వ ప్రజాసంస్థ అయినా, కర్మాగారాలు, ఇతర సంస్థలు అయినా, ప్రజా ప్రతినిధులుగా వారు అవసరమని భావించినపుడు వారు లేవనెత్తిన సమస్యలపై చర్చలు జరపాలి. వాటిపై తగు

చర్చ గై కొనాలి; ఐదవ విభాగంలో పేర్కొన్నట్లు ఈ ప్రజాప్రతినిధులకు కొన్ని ప్రత్యేక రక్షణలు ఉన్నాయి. సోవియట్ యూనియన్, సుప్రీం సోవియట్, ఆయా యూనియన్ రిపబ్లిక్కుల సుప్రీం సోవియట్లకు ఎన్నికో బడిన వారి కాలపరిమితి 5 సంవత్సరాలు. ఇతర సోవియట్ల ప్రతినిధుల కాలపరిమితి 2 1/2 సంవత్సరాలు. ఈ స్థానిక సోవియట్లలో వీలైనంత ఎక్కువమంది ప్రజలు ప్రజాప్రతినిధులుగను, పాలనా నిర్వాహకులుగాను అనుభవం గడించేందుకై ప్రాతినిధ్య కాలం 2 1/2 సంవత్సరాలుగా నిర్ణ యించ బడింది. అయితే ఏ వ్యక్తి అయినా అత్యంత సమర్థుడుగా నిరూ పించుకున్నప్పుడు అతణ్ణి మళ్ళీ మళ్ళీ ఎన్నుకుందుకు పూర్తి అవకాశం ఉంది.

సోషలిస్టు వ్యవస్థలో ఎన్నుకోబడిన ప్రజాప్రతినిధులను విశ్వ సించక పోవడమన్నది లేదు. ఉండజాలదు కూడా. రానున్న అధ్యాయాల్లో చెప్పబడినట్లుగా, అన్ని విషయాల్లోను అంతిమాధికారం శాసనసభలదే. ప్రజల్లోని వేర్వేరు వర్గాల ప్రయోజనాలమధ్య వైరుధ్యమేదీ లేకపోవడం వల్ల ఇది సాధ్యమయింది.

93 వ నిబంధన ప్రకారం ప్రజా ప్రతినిధుల సోవియట్లు అన్ని ప్రభుత్వ,ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక అభివృద్ధి రంగాలను నేరుగాగాని, లేదా తాము నియమించిన సంస్థలద్వారా గాని నిర్దేశిస్తాయి, వాటికి సంబం ధించిన నిర్ణయాలను గై కొని అవి అమలు జరుపబడేందుకు తగు ఏర్పాట్లు చేస్తాయి, అమలు జరుపుతూన్న తీరును పర్యవేక్షిస్తాయి. ప్రజాప్రతినిధుల సోవియట్లు తమకు పూర్తి బాధ్యత వహించే ఉప సంఘాలను ఎన్ను కుందుకు, కార్యనిర్వాహక, పాలక, తదితర బాధ్యతలు నిర్వహించే కమిటీ లను ఏర్పరచేందుకు తగు అధికారాన్ని కలిగివున్నాయి. అయితే ప్రధాన సమస్యలను చర్చించి, నిర్ణయాలు గై కొనడం మాత్రం ఆయా సోవియట్ల సమావేశ కాలంలోనే జరుగుతుంది, ప్రజాప్రతినిధుల సోవియట్లు ప్రజా పర్యవేక్షక సంఘాలను ఏర్పాటు చేస్తాయి. తద్వారా కర్మాగారాలు, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు, వివిధ సంస్థలలో ప్రభుత్వ పర్యవేక్షణకు తోడు ప్రజా పర్యవేక్షణను గూడా జోడిస్తాయి. ఈ సంఘాలు ప్రభుత్వ ప్రణా ళికలు, నిర్దేశాలను ఎంతవరకు పూర్తి చేసిందీ అజమాయిషీ చేస్తాయి.

క్రమ శిక్షణను ఉల్లంఘించడాన్ని, స్థానిక తత్త్వాలను, సంకుచిత శాఖా దృక్పథాన్ని, అసమర్థతను, దుర్వ్యయాన్ని, దుబారాను, మందకొడి తనాన్ని, అధికార జాడ్యాన్ని, నిరంకుశాధికార తత్వాన్ని మట్టు పెట్టేం దుకు పూనుకుంటాయి. ప్రభుత్వ యంత్రాంగాన్ని మరింత మెరుగుపరచి పని చేయించేందుకు తోడ్పడతాయి.

ప్రజాప్రతినిధులు, చాటుమాటన్నది లేకుండా తమ ప్రజా కార్య కలాపాలను నడపవలసి ఉంటుంది. తమ పని గురించి, తాము గైకొనిన నిర్ణయాలను గురించి క్రమబద్ధంగా ప్రజలకు నివేదించవలసి ఉంటుంది. అలాగే సోవియట్లు నియమించిన ఉపసంఘాలు, అసలు సోవియట్లు కూడా ప్రజలకే నివేదించాలి.

ఇకనిప్పుడు సోవియట్ దేశ సుప్రీం సోవియట్, తదితర అత్యు న్నత అధికార సంస్థలు దేశపాలనా నిర్వహణలో వహిస్తున్న పాత్రను గురించి చర్చించడం సముచితం.

### ఐదవ విభాగం

## సోవియట్ దేశ ఉన్నత రాజ్యాధికార, పాలనా నిర్వహణా సంస్థలు

ఈ విభాగంనందలి 15,16 ప్రకరణాలు సోవియట్ దేశ సుప్రీం సోవియట్, మంత్రిమండలి పని తీరును గురించినవి.

సోవియట్ దేశంలో అత్యున్నత ప్రభుత్వాధికార సంస్థ సోవియట్ యూనియన్ సుప్రీం సోవియట్ అన్నది వేరుగా చెప్పనక్కరలేదు. రాజ్యాంగ చట్టంలో నిర్వచించిన విధంగా సోవియట్ యూనియన్ పరిధిలోని అన్ని వ్యవహారాలను అదే నిర్వహిస్తుంది. సోవియట్ దేశ చట్టాలన్నీ సుప్రీం సోవియట్ కాని, లేదా దాని నిర్ణయంపై జరిగే దేశ వ్యాప్త రిఫరెండంద్వారా గాని ఆమోదించబడతాయన్నది గమనార్హం. (నిబంధన 108.)

రాజ్యాంగ చట్ట మందలి 5 వ నిబంధన, రాజ్యానికి సంబంధించిన ప్రధాన సమస్యలను దేశవ్యాప్త చర్చలకు, ప్రజల ఓటింగుకు పెట్టాలని నిర్దేశిస్తూంది. ఇదొక విశాల ప్రాతిపదికగల నిర్దేశక సూత్రం. ఇతర ప్రజాస్వామిక రాజ్యాంగచట్టం కంటే నిస్సందేహంగా ఇది పురోగామి విధానమే అవుతుంది. మరి కొన్ని ఇతర దేశాల రాజ్యాంగ చట్టాలలో కూడా రిఫరెండం నిర్వాహణకు అవకాశాలు కల్పించిన మాట వాస్తవమే. అయితే ఈ రిఫరెండం రాజ్యాంగ చట్ట సవరణ చేసే సందర్భంగానే వినియోగించడం జరుగుతుంది. ఇతర ముఖ్య విషయాలపై కాదు.

జాతుల సోవియట్ నిర్మాణం. సోవియట్ రాజ్యాంగ చట్టం కల్పించిన మరో ముఖ్యమైన ఏర్పాటు. సోవియట్ దేశ సుప్రీం సోవియట్‌లో రెండు సభలున్నాయి. అందు ఒకటి జాతుల సోవియట్, రెండవది సమాఖ్య సోవియట్. ఈ రెండు సభలలోను సభ్యుల సంఖ్య సమానంగా ఉంటుంది. సమాఖ్య సోవియట్ ఇతర దేశాలలోని దిగువ సభలవలెనే, వయోజన ఓటింగు ప్రాతిపదికపై, దేశవ్యాప్తంగా ఆయా నియోజక వర్గాలచేత ఎన్నుకోబడుతుంది. ఆ విధంగా సమాఖ్య సోవియట్ లోని ప్రతి ప్రజా ప్రతినిధి, దాదాపు సమాన సంఖ్యాకుల ఓటర్లకు ప్రాతినిధ్యం వహిస్తారు. ఈ విధంగా దేశం మొత్తంపై గల జనాభా కంతటికి సమాన ఫాయాలో ప్రాతినిధ్యం లభిస్తుంది. అయితే, జాతి, నరవంశ, ప్రాంతీయ వివక్షత చూపబడే అవకాశాన్ని నిరోధించేందుకై జాతుల సోవియట్‌ను మరో విభిన్న ప్రాతిపదికపై ఎన్నుకోవడం జరుగుతున్నది. ఈ సభకు ప్రతి యూనియన్ రిపబ్లిక్కు 32 మంది ప్రతినిధులను ఎన్నుకొంటుంది ; ఒక్కొక్క స్వయంపాలిత రిపబ్లిక్కునుండి 11 మంది, స్వయంపాలిత మండలంనుండి 5 గురు, ఒక్కొక్క స్వయం పాలిత ప్రాంతంనుండి ఒకరు ప్రతినిధులుగా ఎన్నుకోబడతారు. ఈ విధంగా ప్రతి స్వయంపాలిత ప్రాంతానికి, మండలానికి, రిపబ్లిక్కుకు, యూనియన్ రిపబ్లిక్కుకు అందు ప్రాతినిధ్యం లభిస్తుంది. రాజ్యాంగ చట్టంలోని 114 నిబంధన ప్రకారం ఏ చట్టమైనా ఆమోదించబడాలంటే, దానికి ఉభయ సభలలోను అధిక సంఖ్యాకుల మద్దతు కావలసి ఉంటుంది. దీనినిబట్టి జాతుల సోవియట్ ప్రాధాన్యతను మనం అర్థం చేసుకోవచ్చు.

సుప్రీం సోవియట్ నిర్ణయాలకు, ఇతర చర్యలకు కూడు ఇదే సూత్రం వర్తిస్తుంది. ఈ రెండు సభలకు మధ్య అభిప్రాయ భేదం వచ్చినపుడు, ఈ రెండు సభలనుండి సమాన సంఖ్యగల సభ్యులతో ఏర్పడిన సమన్వయ సంఘానికి ఆ విషయాన్ని పంపడం జరుగుతుంది. ఆ సంఘం సిఫారసు పై ఉభయసభల సంయుక్త సమావేశంలో రెండవసారి చర్చించి, నిర్ణయం గైకొనబడుతుంది. ఒక నిర్ణయానికొచ్చేందుకు అప్పటికీ సాధ్యంకాకపోతే, ఆ సమస్యను సోవియట్ యూనియన్ సుప్రీం సోవియట్ తదుపరి సమావేశానికి వాయిదా వేస్తారు. లేదా దేశవ్యాప్త ప్రజాభిప్రాయానికి సమర్పిస్తారు. ఒక జాతీయ సమస్యను పరిష్కరించేందుకు ఇంతకంటే ప్రజాతంత్రయుతమైన పద్ధతి మరెక్కడా ఊహించజాలం. సుప్రీం సోవియట్ సంయుక్త సమావేశాలకు ఈ రెండు సభల అధ్యక్షులు ఒకరి తర్వాత మరొకరు అధ్యక్షత వహిస్తారు. ప్రతి సభకు ఒక అధ్యక్షుడు, నలుగురు ఉపాధ్యక్షులు ఎన్నుకోబడతారు. వీరే ఆయా సభల సమావేశాలకు అధ్యక్షత వహిస్తుంటారు.

సోవియట్ దేశ సుప్రీం సోవియట్ ఏటా రెండు తూర్లు సమావేశమవుతుంది. సుప్రీం సోవియట్ అధ్యక్షవర్గం అవసరమని భావించినప్పుడుగాని, ఏదేని యూనియన్ రిపబ్లిక్కు ప్రతిపాదనపై గాని, ఉభయ సభల్లో కైవ వంతు మంది సభ్యులు కోరినప్పుడుగాని సుప్రీం సోవియట్ ప్రత్యేక సమావేశాలు జరుగుతాయి. చాలా పెట్టుబడిదారీ ప్రజాస్వామిక దేశాలలో పార్లమెంటును సమావేశపరచే అధికారం రాజు, అధ్యక్షుడు వంటి రాజ్యాధిపతి చేతుల్లో ఉంటుంది. దాన్ని వినియోగించే అధికారం కార్యనిర్వాహకవర్గం చేతుల్లో ఉంటుంది. ఇందువల్ల అధికారంలో నున్న వారు తమ చిత్తాయత్తంగా పరిస్థితిని మలుచుకుందుకు అవకాశం లభిస్తోంది.

మరే రాజ్యాంగ చట్టంలోను లేని ఒక విశిష్టత సోవియట్ రాజ్యాంగ చట్టంలో చోటు చేసుకుంది. ఇది సోవియట్ దేశ సుప్రీం సోవియట్‌లో శాసనాలను ప్రతిపాదించేందుకు ప్రజాసంస్థలకు, అఖిల సోవియట్ సంస్థలకు హక్కు వుండడమే. సోవియట్ దేశ సుప్రీం సోవియట్‌కు, ప్రొక్యూరేటర్ జనరల్‌కు (అత్యున్నత, స్వతంత్ర ప్రతిపత్తిగల అధికారి;

ఈ పదవిపై ముందు ముందు వివరణ యివ్వబడింది), సమాఖ్య సోవియట్‌కు, జాతుల సోవియట్‌కు, సుప్రీం సోవియట్ అధ్యక్ష వర్గానికి, కేంద్ర మంత్రిమండలికి, తమ అత్యున్నతాధికార సంస్థలద్వారా యూనియన్ రిపబ్లిక్కులకు, సుప్రీం సోవియట్ ఉపసంఘాలకు, వ్యక్తిగతంగా సుప్రీం సోవియట్ సభ్యులకు యిదే విధమైన హక్కు (బిల్లులు ప్రవేశపెట్టే హక్కు) వుంది. ఇంత ప్రజాతంత్రీకరణ క్రమాన్ని అత్యంత విస్తృత ప్రాతిపదికపై క్రియాశీల మొనర్చేందుకు జరుగుతూన్న చైతన్యయుత ప్రయత్నం మనకు గోచరిస్తోంది.

116 వ నిబంధన ననుసరించి సోవియట్ దేశ చట్టాలు సోవియట్ యూనియన్ సుప్రీం సోవియట్ నిర్ణయాలు, శాసనాలు సోవియట్ దేశ భాషలన్నింటిలోను ప్రచురించి తీరాలి.

ఆయా శాఖల మంత్రులనేగాక, మొత్తం కేంద్ర మంత్రిమండలిని, సుప్రీం సోవియట్ ఉపసంఘాల అధిపతులను ప్రజాప్రతినిధులు ప్రశ్నలడగవచ్చు.

సుప్రీం సోవియట్ సభ్యులకు రాజ్యాంగపరమైన రక్షణలు కల్పించబడ్డాయి. వారిని సోవియట్ యూనియన్ సుప్రీం సోవియట్ అనుమతిగాని, అది సమావేశంలో లేనప్పుడు సుప్రీం సోవియట్ అధ్యక్షవర్గ అనుమతిగాని లేకుండా అరెస్టు చేయడం, నిర్బంధించడం కడకు న్యాయస్థానం జరిమానా విధించడం కూడా నిషిద్ధం. దీన్నిబట్టి ప్రజాప్రతినిధులకు ఎంతటి గౌరవ, ప్రతిపత్తులు కల్పించబడుతున్నాయో తెలుసుకోవచ్చు. ఇతర దేశాలలో ప్రజాప్రతినిధులకు లభించే రక్షణకంటె యెంతో విస్తృతము, గాఢతరము నయినది.

సోవియట్ యూనియన్‌లో ముఖ్యమైన ప్రభుత్వ సంస్థలలో సుప్రీం సోవియట్ అధ్యక్షవర్గం ఒకటి. సోవియట్ యూనియన్ సుప్రీం సోవియట్ ఉభయసభల సంయుక్త సమావేశంలో ఈ అధ్యక్షవర్గాన్ని యెన్నుకుంటారు. ఇది సోవియట్ యూనియన్ సుప్రీం సోవియట్ స్థాయీసంఘం. అది సుప్రీం సోవియట్‌కు పూర్తిగా బాధ్యత వహించి పనిచేస్తుంది. రాజ్యాంగచట్టం ప్రకారం, సుప్రీం సోవియట్ సమావేశాల మధ్యకాలంలో దేశ అత్యున్నతాధికారసంస్థ విధుల నన్నిటినీ అది

నిర్వహిస్తుంది. సుప్రీం సోవియట్ తన సభ్యులనుండే అధ్యక్షవర్గాన్ని ఎన్నుకుంటుంది. దీనికి ఒక అధ్యక్షుడు, ఒక ప్రథమ ఉపాధ్యక్షుడు, ఒక్కో యూనియన్ రిపబ్లిక్ కి ఒకరు చొప్పున 15 మంది ఉపాధ్యక్షులు, ఒక కార్యదర్శి, 21 మంది సభ్యులు ఉంటారు. అధ్యక్షవర్గం ఇతర విషయాలతోబాటు, సోవియట్ దేశ రక్షణ సమితిని నియమించే అధికారాన్ని, రక్షణబలాల అధికారులను నియమించేందుకు, తొలంచేందుకు అధికారం కలిగివుంటుంది. చట్టవిహితంకాని కేంద్ర మంత్రిమండలి నిర్ణయాలను, ఆదేశాలను, అలాగే యూనియన్ రిపబ్లిక్కుల మంత్రిమండలుల నిర్ణయాలను అది రద్దు చేయవచ్చు. సోవియట్ దేశ చట్టాలకు అన్వయంచెప్పే అధికారం దానికుంది. 121 వ నిబంధనలో పేర్కొన్న యితర విషయాలకు కూడా దాని అధికార పరిధి విస్తరించి వుంది. సుప్రీం సోవియట్ సమావేశాల మధ్యకాలంలో అధ్యక్షవర్గం చట్టాలను సవరించవచ్చు. అవసరమైనపుడు యూనియన్ రిపబ్లిక్కుల సరిహద్దులలో మార్పులకు ఆమోదం తెలుపవచ్చు, కేంద్రమంత్రిత్వ, ప్రభుత్వశాఖలను కమిటీలను ఏర్పరచవచ్చు,రద్దు చేయవచ్చు.కేంద్ర మంత్రిమండలి సిఫారసుపై మంత్రివర్గసభ్యులను తొలగించవచ్చు. డిక్రీలను జారీచేయుట, నిర్ణయాలు ఆమోదించుట చేయవచ్చు. సుప్రీం సోవియట్ కాలపరిమితి అయిపోయ్యాక కూడా, కొత్త సుప్రీం సోవియట్ నూతన అధ్యక్షవర్గాన్ని యెన్నుకొనేంతవరకు పాత అధ్యక్షవర్గం పనిచేస్తూ, తన అధికారాలను చలాయిస్తూ వుంటుంది 124 వ నిబంధన ప్రకారం, కొత్త సుప్రీం సోవియట్ ఎన్నుకోబడ్డ రెణ్నెల్లలోపుగా, పాత అధ్యక్షవర్గం దాన్ని సమావేశపరచవలసి వుంటుంది.

అధ్యక్షవర్గం తరువాత ముఖ్యమైన అధికారసంస్థ సోవియట్ యూనియన్ మంత్రిమండలి. అది సోవియట్ దేశంలోకెల్లా అత్యున్నత కార్యనిర్వాహక, పాలకసంస్థ. సోవియట్ సంయుక్త సమావేశంలో మంత్రిమండలి ఏర్పాటవుతుంది. ఇందు మంత్రిమండలి అధ్యక్షుడు, ప్రథమ ఉపాధ్యక్షుడు, ఉపాధ్యక్షులు, సోవియట్ యూనియన్ మంత్రులు. సోవియట్ దేశ ప్రభుత్వ కమిటీ అధ్యక్షుడు సభ్యులుగా వుంటారు. యూనియన్ రిపబ్లిక్కుల మంత్రిమండలుల అధ్యక్షులందరూ వారి

పదవిరీత్యా ఇందులో సభ్యులుగా ఉంటారు. మంత్రిమండలి అధ్యక్షుని సలహాపై సుప్రీం సోవియట్ అధ్యక్షవర్గం యితర ప్రభుత్వ సంస్థల, సంఘాల అధిపతులను ప్రభుత్వంలో చేర్చుకోవచ్చు. కొత్తగా ఎన్నికైన సుప్రీం సోవియట్ ప్రథమ సమావేశానికి కేంద్ర మంత్రిమండలి తన రాజీనామా సమర్పించవలసి వుంటుంది. కేంద్ర మంత్రిమండలి సుప్రీం సోవియట్‌కు, అది సమావేశంలో లేనప్పుడు దాని అధ్యక్షవర్గానికి జవాబు దారీగా వుంటుంది. వారు సుప్రీం సోవియట్‌కు విధిగా నివేదికలు సమర్పించవలసి వుంటుంది. సోవియట్ రాజ్యాంగ చట్టానికితోడు, కేంద్ర మండలి చట్టం, వారి అధికారాలను, విధులను నిర్వచిస్తోంది. మంత్రి మండలి అధ్యక్షవర్గంగా దాని అధ్యక్షుడు, ప్రథమ ఉపాధ్యక్షుడు, ఉపాధ్యక్షులు వ్యవహరిస్తారు. ఇది, సోవియట్ యూనియన్ మంత్రి మండలి స్థాయీసంఘంగా పనిచేస్తుంది. ఆర్థిక వ్యవస్థ సారథ్యానికి సంబంధించిన సమస్యలను, యితర పాలనా సంబంధమైన వ్యవహారాలను ఇది ఎప్పటికప్పుడు పరిష్కరిస్తుంటుంది.

ఇంతేగాక సోవియట్ యూనియన్ సుప్రీం సోవియట్ ప్రజా పర్యవేక్షక కమిటీని, ప్రజాపర్యవేక్షక వ్యవస్థను ఏర్పాటు చేస్తుంది. సోవియట్ దేశ ప్రజా పర్యవేక్షకచట్టం వీటి నిర్మాణాన్ని, పని విధానాన్ని నిర్వచిస్తోంది.

## ఆరవ విభాగం

ఆరవ విభాగం యూనియన్ రిపబ్లిక్కుల ప్రభుత్వాధికార, పాలక సంస్థల నిర్మాణానికి సంబంధించిన మౌలిక సూత్రాలను గురించినవి. సోవియట్ దేశ కేంద్రప్రభుత్వ ఉన్నతాధికార, పాలక సంస్థల నిర్మాణ సూత్రాలనివి పోలివుంటాయి. అవసరమైన కొన్ని తేడాలు వున్నాయని వేరే చెప్పనక్కరలేదు. ఉదాహరణకు, యూనియన్ రిపబ్లిక్కుల సుప్రీం సోవియట్లకు రెండు సభ లుండవు. వాటికి ఎగువసభ – జాతుల సోవియట్ లేదు. యూనియన్ రిపబ్లిక్కుల మంత్రి మండలులు, స్వయంపాలిత రిపబ్లిక్కుల మంత్రిమండలుల నిర్ణయాల ఆదేశాల అమలును, కార్య నిర్వాహక కమిటీ ఆదేశాలను, ఆయా ప్రదేశ, మండల, నగర, స్థానిక పాలిత మండల సోవియట్ల నిర్ణయాల అమలును నిలిపివేయవచ్చు.

ఏడవ విభాగం

# న్యాయ నిర్వహణ, మధ్యవర్తిత్వం, ప్రొక్యురేటర్ పర్యవేక్షణ

ఇందు రెండు ప్రకరణాలున్నాయి. 20వ ప్రకరణం న్యాయస్థానాలు మధ్యవర్తిత్వం గురించినది. 21వ ప్రకరణం ప్రొక్యురేటర్ అధికారాలు గురించినది.

సోవియట్ న్యాయస్థానాలు న్యాయశాస్త్ర విధులను నిర్వర్తిస్తాయి. అక్కడ యీ క్రింది న్యాయస్థానాలున్నాయి:

1. సోవియట్ దేశ సుప్రీంకోర్టులు.
2. యూనియన్ రిపబ్లిక్కుల సుప్రీంకోర్టు.
3. స్వయంపాలిత ప్రాంతాల సుప్రీంకోర్టులు.
4 ప్రదేశ్, మండల, నగర న్యాయస్థానాలు.
5. స్వయంపాలిత మండలాల న్యాయస్థానాలు.
6. స్వయం పాలిత ప్రాంతాల న్యాయస్థానాలు, జిల్లా (నగర్) ప్రజా న్యాయస్థానాలు.
7. సాయుధ బలాల సైనిక న్యాయస్థానాలు, న్యాయస్థానాలలో పనిచేసే న్యాయమూర్తులు, అసెసర్లు అందరూ ఎన్నుకోబడవారే.

జిల్లా (నగర) ప్రజా కోర్టుల న్యాయమూర్తులు ఐదేళ్ళ కాలపరిమితితో సార్వజనీన. సమాన, ప్రత్యక్ష, రహస్య బ్యాలెట్ పద్ధతిపై ఎన్నుకోబడతారు. ప్రజా అసెసర్లు 2½ సంవత్సరాల కాలపరిమితితో తాము పని చేసే చోట్లనే చేతులెత్తే పద్ధతిపై పౌరుల సమావేశంలో ఎన్నుకోబడతారు.

ఉన్నత న్యాయస్థానాల న్యాయాధీశులను ఐదేళ్ళ కాలపరిమితితో అదే స్థాయిలోని ప్రజాప్రతినిధుల సోవియట్ ఎన్నుకుంటుంది. సోవియట్ దేశ సుప్రీం సోవియట్ అధ్యక్షవర్గం, సైనిక న్యాయస్థానాల జడ్జీలను లేదా సైనిక ట్రిబ్యునల్‌లను ఐదేళ్ళ కొకసారి ఎన్నుకుంటుంది. సైన్యానికి సంబంధించిన ప్రజా అసెసర్లను 2½ సంవత్సరాల కొకసారి సైనిక దళాల

సభ్యుల సమావేశాలు ఎన్నుకుంటాయి. ఈ విధంగా సోవియట్ యూనియన్‌లోని న్యాయస్థానాలన్నీ న్యాయాధిపతులను, అసెసర్లను ఎన్నిక చేసుకునే పద్ధతిపై నిర్మింపబడుతున్నాయి. మరో ముఖ్య విషయమేమంటే న్యాయాధిపతులు, అసెసర్లు తమ నెన్నుకున్న వారికి బాధ్యత వహించాలి. నిర్ణీతకాలంలో వారికి తమ పనిగురించి నివేదికలు సమర్పించాలి. చట్టంలో పేర్కొన్న విధానానికి లోబడి ఆ ఎన్నుకున్నవారే వారిని వెనక్కి పిలిపించే అధికారాన్ని కూడా కలిగివున్నారు. ఈ ఏర్పాట్లు సోవియట్ సమాజపు ప్రజాతంత్ర స్వభావానికి చక్కని ప్రతీకలు. సోవియట్ సమాజం శాసన సభలకు, న్యాయస్థానాలకు మధ్య ఘర్షణ వుంటుందని భావించదు. ఈ రెండు శాఖలు ప్రజల నుండి ఉద్భవించి, వారి సేవకే అంకితమవుతాయి. రాజ్యవ్యవస్థ గురించి గోపనీయమైన దేమీ లేనట్టే, చట్టాన్ని గురించి కూడా దాచిపెట్టాల్సిందేమీ లేదు. ప్రభుత్వానికి పౌరునికి మధ్య. సమాఖ్యకు రిపబ్లిక్కులకు మధ్య న్యాయస్థానాలు తీర్పరిగా పని చేయాల్సిన అవసరం సోవియట్ దేశంలో లేదు. ఈ సంస్థలన్నీ ఒకే లక్ష్యసాధనకై పనిచేస్తున్నాయి; ఇవేవీ ఒక సంకుచిత ముఠా ప్రయోజనాల కోసం పనిచేయడం లేదు. కనుకనే వీటి మధ్య వైరుధ్యం లేదు. ప్రజల ప్రయోజనాల పరిరక్షణకే చట్టం రూపొందించబడింది. తమ నెన్నుకున్న ప్రజలకు తమ పనిని గురించి నివేదికలు సమర్పించి న్యాయాధిపతులు, నేరాలకుగల కారణాలను వారికి తెలియజేస్తారు. అందువల్ల వాటిని తొలగించేందుకు ఈ అనుభవం తోడ్పడుతుంది. ఈ విధంగా ప్రజల చైతన్యం పెంపొందించడంతోపాటు న్యాయస్థానాలు సామాజికావసరాలకు తగువిధంగా ప్రతిస్పందించి న్యాయబద్ధమైన సామాజిక వ్యవస్థ నెలకొని కొనసాగేందుకు తోడ్పడుతున్నాయి. ప్రజలలో ఒక వర్గానికి వ్యతిరేకంగా మరో వర్గ సంకుచిత ప్రయోజనాలకు వూడిగం చేసేందుకు చట్టం ఉద్దేశించబడలేదు కనుకను, న్యాయ వ్యవస్థ నంతటిని తన గుప్పిట్లో పెట్టుగోగల ఆస్తిపర వర్గం లేదు గనుకను, ప్రజాతంత్ర పర్యవేక్షణ ఉన్నది కనుకను, న్యాయనిర్వహణ దెబ్బతినే ప్రమాదం లేదు. డబ్బుబలంతో న్యాయస్థానాలకు జరిగే ఎన్నికలను కొందరు తమ చిత్తాయత్తంగా మలచుకొనే అవకాశం కూడా ఈ వ్యవస్థలో లేదు. అంచేత, ఆచరణలో న్యాయ

శాస్త్రంలో తగుశిక్షణ పొందిన వారు, దీర్ఘ కాలంపాటు న్యాయవాదులుగా పని చేసినవారు, లేదా మరో విధంగా తమ సామర్థ్యాని నిరూపించుకొన్న వారు, విశుద్ధవర్తనకు, నిష్పాక్షికతకు పేరుపొందిన వారు మాత్రమే న్యాయాధిపతులుగా ఎన్నుకోబడుతున్నారు.

న్యాయాధిపతులు కాని, ప్రజా అసెస్సర్లుకాని కేవలం చట్టానికి మాత్రమే బద్ధులని, వారు పూర్తిగా స్వతంత్రులని రాజ్యాంగచట్టం ప్రకటిస్తోంది. ఏ కేసునూ ఒకే న్యాయాధిపతి పరిష్కరించడు. ప్రజాకోర్టులలో న్యాయాధిపతులు, అసెస్సర్లు కలిసి కేసులను విచారణ చేసి, తీర్పు నిస్తారు. ప్రజాఅసెస్సర్లకు న్యాయాధిపతులకుండే హక్కులన్నీ ఉంటాయి. అప్పీళ్ళ విచారణా వగైరాలను అనేక మంది జడ్జీలు కలిసి విచారిస్తారు. న్యాయస్థానాల పనిని ప్రజలందరు దర్శించవచ్చు. ఇతర దేశాలలో వలెనే చట్టం నిర్దేశించిన ప్రత్యేక సందర్భాలలోనే రహస్యవిచారణఅనుమతించబడుతుంది.

ఏ వ్యక్తి కూడా చట్ట విహితంగా తప్ప, అర్హతగల న్యాయస్థానం తీర్పుద్వారా తప్ప నేరస్థుడుగా ప్రకటించబడడంగాని, అందుకై శిక్షించబడటంగాని జరుగదు. పౌరులకు సంస్థలకు న్యాయ్యపరమైన సహాయం అందించడానికి న్యాయవాదులు ఉంటారు. నేరారోపణ గావించబడిన వారికి న్యాయ్యపరమైన సహాయాన్ని పొందే హక్కునిస్తూ రాజ్యాంగచట్టం విస్పష్టంగా ఆదేశిస్తోంది (158 నిబంధన). ప్రజాసంస్థల సమిష్టి శ్రామిక సంస్థల ప్రతినిధులు కూడా సివిల్, క్రిమినల్ విచారణలలో పాల్గొనవచ్చును. ఇదొక విలక్షణమైన కార్యవిధానం. సోవియట్ దేశంలో ఈ పద్ధతి, న్యాయం మరింత సమర్థవంతంగా, సమాన ప్రాతిపదికపై అందించడానికి ఆచరణలో తోడ్పడుతూంది. నిందితుడు పని చేస్తున్న కర్మాగారం విచారణలో జోక్యం చేసుకొని, అతడు చేసిన పొరపాటు ప్రత్యేక పరిస్థితుల్లో జరిగిందేగాని, సర్వసాధారణంగా అతని నడవడి చాలా మంచిదని నివేదించవచ్చు. దీని మూలంగా నేరస్థునికి శిక్ష విధించే సందర్భంలో ఎంతో సహాయం జరగవచ్చును.

కర్మాగారాలు, సంస్థలు మొదలైన వాటిమధ్య తలెత్తే ఆర్థిక వివాదాలను సోవియట్ యూనియన్ ప్రభుత్వ మధ్యవర్తి చట్టాన్ననుసరించి, ప్రభుత్వ మధ్యవర్తిత్వ సంఘాలు పరిష్కరిస్తాయి.

ప్రొక్యూరేటర్ పదవి గురించి ప్రస్తావించనిదే, సోవియట్ దేశ న్యాయవ్యవస్థగురించి, చట్టబద్ధతగురించి చెప్పే ఏవిషయమైనా అసంపూర్తిగానేఉండిపోతుంది. సోవియట్ దేశ ప్రొక్యూరేటర్ జనరల్ నిసోవియట్ యూనియన్ సుప్రీమ్ సోవియట్ నియమిస్తుంది.దాని కతడు బాధ్యత వహిస్తాడు. నివేదికలు సమర్పించుకోవాలి. సుప్రీమ్ సోవియట్ సమావేశాల మధ్య కాలంలో దాని అధ్యక్ష వర్గానికి అతడు బాధ్యత వహించాలి. ఈ విధంగా సోవియట్ దేశ అత్యున్నత ప్రజాతంత్ర సంస్థ నియమించిన వ్యక్తియే ఈ పదవిని నిర్వహిస్తాడు. యూనియన్ రిపబ్లిక్కుల, స్వయంపాలిత రిపబ్లిక్కుల, ప్రదేశాల, మండలాల ప్రొక్యూరేటర్లను సోవియట్ దేశ ప్రొక్యూరేటర్ జనరల్ నియమిస్తాడు. స్వయంపాలిత ప్రాంతాల, జిల్లాల, నగరాల ప్రొక్యూరేటర్లను, ఆయా యూనియన్ రిపబ్లిక్కుల ప్రొక్యూరేటర్లు నియమిస్తారు. అట్టి నియామకానికి ప్రొక్యూరేటర్ జనరల్ అనుమతి లభించవలసి వుంటుంది. అందువల్ల ఈ ప్రొక్యూరేటర్లు ప్రాంతీయ పలుకుబడులకు, వత్తిళ్ళకు లొంగవలసిన అవసరం బొత్తిగా ఉండదు. ప్రొక్యూరేటర్ పదవీ బాధ్యతలు నిర్వహించేవారు అధికార స్థానిక సంస్థలతో నిమిత్తం లేకుండా తమ అధికారాన్ని సంపూర్ణ స్వాతంత్ర్యంతో నిర్వహించాలని, సోవియట్ దేశ ప్రొక్యూరేటర్ జనరల్‌కు మాత్రమే అధీనులై ఉండాలని, రాజ్యాంగ చట్టంలోని 168 వ నిబంధన పేర్కొంటున్నది.

ప్రొక్యూరేటర్ యొక్క ప్రధాన కర్తవ్యం యేమిటంటే అన్ని మంత్రిత్వశాఖలు, ప్రభుత్వ కమిటీలు, విభాగాలు కర్మాగారాలు, సంస్థలు, ప్రజాప్రతినిధుల సోవియట్ల కార్యనిర్వాహక-పాలక-సంఘాలు, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు, సహకార సంఘాలు, అధికారులు, పౌరులు, అందరూ చట్టాన్ని ఒకే విధంగా తు. చ. తప్పక పాటించేలా పర్యవేక్షణ జరపడమే. కొన్ని దేశాలతో అంబుత్స్మన్ అను పేరుతో వ్యవహరించే అధికారి కంటే ఎంతో ఉన్నతమైన స్థానాన్ని సోవియట్ దేశ ప్రొక్యూరేటర్ వహిస్తున్నాడు. ఈ అంబుత్స్మన్ ఆయా ప్రభుత్వ అధికారుల నుండి అవసరమైన రికార్డులను తెప్పించుకొని, వాటిని పరిశీలించి దానికి సంబంధించిన వారిని విచారించి, తాను కనుగొన్న చట్టవిరుద్ధ చర్యల పై ప్రభుత్వానికో, శాసన సభలకో నివేదికలు సమర్పిస్తారు. ఇంతకు మించిన

అధికారం ఆంబుడ్స్‌మన్‌కు లేదు. అటు సోవియట్ దేశంలోని ప్రొక్యురేటర్ ఒక విచారణలోగాని, కేసులోగాని, లేదా పాలనా సంబంధమైన వ్యవహారంలోగాని నేరుగా జోక్యం చేసుకొని చట్ట విరుద్ధంగా జరిగే పనిని త్రోసిపుచ్చమని, అవసరమైనప్పుడు న్యాయస్థానంలో చర్య ప్రారంభించవచ్చు. ఆయన అధికారం సివిల్ క్రిమినల్ కేసులకే గాక, చట్టానికి సంబంధించిన ఏ సమస్యకైనా వర్తిస్తుంది. ఒక్కమాటలో చెప్పాలంటే, ఆయన ప్రజల హక్కులకు కాపలాదారుని వంటివాడు. సోవియట్ దేశంలో జరిగే అన్నికార్యకలాపాలలోను చట్టబద్ధత ఉండేలా చూడవలసిన అత్యున్నతబాధ్యత ఆయనపై ఉంది. సోవియట్ దేశంలో సమస్త ఆర్థిక కార్యకలాపాలు సమిష్టి ప్రాతిపదికపై ఉన్నవీ, ప్రభుత్వానికి సంబంధించినవీ కనుక, అవన్నీ చట్టవిహితంగా ఉండాలి. వివిధ స్థాయిలలో ఉన్న ప్రొక్యురేటర్లు ప్రజల తరఫున కావలి వారివలె ప్రజా హక్కులను పరిరక్షిస్తుంటారు. ఇంతకుముందే చెప్పినట్లుగా పౌరులు, తాము వ్యక్తిగతంగా తమకు జరిగిన అపకారాల నివారణకై నేరుగా న్యాయస్థానాలకు వెళ్ళవచ్చు. ఈ విధంగా పౌరుల స్వాతంత్ర న్యాయ హక్కులకు తోడుగా, ప్రొక్యురేటర్ జనరల్, ఆయన అధీనంలోగల ప్రొక్యురేటర్లు, ప్రభుత్వ శాఖలుగాని, ఇతర అధికార సంస్థలుగాని చట్టాన్ని అతిక్రమించకుండా తగు జాగ్రత్తలు గైకొంటారు.

8, 9, విభాగాలు సోవియట్ దేశ ప్రభుత్వ చిహ్నము, పతాకము, జాతీయ గీతము, రాజధాని, రాజ్యాంగ చట్ట సవరణా విధానాలను గురించినవి. సోవియట్ దేశ రాజ్యాంగచట్టానికి ఇతర ప్రభుత్వ చట్టాలన్నింటి కంటె అత్యున్నతాధికారం ఉందని, అట్టి చట్టాలు, ఉత్తర్వులు ఈ రాజ్యాంగచట్టం ప్రాతిపదికపైనే, దాని నిబంధనలకు పూర్తి అనుగుణంగానే జారీ చేయబడాలని 9వ విభాగంలోని 173వ నిబంధన నిర్ద్వంద్వంగా ప్రకటిస్తోంది. ఈ విధంగా సోవియట్ రాజ్యాంగచట్టం సర్వాతీతమైన చట్టం. సోవియట్ రాజ్యాంగచట్టాన్ని సవరించాలంటే ఉభయ సభలలోని మొత్తం సభ్యులలో మూడింట రెండు వంతులకు తగ్గకుండా మద్దతు లభించినపుడే వీలవుతుందని 174 వ నిబంధన పేర్కొంటున్నది.

# కొన్ని నిర్ధారణలు

మనం నూతన సోవియట్ రాజ్యాంగచట్టాన్ని క్లుప్తంగా సమీక్షించాం. అందు వాడిన భాష అతి సరళము. విస్పష్టము. డొంకతిరుగుడు ఎరుగనిది భారత సుప్రీంకోర్టు న్యాయాధిపతి శ్రీ. వి. ఆర్. కృష్ణయ్యర్ చెప్పినట్లుగా, సోవియట్ రాజ్యాంగమంటే "ముందెన్నడో అసలు జరుగబోయే భావి వాగ్దానాల తియ్యటి మాటల మూట" కాదు. సోవియట్ రాజ్యాంగ చట్టం శాస్త్రీయ సోషలిజం తత్వానికి, సిద్ధాంతాలకు ప్రతీక అనే దృష్టితోనే దానిని అర్థం చేసుకోవాలి. ఒకనాడు బిడుగు దేశంగా నున్న సోవియట్ యూనియన్‌ను అత్యంత ప్రవర్థిత దేశాల్లో ఒకటిగా మార్చింది సోషలిజమే. ఈ పరిణామం మూలంగానే సోవియట్ దేశం పారిశ్రామికోత్పత్తిలోను, ఉన్నత సాంకేతిక పరిజ్ఞానంలోను, ప్రజల జీవన ప్రమాణాల పెంపుదలలోను వడివడిగా ముందడుగు వేసింది. బ్రెజ్నెవ్ ఉపన్యాసంలో ఉదహరించబడిన క్రింది సంఖ్యా వివరాలు యీ సత్యాన్ని చాటి చెబుతున్నాయి:

"1936 లో ఉత్పత్తి గావించబడిన మొత్తం సాలుసరి సామాజికోత్పత్తిని 1977 లో ఒక్క నెలకంటె తక్కువ కాలంలోనే ఉత్పత్తి చేయడం జరుగుతోంది. ఆనాటితో పోల్చి చూస్తే అసలు: వ్యక్తి నిష్పత్తి 14 రెట్లు పెరిగింది. పారిశ్రామిక రంగంలో శక్తి: వ్యక్తి నిష్పత్తి 8 రెట్లు, వ్యవసాయ రంగంలో 15 రెట్లకుపైగా పెరిగింది."

"కేవలం సాంకేతిక పద్ధతుల్లోనే గాదు, వాటి నుపయోగించే మనుషుల్లో కూడా గుర్తించదగినంత మార్పు వచ్చింది. ఈనాడు కార్మికుల్లో 73.2 శాతం ఉన్నత, లేదా సెకండరీ (సంపూర్ణ లేదా అసంపూర్ణ) విద్యార్హతను కలిగివున్నారు. నలభై యేళ్ళ క్రిందట యిది 8 శాతానికంటె తక్కువగా వుండేది. ఇదే కాలంలో ఉన్నత, లేదా ప్రత్యేక సెకండరీ విద్యార్హతలు గల నిపుణుల సంఖ్య పారిశ్రామిక రంగంలో 34 రెట్లు, వ్యవసాయ రంగంలో 47 రెట్లు పెరిగింది.

సోవియట్ ప్రజల జీవన ప్రమాణాలు శరవేగంతో పెంపొందాయి. ఇందుకు రెండే ఉదాహరణలిస్తాను. 1936 లో 14.9 మిలియన్

చదరపు మీటర్ల నివాసగృహాలను నిర్మించగా, 1977 లో 110 మిలియన్ చ. మీ. మేరకు నిర్మింపబడ్డాయి. 1936 లో సామాజిక వినియోగ నిధుల నుండి ప్రజలకు సంక్రమించే చెల్లింపులు, ప్రయోజనాల విలువ 21 రూబుళ్ళ మేరకు వుండగా, యీనాటికది 382 రూబుళ్ళకు పెరిగింది.

"ఈనాడు మనమధిగమించిన పథం బ్రహ్మాండమైనది. అయినా అన్నింటినీ అంకెల్లో వ్యక్తం చేయలేము...."

ఎవరూ త్రోసిపుచ్చడానికి వీల్లేని యీ వాస్తవాలను సోవియట్ వ్యవస్థా విమర్శకులు కాదనలేరు. కాని, సోవియట్ యూనియన్లో మానవ హక్కులు మంటగలిశాయని గగ్గోలు పెడుతున్నారు. నిజానికి యింతకంటె హాస్యాస్పదమైనదేదీలేదు. మానవ హక్కులంటె రాజకీయ, పౌర, ఆర్థిక, సామాజిక హక్కుల సమామ్నాయమే. ప్రపంచంలోని నేటి వరకు మరే రాజ్యమూ సోవియట్ యూనియన్‌లో జరిగినంత విస్తృతంగా, యింత విస్పష్టంగా మానవ హక్కులను తన ప్రజలకు గ్యారంటీ చేయలేదు. 1939 నుండే సోవియట్ దేశంలో నిరుద్యోగం లేదు. పనిహక్కు ప్రాథమిక హక్కుగా రాజ్యాంగచట్టంలో చోటు చేసుకుంది. ఈనాడు సోవియట్ దేశం తన పౌరుడు తన అభిరుచికి, ప్రతిభకు పూర్తిగా అనుగుణమైన పనినో, వృత్తినో, ఎంపిక చేసుకోగల ఉన్నత దశకు చేరుకుంది. అమెరికా, బ్రిటను, తదితర యూరపు రాజ్యాలలో నానాటికి పెరుగుతూన్న నిరుద్యోగంతో పోల్చిచూస్తే సోవియట్ యూనియన్ సాధించిన విజయం విలువేమిటో అర్థమవుతుంది. గత కొలది సంవత్సరాలుగా ప్రవర్ధిత పెట్టుబడిదారీ దేశాలలో నిరుద్యోగుల సంఖ్య 15–18 మిలియన్లకు చేరుకుంది. పెట్టుబడిదారీ వ్యవస్థ మౌలిక లక్షణాలయిన పోటీ, మార్కెటు ప్రాబల్యం ఉత్పత్తిలో అరాచకత్వం నిరుద్యోగానికి దారితీస్తాయి. 1975లో న్యూయార్కులో ప్రచురితమైన "ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక హక్కులు అమలు గురించిన ఐ. రా. స. పరిశీలన" యిలా అంటోంది: "ప్రవర్ధిత మార్కెటు ఆర్థిక వ్యవస్థలుగల దేశాలు కొన్నింటిలో తాను

స్వేచ్ఛగా ఎంపిక చేసుకున్న, లేదా ఆమోదించిన పని ద్వారా తన జీవనోపాధిని పొందే హక్కు పౌరులకు కనుచూపు మేరలో కూడా కానరావడం లేదు. ఈ దేశాలలో యీనాటి ఆర్థిక, సామాజిక, రాజకీయ వ్యవస్థలే కొనసాగితే, ఆయా దేశాల జనాభాలలో ఉద్యోగావకాశాలను పొందడంలో ప్రత్యేకమైన యిబ్బందుల నెదుర్కొనే ప్రజా బృందాలు సర్వవేళలా వుంటాయి."*

అంతేగాదు సోవియట్ దేశంలో తలదాచుకొనే యిల్లులేని వాడంటూ లేడు. అర్హతగల వారందరి కెవరికయినా అత్యున్నత స్థాయివరకు విద్య విధిగా ఉచితంగా లభిస్తుంది. సోవియట్ పౌరుల ఆదాయం వారి పని గుణం, పరిమాణాలపైనే ఆధారపడుతుంది. ప్రతి వ్యక్తీ తన శక్తిని, నైపుణ్యాన్ని అత్యధిక స్థాయిలో సమాజానికై వినియోగించేందుకే అనేక ప్రోత్సాహకాలు కల్పించబడ్డాయి. తన వంతుగా సమాజం ప్రతివ్యక్తి సంక్షేమాన్ని వెయ్యికళ్ళతో కనిపెట్టి చూస్తోంది.

సోవియట్ సోషలిస్టు ప్రజాస్వామ్యం ఒక నూతన తరహా ప్రజాస్వామ్యం. రాజ్యాంగచట్టం కల్పించిన స్వేచ్ఛలను, హక్కులను అనుభవించే సాధనాలను నమ్మకంగా సమకూర్చడమేగాక, ప్రభుత్వ కార్యకలాపాలలోను, వ్యవసాయ, పారిశ్రామిక ఉత్పత్తి క్రమాలలోను, భావి పురోగతి కార్యక్రమాల రూపకల్పనలోను ప్రజలను అంతకంతకు మరింత ఎక్కువగా కూడగట్టే దిశగా సోవియట్ ప్రజాస్వామ్యం ప్రస్థానం గావిస్తోంది. ఈ అంశాలకు సంబంధించి రాజ్యాంగచట్టంలో పేర్కొనబడిన ముఖ్యాంశాలను యింతకు ముందే చర్చించడం జరిగింది.

అయితే లోపాలేవీ జరగలేదా, అని ఎవరైనా ప్రశ్నించవచ్చు. విప్లవానంతరం చారిత్రకంగా అతి స్వల్పమయిన కాల వ్యవధిలో సోవియట్ దేశం మొదటి ప్రపంచయుద్ధ విధ్వంసనాన్ని, అంతర్యుద్ధ ప్రమాదం, రెండో ప్రపంచ యుద్ధమారణహోమం వంటి అగ్ని పరీక్షలను గడచి గట్టెక్కాల్సి వచ్చింది. ఈ దశ అంతటా సామాజిక పరిణామం కొనసాగు

---

* ఐ. రా. స. పత్రం ఇ/సి. యన్ 4/1108 రెవ్.1, న్యూయార్క్, 1975.

తూనే వచ్చింది. సాధించిన విజయాలను కాపాడుకుందుకు తగు జాగరూకత వహించవలసి వచ్చింది. అందువల్ల, ఎంతో కేంద్రీకృత మార్గదర్శకత్వము, నాయకత్వము అవసరమయ్యాయి. అయినా అన్ని స్థాయిల్లోను ప్రజల చొరవను పెంపొందించేందుకు అపారమైన అవకాశాలు ఏర్పడ్డాయి. ఇందుమూలంగా నిరంతర ప్రజాతంత్రి పురోగతికి రాచబాట ఏర్పడింది. అంచాతనే, స్టాలిన్ పాలనా కాలంలోని చివరిభాగంలో యేర్పడిన వక్రీకరణలను సోవియట్ సమాజమంతా గుర్తించి, త్వరగాను, సకాలంలోను తొలగించేందుకు వీలు చిక్కింది. దాంతో యీ వక్రీకరణలను దేశరాజకీయ జీవనం నుండి తుడిచిపెట్టేందుకు పటుదలతో కృషి చేయడం జరిగింది. సోషలిస్టు చట్టబద్ధతను పెంపొందించేందుకు మౌలిక ప్రాధాన్యత గల చర్యలు గైకొనబడ్డాయి ఇందు అత్యంత ప్రాధాన్యతగల అంశమేమంటే యీ తప్పులను కనిపెటడం, వాటిని సరిదిద్దడం ప్రజలందరి కళ్ళముందు వారి ఎరుకతోనే- జరుపబడింది. సరిగా యీ క్రమంలోనే ప్రజలందరూ, పెద్ద ఎత్తున చట్టబద్ధ పాలనను భంగపరచిన విధం గురించి తెలుసు కొనడమేగాక, అలాంటి వక్రీకరణ మరల జరక్కుండా చేసేందుకు ఏమి చేశారో. యింకేమి చేయాలో కూడా తెలుసుకొన్నారు. కోర్టుద్వారాగాని, ప్రొక్యురేటరు ద్వారాగాని ప్రజలు తమ ఫిర్యాదులను పరిష్కరింపజేసు కుందుకు తగు సాధనాలను సోవియట్ రాజ్యాంగచట్టం కల్పించింది. ప్రభుత్వాంగాలన్నింటికిగల పజాతంత్ర ప్రాతిపదిక, వాస్తవానికి ప్రభుత్వ కార్యకలాపాన్ని-సోవియట్ దేశ ఆర్థిక, సామాజిక, రాజకీయ రంగాలన్నింటా జరిగే క్రమాలన్నీ-చట్టబద్ధతను పటుతరం చేస్తాయి. పజలందరు అత్యున్నత విద్యా సంపన్నులు. వారిని ప్రభుత్వం అణచి వుంచగలుగు తుందనుకోవడంకంటె హాస్యాస్పదమైందేమీ వుండదు. సోవియట్ యూనియన్‌లో రాజ్యవ్యవస్థను గురించి దాపరికం చేయాల్సిందేమీ లేదు. అది సకల ప్రజలకు ప్రాతినిధ్యం వహిస్తుంది. అంచాత అది వారి ప్రయోజ నాలకు విరుద్ధం కాదు. అంతే కాదు. ఏవైనా చట్టాలను జారీచేసే టప్పుడు, వాటిని గురించి అత్యంత విస్తృత ప్రచారం జరుగుతుంది. చట్టాల రూప కల్పనలోనే ప్రజలు పాలుపంచుకుంటారు. ఇలాంటి పజా భాగస్వామ్యం రాజ్యాంగ చట్ట రచనలోనేగాక, యితర చట్టాల విషయంలోకూడా వాస్త

వంగా అమలు జరుగుతూంది. నూతన సోవియట్ రాజ్యాంగచట్టం సుప్రీం సోవియట్‌చే ఆమోదించబడి చట్టరూపం ధరించిన అక్టోబరు 7 వ తేదీని ప్రతి సంవత్సరమూ జాతీయ పర్వ దినంగా సోవియట్ ప్రజ అంతా జరుపుకుంటోంది. ఇందుమూలంగా రాజ్యాంగ నిబంధనలన్నింటినీ అర్థం చేసుకుని, తమ హక్కులను గుర్తించి, కాపాడుకోగల అవకాశం వారికి లభిస్తోంది. దేశమంతటా యీ రాజ్యాంగ చట్టాన్ని పరిజ్ఞానాన్ని విస్తృతంగా ప్రచారంచేసే హక్కును వ్యతిరేకించే వారుంటారని ఊహించడం అసంభవం. జ్ఞానమే శక్తి. ఇలాంటి విజ్ఞానంగలవారు శక్తివంతంగా, తమ హక్కులను గట్టిగా నిలబెట్టుకుంటారు.

పాశ్చాత్యదేశాల మానవహక్కుల ప్రచారకులు చేస్తూన్న ప్రచారం ఎంత కపటమైనదో, వారి ఆచరణను పరికిస్తే బయటపడుతుంది. సోవియట్ పౌరుల మానవహక్కుల ఉల్లంఘనను నిరోధించాలనే పేరుతో జరుగుతూన్న ఉన్మాదపూరితమైన ప్రచారంలో అమెరికా నాయకులు ముందు పీటీన వున్నారు. కాని, చిలీలో వీరు వెలగబెట్టిందేవిటో ఎవరైనా ఎలా మరచిపోగలుగుతారు? చిలీ ప్రజల హక్కులను కాలరాచి, అమెరికా బహుళజాతి కంపెనీల నీచప్రయోజనాల రక్షణకై ఫాసిస్టు నరహంతక ముఠాను ఆ దేశంపై రుద్దిన అమెరికా కుట్రను కాదనగలవారెవరయినా వున్నారా? రెండవ ప్రపంచ యుద్ధానంతర కాలం పొడుగునా అమెరికా, బ్రిటను వగైరా ప్రజాస్వామికాలని చెప్పుకునే దేశాల మద్దతుతో ఆసియా, ఆఫ్రికాలలో రోసిపోయిన నియంతృత్వ ప్రభుత్వాలను వెనకేసుకొచ్చింది. 1971 లో బంగ్లాదేశ విముక్తి సందర్భంగా అమెరికా 7 వ నౌకాదళం జోక్యాన్ని భారతీయులు అంత సులభంగా మరచిపోలేరు. ఈనాటికీ దక్షిణాఫ్రికా, జింబాబ్వే, నమీబియాలలోని జాతి వివక్ష ప్రభుత్వాలకు వెనుకదన్నుగా నిలబడ్డది. మానవ హక్కుల సంరక్షకులుగా డబ్బా కొట్టుకుంటున్నది వీరేనన్న విషయం సర్వవిదితమే.

ఇది యాదృచ్ఛికమేమీ కాదు. దక్షిణాఫ్రికాలోని మొత్తం పెట్టుబడిలో సగానికిసగం బ్రిటనులో పాదుకొనివున్న బహుళజాతి కంపెనీలదే. 1960–75 మధ్యకాలంలో దక్షిణాఫ్రికాలో అమెరికా ప్రత్యక్ష పెట్టుబడులు 300 శాతం పెరిగాయి. దాంతో దక్షిణాఫ్రికా

మొత్తం పెట్టుబడిలో అమెరికా వాటా ఆరోవంతుకు చేరుకుంది. దక్షిణాఫ్రికాలో మొత్తంమీద అమెరికాకు చెందిన 300 బహుళజాతి కంపెనీలు పనిచేస్తున్నాయి. వాటిలో 13 కంపెనీల వాటా, దక్షిణాఫ్రికా లోని మొత్తం పెట్టుబడులలో 3/4 వంతుల వరకు వుంది. జర్మన్ ఫెడరల్ రిపబ్లిక్‌కు చెందిన బహుళజాతి కంపెనీలకు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో వంద కోట్ల రాండ్ల వరకు వుంటుంది. మానవ హక్కులను సిగ్గూశరం లేకుండా వుల్లంఘించే దేశీయ, విదేశీ విధానాలుగల ఇజ్రాయెల్, దక్షిణాఫ్రికా ప్రభుత్వాల మధ్య సహకారం ప్రత్యేకంగా గమనించ దగివుంది. పాశ్చాత్య గుత్తకంపెనీలు యూరపు దేశాలకు కావలసిన మాంగనీసులో 52 శాతం, క్రోమియంలో 31 శాతం, అమెరికా తనకు కావలసిన కోబాల్టులో 98 శాతం, మాంగనీసులో 99 శాతం, యురేనియంలో 91 శాతం, ప్లాటినంలో 80 శాతం దక్షిణాఫ్రికానుండి దిగుమతి చేసుకుంటున్నాయి. ఇదంతా గమనిస్తే, జాతివివక్ష విధానానికి, నమీబియా ఆక్రమణకు, రోడీషియాపై తెల్లజాతి అల్పసంఖ్యాకుల పెత్తనానికి పాశ్చాత్య రాజ్యాల మద్దతును అర్థంచేసుకోవచ్చు. *

1950 దశకంలో, మెకార్థీయుగంలో కమ్యూనిజం వ్యతిరేక పోరాటం పేరుతో అమెరికా కాంగ్రెసు, పాలనా యంత్రాంగం వేట, వేధింపు ప్రారంభించాయి. దీంతో స్వేచ్ఛాభావాలు. కార్యకలాపాల పీక నొక్కివేయబడింది. కడకు అమెరికా దేశపు ఉదారవాదులు కూడా వూపిరి పీల్చుకోలేని వాతావరణం ఏర్పడింది.

ఇటీవలే, అమెరికా అధ్యక్షుడుగానున్న రిచర్డు నిక్సన్ పాక్షిక ప్రయోజనాల సాధనకై తానే చట్టవిరుద్ధ చర్యలకు పాల్పడడం, ఆయన తర్వాత గద్దెనెక్కిన గెరాల్డ్ ఫోర్డ్ క్షమాదానం ప్రకటించడం వంటి అసహ్యకరమైన పరిస్థితి దాపురించింది. 1960 దశకం ఉత్తరార్థంలోను, 1970 దశకం ప్రథమార్థంలోను అమెరికా ప్రపంచ చరిత్రలో యేనాడూ కనీ, వినీ యెరుగని రీతిలో అత్యంత క్రూరమైన, అప్రకటిత యుద్ధాన్ని వియత్నాంపై సాగించింది. వియత్నాం ప్రజల అత్యంత మౌలిక

---

* ఇంటర్నేషనల్ అఫైర్స్, జూన్ 19/78, పు. 91.

హక్కయిన జీవించే హక్కును కూడా కాలరాచింది అమెరికా నరహంతక ప్రభుత్వం. వియత్నాం ప్రజ చేసిన నేరమల్లా తమ స్వేచ్ఛను కాపాడుకుంటూ తమ జీవన విధానాన్ని తామే నిర్ణయించుకోవాలని నదురూ, బెదురూ లేకుండా కోరడమే. వియత్నాంను లొంగదీసి, తుడిచి పెట్టాలనే తమ నీచయత్నంలో భాగంగా అమెరికా దేశపు వేలాది యువకుల ప్రాథమిక హక్కుల్ని త్రోసిపుచ్చి, వారిని నిర్బంధంగా సైనిక సేవలోకి లాగి, మృత్యుముఖంలోకి చేజేతులా నెట్టింది. అయితే అమెరికా యువత అంతిమంగా ఈ కిరాతకానికి వ్యతిరేకంగా ఒక్కుమ్మడిగా లేచింది. ప్రపంచ ప్రజాతంత్ర వాణికి తోడుగా సాగిన ప్రజాపోరాటాలు, రోసిపోయిన ఈ పాశవిక యుద్ధాన్ని అంతమొందించాయి.

మానవ హక్కులను కాలరాచే అమెరికా ప్రభుత్వ ప్రధాన కార్యకలాపాలన్నిటా బ్రిటను ఉపభాగస్వామిగా వ్యవహరించింది. నేడు బ్రిటను కూడా తన ఉదారవాద సంప్రదాయాలను మంటగలుపుతూంది. అక్కడగూడా జాతి విద్వేషం వికృత రూపంలో తలెత్తుతూంది. సామ్రాజ్యవాదం తిరుగులేని విధంగా రాజ్యమేలుతూన్న కాలంలో బ్రిటను, కోట్లాది అధీన దేశాల ప్రజల ప్రాథమిక హక్కుల్ని నిర్దాక్షిణ్యంగా కాలరాచివేసింది. స్వేచ్ఛా ప్రపంచంగా జబ్బలు చరుచుకునే సామ్రాజ్యవాదులు మానవ హక్కుల గురించి గావుకేకలు పెట్టడం వాస్తవాలను వక్రీకరించేందుకు, సోవియట్ దేశ ఆంతరంగిక వ్యవహారాల్లో జోక్యం చేసుకొనేందుకు సాగించే మొదటి యత్నంతప్ప మరేమీ కాదు.

నూతన సోవియట్ రాజ్యాంగచట్టాన్ని, మానవ హక్కుల ప్రకటనతోను, ఇతర అంతర్జాతీయ పత్రాలతోను పోల్చి చూచినపుడు ఈ పత్రాల్లో పొందుపరచిన మౌలిక మానవ హక్కులూ, స్వేచ్ఛలు సోవియట్ యూనియన్‌లో ఏనాడో పూర్తిగా గ్యారంటీ చేయబడ్డాయని తేలుంది. అంతేకాక 1977 నూతన రాజ్యాంగ చట్టం ఈ హక్కులను మరింత పరిపుష్టం గావించి, మరింత విస్తృత మొనర్చడంలో మరింత ముందుకు పోయిందనికూడా తేటతెల్లమవుతుంది. ఇంకా చెప్పాలంటే, పైన పేర్కొన్న అంతర్జాతీయ మానవహక్కుల ప్రకటనలవలె హక్కులను, స్వేచ్ఛలను ప్రకటించడంతో మాత్రమే సోవియట్ రాజ్యాంగ చట్టం

తృప్తిపడడం లేదు; వాటిని అమలు జరిపేందుకు కావలసిన హామీలను పూర్తిగా సమకూర్చింది కూడా. ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక హక్కుల పై అంతర్జాతీయ ప్రకటన 6 వ నిబంధన, ఆయా ప్రభుత్వాలు "పనిహక్కును గ్యారంటీ చేసేందుకు తగు చర్యలు గైకొనాల"ని చెపుతూంది. మన మింతకుముందే చూచినట్లుగా సోవియట్ రాజ్యాంగచట్టంలోని 40 వ నిబంధన, ప్రతి సోవియట్ పౌరునికి పని హక్కును గ్యారంటీ చేయడమే కాక, అతని పని పరిమాణాన్ని, గుణాన్నిబట్టి ప్రతిఫలం ముట్టే అవకాశాన్నిచ్చింది. అంతేకాక అతని అభిరుచులు, శక్తి సామర్థ్యాలు, వృత్తి శిక్షణ, విద్య వగైరాల కనుగుణంగా తన వృత్తిని ఎంపిక చేసుకోగల హక్కును కూడా సమకూర్చింది.

ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక హక్కుల అంతర్జాతీయ ప్రకటన, నిర్బంధోచిత ప్రాథమిక విద్య, క్రమానుగతంగా ఉచిత ఉన్నత విద్యతో సహా, ప్రతి వ్యక్తికి విద్యాహక్కును కల్పించాలని చెబుతూంది. (నిబంధన 13). సోవియట్ రాజ్యాంగచట్టంలోని 45 వ నిబంధన అన్నిరకాల విద్య ఉచితమని, సెకండరీ విద్య సార్వజనీనము, ఉచితము అని తెలియ చేస్తూంది.

నూతన సోవియట్ రాజ్యాంగచట్టం, సుశిక్షితులైన నిపుణుల పర్యవేక్షణలో ఉచితవైద్యం (నిబంధన 42), గృహవసతి హక్కు (నిబంధన 44), వృద్ధాప్యంలో, జబ్బుపడినప్పుడు, అశక్తులైనప్పుడు, కుటుంబపోషకుడు చనిపోయినపుడు పోషణ హక్కు పూర్తిగా, ప్రభుత్వ వ్యయంపై సామాజిక భీమా హక్కు (ని. 43) వగైరా హక్కులకు హామీ కల్పిస్తూంది. ఈ హక్కులన్నీ ఈనాడు ఆచరణలో అమలు జరుగుతున్నాయి. ఇందుకు ప్రాతిపదికగా అవసరమైన పాదార్థిక సంపద పూర్తిగా సృజించబడింది. గత దశాబ్దంలోనే నూరుమిలియన్లమంది సోవియట్ పౌరులు—అంటే సోవియట్ జనాభాలో దాదాపు సగంమందన్నమాట — క్రొత్త ఇళ్ళలో ప్రవేశించారు. ఏటేటా ఇళ్ళ నిర్మాణం ఊహాతీతంగా పెరిగిపోతూంది. ఇళ్ళ అద్దెలు ప్రపంచంలో మరెక్కడా లేనంత తక్కువగా ఉన్నాయి.

పాశ్చాత్య దేశాలలో చాలా భాగం ఇప్పటికీ ప్రధానమైన అంతర్జాతీయ మానవ హక్కుల ప్రకటనలను ఆమోదించలేదు. అట్టిం వానిలో. యుద్ధనేరాలు. మానవజాతి వ్యతిరేక నేరాలపై చట్టబద్ధ నిషేధ గురించిన ఐ.రా.స. ప్రకటన (1968), అన్ని రకాల జాతి వివక్షతల నిర్మూలన ప్రకటన పౌర, రాజకీయ హక్కుల అంతర్జాతీయ ప్రకటన, జాతి వెలివిధానాన్ని నిషేధించే ఐ రా.స. ప్రకటన (1973) వగైరాలు కొన్ని. ఇలాంటి అంతర్జాతీయ ఒప్పందాలలో కొన్నింటిని ఆమోదించిన పాశ్చాత్య రాజ్యాలు కూడా కొన్ని మినహాయింపులతోనే తమ ఆమోదాన్ని తెల్పాయి. ఉదాహరణకు, "న్యాయమైన వేతనం, ఎట్టి వివక్షతా చూపకుండా సమాన విలువగల పనికి సమాన వేతనం" అన్న, ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక హక్కుల ప్రకటనలోని 7 వ నిబంధనను గుర్తించడానికి బ్రిటన్, డెన్మార్క్‌లు నిరాకరించాయి. మరో ముఖ్య విషయం ఏమిటంటే, అమెరికా ఈ అంతర్జాతీయ ఒప్పందాలలో ఒక్కదాన్ని కూడా ఈనాటికీ ఆమోదించలేదు. ఐ.రా.స. మానవ హక్కుల ఉపసంఘంలో అమెరికా ప్రతినిధిగా పనిచేసిన ఆర్. హౌసర్, 1970 లో అమెరికా అంతర్జాతీయ న్యాయశాస్త్ర సమితి సమావేశంలో మాట్లాడుతూ, తన దేశం అన్ని రకాలైన జాతి వివక్షను నిర్మూలించాలన్న అంతర్జాతీయ ప్రకటనను ఆమోదించజాలదని ప్రకటించాడు. ఎందుకంటే, జాతి ఆధిక్యతా ప్రచారాన్ని నిషేధించే ఈ ప్రకటనలోని 4 వ నిబంధనగాని, ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక రంగాలలో సకల పౌరుల సమానత్వం - ముఖ్యంగా పనిహక్కు,నిరుద్యోగరక్కసిబారినుండి సంరక్షణ. సమానమైన పనికి సమాన వేతనం అన్నదాని విధివిహితం చేసే 5 [ఇ] నిబంధన తమ కసలే ఆమోదయోగ్యం కాదని ఆయన, అసలు విషయాన్ని బయట పెట్టారు. అమెరికా కాంగ్రెసు ఈ అంతర్జాతీయ ప్రకటనలలో కొన్నిటిని ఖరారు చేసేందుకు నిరాకరించింది.* పాశ్చాత్యరాజ్యాలలో చాలా భాగం అంతర్జాతీయ మానవ హక్కుల ఒప్పందాలలో కేవలం ఒకటి, రెంటిని మాత్రమే ఆమోదించాయి. 1973 లో అమెరికా మాజీ ప్రధాన న్యాయ

---

* ఇంటర్నేషనల్ అఫైర్స్. 1978, సంపుటి 2. పుటలు 16,17

మూర్తి ఎర్ వారెన్ ఈ విషయంలో తన విచారాన్ని ఈ విధంగా ప్రకటించాడు: "దురదృష్టవశాత్తు, ఈ ప్రకటనలను ఆమోదించిన దేశాల సుదీర్ఘమైన జాబితాలో అమెరికా కూడా ఉంది. అయితే ఇందులో గుడ్డిలో మెల్ల ఏమిటంటే, ఇట్టి ప్రకటనల్లో ఒక్క దానిని కూడా ఆమోదించని 14 దేశాల్లో మన దేశం లేదు.... దీనిని కేవలం విచారకరమని సరిపెట్టుకోలేము; ఇది మన దేశానికి అత్యంత అపఖ్యాతికరమైన విషయం కూడా" *

ఈ విధంగా, ఏ అంతర్జాతీయ ప్రమాణాలతో చూచినా, అంతర్జాతీయ ప్రకటనలలో పొందుపరచిన మానవ హక్కుల కార్యక్రమం అమలులో ఇతర పాశ్చాత్య రాజ్యాల అన్నింటికంటే సోవియట్ యూనియన్ ఎంతో ముందున్నది.

సోవియట్ యూనియన్ ప్రవర్ధిత సోషలిస్టు సమాజ దశను చేరుకొని, కమ్యూనిజంలోకి ప్రస్థానం గావిస్తూంది. ఇందుకు మార్గాన్ని సుగమం చేయడమే నూతన రాజ్యాంగచట్టం కర్తవ్యం. పాదార్థిక సంపదా, వస్తూత్పత్తి కనీవినీ ఎరుగనంత స్థాయికి, కోకొల్లలుగా ఉండే స్థాయికి పెరగనిదే కమ్యూనిజాన్ని గురించి ఊహించలేం. కమ్యూనిస్టు సమాజంలో ప్రతి ఒక్క వ్యక్తికిగల సమస్త అవసరాలను తీర్చవలసి ఉంది. అందుకే అత్యధిక స్థాయిలో సామాజికోత్పత్తి పెరగాల్సి ఉంది. ఈ లక్ష్య సాధన దిశగా పురోగమనానికి కావలసిన చోదక శక్తులను సోషలిజమే సమకూర్చి పెడుతూంది. అది ఒక వంక శ్రమ ఉత్పాదకత, ఉత్పత్తి సామర్థ్యము పని నైపుణ్యము పెరిగేందుకు హామీలు కల్పిస్తూంది. ఈ విషయంలో అది కార్మికుల చొరవపైన, తమలోని అత్యుత్తముల ఆదర్శాన్ని మిగతా కార్మికులు హృదయపూర్వకంగా అనుకరించడం పైన, శాస్త్రీయ, సాంకేతిక ప్రగతిపైన ఆర్థికరంగ మేనేజిమెంటు

---

* ఇ. వారెన్: "మానవ హక్కుల ప్రకటనను అమలు పర్చాల్సిన సమయమాసన్నమయింది:" "అమెరికా న్యాయవాద సంఘ పత్రిక, నవంబరు. 1973, సం. 59, పు. 1258. "మానవ హక్కులు – అంతర్జాతీయ సహకారం" అన్న వి. కర్తాష్కిన్ పుస్తకం (నొవోస్తి-మాస్కో, 1977) లో ఉటంకించబడింది.

పద్ధతులను, రూపాలను మెరుగుపరచడంపైన ఆధారపడుతూంది. మరొక వంక, ఆర్థిక, సామాజికాభివృద్ధికై రూపొందించిన ప్రణాళికలను ఖచ్చితంగా అమలు జరుపుతూ, ఆయా శాఖలకు ప్రాంతాలకు మధ్య సమతూకాన్ని కాపాడుతూనే, కేంద్రీకృత నిర్దేశానికి, వ్యక్తుల, పారిశ్రామిక, తదితర సంస్థల చొరవకు స్థానిక మేనేజిమెంటు స్వేచ్ఛకు తగు అవకాశాలను తప్పక కల్పిస్తూంది. ఇందుకోసం మేనేజిమెంటు అకౌంటింగు, ఉత్పాదకత ఉత్పత్తి ఖర్చులు, తదితర ఆర్థిక కీలకాలను, ప్రోత్సాహకాలను చురుకుగా ప్రయోగిస్తుంది [15, 16 నిబంధనలు]. ఈ విధంగా సోషలిస్టు దేశంలో రాజ్యాంగ వ్యవస్థకు ఒక విశిష్ట నిర్మాణాత్మక పాత్ర ఉంది. దానికి, రాజకీయాధికారానికి సంబంధించిన ఇతర లక్షణాలు కూడా ఉన్నాయి. ఎందుచేతనంటే, శతాబ్దాల తరబడి రూపొందిన దేశీయ, అంతర్జాతీయ బూర్జువావర్గ శక్తిని ఎదుర్కొనేందుకు కార్మిక వర్గ, తదితర శ్రామిక ప్రజల సమిష్టి బలాన్ని సంఘటితపరచడం, తొలిదశలో నూతన సామాజిక వ్యవస్థకు దోపిడీ వర్గ ప్రతిఘటనను అధిగమించడం కూడా దీని కర్తవ్యం.

అయితే ఇది బూర్జువా, లేదా పెట్టుబడిదారీ రాజ్యవ్యవస్థకు మౌలికంగానే భిన్నమయినది. ఏ దోపిడీ సమాజంలోనైనా దేశాన్ని పాలించేందుకు రాజ్యాధికారమే ప్రధానమైన—వాస్తవానికి ఏకైక కళ్ళెంగా ఉంటుంది. ఎందుచేతనంటే, అశేష పీడిత జనసముదాయం అట్టి సమాజాల్లో అధిక సంఖ్యాకులుగా ఉంటారు. వారినుంచి ఎదురయ్యే ప్రతిఘటనను తట్టుకుందుకు ప్రభుత్వ బలప్రయోగం రూపంలో ప్రత్యక్ష హింసకు పూనుకొనడం తప్ప పాలకవర్గానికి వేరే మార్గం లేదు. అయితే, పాలక వర్గాలు పార్టీలు, ఉద్యోగసంఘాలు వంటి సంస్థలను నెలకొల్పుతాయి; తమ భావజాలాన్ని ప్రచారం చేసేందుకు వివిధ ప్రచార సాధనాలను వినియోగిస్తాయి. ఇట్టి సమాజంతో రాజ్యాధికారాన్ని వినియోగించడంలో శ్రామిక ప్రజల వాణికి ఏమాత్రం విలువ ఉండదు. సుదీర్ఘమైన అత్యంత కఠినమైన పోరాటాలద్వారానే వారు తమ సంస్థలను నెలకొల్పుకోగలుగుతారు; వాటిని చట్టబద్ధంగా పని చేయించుకో గలుగుతారు. అయితే, ఈసంఘాలు ప్రభుత్వ నిర్వహణలో నిర్ణయాత్మక పాత్ర వహించలేవు. అవి కొన్ని విజయాలను

సాధించవచ్చు; ప్రభుత్వ నిర్ణయాలపై కొంతవరకు ప్రభావాన్ని నెరపవచ్చు. కాని, మొత్తంమీద దోపిడీవర్గాల చేతిలో పనిముట్టుగానున్న రాజ్యాంగ వ్యవస్థతో వారు అడుగడుగునా సంఘర్షించాల్సి వస్తుంది. సబ్సిడీలు, అప్పులు, సంస్థాగత, ఆర్థిక వనరులు, రకరకాల ప్రోత్సాహకాలు — ఎగుమతులకిచ్చే రాయితీలు, క్రొత్త పరిశ్రమలపై పన్నుల వాయిదా, విదేశీపోటీని తట్టుకుందుకై సుంకాల రూపంలో వేసే అడ్డుకట్టలు వంటివి, పెట్టుబడిదారీ వర్గానికి ప్రత్యక్షంగా తోడ్పడేందుకు ప్రభుత్వం చేబట్టిన విధానాలు. కాని, పెరిగిన ధరలతో తరిగిన తమ జీవనప్రమాణాలను నిలుపుకోవడానికైనా కార్మికులు జీతాలు పెంచాలనో, బోనస్ ఇవ్వమనో కోరగనే, పారిశ్రామిక శాంతిని పరిరక్షించమని, పరిశ్రమలు మూతపడకుండా కాపాడమని, రాజకీయ నాయకుల వలలో పడవద్దని కార్మికులకు ధర్మబోధలను కుండపోతగా కురిపిస్తున్నారు. ఓపిక చచ్చి, బాధాసర్పదష్టులైన తన తోటి సోదరులతో కత్తుకట్టి కార్మికుడు తన హక్కులడగడానికి నోరు తెరిస్తే, పెట్టుబడిదారీ రాజ్యవ్యవస్థ తన దుష్టబలగాలన్నిటినీ అతనిపై కురికిస్తుంది. మరోచెంప, సామ్రాజ్యవాద దేశాలు తమ బహుళజాతి కంపెనీల మార్కెట్లకు కించిత్తు నష్టంకూడా వాటిల్లకుండా కాపాడేందుకై ఇతర దేశాలపై ప్రత్యక్షంగాను, పరోక్షంగాను తమ రాజకీయ, ఆర్థిక ప్రాబల్యాన్ని నెలకొల్పుకుందుకు ఎంతటి నైచ్యానికైనా పాల్పడుతున్నాయి.

సోషలిజం, రాజ్యాధికార అంతస్సారాన్నే సమూలంగా మార్చివేస్తుంది. ఇది రాజ్యవ్యవస్థా, శ్రామిక ప్రజానంస్థలూ ఒకే స్వభావాన్ని కలిగిఉండే నూతన పరిస్థితిని కల్పిస్తుంది. మొత్తంమీద సోషలిస్టు వ్యవస్థలో అధికారం, అంటే, సామాజిక వ్యవహారాల నిర్వహణ అంతా శ్రామిక ప్రజలకే చెందుతుంది. వారు దాన్ని విభిన్న రూపాల్లో వినియోగిస్తారు. అట్టి రూపాల్లో రాజ్యాధికారం ముఖ్యమైనది. సోషలిజాన్ని, కమ్యూనిజాన్ని నిర్మించడంలోను, పాత సామాజిక వ్యవస్థను సమూలంగా మార్చివేయడంలోను రాజ్యాధికారాన్ని ఒక సాధనంగా ఉపయోగించడం జరుగుతూంది. అంతర్గతంగా దోపిడీవర్గాల అస్తిత్వాన్ని నిర్మూలించడం, బయటనుండివచ్చే సామ్రాజ్యవాద దేశాల దురాక్రమణ ప్రమాదాన్ని తట్టుకోవడం

అనే ఆవశ్యకతను బట్టి రాజ్యవ్యవస్థకు ఈ పాత్ర నిర్ణయమవుతోంది. అయితే ఆదినుండీ శ్రామిక ప్రజాబాహుళ్యంయొక్క అంటే ఉత్తరోత్తరా యావన్మంది ప్రజలుగా రూపొందే శ్రామిక ప్రజాబాహుళ్యం యొక్క అధికార వ్యవస్థ అయినందున, అదేనాడూ సమాజానికి దూరం కాలేదు. దాన్ని అణచివుంచే సాధనం కాజాలదు; పైపెచ్చు సామాజిక స్రవంతిలో అవిభాజ్య భాగమయింది; దాదాపు రాజకీయేతర రాజ్యాధికార వ్యవస్థగా భాసిస్తూంది. రాజ్యాధికారానికి గల యీ స్వభావం సమాజంలో యీ అధికారము, విభిన్న సామాజిక అధికార రూపాలు ప్రజాస్వయంపాలనా వ్యవస్థగా అభివృద్ధి చెందేందుకు అనువగు పరిస్థితులను ఏర్పరుస్తాయి. ప్రజాస్వయంపాలన అంటే, మొత్తం సమాజ ప్రయోజనాలను, వాంఛలను వ్యక్తీకరించడమేగాక, అసలు సమాజంతోనే మమేకంచెంది, అట్టి అధికారాన్ని చెలాయించేందుకు ప్రత్యేక యంత్రాంగంతో అవసరముండక పోవడమే. ఇంతకుముందే చెప్పినట్లుగా యిది "రాజకీయేతర అధికారం." ఇట్టి ప్రజాస్వయంపాలనా వ్యవస్థ నానాటికి మరింత అభివృద్ధి చెందేలా చేసేందుకు నూతనరాజ్యాంగ చట్టంలో సమిష్టి శ్రామికసంస్థలకు విశిష్టపాత్ర కల్పించబడింది (నిబంధన 8). ప్రభుత్వ, ప్రజావ్యవహారాల నిర్వహణలో పాలువంచుకుందుకు పౌరులకు హక్కుంది (ని. 48). ప్రభుత్వ, ప్రజా సంస్థల నిర్వహణలో దొర్లే లోపాలను వేలెత్తిచూపి, వాటిని తొలగించి, ఆయా సంస్థల పని విధానాన్ని మెరుగుపరచేందుకు తగు సూచనలిచ్చే హక్కు వారికుంది (ని. 49). పారిశ్రామిక సంస్థలు, సమిష్టి క్షేత్రాలు, వేర్వేరు సంస్థలలో, ప్రభుత్వ అజమాయిషీకి ప్రజల నిఘాలు జోడించేందుకు అవకాశం కల్పించబడింది. (ని. 92), సోవియట్లకు ప్రతినిధులుగ ఎన్నికోబడేందుకు తగినవారిని ప్రతిపాదించే అధికారం ప్రజాసంస్థల కున్నది (ని. 100). తమ అఖిలయూనియన్ సంస్థలద్వారా క్రొత్త బిల్లులను ప్రతిపాదించే అధికారం ప్రజాసంస్థలకు ఇవ్వబడింది (ని. 113). ఇవీ, ఇలాంటి ఇతర పౌరహక్కులు ప్రజాస్వయంపాలన పెంపొందడానికి ప్రాతిపదికలుగా ఉన్నాయి. సోషలిస్టు పాలనా విధానం అభివృద్ధి చెందే ప్రధాన దిశను నిర్దేశించేది ఈ ప్రజాహక్కులే. సమాజాన్ని నియంత్రిత మొనర్చేశక్తి రాజ్యవ్యవస్థనుండి రాజ్యవ్యవస్థేతర సంస్థలకు క్రమంగా

బదలాయించే క్రమాన్ని ఇవే నిర్దేశిస్తాయి. సోషలిస్టు రాజ్యవ్యవస్థ కమ్యూనిస్టు ప్రజాస్వయంపాలనగా పరిణతి చెందేందుకు ఇవి పునాదులుగా ఉంటాయి. ప్రజాధికార అభివృద్ధి దిశలో కమ్యూనిస్టు స్వయంపాలనా విధానమే అత్యున్నతదశ అవుతుంది. ఆనాటికి ఒక నవమానవు డవతరిస్తాడు. అతని భౌతిక, ఆధ్యాత్మిక అవసరాలన్నీ సమాజం తీరుస్తుంది. తన వంతుగా అతడు, తనలో యిమిడివున్న అత్యుత్తమ శక్తి సామర్థ్యాలను నిస్వార్థంగా సమాజంకోసం ధారపోస్తాడు. పని అతనికి భారంగాకాక గౌరవంగాను, విద్యుక్తకర్తవ్యంగానూ మారుతుంది. ఇదంతా జరిగేందుకు చాలాకాలం పట్టవచ్చు. అయితే, సోవియట్ యూనియన్, నవ సోవియట్ రాజ్యాంగచట్టం పుట్ట, గుట్టలు తొలగించి ఇందుకు రహదారి నేర్పరుస్తున్నాయి. ఈ క్రమాన్నే నవ సోవియట్ రాజ్యాంగచట్టం ప్రతిబింబిస్తోంది.

2 వ ప్రకరణము

# సోవియట్ యూనియన్‌లో చట్టాలను రూపొందించే తీరు :

సోవియట్ రాజ్యాంగచట్టంలోని 73 వ నిబంధన సోవియట్ దేశ ఉన్నత రాజ్యాధికార, రాజ్యపాలనాసంస్థ అధికార పరిమితిని నిర్వచిస్తుంది. దీని పరిధిలో సోవియట్ దేశమంతటా చట్టపరమైన ప్రమాణాలు ఒకే విధంగా ఉండేలా చూడడం సోవియట్ యూనియన్, యూనియన్ రిపబ్లిక్కుల మౌలిక శాసనాలను ప్రతిపాదించడం చేరిఉన్నాయి. దీని కనుగుణంగా సోవియట్ దేశం వివిధ ప్రధాన విషయాలకు సంబంధించిన మౌలిక చట్టాలను రూపొందించింది. ఈ మౌలిక చట్టాలకు అనుగుణ్యంగా సోవియట్ యూనియన్ సుప్రీం సోవియట్, రిపబ్లిక్కుల సోవియట్లు తమ తమ చట్టాలను రూపొందిస్తాయి. ఈ సందర్భంలో అవి ఆయా జాతీయ రిపబ్లిక్, ప్రాంతీయ విశిష్టతలను దృష్టియం దుంచుకొంటాయి. ఈ విధంగాసోవియట్ దేశ రాజ్యాంగచట్టం,ఆయా యూనియన్ రిపబ్లిక్కుల, స్వయంపాలిత ప్రాంతాల రాజ్యాంగ చట్టాలు, యూనియన్ రిపబ్లిక్కులు ఆమోదించిన మౌలిక చట్టాలు ఏ రంగంలోనైనా న్యాయశాస్త్రానికి పునాదిగా ఉంటాయి.

ఒకే విధమైన న్యాయశాస్త్ర ప్రమాణాలను సమాజమంతా సార్వజనీనంగాను, హృదయపూర్వకంగాను పాటించాలంటే అవి ఆ సమాజపు ఆదర్శాలకు, ప్రజాతంత్ర విజయాలకు అనుగుణమైనవిగా ఉండాలి.

సోవియట్ యూనియన్‌లోగాని, ఆయా రిపబ్లిక్కులలోగాని చట్టాలు రూపొందించే సందర్భంగా మార్గదర్శక దృక్పథమిదే.

సోవియట్ సమాజం అభివృద్ధి చెందేకొలదీ, జాతీయ వైరుధ్యాలు రూపుమాసిపోయి, సామాజికంగా ఏకరూపత సాధించేకొద్దీ, సోవియట్ పౌరుల హక్కులు మరింత విస్తృతమవుతాయి. వారి రాజకీయ కార్యకలాపాలు మరింత అభివృద్ధి చెందుతాయి. తద్వారా కమ్యూనిస్టు స్వయం పాలనా వ్యవస్థ లక్ష్యానికి సమాజం చేరువఅవుతుంది. అంచేత సామాజికాభివృద్ధికి అనుగుణంగా చట్టాలను రూపొందించి, ముందుకు గొని పోవలసిన ఆవశ్యకత ఎంతేని ఉంది.

అయితే యిక్కడ ఒక విషయం గుర్తించవలసి ఉన్నది. ఒకే విషయంపై నేడు రూపొందిస్తున్న చట్టాలకు, ఇంతకు ముందున్న వాటికి, వాటి సోషలిస్టు సారాంశంలో ఏ విధమైన తేడా కూడా లేదు. కొత్త చట్టాలు పాత వాటిలో శ్రామిక ప్రజలకు కల్పించిన హక్కులను, హామీలను మరింత విస్తృతపరచి, పటుతరం గావించేందుకే ఉద్దేశించబడ్డాయి. కాలం గడచేకొద్దీ అభివృద్ధి చెందుతున్న సామాజిక సంబంధాలను ఈ సందర్భంలో అవి తమ దృష్టియందుంచుకొంటాయి. తన పరిధిని విస్తృతమొనర్చుకోవడం ద్వారా ప్రతి చట్టము, మరింత ఫలవంతంగా క్రియాశీలంగా భారీఎత్తున తన కార్యకలాపాలను నిర్వహించేందుకు అధిక తర అవకాశాలను ఆవిష్కరిస్తుంది.

ఉదాహరణకు 1917 అక్టోబరు విప్లవానంతరం భూ యాజమాన్య విధానం సమూలంగా మార్పు చేయబడింది భూమంతా జాతి మొత్తానికి సంబంధించిన ఆస్తి అయింది. వినియోగానికై అది శ్రామిక ప్రజలకు అప్పగించబడింది. ఈ విధానానికి హామీ ఇచ్చేందుకై చట్టం రూపొందించబడింది. 1930 దశకం ఆరంభంలో సమిష్టి వ్యవసాయ క్షేత్రాల వ్యవస్థ పూర్తిగా నెలకొనడంతో, సోవియట్ దేశంలో సేద్యయోగ్యమైన భూమి సన్నకారు వ్యక్తిగత క్షేత్రాలుగా ఉండే దశ అంతరించి, సమిష్టి క్షేత్రాలుగా అవతరించాయి, ఆరెల్స్ ఏర్పడ్డాయి. ఈ విషయాలనే చట్టబద్ధం గావించడం జరిగింది. అయితే జాతియార్థిక వ్యవస్థలోని వివిధ రంగాలు త్వరితగతిని అభివృద్ధి చెందడంతో వ్యవసాయేతర ప్రయోజ

వాలకై భూములను మరింత ఎక్కువగా ఉపయోగించవలసి వచ్చింది. సోవియట్ యూనియన్‌లాంటి సువిశాల దేశంలో కూడా భూమిని హేతు రహితంగా ఉపయోగించడం అనుమతించబడలేదు. కనుక, ఇట్టి దశలో వివిధ ప్రయోజనాలకు భూమిని ఉపయోగించేందుకు ఒక సమన్వయీకృత సమగ్ర విధానాన్ని రూపొందించేందుకు అవసరమైన నిబంధనలు కావలసి వచ్చాయి. మరో ఉదాహరణగా సోవియట్ యూనియన్‌లోను, యూనియన్ రిపబిక్కులలోను వివాహానికి, కుటుంబాలకు సంబంధించిన మౌలిక చట్టాల విషయమే తీసుకుందాం. కమ్యూనిస్టు లక్ష్యం దిశగా సమాజం పురోగమించే కొద్దీ ప్రజల నైతిక విలువలలోను, సైద్ధాంతిక అవగాహన లోను, సాంస్కృతిక స్థాయిలోను నూతన ప్రమాణాలు నెలకొల్పవలసిన ఆవశ్యకత ఏర్పడింది. ఇందుమూలంగా కొత్త తరం పెంపకం శిక్షణలలో తగు మార్పులు చేయవలసిన పరిస్థితి ఏర్పడింది. ఈ క్రమంలో కుటుంబ మన్నది అతి కీలకాంశం. కనుక కుటుంబ వ్యవస్థను మరింత పదిలపరచ డానికి వివాహము, కుటుంబానికి సంబంధించిన మౌలిక చట్టాలు పూను కొన్నాయి. అంచేత, సోవియట్ దేశంలో కుటుంబ సంబంధాలనుండి అన్ని రకాలైన భౌతిక వత్తిడులను తొలగించి, మహిళల దైనందిన జీవితంలో ఎదురయ్యే హేతురహితమైన సామాజిక లక్షణాలను నిర్మూలించి, నిజమైన కమ్యూనిస్టు కుటుంబాన్ని పెంపొందించడం కొత్త శాసన లక్ష్య మయింది. ఇట్టి కుటుంబంలో వ్యక్తుల వ్యష్టి అవసరాలన్నీ అత్యధిక స్థాయిలో తీర్చబడతాయి. ఈ విధంగా ఉత్తమ కుటుంబ వ్యవస్థ ప్రాతి పదికలను నిర్మించడమే ఈ కొత్త చట్టాల మౌలిక లక్ష్యం. ఇక మనం ఈ చట్టాలు రూపొందే తీరును గురించి చర్చించాల్సి ఉంది. సామాజిక జీవిత అవసరాలన్నిటిని తీర్చగల చట్టాన్ని రూపొందించడం అంత తేలి కైన పనికాదు. వారెంత నిష్ణాతులైనా కొద్దిమంది వ్యక్తుల బృందం ఈ పని చేయజాలదు. అందుకే సోవియట్ రాజ్యాంగ చట్టంలో, శాసనాల రూప కల్పన విషయంలో ప్రజలకు విస్తృతమైన హక్కులు కల్పించబడ్డాయి. వారు తమ అభిప్రాయాలను, సూచనలను సుప్రీం సోవియట్ ప్రతినిధుల ద్వారా తెలియచేస్తారు. (ఈ ప్రజా ప్రతినిధుల్లో సగానికిపైగా కార్మికులు, కర్షకులు). అంతేకాక ట్రేడ్ యూనియన్‌లు, యువ కమ్యూనిస్టు లీగు,

వినియోగదారుల సహకార సంఘాలవంటి ప్రజాసంస్థలద్వారాను, కర్మాగారాలు, కార్యాలయాలలో పనివారల సమావేశాల ద్వారాను, పత్రికలు, రేడియో ద్వారాను ఉన్నత ప్రభుత్వాధికార సంస్థలతో ఉత్తర ప్రత్యుత్తరాల ద్వారాను ప్రజావాణి విన్పిస్తుంది.

ఈ సూచన లన్నింటిని చట్టాలకు రూపకల్పన చేసే ఉపసంఘాలు సమీక్షించి విశ్లేషణ చేస్తాయి. అటుతర్వాత ఈ సూచనలలో అనేక వాటిని కొత్త చట్టాలలో చేరుస్తాయి. వివిధ రంగాలకు సంబంధించిన మౌలిక చట్టాలను, వీటికి సంబంధించిన ఇతర చట్టాలను తయారుచేసే సందర్భంలో ఈ సార్వజనీన చర్చల సారాంశాన్ని పరిగణనలోకి తీసుకొంటారు.

కొత్త చట్టం చిత్తుప్రతిని రూపొందించే సందర్భంలో, ఆ చట్టం వల్ల పరిష్కరించవలసిఉన్న సమస్యలను చర్చించేందుకై ప్రజా ప్రతినిధులు ప్రజా సభలు జరుపుతారు. వివాహం, కుటుంబాల గురించిన మౌలిక చట్టాన్ని రూపొందించే సందర్భంలో ప్రజా ప్రతినిధులు తమ తమ నియోజక వర్గాలలో అనేక మార్లు చట్టబద్ధమైనవి వివాహం, తల్లిదండ్రుల హక్కులు మున్నగు వాటి రూపాలను, పరిస్థితులను గురించి చర్చలు జరిపారు. ఉదాహరణకు, 400 మంది మహిళలతో జరిగిన ఒక సమావేశంలో, భార్యా భర్తలు విడిపోయి, వారిని తిరిగి ఏకం చేయడం సాధ్యం కానపుడు విడాకుల వ్యవహారాన్ని మరింత సులభతరం చేయాలని సూచించబడింది. తల్లిదండ్రులు విడిపోయిన సందర్భంలో పిల్లల పోషణకు చెల్లించవలసిన భరణాన్ని నిర్ణయించి, దాన్ని అమలు జరిపేందుకు అవసరమైన చర్యలను మరింతఅభివృద్ధిపరచేపద్ధతులను గురించి, ఛఘేస్తాన్ స్వయంపాలిత రిపబ్లిక్కు రాజధానిలోని వస్త్ర కర్మాగారంలో జరిగిన సమావేశంలో అనేక సూచనలు చేయబడ్డాయి. అలాగే యింకా మరికొన్ని సమావేశాలలో కూడా జరిగింది. ఇట్టి సూచనలను కొత్త చట్టంలో పొందుపరచడం జరిగింది. సోవియట్ యూనియన్ చట్టాలను రూపొందించే సందర్భంగా రిపబ్లిక్కు, స్థానిక, అధికార సంస్థలు ఆయా చట్టాలలోని ప్రతిపాదనలపై ప్రాథమిక చర్చలు జరుపుతాయి. ఈ విధంగా అఖిల

యూనియన్ చట్టాలలో వివిధ సోవియట్ జాతుల ప్రయోజనాలు ప్రతిబిం బించేందుకు అవకాశం కల్పించబడింది.

సోవియట్ చట్టాలను రూపొందించే సందర్భంలో అయా బిల్లులను పత్రికలలో ముందుగా ప్రకటించడం సర్వసాధారణమైన విషయం. ఉదా హరణకు వివాహము – కుటుంబాలకు సంబంధించిన మౌలిక చట్టం చిత్తు ప్రతిని ప్రచురించిన సందర్భంగా ఒక్క ఇజ్వెస్తియా పత్రికకే 15,000 లకు పైగా సూచనలు, వ్యాఖ్యాలు అందాయి. కజక్‌స్తాన్‌లోని ఒక్క మండలంలోనే 30 ఉత్పత్తి సంసల్లో ఈ చిత్తు ప్రతిని చర్చించారు. ఈ సమావేశాలలో అనేక సూచనలు, సవరణలు రూపొందించబడి, పంప బడ్డాయి, ఈ చట్టంలో చోటు చేసుకొన్న ఒక సూచన, వివాహ బంధం ఫలితంగా పుట్టిన బిడ్డల పితృత్వాన్ని నిర్ధారించడంలో కోర్టులు దృష్టిలో వుంచుకోవల్సిన పరిస్థితులను విస్తృతం చేయాలని ప్రతిపాదించింది. చట్టా లను రూపొందించేందుకు సాధారణంగా ప్రత్యేక ఉపసంఘాలను ఏర్పరు స్తారు. వీటిలో చట్టాల రూపకల్పన ఉపసంఘాల, శాశ్వత ఉపసంఘాల సభ్యులైన సుప్రీం సోవియట్ ప్రతినిధులతో బాటు, వివిధ మంత్రిత్వ శాఖల, సంసల ప్రతినిధులు, న్యాయశాస్త్ర నిపుణులు, ఆర్థికవేత్తలు, గణాంకశాస్త్రవేత్తలు, రాజకీయ ఆర్థిక, విద్యా తదితర రంగాలలోని నిపు ణులు చేరి వుంటారు. ఈ విధంగా నిపుణు లందించే సహకారం, గతంలో ఇలాంటి చట్టాలను అమలు జరపడంలో సమకూరిన అనుభవాన్ని గ్రహించడానికి ప్రస్తుతమున్న చట్టాలకు రాబోయే చట్టాలకు పూసల్లో దారంలాగా అనుబంధ ముండేందుకు, న్యాయశాస్త్ర వ్యవహారానికి చిత్తు చట్టం సరిపడేలా చేయడానికి తోడ్పడుతుంది. పౌరులనుండి, ప్రభుత్వ, ప్రజాసంస్థలనుండి పెద్ద సంఖ్యలో వచ్చే ప్రతిపాదనలను విశ్లేషించడంలో ప్రత్యేక నిపుణుల అభిప్రాయాలు ఎంతో ముఖ్య పాత్ర వహిస్తాయి. కొత్త చట్టాలను రూపొందించడంలో ఖచ్చితమైన న్యాయశాస్త్ర పరిభాష వాడి, ముందు ముందు దానికి దురన్వయం చెప్పేందుకు వీల్లేకుండా చేయ డానికి నిపుణులు తోడ్పడతారు.

చట్టానికి వాస్తవంగా రూపకల్పన చేయడంలో పాత్ర వహించే ప్రజాప్రతినిధులదే చివరిమాట. తమ తమ కర్మాగారాలు, సమిష్టి క్షేత్రాలు,

శాస్త్రీయ, సాంస్కృతిక సంస్థలలో పనిచేసే సందర్భంగా ప్రజల సమిష్టి అనుభవమేదో వారు చక్కగా గ్రహిస్తారు. తమతమ నియోజక వర్గాలలోని ప్రజలతో వారు తరచుగా సమావేశాలు జరుపుతారు. ఇట్లు వారు గ్రహిం చిన విషయాలను తమ స్వానుభవంతో జోడించి సామాజికాభివృద్ధికి సంబం ధించిన తక్షణ సమస్యలపై చట్టాలను రూపొందించి ప్రతిపాదించేందుకు, తద్వారా ప్రజల ప్రయోజనాలను అవసరాలనుతీర్చేందుకు తగుఅవకాశం లభి స్తుంది సోవియట్ యూనియన్ సుప్రీంసోవియట్ ఉభయ సభలకు పదమూ డేసి స్థాయీ సంఘా లుంటాయి. వీటికి ప్రభుత్వ శాఖలనుండి, అధికారుల నుండిఅధికార పత్రాలను లేదా తమప్రశ్నలకు రాత పూర్వకంగానో, నోటి మాటగానో జవాబులను తెప్పించుకొనే హక్కు ఉన్నది. సాధారణ చర్చలేని సందర్భాలలో కూడా వాస్తవ పరిస్థితుల నన్నింటిని పరిగణన లోకితీసుకుందుకు అవసరమైన సమాచారాన్నంతా వారేవిధంగా సమకూర్చు కుంటారు. ఇంతకు ముందే చెప్పినట్లుగా, సోవియట్ యూనియన్ సుప్రీం సోవియట్ ఆమోదించిన మౌలిక చట్టాలు, 15 యూనియన్ రిప బ్లిక్కుల సుప్రీం సోవియట్లు తమతమ జాతి, ప్రాంత విశిష్టతలను, సంప్ర దాయాలను దృష్టియందుంచుకొని స్థానిక చట్టాలలో తగు మార్పులు, చేర్పులు చేసేందుకు ఆధారంగా ఉంటాయి.

అంతిమంగా ఆమోదించే ముందు అత్యంత సమగ్రమైన ప్రజా తంత్రయుతమైన, ఓపికతో కూడిన చర్చలు, తయారీలు జరుగుతాయి. కనుకనే సాధారణంగా ఈ ముసాయిదా చట్టాలు ఏకగ్రీవంగా ఆమోదించ బడతాయి. అయితే, కొన్ని సందర్భాలలో ఇట్టి అంతిమ చర్చల సందర్భం గానే సవరణలు చేయడం కూడా కద్దు. ఇలాంటివి జరిగిన సందర్భాలలో ఉభయసభల ఉపసంఘాలు సమావేశమై వచ్చిన సూచనలను చర్చించి, ఎలాంటి ఆలస్యము లేకుండ సుప్రీం సోవియట్‌కు తమ సూచనల నంద జేస్తాయి. ఈ విధంగా చట్టాల రూపకల్పన ఒక గంభీరమైన కర్తవ్యంగా గ్రహించబడుతుంది. అందుకనే ఆయా శాసనసభలు అతి జాగ్రత్తగా, గంభీరంగా తమ కార్యకలాపాలను నిర్వర్తిస్తాయి. అందుకే ప్రక్కదారి పట్టించే చిల్లర మల్లర విషయాలకు, పాక్షికత్వానికి చర్చలలోగాని, నిర్ణయా లలోగాని తావుండదు.

3 వ ప్రకరణము

# సోవియట్ కార్మిక చట్టం

## కార్మిక చట్టపు మూల సూత్రాలు

అక్టోబరు విప్లవానంతరం ఆస్తి సంబంధాలను, శాస్త్రీయమార్క్సిస్టు పద్ధతులపై సమూలంగా మార్చివేయడం జరిగింది. సోషలిస్టు సమాజ ఆవిర్భావంతో ఉత్పత్తి సాధనాలు సమాజ పరమయ్యాయి. అందుచేత పది మందిని దోచి ఒకడు సంపన్నుడయ్యే వ్యవస్థ రద్దయింది. మనిషిని మనిషి దోచుకునే వ్యవస్థ శాశ్వతంగా రద్దయింది. దోపిడీదారులకు అనేక శతాబ్దాల పాటు ఊడిగం చేశాక చరిత్రలో మొట్టమొదటి సారిగా శ్రామిక ప్రజలు, తమ కోసం, తమ సమాజం కోసం పనిచేసే అవకాశం లభించింది. దీంతో శ్రామిక జన కళ్యాణం కోసం, శ్రమ జీవుల సుఖజీవితం కోసం స్వేచ్ఛగా శ్రమించే యుగం ఆరంభమైంది; శ్రమ దోపిడీ నుండి విముక్తమయిందనేందుకు, వాస్తవమైన స్వేచ్ఛను వ్యక్తికి ప్రసాదించేందుకది దోహదం కూర్చుతుందనేందుకు సోషలిస్టు వ్యవస్థ హామీ.

లాభమే సకల ఉత్పాదక క్రమాలకు గీటురాయి కానందున, సమాజ అవసరాలను, శ్రామిక ప్రజల అవసరాలను దృష్టియందుంచుకొని పనిని వ్యవస్థీకరించడం సాధ్యమయింది. సోషలిస్టు అభివృద్ధి దశలో సోవియట్ దేశం "శక్తినిబట్టి పని, పనిని బట్టి ప్రతిఫలం" అన్న సోషలిస్టు సూత్రం ఈ లక్ష్యసాధనకు చక్కగా సరిపోయింది. ఈ సూత్రం ప్రాతిపదికగా పనిచేయ సామర్థ్యంగల పౌరులందరికీ పని హక్కు అనే సూత్రానికి వాస్తవ రూపం ఇవ్వడం సాధ్యమైంది. ఇలాంటి సమాజంలో సోమరి

తనానికి తావేలేదు. పని యన్నది శక్తి సంపన్నుడైన ప్రతి పౌరుని బాధ్యత, నైతిక విధి అయింది.

పైన చెప్పిన విషయాన్ని దృష్టిలో ఉంచుకుంటే సోషలిస్టు సమాజం, పౌరులమధ్య యాంత్రిక సమానత్వం ప్రాతిపదికగా నిర్మిత మవలేదని తెలుస్తుంది. ప్రతి వ్యక్తికి తన పనికి తగ్గ ప్రతిఫలం పొందే హక్కు ఇచ్చి, ఆ వ్యక్తికి న్యాయం చేయడం జరిగింది. అదే సమయంలో వ్యక్తులు మరింత బాగా పనిచేసేలా ప్రోత్సహించేందుకై నైతిక, పాదార్థిక ప్రోత్సాహకాలు ఇచ్చి, అతడు తన అత్యుత్తమ శక్తి సామర్థ్యాలను ధారపోయడం ద్వారా సామాజిక పురోగతి జరిగేలా జాగ్రత్త వహించబడింది. ఈ విధంగా సోషలిస్టు వ్యవస్థలో సామాజికోత్పత్తి నిరంతరాయంగా పెంపొందేందుకు మరింత మెరుగయ్యేందుకు అవకాశం కల్పించబడింది. నానాటికి పెరుగుతోన్న సామాజికోత్పత్తి, సోవియట్ ప్రజల జీవన, సాంస్కృతిక ప్రమాణాల్లో నిరంతరాయమైన పురోభివృద్ధి సాధించేందుకు అవకాశం కల్పిస్తోంది. సోవియట్ ప్రభుత్వం పాదార్థిక, శ్రామిక ప్రోత్సాహకాల రూపాలను నిరంతరం మెరుగుపరుస్తోంది. అందుకే, శ్రామిక ప్రజలలో సోషలిస్టు పోటీని సర్వవిధాల ప్రోత్సహించడం జరుగుతూంది.

కమ్యూనిస్టు సమాజ నిర్మాణానికై శ్రామిక ఉత్పాదక శక్తి, అధికతర ఉత్పత్తి సామర్థ్యము పెంపొందించడం ఎంతైనా ముఖ్యం. అంచేత జాతీయార్థిక వ్యవస్థలోని సమస్త రంగాలలోను శాస్త్రీయ, సాంకేతిక పురోగతి త్వరిత మొనర్చబడింది. దీని లక్ష్యం విద్య, సాంకేతిక శిక్షణల స్థాయిని పని విషయంలో శ్రామిక ప్రజల వ్యవస్థీకరణ, క్రమశిక్షణలను నిరంతరాయంగా పెంపొందించడమే. మార్కెట్ ఆర్థిక వ్యవస్థ గల దేశాలలో శాస్త్రీయ, సాంకేతిక పురోభివృద్ధి యజమానులు, తమ లాభాలను యిబ్బడి, ముబ్బడిగా పెంచుకుందుకు, పనివారి తగ్గింపు, లే ఆఫ్‌ల ద్వారా శ్రామికుల కడుపు కొట్టేందుకు, వినియోగించబడుతున్నది కాని, సోషలిస్టు సమాజంలో ఇట్టి శాస్త్రీయ, సాంకేతిక ప్రగతిని శ్రమను మరింత సులభతరం గావించేందుకు, పనిగంటలను మరింత తగ్గించేందుకు, శారీరక శ్రమను, నైపుణ్య రహిత శ్రమను తొలగించేందుకు వినియో

గించడం జరుగుతూంది. అంతేగాక, శాస్త్రీయ, సాంకేతిక పురోగతి ఉత్పత్తి క్రమంలో బౌద్ధిక శ్రమకు, శారీరక శ్రమకు మధ్య ఇప్పటికంటే మంచి అంతస్సంబంధాన్ని నెలకొల్పేందుకు దారితీస్తుంది. పెద్ద యెత్తున ఉచిత, విశిష్ట వృత్తి విద్యాశిక్షణ సమాజ ప్రయోజనాల దృష్ట్యా వ్యక్తి తన వృత్తిని, పనులను ఎంపిక చేసుకుందుకు అత్యంత విస్తృతమైన అవకాశాలను సమకూర్చుతూంది. ఈ విధంగా పని సంతోషదాయకమైన క్రీడగా మారుతూంది. విసుగు పుట్టించే చాకిరీ స్వభావాన్ని క్రమంగా కోల్పోతున్నది.

సోషలిస్టు రాజ్యంలో శ్రామిక ప్రజల ఆరోగ్య పరిరక్షణ, భద్రతతో కూడిన పని పరిస్థితులు, వృత్తిపరమైన జబ్బుల నివారణ, పారిశ్రామిక ప్రమాదాలను అరికట్టడంవంటి బాధ్యతలను సోవియట్ ప్రభుత్వం తన ముఖ్య కర్తవ్యంగా భావించడం సహజమే.

ఉత్పత్తి ప్రజలకోసం, ప్రజలచేత నిర్వహింపబడుతుంది. అట్టి సోషలిస్టు సమాజంలో ఉత్పత్తియెడ నికరమైన ప్రజాతంత్ర వైఖరి సుసాధ్యమైనట్టిదే. ఫ్యాక్టరీ కార్మికులను, కార్యాలయోద్యోగులను, ఇతరులను కూడా ఉత్పత్తి వ్యవహారాల నిర్వహణలో పాలుపంచుకొనేలా చేయడంలో ట్రేడ్‌యూనియన్లు అతి ముఖ్యపాత్ర వహిస్తున్నాయి. సోవియట్ సమాజంలో మొత్తం ప్రజలందరికి (ప్రభుత్వానికి) చెందిన సంస్థలను నిర్వహించేది శ్రామిక పజలే. వ్యక్తిగతంగా కార్మికులకు, వారి ట్రేడ్‌యూనియన్లకు ఆయా పరిశ్రమల నిర్వహణలో యివ్వబడిన హక్కులకు ఎంతో ప్రాముఖ్యం ఉన్నది.

వారి జాతి, నరవంశము ఏదైనప్పటికీ, పని నిబంధనల విషయంలో సోవియట్ పౌరులందరికి సమానహక్కులను సోవియట్ రాజ్యాంగచట్టం గ్యారంటీ చేసిన విషయం మనం గమనించాము. పని విషయంలోను, ఆ పనికితగ్గ ప్రతిఫలం పొందడంలోను, సామాజిక భద్రతలోను, స్త్రీలు, పురుషులతో సమానమైన హక్కులను అనుభవిస్తున్నారు. ఈ హక్కులను చట్టం పరిరక్షిస్తూంది.

సోవియట్ దేశంలో కార్మిక చట్టాల చరిత్ర, పై లక్ష్యాల సాధనకు సోవియట్‌దేశ నాయకత్వం సాగిస్తూన్న పట్టువీడని నిరంతర ప్రయత్నాలకు

తారాౣణం. సోవియట్ ప్రభుత్వం జారీచేసిన మొట్టమొదటి డిక్రీలలోనే పని గంటలు, విశ్రాంతి, స్త్రీలు, పిల్లలకు సంబంధించిన పని పరిస్థితుల నిబంధనలు వివరించబడ్డాయి. 1918 లో రష్యన్ సోవియట్ రిపబ్లిక్ కార్మికచట్టం అమలులో కొచ్చింది. అంతర్యుద్ధానంతరం 1922 లో ఒక కొత్త కార్మికచట్టం అమలుపరచబడింది. కర్మాగారాలలోని కార్మికులకు, కార్యాలయోద్యోగులకు యివ్వబడిన హక్కులను, హామీలను అది మరింత విస్తృత మొనర్చింది.

1970 జూలైలో సోవియట్ దేశ సుప్రీం సోవియట్ ఆమోదించిన కార్మికచట్టం, 1922 నాటి రష్యన్ ఫెడరేషన్ కార్మిక చట్టంలోని ప్రధాన నిబంధనలను అలాగే ఉంచింది. ఈ సూత్రీకరణలే 1936 రాజ్యాంగ చట్టంలో కూడా చోటుచేసుకొన్నాయి. పనికితగ్గ ప్రతిఫలం పొందేహక్కు, నిర్ణీతమైన పని గంటలు, ప్రభుత్వ ఖర్చుపై శ్రామిక ప్రజలందరికి సామాజిక భద్రత. పని విషయంలో స్త్రీ పురుషులకు సమాన హక్కులు, సమానమైన పనికి సమాన వేతనం, పద్దెనిమిదేండ్లకు లోపుగానున్న యువ కార్మికులను భారమైన, హానికరమైన పనులలో నియమించకుండా నిషేధంవంటి ఏర్పాట్లు ఇందులో కొన్ని మాత్రమే.

ఆనాటినుండి సోవియట్ యూనియన్‌లో ప్రధానమైన సామాజిక మార్పులు జరిగాయి. వారానికి ఐదు రోజుల పని పద్ధతి అమలులో కొచ్చింది; కష్టమైన పరిస్థితులలో మారుమూల ప్రాంతాలలో పనిచేసే వారికి అదనపు జీతం యివ్వబడుతూంది. జీతంతో శెలవు దినాల సంఖ్య బాగా పెరిగింది; కర్మాగారాల బోనస్ నిధి గణనీయంగా వృద్ధిచెందింది. జాతీయార్థిక వ్యవస్థలో పనిచేయగల ప్రతి ఐదుగురు మహిళలలోను నలుగురు పనులలో ఉన్నారు. ఈనాటి శ్రామిక ప్రజలలో 65 శాతం పైగా ఉన్నత విద్యను, సెకండరీ విద్యను పొందినవారున్నారు. నానాటికీ పెరుగుతున్న ఉత్పత్తి సంస్థల లాభాలలో అధికాధికభాగం ప్రజలా పాదార్థిక, సాంస్కృతికఅవసరాలను తీర్చేందుకై వినియోగించ బడుతున్నది.

సోవియట్ దేశ, యూనియన్ రిపబ్లిక్కుల మౌలిక శ్రామిక చట్టం, కమ్యూనిస్టు సమాజ నిర్మాణదశలో కార్మికుల, ఉద్యోగుల పని విధానపు మౌలిక ప్రమాణాలకు వర్తించే తొట్టతొలి దేశవ్యాప్త శ్రామిక చట్టం.

గతంలో రూపొందిన శ్రామిక చట్టాలలోని మౌలిక నిబంధనలను నిలిపి ఉంచుకుంటూనే, నూతన శ్రామికచట్టం ఇంతకుముందున్న చట్టాలలో లేని అనేక నూతన అంశాలను ప్రవేశపెట్టింది.

శ్రామిక విజయాల సాధనకు చైతన్యయుతమైన పనికి మరింత ఎక్కువ బహుమతులు, ప్రత్యేక సౌకర్యాలు కల్పించడం ఒక నూతన విశేషం సోషలిస్టు సమాజం ప్రవర్తిత మవ్వడంతో. శ్రామిక సంబంధాలకు, మరింత మేలైన, ఒకేలాంటి శాసనపర పునాదిని కల్పించడం వస్తుగత ఆవశ్యకత అయింది. అంతకుముందు చేసిన సవరణలు, చేర్పులు, కూర్పు లన్నింటిని నూతన చట్టంలో క్రమబద్ధం చేయడం జరిగింది.

సమిష్టి క్షేత్ర సభ్యుల శ్రమకు వర్తించే "ఆదర్శ సమిష్టి వ్యవసాయ క్షేత్ర నిబంధనలు," సోవియట్ సమాఖ్య, యూనియన్ రిపబ్లిక్కుల సమిష్టి క్షేత్ర చట్టాలు ప్రాతిపదికగా జారీచేసిన నిబంధనలు వర్తిస్తాయి. (సోవియట్ దేశ, యూనియన్ రిపబ్లిక్కుల మౌలిక కార్మిక చట్టంలోని 3 వ నిబంధనను చూడండి).

సోవియట్ దేశ యూనియన్ రిపబ్లిక్కుల కార్మికచటం మౌలిక సూత్రాలు కార్మికుల, ఉద్యోగుల పని పరిస్థితులను క్రమబద్ధం చేస్తున్నాయి. ఈ కార్మిక చట్టాల మౌలికాంశాలలోని 107 వ నిబంధన, సోవియట్ యూనియనూ, యూనియన్ రిపబ్లిక్కులూ కార్మిక వ్యవహారాలకు సంబంధించిన చట్టాల నామోదించే అధికారాన్ని నిర్వచిస్తోంది. ఈ కార్మిక చట్టపు మౌలిక సూత్రాలలో నిర్దేశించిన పని పరిస్థితులను కార్మికులకు, ఉద్యోగులకు కల్పించని శ్రామిక ఒప్పందాలు చెల్లనేరవని స్పష్టంగా పేర్కొనడం జరిగింది.

శ్రామిక ఒప్పందాలు, సమిష్టి ఒప్పందాలుగా పిలువబడే ఒడంబడికలు, కర్మాగారాల్లోని, పారిశ్రామికాది సంస్థల్లోని, ఇతర సంస్థల్లోని కార్మికుల, మేనేజిమెంటుల హక్కులను, విధులను నిర్వచించి, నిర్దేశిస్తాయి.

కార్మిక ఒప్పందాల గురించి చర్చించేముందు, సమిష్టి ఒప్పందాలపై కార్మికచట్టాల మౌలిక సూత్రాలలో పేర్కొన్న ఏర్పాట్లను మననం చేసుకోవడం అవసరం. ఈ సమిష్టి ఒప్పందాలన్నవి ఆయా పారిశ్రామి కాది సంస్థల మేనేజిమెంటుకు ఆయా ట్రేడ్ యూనియన్ కమిటీకి, లేదా

ఫ్యాక్టరీ కార్మికుల, కార్యాలయోద్యోగుల తరపున స్థానిక శాఖకు మధ్య కుదుర్చుకోబడతాయి.

ఇలాంటి ఒప్పందంపై సంతకాలు జరిగేముందు, చిత్తు ప్రతిని తయారు చేసి కార్మిక సంఘాలకు పంపిస్తారు. కార్మికుల, ఉద్యోగుల సమావేశాలలో దానిని ఆమోదించవలసి ఉంటుంది. ఇట్టి సమిష్టి ఒప్పందపు నిబంధనలు ట్రేడ్ యూనియన్ సభ్యులైనా కాకపోయినా కార్మికులు, ఉద్యోగులు అందరికీ వర్తిస్తాయి.

ఈ సమిష్టి ఒప్పందాలలో కార్మికుల, ఉద్యోగుల పని, జీతనాతాలు, పని గంటలు, విశ్రాంతి సమయము, పాదార్థిక ప్రోత్సాహకాలు, శ్రామిక పరిరక్షణలు మొదలైనవాటికి సంబంధించిన మౌలిక నిబంధనలు చేరి ఉంటాయి. ఈ నిబంధనలు కొన్ని ప్రమాణాలను నిర్దేశిస్తాయి. ఉత్పత్తి పథకాలు శ్రామిక బలంయొక్క, ఉత్పత్తియొక్క వ్యవస్థీకరణను మెరుగుపరచడం, కొత్త యంత్రాలను ప్రవేశపెట్టడం, లేదా శ్రామిక ఉత్పాదకశక్తిని పెంపొందించడం, ఉత్పత్తుల నాణ్యాన్ని పెంచి, ఉత్పత్తి ఖర్చులను తగ్గించడం, సోషలిస్టు పోటీని ప్రోత్సహించడం, శ్రామిక క్రమశిక్షణను పటుతరం గావించి, కార్మికుల సామర్థ్య స్థాయిని పెంపొందించడం, పనివారికి సర్వీసులో ఉండగానే శిక్షణ గరపడంవంటి విషయాలు కూడా ఈ సమిష్టి ఒప్పందాల్లో చేరిఉంటాయి. ఈ విధంగా ఈ ఒప్పందాలు, అటు సంస్థ మేనేజిమెంటుకు (అంటే సమిష్టి శ్రామికసంస్థ అన్నమాట. ఎంచేతనంటే అంతిమంగా మేనేజిమెంటు కార్మిక ప్రయోజనాలకే ప్రాతినిధ్యం వహిస్తుంది), ఇటు కార్మికులకు వ్యక్తిగతంగాను ఆసక్తికరమైన విషయాలను గురించి చర్యతీసుకుంటుంది. ఆయా సంస్థల ఉద్యోగులు ఒడంబడే పని ప్రమాణాల చట్రాన్ని ఈ ఒప్పందాలు తయారుచేస్తాయి. ఇలాంటి కీలకమైన విషయాలపై నిర్ణయాలు ట్రేడ్ యూనియన్ల భాగస్వామ్యంతో, ప్రజాతంత్ర పద్ధతులలో గైకొనబడడం గమనార్హమైన విషయం. ఈ విధంగా సోవియట్ ప్రజాస్వామ్యం శ్రామిక ప్రజల జీవనంలోని ప్రతి అంశాన్ని సర్వసమగ్రంగా ఆవరించి ఉంటుంది. దైనందిన నిర్ణయాలకు వర్తించే క్రియాశీల సిద్ధాంతంగా ప్రజాస్వామ్యం పనిచేస్తుంది. శ్రామిక ఒప్పందం ఇట్టి సమిష్టి ఒప్పందా

లకు భిన్నమైనది. ఇది ఆ ఉద్యోగికి, ఆయా సంస్థలు, కర్మాగారాలకు మధ్య కుదిరే ఒప్పందం. దీని ప్రకారం, శ్రామిక నిబంధనలకు అనుగుణంగా ఒక నిర్దిష్ట వృత్తిలోనో, మరో హోదాలోనో పనిచేస్తానని కార్మికుడు ఒడంబడతాడు. మరోవైపు, ఆ కర్మాగారమో, సంస్థయో అతని పనికి తగ్గ వేతనాన్ని, కార్మిక చట్టాలు, సమిష్టి ఒప్పందాలు, సంస్థకు, కార్మికునికి మధ్యగల ఒప్పందాల ప్రకారం అనువైన పని పరిస్థితులను కల్పిస్తామని ఒప్పుదల అవుతాయి.

ఈ విధంగా ఇట్టి శ్రామిక ఒప్పందం, ఉద్యోగానికి ఒక పాస్ పోర్టు వంటిది; సోవియట్ పౌరునికి ఉద్యోగ గ్యారంటీనిచ్చే పత్రము. ఈ విషయాన్ని కార్మిక చట్టాల మౌలిక సూత్రాలలోని 9 వ నిబంధన నొక్కి చెబుతూంది. ఎవరికయినా కారణం చూపకుండా పని యివ్వ నిరాకరించడాన్ని ఇది నిషేధిస్తుంది. పౌర హక్కులపై ప్రత్యక్షంగా గాని, పరోక్షంగా గాని పరిమితులు విధించడాన్ని ఇది అడ్డుకుంటుంది. స్త్రీ, పురుష, జాతి, మత విశ్వాసాలు ప్రాతిపదికగా పనులు చూపడంలో ఏ విధమైన ప్రత్యేక సౌకర్యాలు చూపడానికైనా ఇది ఆటంకంగా నిలుస్తుంది. ఈ విధంగా నవ సోవియట్ రాజ్యాంగ చట్టపు 34,35,36 వ నిబంధనలలో పేర్కొన్న విధంగా అన్ని తరగతుల ప్రజలమధ్య సమానత్వానికి నిజమయిన ప్రాతిపదిక నేర్పరుస్తుంది. పనిహక్కును సమస్త పౌరులకు గ్యారంటీచేసే నవ రాజ్యాంగ చట్టపు 40 వ నిబంధనకు కార్మిక చట్టాల మౌలిక సూత్రాలు (అందలి 9 వ నిబంధన) ఆచరణాత్మకమైన వ్యక్తీకరణ నిస్తున్నాయి.

శ్రామిక ఒప్పందం సాధారణంగా ఆ నిర్దిష్ట కాలానికి వర్తిస్తుంది. అయితే కొన్ని సందర్భాలలో మూడేళ్ళు, లేదా అవసరమైన కాలం మేరకు కూడా వర్తించవచ్చు. 10,11 నిబంధనలలో సూచించిన విధంగా, నిర్దిష్ట కర్తవ్యాన్ని నిర్వర్తించేందుకై కొంత ప్రొబేషన్ కాలాన్ని నిర్ధారించేందుకు కూడా వీలున్నది. ఇందుమూలంగా ఒక ఉద్యోగి కోరిన పనిని అతను సక్రమంగా నిర్వర్తించగలడా లేడా అని పరీక్షించి చూచే అవకాశాన్ని మేనేజిమెంటుకివి కలిగిస్తాయి. సోవియట్ యూనియన్‌లో సామాన్య కార్మికునికి ఇలాంటి ప్రొబేషన్ కాలపరిమితి ఆరు రోజులకు

మించదు. కార్యాలయోద్యోగికి 12 రోజులు, బాధ్యతాయుతమైన పదవులు నిర్వర్తించే వ్యక్తులకు 24 రోజులకు మించదు.*

శ్రామిక ఒప్పందంలో లేని ఏ పనినయినా చేయమని ఒక ఫ్యాక్టరీ కార్మికుని, లేదా ఆఫీసు ఉద్యోగిని కోరే హక్కు మేనేజిమెంటుకు లేనే లేదు. కార్మిక చట్టాల మౌలిక సూత్రాలలోని 14,56 నిబంధనల మేరకు కొన్ని ప్రత్యేక సందర్భాలలో తప్ప ఒక ఆఫీసు ఉద్యోగిని, అతని అంగీకారం లేనిదే బదిలీ చేయడానికి కూడా వీలులేదు. ఈ నిబంధనలు ప్రకృతి వైపరీత్యాలు, పరిశ్రమలు మూతబడటం, ప్రమాదాల నివారణ, పనిలేక పోవడం. ప్రభుత్వ ఆస్తులకు వినాశము వాటిల్లడం వంటి అత్యయిక పరిస్థితులకే వర్తిస్తాయి. ఇట్టి బదిలీలు తాత్కాలికమయినవిగానే ఉంటాయి. వాటి కాలపరిమితి నెలకు మించరాదు. ఈ విధంగా బదిలీ చేయబడిన వ్యక్తికి, అతడు అంతకుముందు పొందుతున్న సగటు వేతనానికి ఏమాత్రము తక్కువకాని ప్రతిఫలాన్ని చెల్లించవలసివుంటుంది. తప్పనిసరి అయిన పని రాహిత్యము, తాత్కాలికంగా కార్మికునికి బదులుగా మరొకర్ని నియమించినపుడు కూడా నిష్ణుడైన కార్మికుని, లేదా ఉద్యోగిని నిపుణత లేని పనికి బదిలీచేయడం నిషిద్ధం. శ్రామిక క్రమశిక్షణ నుల్లంఘించినందుకు శిక్షగా బదిలీలు జరుగవచ్చు. అయితే, ముందు ముందు వివరించినట్లు, ఎట్టి సందర్భాల్లోకూడా ఉద్యోగుల ప్రయోజనాలకు విరుద్ధంగా చట్టవిరుద్ధ చర్యలు గైకొనకుండా తగు రక్షణలు కల్పించబడ్డాయి.

కార్మికుడు, లేదా ఉద్యోగి అనిర్దిష్టకాల శ్రామిక ఒప్పందాన్ని రెండు వారాల వ్యవధితో రద్దు చేసుకోవచ్చు. ఒక నిర్దిష్ట కాలపరిమితితో కూడిన ఒప్పందాన్ని జబ్బు, లేదా అశక్తత సంప్రాప్తించినపుడు, కార్మిక చట్టాన్ని, సమిష్టి, లేదా శ్రామిక ఒప్పందాలను మేనేజిమెంటు ఉల్లంఘించినపుడు, లేదాసమర్థనీయమయిన మరే కారణంతోనయినా రద్దుపరచుకోవచ్చు.

అయితే మేనేజిమెంటు పారిశ్రామిక సంస్థను మూసివేసినపుడు గాని, తన పని నిర్వహించేందుకు కార్మికుడు పనికి రానపుడుగాని, సమర్థ

---

*'సోషలిస్టు, శ్రామిక, పౌర, నేర, న్యాయశాస్త్రము' — జగోరోద్నికొవ్, పొష్మెల్యార్చుక్, బారావికొవ్, పుట 31.

నీయమైన కారణాలు లేకుండా తన విధి నిర్వహణలో ఎడతెరిపి లేకుండా విఫలమవడంగాని, అకారణంగా పనికి గైరుహాజరవడంగాని, అంతకు ముందు ఆ పనిలోవున్న కార్మికుడు, లేదా ఉద్యోగిని ఆ పనిలో తిరిగి నియమించినపుడుగాని, అశక్తత వలన నాలుగు నెలలకంటె ఎక్కువ కాలం పనికి హాజరు కాలేనపుడుగాని, శ్రామిక ఒప్పందాన్ని రద్దు చేయవచ్చు. పారిశ్రామిక ప్రమాదం జరగడంవల్లనో, వృత్తిపరంగా సంక్రమించిన వ్యాధివల్లనో అశక్తత ప్రాప్తించినట్లయితే, అట్టి కార్మికుడు, లేదా ఉద్యోగి పూర్తిగా కోలుకునే వరకు ఆ పదవి ఖాళీగా వుంటుంది, లేదా అశక్తతాపింఛనయినా ఇవ్వబడుతుంది. కర్మాగారం మూతబడినపుడు, కార్మికుడు పనికి తగినవాడు కానపుడు, పాత కార్మికుణ్ణి, లేదా ఉద్యోగిని తిరిగి పనిలో పెట్టుకున్నప్పుడు, అతని సమ్మతితో మరో పనికి బదలాయించడానికి వీల్లేనపుడే పనినుండి తీసివేయడం జరుగుతుంది. ఈ మూడు సందర్భాల్లోను అతడు రెండు వారాల సగటు సంపాదనకు సమానమైన తొలగింపు భృతి పొందుతాడు. కర్మాగార కార్మికుల, ట్రేడ్ యూనియన్ కమిటీయొక్క, లేదా దాని స్థానిక శాఖయొక్క అంగీకారం ముందుగా పొందకుండానే శ్రామిక ఒప్పందాన్ని రద్దు పరచేందుకు వీల్లేదు. సోవియట్ దేశ శాసనాలు అంగీకరించిన ప్రత్యేక సందర్భాల్లోనే అలా చేయడానికి అవకాశముంటుంది. ఆ విధంగా తొలగించబడిన ఉద్యోగి ఇంతకు ముందు తడు నిర్వహించిన పదవిలో తిరిగి నియమింపబడుటకు తగుహక్కు కలిగివుంటాడు. అందువల్ల చట్టవిరుద్ధమైనచర్యకు పాల్పడకుండా నిరోధించేందుకు యిది అతి ముఖ్యమైన గ్యారంటీగా ఉపకరిస్తుంది.

పైన ఉదహరించిన వాటికి తోడు యీ క్రింద పేర్కొన్న సందర్భాలలో కూడా శ్రామిక ఒప్పందాన్ని రద్దుపరచవచ్చు.

1. ఉభయపక్షాలు అందుకంగీకరించినపుడు,

2. ఒప్పందం కాలపరిమితి పూర్తయి, శ్రామిక సంబంధాలు అట్టు తర్వాత కూడా కొనసాగుతూ, వాటిని తెగతెంపులు చేసుకుందుకు యిరుపక్షాల వారూ అంగీకరించనపుడు,

3. ఆ కార్మికుడు, లేదా ఉద్యోగిని సైనిక సేవకు రమ్మని పిలుపు వచ్చినపుడు, లేదా అతడే వెళ్ళి చేరినపుడు,

4. అతని సమ్మతిపై మరో పనికి బదలాయించినపుడు, లేదా ఎన్నికల ద్వారా వచ్చిన పదవిని అతడు స్వీకరించినపుడు,

5. ఆ కర్మాగారమో, సంస్థయో మరోచోటికి తరలించబడు తూన్న సందర్భంలో అచటికి వెళ్ళి పనిచేసేందుకు అతడు నిరాకరించినపుడు,

6. కార్మికుడు, తాను పనిచేస్తూన్న చోటకాక మరొకచోట జైలు శిక్షనుగాని, దిద్దుబాటు పనిశిక్షనుగాని,అతడు తన ఉద్యోగం చేసుకొనేందుకు వీలు మరే శిక్షనుగాని అనుభవిస్తున్నపుడు.

పైన పేర్కొన్న 3,5 సందర్భాల్లో రెండు వారాల తొలగింపు భృతి చెల్లించబడుతుంది. 20వ నిబంధనలో అతిముఖ్య ఏర్పాటొకటుంది. దీని ప్రకారం ఒక ట్రేడ్ యూనియన్ సంస్థ ఉల్లంఘించినా, సమిష్టి ఒప్పందంలోని బాధ్యతను (జిల్లా స్థాయికి తగ్గనిది) ఒక అధికారి కార్మిక చట్టాన్ని నిర్వర్తించడంలో విఫలమైనా, నిరంకుశాధికార పద్ధతులకూ, అధికార జాప్యానికీ ఒడిగట్టినా అతనితో శ్రామిక ఒప్పందాన్ని రద్దు చేయమని అతనిని తన పనినుండి తొలగించమని కోరవచ్చు. మేనేజి మెంటు, అంతకంటె ఉన్నత ట్రేడ్ యూనియన్ సంస్థకు అప్పీలు చేసు కోవచ్చు. దానిది తుదినిర్ణయంగా ఉంటుంది. కార్మికుల సమిష్టి సంస్థఅయిన ట్రేడ్ యూనియన్, కార్మికుల హక్కుల పరిరక్షణలోను, తాముస్వేచ్ఛగా ఎంపికచేసుకున్న బాధ్యతల నిర్వహణను ఖచ్చితంగా అమలు పరచేసందర్భం లోను పూర్తి పైచేయి కలిగి వుంటుందని దీంతో నిరూపణ అవుతోంది.

సోవియట్ యూనియన్‌లో 41 గంటల పనివారం చట్టరీత్యా నిర్ణయమయింది (21 ఎ నిబంధన). ఇదే చట్టంలో ఆర్థిక, తదితర పరిస్థితులు అనుమతిస్తే వారపు పని గంటల్ని మరింత తగ్గించేందుకు వీలు కల్పించబడింది. ఇప్పటికే 16–18 సంవత్సరాల వయస్సు గలవారు వారానికి 36 గంటలు, 15–16 సంవత్సరాల మధ్య వయస్సు గలవారు వారానికి 24 గంటలు మాత్రమే పనిచేయవలసి వుంది. ఆరోగ్యానికి భంగకరమైన పనులలో న్నవారు వారానికి 36 గంటలకంటె ఎక్కువ పనిచేయవక్కరలేదు. ఉపాధ్యాయులు, వైద్యులు, మరికొన్ని తరగతులకు చెందిన పనివారికి ఇంతకంటె తక్కువ పని గంటలు అమలునందున్నాయి.

వారానికి రెండు రోజులు శెలవు, ఐదు రోజుల పని అన్న నిబంధన కర్మాగారాలు, ఆఫీసులో పనిచేసే వారందరికి అమలు జరుగుతూంది. మరీ ప్రత్యేకమయిన సందర్భాలలో కర్మాగారాలు, సంస్థలు ఉత్పత్తి స్వభావాన్నిబట్టి, పని పరిస్థితుల స్వభావాన్నిబట్టి వారానికి ఐదు రోజుల పని అన్న సూత్రం ఆచరణీయం కానపుడు, 6 రోజుల పనివారాన్ని అవలంబించవచ్చు. అయితే 41 పని గంటలున్న వారు రోజుకు 7 గంటలకు, 39 గంటలున్న వారు రోజుకు 6 గంటలకు, 24 గంటలున్నవారు రోజుకు 4 గంటలకు మించి పనిచేయనక్కరలేదు.

శెలవుల ముందురోజున పనివారికి వారానికి 5 రోజులు పని చేసినా, 6 రోజులు పనిచేసినా ఒక గంటపని రాయితీ ఇవ్వబడుతుంది. అయితే తక్కువ పనిగంటలు మాత్రమే పనిచేసే వారికిది వర్తించదు. ఆరు రోజుల పనివారం ప్రాతిపదికపై పనిలోనున్న వారికి వారాంతంలో పని గంటలు 6కు మించవు. 25వ నిబంధన క్రింద అత్యధిక సంఖ్యాక కార్మికుల విషయంలో రాత్రివేళల పనిచేసేవారు పగటి షిఫ్టులో పనిచేసే వారికంటే రోజూ ఒక గంట తక్కువ పనిచేస్తారు. పూర్తికాలంపని చేయని కార్మికులకు వారి ఉత్పత్తి ననుసరించి వారి వాస్తవమైన పని గంటల సంఖ్య కనుగుణంగా ప్రతిఫలం ముడుతుంది. సాధారణంగా ఎక్కువ గంటల పనికి ఆమోదం లభించదు. ప్రత్యేక సందర్భాలలో మాత్రమే యూనియన్ రిపబ్లిక్కుల శాసనాల్లో పేర్కొన్న మేరకు ఎక్కువ పని గంటలకు అనుమతి నిమ్మని మేనేజిమెంటు కోరవచ్చు. కర్మాగార, కార్యాలయ, లేదా స్థానిక ట్రేడ్ యూనియన్ శాఖ అనుమతి పెనే ఎక్కువ గంటల పనికి ఆమోదం తెల్పడం జరుగుతుంది. ఫ్యాక్టరీ కార్మికునికి, లేదా కార్యాలయోద్యోగికి వరుసగా రెండు రోజులపాటు 4 గంటలకంటె ఎక్కువగాని, సంవత్సరానికి 120 గంటలకంటె ఎక్కువగాని అదనపు పని చేసేందుకు అనుమతించబడదు. 5 రోజుల పనివారమున్న వారు రెండు రోజులు, 6 రోజుల పనివారమున్నవారు ఒక్కరోజు విశ్రాంతి గైకొంటారు. అయితే ఎవరికయినా వారంలో 42 గంటలు వరుసగా విశ్రాంతి లభించితీరాలి. శెలవు రోజున పని చేయించడం చట్టరీత్యా నిషిద్ధం. ఆయా కార్మికుల సేవలను, యూనియన్ రిపబ్లిక్కుల చట్టాలలో పేర్కొనబడిన

మేరకు ప్రత్యేక సందర్భాలలో ట్రేడ్ యూనియన్ల సమ్మతిపైనే శెలవు రోజున వినియోగించుకుందుకు వీలుంది. అలాంటి శెలవు రోజున పనిచేసే వారు ఆ తరువాత రెండు వారాల్లోపుగా ఒకరోజు ప్రత్యామ్నాయ శెలవు పొందుతారు. అయితే, ఆ కార్మికుడు, లేదా ఉద్యోగి ఆ సంస్థలో పని చేయడం మానివేసినా, మరేవైనా బలీయమైన కారణాలున్నా శెలవు రోజున పని చేసినందుకు రెట్టింపు పరిహారాన్ని పొందుతాడు.

అన్ని కర్మాగారాది సంస్థలలో సాలీనా 8 ప్రభుత్వ శెలవు దినాలున్నాయి. అవి నూతన సంవత్సరాది, అంతర్జాతీయ మహిళా దినోత్సవం (మార్చి 8), అంతర్జాతీయ కార్మిక సంఘీభావ దినోత్సవం, (మే1, 2), విజయోత్సవదినం (మే 9), రాజ్యాంగచట్ట దినోత్సవం (అక్టోబరు 7), అక్టోబరు సోషలిస్టు మహా విప్లవ దినోత్సవం (నవంబరు 7,8). నూతన సంవత్సరాది తప్ప మిగతావన్నీ శ్రామిక జనకల్యాణంకోసం సాగిన మహా పోరాటానికి సంబంధించిన పర్వదినాలే. సోషలిస్టు దేశాల కవి జాతీయ పర్వదినాలు. సాంకేతిక కారణాలపై ఆపు చేయడానికి వీల్లేని పనులు, శక్తి వనరుల బాగుచేత, సరకుల రవాణావంటి అత్యవసర సర్వీసులు తప్ప మిగతావేవీ ఆ రోజుల్లో పనిచేయవు.

సకలకర్మాగార, కార్యాలయోద్యోగులకు ఉద్యోగ, ఆదాయభద్రతతో పహ సాలుసరి శెలవు హక్కువుంది. మేనేజిమెంటు ట్రేడ్ యూనియన్ కమిటీతో శెలవు కాలానికి సంబంధించిన ఒప్పందాన్ని కుదుర్చుకుంటుంది (ఫ్యాక్టరీ, సంస్థ, శాఖ ట్రేడ్ యూనియన్ కమిటీలతో). సాలుసరి శెలవును వినియోగించుకొనక ముందే ఉద్యోగి తనపదవిని మార్చుకున్నపుడు తప్ప, అలాంటి శెలవుకు బదులుగా డబ్బురూపంలో పరిహారం చెల్లించడం జరుగదు. ఈ శెలవు సంవత్సరానికి 15 దినాల వరకు వుంటుంది. దాన్నింకా పెంచేందుకు యోచిస్తున్నారు. ఈ శెలవు కాలాన్ని సోవియట్ దేశ శాసనాల ననుసరించి నిర్ణయిస్తారు. 18 సంవత్సరాలకంటె తక్కువ వయస్సు గలవారికి నెలరోజులు శెలవుంటుంది. కొన్ని రకాల పనివారికి ప్రత్యేక అదనపు శెలవులుంటాయి. పైనుదహరించిన వాటికి తోడు కొన్ని ప్రత్యేక పరిస్థితుల్లో జీతంలేని శెలవుకూడావాడుకోవచ్చు. కనీస నెలసరి వేతనం నిర్ణయించబడింది. అంతకంటె తక్కువ జీతం ఎవరికీ

వుండదు. పనివారికి ముట్టే ప్రతిఫలం వారి పనియొక్క గుణం, పరిమాణాలపైనే ఆధారపడి వుండాలని రాజ్యాంగచట్టం నిర్దేశిస్తూంది. అంచాత స్త్రీ, పురుష, వయస్సు, జాతి, వరవంశాల ప్రాతిపదికపై వేతనాలలో కోత గాని, యెలాంటి వివక్షతగాని చూపేందుకు వీల్లేదు.

ట్రేడ్ యూనియవ్ల ఆమోదంతో ప్రభుత్వం వేతనాలను నిర్ణయిస్తుంది. ఫ్యాక్టరీ కార్మికుని శ్రమకు కేంద్ర ట్రేడ్ యూనియన్ సంస్థల ఆమోదం పొందిన వేతనరేట్లు ప్రాతిపదికపై ప్రతిఫలం చెల్లించబడుతుంది. నిర్దిష్ట ఉత్పత్తి, కార్మికుల విద్యార్హతలు నైపుణ్యాల ప్రాతిపదికగా ఉద్యోగుల వర్గీకరణను ట్రేడ్ యూనియన్ కమిటీతో ఒప్పందం మేరకు ఆయా సంస్థల మేనేజిమెంటు చేస్తుంది. వేతన రేట్లు, అర్హతలు, నైపుణ్యాల మాన్యువల్ మేరకు వారి వేతన స్కేళ్ళుంటాయి. కార్యాలయోద్యోగుల వేతనాలు వారు నిర్వహించే పదవి, ఉద్యోగి అర్హతల ప్రాతిపదికపై ఆయా సంస్థల మేనేజిమెంటులు నిర్ధారిస్తాయి. ప్రమాద భూయిష్టమైన పనులలోను, పొడి వాతావరణంగల ప్రాంతాలలో పనిచేసేవారు మామూలుకంటె ఎక్కువ వేతనాలు పొందుతారు.

అదనపు పాదార్థిక ప్రోత్సాహకాల నిచ్చేందుకై బోనసు విధానం ప్రవేశపెట్టవచ్చు. ఈ విధానంద్వారా పనివారు ఉత్పత్తి ప్రణాళికలను పరిపూర్తిగావించి, అధిగమించేందుకు మరింత ఉత్పత్తి సామర్థ్యాన్ని,లాభదాయకతను సాధించి, శ్రామికోత్పాదకతను పెంపొందించి, వనరులను పొదుపుచేసి, నాణ్యతను మెరుగు పరచేందుకు ప్రయత్నం జరుగుతూంది. యాజమాన్యం బోనసురేట్లు, దాని చెల్లింపు నిబంధనలు రూపొందించి, ట్రేడ్ యూనియన్ కమిటీ సమ్మతితో ప్రకటిస్తుంది. ఆయా కర్మాగారాలు, సంస్థలు సాధించిన వార్షిక ఫలితాలు ఆధారంగా యితర అదనపు చెల్లింపులు కూడా వుంటాయి. ఇందుకు అవసరమైన నిధులు ఆయా సంస్థల లాభాల నుండి మిగిల్చిన వాటా నుండి సమకూరుతాయి. ప్రతి కార్మికుడు, ఉద్యోగి తన పనిగుణం. ఆ సంస్థలో అతడు పనిచేసిన మొత్తం కాలం ప్రాతిపదికగా యిట్టి అదనపు చెల్లింపులను పొందుతాడు. ప్రామాణిక ఉత్పత్తి పరిమాణాలు, ప్రామాణిక నిర్వహణ పరిమాణాలు, పనివారల సంఖ్య ట్రేడ్ యూనియన్ కమిటీతో ఒప్పందంమేరకు నిర్ణయించబడతాయి.

కాలప్రమాణ ప్రాతిపదికపై వేతనాలు పొందేవారు మొదటి రెండుగంటల అదనపు పనికి తమ మామూలు వేతనంపై 150 శాతం, ఆటు తర్వాత రెట్టింపు ప్రతిఫలం పొందుతారు. ఉత్పత్తి పరిమాణాల ప్రాతిపదికపై వేతనాలు పొందేవారు, సోవియట్ దేశ శాసనాలలో నిర్ణయించిన మేరకు అదనపు ప్రతిఫలం పొందుతారు. వేతనాలు, రేట్లు, యితర వివరాలకు సంబంధించి కార్మిక శాసన మౌలిక సూత్రాలలో యితర నిబంధనలు కూడా వున్నాయి. 45 వ నిబంధన మేరకు వేతనాలు ప్రతి 15 రోజుల కొకసారి చెల్లించవలసి వుంటుంది. అయితే, యూనియన్ రిపబ్లిక్కుల శాసనాలలో కొన్ని రకాలకు చెందిన ఉద్యోగులకు ప్రత్యేక వేతన చెల్లింపు కాలపరిమితులను నిర్ధారించవచ్చు. ఒక కార్మికుడు, లేదా కార్యాలయోద్యోగి ప్రభుత్వ పదవికి, ట్రేడ్ యూనియన్, పార్టీలేదా సహకార ప్రజా సంస్థ కార్యనిర్వాహక పదవికి యెన్నుకోబడి తన పనికి హాజరవడానికి వీల్లేని సందర్భంలో, అతడు తిరిగి వచ్చాక తన పూర్వపు పనిని పొందే హక్కు వుంది. అయితే, ఆ పనిలో మరొకరు చేరిపోయివుంటే, అతనికి అదే సంస్థలోగాని, అతని అంగీకారంపై మరో సంస్థలోగాని అందుకు సమాన హోదాగల పనిని యిచ్చితీరాలి. పని పురమాయింపుపై గాని, కొత్త పనిలో చేరేందుకుగాని వేరే ప్రాంతానికి వెళ్ళేవారికి అందుకయ్యే ఖర్చులు పొందే హక్కు కల్పించ బడింది. కార్మికుడు పొరపాటు వల్ల సంస్థకు చేకూరిన నష్టాలకు అతడే బాధ్యత వహించవలసి వుంటుంది. అయితే అందుకై అతని అంగీకారం మేరకు తగ్గింపులు అతని నెలసరి వేతనంలో ⅓ వంతుకు మించరాదు. ఇదికూడా సోవియట్ దేశ శాసనంలో విధించిన నిబంధనల మేరకే చేయవలసి వుంటుంది. కార్మికుడు యీ విషయంలో ఒప్పుందానికి రాకపోతే ఆ సంస్థ, ఆ నగర,జిల్లా ప్రజాకోర్టులో దావా వేయవలసి వుంటుంది. ( ని. 49 ). చట్టంలో నిర్దేశించిన మేరకే వేతనంలో కోతలు అనుమతించ బడతాయి. చట్టం అనుమతించే కొన్ని ప్రత్యేక సందర్భాలలో దక్క ఇలాంటి కోతలు 20 శాతానికి మించరాదు. ఇలాంటి ప్రత్యేక సందర్భాలలోకూడా, ఉద్యోగికి ఒకటికంటె యెక్కువ కోర్టులలో సోవియట్ శాసనాల ప్రకారం వ్యతిరేక తీర్పులు వచ్చినా 50 శాతానికంటె యెక్కువ కోత విధించేందు కవకాశంలేదు. అయితే నేరాలకు శిక్షలనుభవించే

వారి ఆదాయాలపై విధించే కోతలు యీ నిబంధన క్రిందికిరావు. తొలగింపు వేతనం, తదితర భత్యాలు ఏ పరిస్థితులలోను తగ్గించేందుకు వీల్లేదు.

పైన పేర్కొన్న నిబంధనలు కార్మికుల, ఉద్యోగుల ప్రయోజనాల పరిరక్షణకు చట్టం గైకొన్న విశేష శ్రద్ధను సూచిస్తాయి. చట్టపరమైన యీ రక్షణలతోబాటు ప్రధానమైన అన్ని విషయాల్లోను స్థానిక ట్రేడ్ యూనియన్ కమిటీ వారికి ప్రత్యేక విలువ వుంటుంది. కార్మికులచే యెన్నుకోబడిన ట్రేడ్ యూనియన్ నాయకులు కార్మిక ప్రయోజనాలకే అత్యధిక ప్రాధాన్యత యిస్తారనడంలో యెలాంటి సందేహమూ వుండ నక్కరలేదు. కార్మికులను వేధించడం, తొలగించడం వంటి కఠిన చర్యను నిరోధించే అత్యంత ప్రజాతంత్రయుత వ్యవస్థ యిదే.

కార్మికుల హక్కులను కాపాడేందుకు విశేష శ్రద్ధ గైకొన్న సోవియట్ కార్మిక శాసనాలు, శ్రామిక క్రమశిక్షణను పరిరక్షించే చర్యలను నిర్దేశించడం ద్వారా యీ లక్ష్యాన్ని మరింత ముందుకు గొనిపోతోంది. శ్రామిక క్రమశిక్షణ ఉత్పత్తిని పటుతరంగా వ్యవస్థీకరించి, అభివృద్ధి పరచేందుకు దోహదం చేస్తుంది. తద్వారా నిర్మాణ పథకాలు సకాలంలో పూర్తవుతాయి. ఇందు వల్ల అంతిమంగా లాభపడేది కార్మికులే. సోషలిస్టు రాజ్యంలో కార్మికుల శ్రమను దోచుకొని, దేశ సంపదను స్వాయత్త మొనర్చుకునే వ్యక్తిగాని, వర్గంగాని లేదు. అంచేత చిత్తశుద్ధితో నిజాయితీగా పనిచేయడం, శ్రామిక క్రమశిక్షణను పాటించి, మేనేజిమెంటు అప్పగించే పనులను వడివడిగా సకాలంలో పరిపూర్తి చేయడం, శ్రమ ఉత్పాదకతను పెంపొందించి, సరకుల నాణ్యాన్ని మెరుగు పరచటం సాంకేతిక ఉత్పత్తి ప్రమాణాలను పూర్తిగా అమలుపర్చడం, రక్షణ, సంక్షేమ నిబంధనలను పాటించడం, పారిశ్రామిక పరిశుభ్రతకు సంబంధించిన నిబంధనలను తు. చ. తప్పక అమలుపర్చడం, సోషలిస్టు ఆస్తిని కాపాడి, వదిలపర్చడం ప్రతి కార్మికుని, ఉద్యోగి విధియని వేరే చెప్ప నక్కరలేదు (నిబంధన 51). అయితే శ్రామిక క్రమశిక్షణ, పనియెడల చిత్తశుద్ధి వీలయినంత వరకు ప్రోత్సాహకాల నివ్వడం ద్వారాను, నచ్చ చెప్పడం ద్వారాను ప్రోత్సహించడం జరుగుతుంది. ఎవరైనా ఉద్యోగి వ్యక్తిగతంగా నిజాయితీ లోపించినవాడైనపుడు మాత్రమే అతనికి వ్యతి

రేకంగా క్రమశిక్షణా చర్యలు, ప్రజా ప త్తిడి తీసుకురావడం జరుగుతుంది. అంతరంగిక శ్రామిక నిబంధనల ద్వారా దైనందిన శ్రామిక క్రమ శిక్షణ అమలు జరుగుతోంది. ఈ నిబంధనలు దేశవ్యాప్త ప్రామాణిక నిబంధనల ప్రాతిపదికపై, మేనేజిమెంటుకి, ట్రేడ్ యూనియన్ కమిటీకి మధ్య జరిగిన ఒప్పందం ద్వారా నిర్ధారించ బడతాయి. బహిరంగమైన పొగడ్త, బోనస్ ఇవ్వడం, విలువైన బహుమతులు, గౌరవ పట్టాలు ప్రదానం చేయడం, మాన్యుల జాబితాలో పేరు జేర్చడం వంటి చర్యలు, తన విధులను ఆదర్శ ప్రాయంగా నిర్వర్తించడంలోను, సోషలిస్టు పోటీలో ఉత్తమ విజయాలు సాధించడంలోను, శ్రామిక ఉత్పాదకతను పెంపొం దించడంలోను. ఉత్పత్తుల నాణ్యతను అభివృద్ధి చేయడంలోను, పనికి అలాగే ఇతర శ్రామిక విజయాలకు సంబంధించి నూతన ఆవిష్కరణలను చేయడంలోను, సుదీర్ఘమైన, అత్యుత్తమమైన సేవలు చేయడంలోను, అంతరంగిక, శ్రామిక నిబంధనలను పాటించడంలోను కార్మికునికి ఉత్తమ ప్రోత్సాహకాలుగా నిరూపిత మయ్యాయి. ఈ చర్యలన్నింటిని ట్రేడ్ యూనియన్ కమిటీ సమ్మతితో మేనేజిమెంట్ గైకొంటుంది. తమపనిని చిత్తశుద్ధి,నిజాయితీలతో నిర్వర్తించిన వారికి,తామిచ్చిన వాగ్దానాలను, తమవంతు కర్తవ్యాలను నిశ్శేషంగా పూర్తి చేసిన వారికి సామాజిక సంక్షేమం, సాంస్కృతిక సేవలు, గృహవసతి (విశ్రాంతి కేంద్రాలలో వసతి, గృహ సౌకర్యాల విస్తృతి) వగైరాలువంటి వానిలో ప్రత్యేక హక్కులు లభిసాయి. నిజాయితీగా పనిచేసిన ఉద్యోగులకు ప్రమోషన్ల విషయంలో ప్రత్యేకత ఉంటుంది. శ్రామికరంగంలో అత్యద్భుత విజయాలు సాధించిన వారికి బిరుదులు, బహుమతులు, డిప్లమోలు, బ్యాడ్జీలు మున్నగునవి యివ్వమని సిఫార్సు చేయడం జరుగుతుంది. అలాంటి వారికి "వృత్తిలో అత్యుత్తమ శ్రామికుడు" అను బిరుదుతో సహా అనేక గౌరవ బిరుదులు యివ్వమని సిఫార్సు చేయడం జరుగుతుంది. శ్రామిక క్రమశిక్షణను ఉల్లంఘించినం దుకుగాను జరిమానాలు విధించే అధికారం మేనేజిమెంటుకిచ్చే నిబంధనలు కూడా చట్టంలో వున్నాయి. ఇలాంటి శిక్షలలో హెచ్చరిక, మందలింపు, తీవ్రమైన మందలింపు, మూడు నెలలపాటు తక్కువ పదవికి దించివేయడం వంటివే గాక, తగు కారణాలు లేకుండా నిరంతరం పనిలో వైఫల్యం

చూపే వారిని, శ్రామిక ఒప్పందంలోను, ఆంతరంగిక శ్రామిక నిబంధనల తోను సూచించిన మేరకు తమ విధి నిర్వహణలో పూర్తిగా విఫలమైన వారిని, తగు కారణం లేకుండా పనికి గైరుహాజరవుతున్నందుకు గాను గతంలో శిక్షింపబడివున్న ఉద్యోగిని (తాగుడు మత్తులో పనికి రావడంతో సహా) పనినుండి తీసివేయవచ్చు. శ్రామిక క్రమశిక్షణా బాధ్యతలపైన శాసనాలను, క్రమశిక్షణపై నిబంధనలు, ఉత్తర్వులను క్రమపద్ధతిలో జారీ చేసి, ఇతర రకాలకు చెందిన కార్మికులకు, ఉద్యోగులకు ఇతర విధాలైన జరిమానాలు విధించవచ్చు. శ్రామిక క్రమశిక్షణను ఉల్లంఘించిన కేసును మేనేజిమెంటు వారు కామ్రేడ్ల కోర్టుకు (తోటి ఉద్యోగులతో కూడిన కోర్టు అన్నమాట) పంపవచ్చు. లేదా, మరో ప్రజా సంస్థకు విచారణకై పంపి, తానే జరిమానా విధించకుండా ఉండవచ్చు. ఈ విధంగా నచ్చ చెప్పడం ద్వారాను, తోటి కార్మికుల విమర్శ, వారిచే బిట్టబయలు చేయడం ద్వారా వ్యక్తిని సరైన దారిలోకి తేవడం జరుగుతుంది.

శ్రామిక సంబంధాలలో అతిముఖ్యమైన భాగం కార్మికులకు కల్పించ బడే రక్షణ. 57 వ నిబంధన ప్రకారం ఆరోగ్యవంతమైన పని పరిస్థితులు శ్రామిక భద్రత కల్పించడం మేనేజిమెంటు యొక్క ప్రధాన బాధ్యత. పారిశ్రామిక ప్రమాదాలను నివారించేందుకై ఆధునిక రక్షణా పద్ధతులను ప్రవేశపెట్టడం, వృత్తిపరమైన వ్యాధులు కార్మికులకు, ఉద్యోగులకు సోక కుండా పారిశుధ్య ఆరోగ్య నిర్మాణ సంబంధమైన ఏర్పాట్లను గావించడం కూడా మేనేజిమెంటు బాధ్యతగా ఉంటుంది. పారిశ్రామిక సంస్థల భవనాలు, పరికరాలు, సౌకర్యాలు, వాటితోపాటు సాంకేతిక ఉత్పత్తి పద్ధతులు ఆరోగ్యవంతమైన పని పరిస్థితులకు, శ్రామిక రక్షణ అవసరాలకు తగి నట్లుగా ఉండాలి. పారిశ్రామిక సంస్థల భవనాల, ఇతర వసతుల రూప కల్పన, నిర్మాణము, వానిని ఉంచే తీరు, శ్రామిక రక్షణ ప్రమాణాలకు, నిబంధనలకు పూర్తి అనుగుణంగా ఉండాలి. శ్రామిక రక్షణ అవసరాలను పూర్తిగా దృష్టిలో ఉంచుకొని నిర్మించబడని ఏ కొత్త పారిశ్రామిక సంస్థ అయిన అసలు పనిచేసేందుకే అనుమతించబడదు. ఏ పారిశ్రామిక సంస్థ అయినా పని మొదలుపెట్టేముందు ప్రభుత్వ, ఆరోగ్య, సాంకేతిక పర్య వేక్షక బృందాల ప్రమాణాలకు నిలబడగలగాలి. ట్రేడ్ యూనియన్ల

సాంకేతిక పరీక్షక దళము, అసలు ఆ పారిశ్రామిక సంస్థకు సంబంధించిన ట్రేడ్ యూనియన్ కమిటీ పూర్తిగా సంతృప్తి చెంది అనుమతించనిదే పని ప్రారంభించజాలవు. సోవియట్ యూనియన్ మంత్రి మండలి, ఇతర ప్రభుత్వ సంస్థలు, అఖిల యూనియన్ ట్రేడ్ యూనియన్‌ల కేంద్ర సమితి సమిష్టిగా ఆమోదించి, జారీ చేసిన శ్రామిక రక్షణ నిబంధనలను, లేదా అటు తర్వాత ట్రేడ్ యూనియన్‌ల కేంద్ర కౌన్సిల్ జారీ చేసే నిబంధనలను మేనేజిమెంటు విధిగా పాటించవలసి ఉంటుంది ఏ రంగానికైనా ఇలాంటి నిబంధనలు, ప్రమాణాలు అందుకు సంబంధించిన ట్రేడ్ యూనియన్ కేంద్ర కమిటీతో సమిష్టిగా గాని, లేదా దాని ఒప్పుదలతో గాని ఆయా మంత్రిత్వ శాఖలు, డిపార్టుమెంటులు జారీ చేయవచ్చు. ప్రామాణిక నిబంధనలు అవసరమైన వాటిని నిర్దేశించక పోయినప్పటికీ, మేనేజిమెంటు వారు ట్రేడ్ యూనియన్ కమిటీతో ఒప్పందం కుదుర్చుకొని, కార్మికులకు పూర్తి భద్రత కల్పించే పరిస్థితులను ఏర్పరచాలి. అంతేగాక కార్మికులకు, ఉద్యోగులకు రక్షణ పద్ధతులు, పారిశ్రామిక ఆరోగ్య నిబంధనలు, అగ్నిప్రమాద నివారణా చర్యలు తదితర శ్రామిక రక్షణ నిబంధనలపై తగు విధమైన శిక్షణ నివ్వవలసిన బాధ్యత మేనేజిమెంటుకున్నది. శ్రామిక రక్షణ నిబంధనల గురించి తగు శిక్షణ యివ్వబడుతున్నదీ లేనిదీ నిరంతర పర్యవేక్షణ జరుపవలసిన బాధ్యత కూడా యాజమాన్యానికుంది. ఇట్టి శ్రామిక రక్షణ సూచనలను కార్మికులు, ఉద్యోగులు తప్పక పాటించాలి. పనిముట్లు తదితర యంత్రాలను ఉపయోగించే సందర్భంగా వారు తప్పక శ్రామిక రక్షణ పరికరాలను వాడాలి. నిపుణులు సూచించిన నిబంధనలను, నిర్దేశాలను తప్పక పాటించాలి. శ్రామిక రక్షణ చర్యలన్నింటికీ ప్రత్యేక నిధులు, వనరులు కేటాయించబడతాయి. ఈ నిధులను, వనరులను ఏ యితర ప్రయోజనాలకైనా వినియోగించడాన్ని చట్టం నిషేధిస్తూంది. ఈ నిధులు, వనరుల వినియోగానికి సంబంధించిన విధానాన్ని సమిష్టి ఒప్పందాలలోను, ప్రత్యేక శ్రామికరక్షణ ఒప్పందాలలోను నిర్దేశించవలసి ఉన్నది. ఇట్టి ఒప్పందాలు ఆయా పరిశ్రమల మేనేజిమెంటుకి, ట్రేడ్ యూనియన్‌లకు మధ్య జరుగుతాయి. ఆరోగ్యానికి భంగకరమైన పనులలోను అసాధారణపరిస్థితులలోను పనిచేసే వారికి మేనే

జిమెంటువారు ఉచితంగా అనువైన ప్రత్యేక దుస్తులను, ఇతర వ్యక్తిగత రక్షణ సాధనాలను సరఫరా చేయాలి. అలాగే ప్రమాదకరమైన ఫలితాలను కలిగించే పదార్థాలను ఉపయోగించి పనిచేయవలసిన వారికి, వాటి వలన వ్యాధులు సోకకుండా చేయగల నివారక ఔషధాలను సరఫరా చేయడం కూడా వారి విధి. అలాగే ఆరోగ్యానికి భంగకరమైన పనులు చేసే కార్మికులకు పాలు, తదితర ప్రత్యేక ఆహార పదార్థాలు కూడా మేనేజిమెంటు సరఫరా చేయాలి. అలాంటి పనులలో నున్న కార్మికులకు తరచుగా వైద్య పరీక్షలు జరిపించి, వారు పని చేయగల స్థితిలో ఉన్నదీ లేనిదీ తెల్సుకోవాలి. అలాంటి వ్యాధులు ఇతరులకు సోకకుండా తగు జాగ్రత్తలు తీసుకోవాలి. ఒక కార్మికుడి, లేదా ఉద్యోగి ఆరోగ్య పరిసితి క్షీణించినపుడు వైద్య నిపుణుల సలహా మేరకు అతని సమ్మతిపై మరో సులభ తరమైన పనికి బదిలీ చేయాలి. కార్మికుల ఆరోగ్యానికి భంగకరమైన చెడు ఫలితాలన్నిటికి ఆ సంస్థ మేనేజిమెంటే ఆర్థికంగా బాధ్యత వహించవలసి వుంటుంది. ఇలాంటి సందర్భాల్లో నిర్ణీత ప్రాతిపదికపై వేతనాల చెల్లింపుపై చట్టబద్ధమైన నిబంధనలున్నాయి.

నవ సోవియట్ రాజ్యాంగ చట్టపు 35 వ నిబంధన స్త్రీ పురుష లిద్దరికీ సమాన హక్కులను కల్పిస్తోంది. కార్మిక శాసనం మౌలిక సూత్రాలు మహిళా కార్మికుల సంక్షేమానికై ప్రత్యేక సౌకర్యాలను ఏర్పరచాయి. వారిని కష్టభరితమైన పనులలోను, అనారోగ్యకర పని పరిస్థితులున్న సందర్భాల్లోను, శారీరకేతర, పారిశుధ్య, జనసేవా విభాగాలలో తప్ప యే యితర భూగర్భ శ్రామిక కార్యకలాపాలలోను వినియోగించరాదు. మహిళలను రాత్రివేళ పనులలో-ప్రత్యేక సందర్భాలలోతప్ప, అదీ తాత్కాలికంగానే-వినియోగించరాదు. ఎట్టి పరిస్థితుల్లోను గర్భవతుల చేత, సంవత్సరంలోపు వయస్సుగల పిల్లల తల్లులచేత రాత్రివేళల్లోను, అదనపు పని గంటలలోను, సెలవు రోజుల్లోను పనిచేయించడమూ, వేరే పనులకోసం యితర ప్రాంతాలకు పంపడమూ అనుమతించబడదు. ఒకటి మొదలు ఎనిమిదేళ్ళ వయస్సుగల పిల్లల తల్లుల విషయంలో వారి సమ్మతితో అదనపు పనిగంటలలోను, ఇతర పనులలోను వినియోగించే అవకాశ ముంది. గర్భవతులు, పాలిచ్చే తల్లులు, సంవత్సరంలోపు వయసు గల

పిల్లల తల్లులు ఆ మేరకు సర్టిఫికేట్ దాఖలు చేస్తే, వారిని సులభతరమైన పనులకు బదిలీ చేస్తారు. అయితే వారు తమ పూర్వపు సగటు వేతనాన్నే పొందుతారు. పిల్లలు పాలు మానేసేంతవరకు, లేదా వారికి సంవత్సరం నిండేవరకు యీ సౌకర్యం కొనసాగుతుంది. సోవియట్ దేశ మహిళ లందరికి ప్రసవానికి ముందు 56 రోజులు, ప్రసవానంతరం 56 రోజులు ప్రసూతి శెలవు లభిస్తుంది. ఈ కాలంలో వారి జీతాలు ప్రభుత్వ సామాజిక భీమా నిధులనుండి చెల్లించబడతాయి. ప్రసవం గడ్డుగానున్నా, కవలలు పుట్టినా ప్రసవానంతర శెలవు కాలం 70 రోజులకు పొడిగించ బడుతుంది. అంతేగాక బిడ్డకు యేడాది నిండేదాక జీతం నష్టంపై తల్లికి శెలవు మంజూరు చేయవచ్చు.మామూలు భోజన విశ్రాంతి సమయాలకు తోడు,సంవత్సరంలోపు వయసుగల పిల్లలున్నతల్లులకు పిల్లలకుపాలిచ్చేందుకు అదనపు విశ్రాంతి సమయాలు కల్పించబడతాయి. ప్రతి మూడు గంటలకు కనీసం 30 నిమిషాలకు తక్కువ లేకుండా వుంటుందా అదనపు విశ్రాంతి. ఇట్టి విశ్రాంతి మామూలు పనికాలం క్రిందనే లెక్కించి వేతనాలు చెల్లిస్తారు. గర్భవతులకు, పాలిచ్చే తల్లులకు పనియివ్వ నిరాకరించడంగాని, ఆమె జీత నాతాల్లో కోత విధించడంగాని చట్టరీత్యా నిషిద్ధం. గర్భవతిని, పాలిచ్చే తల్లిని ఆ సంస్థ పూర్తిగా మూసివేయబడిన సందర్భంలో తప్ప పనినుండి తొలగించేందుకు వీలేలేదు. అలాంటి సందర్భంలో తప్పక ప్రత్యామ్నాయ ఉద్యోగ వసతి చూపి తీరాలి.

13–19 యేళ్ళ మధ్య వయస్సు వారికి పని కల్పించే విషయంలో కొన్ని ప్రత్యేక నిబంధనలున్నాయి. సాధారణంగా 16 యేళ్ళలోపు వారిని ఏ పనిలోను నియమించరాదు. అసాధారణ పరిస్థితులలో 15 యేళ్ళు నిండిన వారిని ట్రేడ్ యూనియన్ కమిటీ అనుమతిపై పనిలో నియమించవచ్చు. కష్టభరితమైన పనులలోను, అనారోగ్యకరమైన, ప్రమాద భూయిష్టమైన పని పరిస్థితులున్న సందర్భాల్లోను, భూగర్భంలో పని చేయవలసిన పరిస్థితుల్లోను 18 సంవత్సరాలలోపు వారిని పనిలో నియమించరాదు. 18 యేళ్ళకు లోపున్న వారిని వైద్య పరీక్షానంతరమే పనిలో చేర్చుకునే వీలుంటుంది. అటు తర్వాత కూడా వారికి తరచు వైద్య పరీక్షలు జరుగుతాయి. వారి పని గంటలు తక్కువైనా, వారి వేతనాలు మాత్రం ఇతరులతో

సమానంగా వుంటాయి. పని పరిమాణాన్నిబట్టి వేతనాలు చెల్లించే సంద ర్భంలో కూడా వారికి అదనపు ఆదాయం లభిస్తుంది. వారిని రాత్రివేళ లందు, అదనపు పనిగంటల్లోను పనికి నియమించరాదు. వారికి వేసవిలో గాని, వారు కోరినప్పుడుగాని వార్షిక శెలవులు మంజూరవుతాయి. ప్రతి కర్మాగారము, సంస్థ 18 సంవత్సరాలలోపు వారికి, వారు సాధారణ విద్య, వృత్తి. సాంకేతిక విద్య ముగించాకగాని, ఇతర విధంగాగాని పనికి, పారిశ్రామిక శిక్షణకు వీలుగా ఒక నిర్దిష్ట శాతం ఖాళీలను అట్టిపెట్టాలని ఆదేశించబడింది వృత్తి, సాంకేతిక విద్యలను పూర్తి చేసిన వారికి, ఉన్నత విద్యా సంస్థలనుండి, ప్రత్యేక సెకండరీ పాఠశాలల నుండి పట్ట భద్రులయిన వారికి వారి వృత్తి విద్యా శిక్షణ, అర్హతలకు తగిన విధంగా పనులు చూపబడాలని 81 వ నిబంధన ఆదేశిస్తోంది. 18 యేళ్ళలోపు పని వారిని తొలగించాలంటే అనేక ఆంక్షలున్నాయి. వారి విషయంలో కూడా తొలగింపుకు సంబంధించిన సాధారణ నియమాలన్నీ వర్తిసాయి. అంతే గాక జిల్లా (నగర) గని పనివారల బోర్డు అంగీకారం లేనిదే వారిని తొల గించరాదు కూడా. కొన్ని ప్రత్యేక సందర్భాలలో ప్రత్యామ్నాయ వృత్తి చూపబడినపుడే అట్టి తొలగింపుకు అవకాశం వుంటుంది.

కార్మిక శాసనాల మౌలిక సూత్రాలలోని మరొక ముఖ్యాంశమేమి టంటే పని చేస్తూనే చదువు సాగించే వారికి కొన్ని ప్రత్యేక సౌకర్యాలు కల్పించడం. వృత్తి విద్యా శిక్షణ పొందేందుకు, తమ అర్హతలను పెంపొం దించుకుందుకు ఫ్యాక్టరీ కార్మికులకు, కార్యాలయోద్యోగులకు, ముఖ్యంగా యువకులకు పారిశ్రామిక సంస్థల మేనేజిమెంటులు వ్యక్తిగత, సామూహిక పారిశ్రామిక శిక్షణా తరగతులు తమ సొంత ఖర్చుపై నిర్వహిస్తాయి. పనిలో వుంటూనే విద్యా సంస్థలలో పారిశ్రామిక శిక్షణ, లేదా విద్యా భ్యాసం సాగించే వారికి తమ పనిని, విద్యను మేళవించేందుకు వీలుగా కొన్ని ప్రత్యేక సౌకర్యాలు కల్పించబడతాయి. ఒక కార్మికుణ్ణి, లేదా ఉద్యోగిని పై పదవికి సిఫార్సు చేసేప్పుడు అతని పారిశ్రామిక శిక్షణ, సాధారణ, వృత్తి విద్యలలో అతని ప్రగతి, ఉన్నత, లేదా ప్రత్యేక సెకండరీ విద్యలనతడు పూర్తి చేసిన వైనం పరిగణనలోకి తీసుకుని తీరాలి (నిబంధన 83). తమ మామూలు పనితోబాటు సాధారణ, లేదా

వృత్తి విద్యా సంస్థలలో అధ్యయనం కొనసాగించే వారికి వారంమీద, లేదా ప్రతిరోజూ తక్కువ పనిగంటలుంటాయి. అయితే వారి జీత భత్యాల్లో యే విధమైన కోతావుండదు, ఇంకా ఇతర సౌకర్యాలు కూడా లభిస్తాయి. ఉన్నత విద్యా సంస్థలు, లేదా ప్రత్యేక సెకండరీ విద్యా సంస్థల ప్రవేశ పరీక్షలకు కూర్చునే వారికి జీతంలేని సెలవు మంజూరు చేయబడు తుంది. ఉన్నత, ప్రత్యేక సెకండరీ విద్యాలయాలలో సాయంకాల తరగ తులకు హాజరయ్యే వారికి లేదా ఉత్తర ప్రత్యుత్తరాల ద్వారా విద్యాభ్యాసం చేసేవారికి, విద్యాభ్యాస సెలవు నిబంధనల క్రింద జీతంతో కూడిన సెలవు ఇవ్వాలి, ఇంకా ఇతర సౌకర్యాలు కూడా కల్పించాలి. ఈ నిబంధనలను పరి శీలిస్తే, జీవితంలో ఉన్నత స్థాయికి ఎదగాలని, ఉత్తమ విజ్ఞానాన్ని సాధిం చాలని కోరేవారికి సోవియట్ శాసనాలు యెంత తోడ్పాటునిస్తాయో తేట తెల్లమవుతుంది. సోషలిజానికి మానవతా లక్షణాలే లేవని నీతి జాతిలేని అబద్ధపు ప్రచారాన్ని సాగించే వారి అసలురంగు అర్థమవుతుంది.

సోవియట్ దేశ కార్మిక శాసనం, కార్మిక శాసనాల మౌలిక సూత్రాలలో వెల్లడయిన విధంగా కార్మిక వివాదాల పరిష్కారానికి తన సొంత యంత్రాంగాన్ని ఏర్పాటు చేసింది. అలాంటి వివాదాల పరిష్కార యంత్రాంగం క్రింది రూపాల్లో వుండవచ్చు.

1. కార్మిక వివాదాల ఉపసంఘం: ఇది కర్మాగారాది సంస్థల స్థాయిలో యేర్పడుతుంది. ఈ ఉపసంఘంలో, మేనేజిమెంటుకి ట్రేడ్ యూనియన్ కమిటీకి సమాన ప్రాతినిధ్యం వుంటుంది.

2. ఫ్యాక్టరీ, కార్మిక, స్థానికశాఖ ట్రేడ్ యూనియన్ కమిటీ (దీన్నే ట్రేడ్ యూనియన్ కమిటీగా యీ రచన అంతటా పేర్కొనడం జరిగింది)

3. జిల్లా (నగర) ప్రజాకోర్టులు.

94వ నిబంధనలో పేర్కొన్న విధంగా ఉన్నతాధికార సంస్థలే పరిష్కరించాల్సిన వివాదాలు కొన్ని వున్నాయి. ఒక ఉద్యోగికి అతడు పని చేసే సంస్థ మేనేజిమెంటుకి మధ్య వివాదం తలెత్తినపుడు కార్మిక వివాదాల ఉపసంఘమే దాన్ని విచారించాలి. అయితే, కొన్ని ప్రత్యేక స్వభావంగల వివాదాలను నేరుగా జిల్లా (నగర) ప్రజా కోర్టులకో,

చట్టంలో పేర్కొన్న మరో ఉన్నతాధికార సంస్థకో తీసుకెళ్ళాలి. కార్మిక వివాదాల ఉపసంఘం తన ముందున్న వివాదానికి సంబంధించిన ఇరుపక్షాల మధ్య అంగీకారం కుదర్చడం ద్వారా పరిష్కరిస్తుంది. ఈ విధంగా యీ ఉపసంఘాన్ని ప్రధానంగా రాజీ సంప్రదింపుల యంత్రాంగంగా పేర్కొనవచ్చు. ఇక్కడ గమనార్హమైన ముఖ్య విషయమేమిటంటే, యీ యంత్రాంగంలో కార్మికులు, మేనేజిమెంటుతో సమాన ప్రాతినిధ్యం కలిగి వుంటారు.

కార్మిక వివాదాల ఉపసంఘం వివాదాన్ని పరిష్కరించడంలో విఫలమయినా, కార్మికుడు, లేదా ఉద్యోగి ఉపసంఘం నిర్ణయంపట్ల అసంతృప్తి చెంది, అప్పీలు చేసినా, ట్రేడ్ యూనియన్ కమిటీ ఆ వివాదాన్ని పరిశీలించి, ఆ నిర్ణయాన్నే ఆమోదించవచ్చు, లేదా దాన్ని నిరాకరించి, తన స్వంత తీర్పు నివ్వవచ్చు. అమలులో వున్న చట్టాలకు ఉపసంఘం నిర్ణయం వ్యతిరేకంగావున్న సందర్భంలో ట్రేడ్ యూనియన్ కమిటీ, తాను స్వయంగా జోక్యం కలిగించుకునిగాని, పబ్లిక్ ప్రాసిక్యూటరు సూచనపైగాని ఆ నిర్ణయాన్ని చట్టవిరుద్ధమైనదిగా ప్రకటించి, రద్దు చేయవచ్చు. వివాదం పరస్పర సంప్రతింపుల ద్వారా పరిష్కారం కాకపోతే ట్రేడ్ యూనియన్ కమిటీ, మేనేజిమెంటుకంటె ఉన్నతమైన సంస్థగా పరిగణించబడుతుందని దీన్నిబట్టి విదితమవుతూంది.

జిల్లా (నగర) ప్రజా కోర్టుల విచారణాధికారం యీ క్రింది విషయాలకు వర్తిస్తుంది:

1. కార్మికులు ట్రేడ్ యూనియన్ కమిటీ నిర్ణయంతో విభేదించి అపీలు చేసుకున్నప్పుడుగాని, ట్రేడ్ యూనియన్ కమిటీ నిర్ణయం చట్టవిరుద్ధమైనదని మేనేజిమెంటు భావించి అపీలుకెళ్ళినప్పుడు గాని అది విచారణ జరుపుతుంది.

2. ట్రేడ్ యూనియన్ కార్యకర్త, సంస్థ మేనేజరులతో కూడిన కార్మిక వివాదాల ఉపసంఘం తీర్పు యిచ్చినపుడు కార్మికులు నేరుగా ప్రజాకోర్టుకే వెళ్ళవచ్చు. లేదా, ఉపసంఘం వారు కార్మికునికి, మేనేజిమెంటుకి మధ్య ఒప్పందం కుదర్చడంలో విఫలమైనపుడు, లేదా, యేదేని కర్మాగారంలో ట్రేడ్ యూనియన్ కమిటీ లేనపుడు నేరుగా కోర్టు జోక్యం కోరవచ్చు.

పైన పేర్కొన్న సందర్భాల్లోనేగాక, కోర్టు నేరుగా యిట్టి కార్మిక వివాదాలను విచారించవచ్చు. అట్టి సందర్భాల్లో కార్మిక వివాదాల ఉప సంఘానికి ట్రేడ్ యూనియన్ కమిటీకి అట్టి వివాదాన్ని అప్పగించ కుండా తానే నేరుగా చేబట్టవచ్చు.

1. మేనేజిమెంటు చొరవపై కార్మికుణ్ణితొలగించిన సందర్భంలో, అతణ్ని పనిలో తిరిగి చేర్చుకొమ్మని కోరే విషయంగూర్చి కోర్టుకు నేరుగా పోవచ్చు. అయితే 94వ నిబంధన క్రిందికి వచ్చే కార్మికుల కిదివర్తించదు.

2. కార్మికులు సంస్థకు కలిగించిన నష్టానికి తగు పరిహారం చెల్లించమని మేనేజిమెంటు కోరినపుడుకూడా నేరుగా ప్రజాకోర్టు కెళ్ళవచ్చు.

కార్మికులు తమ వివాదాల్లో జోక్యం చేసుకొమ్మని కార్మిక వివాదాల ఉపసంఘానికి వ్రాసేందుకు నిర్దిష్ట కాలపరిమితి అంటూలేదు. తొలగింపు జరిగినపుడు, అట్టి నోటీసు అందిన నెలరోజులలోపల వారు జిల్లా (నగర) ప్రజా కోర్టుకు తమ దరఖాస్తు దాఖలు చేయాలి. మేనేజిమెంటువారు కొన్ని సందర్భాల్లో నెల, మరికొన్ని విషయాల్లో ఒక సంవత్సరానికి లోపుగా తమ సంస్థకు జరిగిన నష్టాలకు నష్ట పరిహారం రాబట్టుకుందుకు దరఖాస్తు చేయవచ్చు.

ఒక కార్మికుణ్ణి, లేదా ఉద్యోగిని తగు కారణాలు లేకుండా బర్తరఫు చేసినా, లేదా అందుకు చట్టం నిర్దేశించిన క్రమాన్ని ఉల్లంఘించినా, చట్ట విరుద్ధంగా అతన్ని మరో పనికి బదలాయించినా, అట్టి కార్మికుణ్ణి తన పనిలో తిరిగి నియమించడం జరుగుతుంది. ఆ కార్మికుడు పనిలోలేని కాలానికి— మూడు నెలలకు మించకుండా— అతని సగటు వేతనం చెల్లించబడుతుంది. అలాగే, చట్ట విరుద్ధంగా వేరే పనికి బదలాయించబడి తిరిగి పనిలో నియమించబడిన కార్మికుడి విషయంలో కూడా వెనుకటి వేతనం చెల్లించాలి. ఈ రెండు సందర్భాల్లో మధ్యవర్తి తీర్పు యెలాంటి ఆలస్యము లేకుండా అమలు జరుపబడుతుంది. ఆలస్యం జరిగితే ఆ కాలానికి కార్మికుడికి తన సగటు వేతనం లభించుతుంది. అన్యాయంగా బర్తరఫు చేసిన సందర్భాల్లోను, చట్ట విరుద్ధంగా బదిలీలు చేసినపుడు, కార్మికుణ్ణి తిరిగి పనిలో నియమిస్తూ కోర్టు యిచ్చిన తీర్పును అమలుపర్చకుండా ఆలస్యం చేసినపుడు అతడు పనిలో లేని కాలానికి చెల్లించే జీతాలవల్ల

లేదా, తక్కువ స్థాయి పనికి పంపినపుడు కోర్టు తీర్పుపై కార్మికునికి చెల్లించిన నష్ట పరిహారంవల్ల సంస్థకు వాటిల్లిన నష్టాన్ని కర్మాగార కార్యనిర్వాహకాధికారులు వ్యక్తిగతంగా అచ్చుకోవాలి. అయితే, ఆ వుద్యోగి యీ విధంగా అచ్చుకోవలసిన మొత్తం అతని మూడు నెలల వేతనానికి మించరాదు. ప్రత్యేక జాబితాలో పేర్కొన్న పదవులను నిర్వహిస్తున్న కార్మికులను లేదా వుద్యోగులను బర్తరఫు చేసినపుడు, యితర పనులకు బదలాయించినపుడు లేదా వారిపై క్రమశిక్షణా జరిమానాలను విధించినపుడు, 94 వ నిబంధన క్రింద అందుకనువైన ఉన్నతాధికార సంస్థ ఆ వివాదాలను పరిశీలిస్తుంది. కార్మికుడు తన పూర్వపు పనిలో తిరిగి నియమింప బడితే, ఉన్నతాధికార సంస్థ నిర్ణయం మేరకు, తాను పనిలో లేని కాలానికి యితర శాఖల కార్మికులకు వలెనే తగు నష్టపరిహారాన్ని పొందుతారు.

మౌలిక కార్మిక శాసనాలు ట్రేడ్ యూనియన్ల హక్కుల గురించి ఉత్పత్తి నిర్వహణలో కార్మికుల భాగస్వామ్యం గురించి సవివరంగా పేర్కొన్నాయి. కార్మికులకు ట్రేడ్ యూనియన్లలో సంఘటితమయ్యే హక్కు కల్పించబడింది. ట్రేడ్ యూనియను ప్రభుత్వ సంస్థలవద్ద రిజిష్టరు చేసుకోవలసిన అవసరం లేకపోగా, అవి తాము స్వయముగా నిర్ణయించుకున్న నిబంధనలు, నియమావళుల కనుగుణంగానే పనిచేస్తాయి. పై పెచ్చు ప్రభుత్వ సంస్థలు, కర్మాగారాలు, వివిధ సంస్థలు ట్రేడ్ యూనియన్లకు తమ విధి నిర్వహణలో సర్వతోముఖ సహకారాన్ని అందించాలి. ఈ విధంగా ట్రేడ్ యూనియన్లకు చట్టరీత్యా ప్రత్యేక స్థానం కల్పించబడింది. ఉత్పత్తి, శ్రమ, సంస్కృతి, సంక్షేమ రంగాల్లో అవి కార్మిక ప్రయోజనాలకు పూర్తి ప్రాతినిధ్యం వహిస్తాయి. దేశ ఆర్థిక ప్రణాళికలను రూపొందించి, అమలు పరచేవిషయంలోను, పాదార్థిక, ఆర్థిక వనరుల పంపిణీ, వినియోగాలకు సంబంధించిన విషయాలను నిర్ణయించడంలోను అవి పాలుపంచుకుంటాయి. ఉత్పత్తి నిర్వహణలో కార్మికులు పాల్గొనేలా చేస్తాయి; సోషలిస్టు పోటీని నిర్వహిస్తాయి; సాంకేతిక, శాస్త్ర పురోభివృద్ధి విషయమై నూతన భావాలను పెంపొందించి, ఆచరణయుక్తం గావించడంలోను, ఉత్పత్తి పెంపుదలలోను, శ్రామిక క్రమశిక్షణను పటుతరమొనర్చ

షంలోను కార్మిక జన సామాన్యాన్ని సమీకరించి, వారిని భాగస్వాములుగా చేయడంలో ప్రముఖ పాత్రవహిస్తాయి.

ఆయా పారిశ్రామిక సంస్థలు, ట్రేడ్ యూనియన్లతో కలసి వేతనాలు, ప్రజావినియోగ నిధుల పంపిణీ, నిర్దిష్ట రంగాల్లో కార్మిక శాసనాల ప్రయోగంవంటి నిర్ణయాలు గై కొనాలి. కార్మిక శాసనాలు, కార్మిక రక్షణ నిబంధనలు అమలు జరుగుతూన్న తీరును ట్రేడ్ యూనియను పర్యవేక్షిస్తాయి, నిర్దేశిస్తాయి. కార్మికులకు కల్పించే గృహవసతి, సామాజిక సంక్షేమ సౌకర్యాలు-వీటిపై ని వాటి అజమాయిషీ కూడా ఉంటుంది. ట్రేడ్ యూనియన్ల ఆధ్వర్యంలోనే ప్రభుత్వ సామాజిక భీమా పథకం అమలు జరుపబడుతుంది; విశ్రాంతి కేంద్రాలు, ఆరోగ్య సంరక్షణా సంస్థలు, విశ్రాంతి గృహాలు వాటి ఆధ్వర్యానే నడుస్తాయి. సాంస్కృతిక, విద్యా, పర్యాటక, క్రీడా సౌకర్యాలు వాటి పర్యవేక్షణ క్రిందే వుంటాయి. వీటన్నిటికీ తలమానికమైనది అఖిలయూనియన్ ట్రేడ్ యూనియన్ కేంద్ర సమితికి కొత్త చట్టాలు రూపొందించి. ప్రతిపాదించగల హక్కు వుండడం ఉత్పత్తి పెంపుదల సమస్యలపై చర్చలలో పాల్గొని నిర్ణయాలు గై కొనే హక్కు ట్రేడ్ యూనియనకుంది. అలాగే ఆయా పారిశ్రామిక సంస్థల పనిని మెరుగుపరచే ప్రతిపాదనలనందించేదుకుసామాజిక, సాంస్కృతిక, తదితర సేవలకు సంబంధించిన సూచనల నందజేసేందుకు వాటికి హక్కుంది. ట్రేడ్ యూనియను, యితర ప్రజా సంస్థలు, ప్రజా పర్యవేక్షక సంఘాలు, సాధారణ సభలు, యితర ప్రజా కార్యకలాపాల రూపాల ద్వారా కార్మికులు ఉత్పత్తి రంగ మేనేజిమెంటు నిర్వహణలో పాల్గొంటారు. ప్రతి పారిశ్రామిక సంస్థ మేనేజిమెంటు కార్మికులు, ఉత్పత్తి రంగ నిర్వహణలో క్రియాశీలంగా పాల్గొనేందుకనువైన పరిస్థితులను కల్పించాలి. కార్మికులు చేసే విమర్శలను, వారి ప్రతిపాదనలను కర్మాగార నిర్వాహకులు విధిగా దృష్టియందుంచుకోవాలి. అంతేగాక వారివిమర్శలు, ప్రతిపాదనలపై తామేమి చర్యలు గైకొన్నది ఎప్పటికప్పుడు తెలపాలి. ట్రేడ్ యూనియన్ కమిటీకీ, మేనేజిమెంటుకి మధ్యగల సంబంధాలను చట్టం స్పష్టంగా నిర్దేశిస్తోంది. భారీ యెత్తున సాంస్కృతిక కార్యకలాపాలు, క్రీడా-వ్యాయామ కార్యక్రమాలు నిర్వహించేందుకు అవసరమైన నిధులను మేనేజిమెంటు ట్రేడ్

యూనియన్లకు అప్పగించాలి. ట్రేడ్ యూనియన్ కమిటీకి యెన్నుకో బడిన కార్మికులు తమ ప్రధానమైన పనిలో కొనసాగుతూండగా వారిని ఇతర పనులకు బదిలీ చేయరాదు. ట్రేడ్ యూనియన్ కమిటీ ఆమోదం లేనిదే అతనిపై ఏ విధమైన క్రమశిక్షణా చర్య గైకొందుకు వీల్లేదు. ట్రేడ్ యూనియన్ కమిటీ అధ్యక్షుడు, ఇతర ట్రేడ్ యూనియన్ ముఖ్య కార్యకర్తల విషయంలో కూడా ఇదే నిబంధనలు వర్తిస్తాయి. ట్రేడ్ యూనియన్ కమిటీ అధ్యక్షుడిని, ఇతర సభ్యులను పనినుండి తొలగించా లంటే, ఇతర కార్మికులందరికి సాధారణంగా వర్తించే క్రమానికితోడు ఉన్నత ట్రేడ్ యూనియన్ సంస్థ అనుమతిని కూడా గైకొనవలసి ఉంటుంది.

శ్రామిక శాసనాలకు సంబంధించి మరో ముఖ్యమైన అంశం, ప్రభుత్వ సామాజిక భీమాపథకానికి సంబంధించిన నిబంధనలు. ఫ్యాక్టరీ కార్మికులు, కార్యాలయోద్యోగు లందరికి ప్రభుత్వ సామాజిక భీమాపథకం విధిగా వర్తిస్తుంది. ఈ సామాజిక భీమాపథకానికి ఆయా పారిశ్రామిక సంస్థలనుండి రాబట్టిన నిధులనుండి ప్రభుత్వమే చెల్లింపులు చేస్తుంది. కార్మికుల, ఉద్యోగుల వేతనాలనుండి ఏవిధమైన తగ్గింపులు చేయరు. ఏ పరిస్థితులలోనైనా ఆయా పారిశ్రామిక సంస్థలు ఇందుకోసం డబ్బు చెల్లించకపోయినప్పటికీ కార్మికులకు ఉద్యోగులకు ప్రభుత్వ సామాజిక భీమా నిధులనుండి భృతిని పొందే హక్కుకు ఏవిధంగా భంగం కలుగదు. కార్మికులకు, కొన్ని ప్రత్యేక సందర్భాలలో వారి కుటుంబ సభ్యులకు ప్రభుత్వ భీమా నిధులనుండి క్రింది సౌకర్యాలు కల్పించబడతాయి.

1. తాత్కాలిక అశక్తతాభృతి; ఇదేగాక మహిళలకు గర్భవతులుగా నున్నపుడు, కాన్పు సందర్భంలోను దీనినుండే చెల్లింపులు జరుగుతాయి.

2. బిడ్డపుట్టినప్పుడు చెల్లించే భృతి, బంధువులు మరణించినపుడు వారి ఖననానికయ్యే ఖర్చులకై అలవెన్సులు ఈ నిధులనుండే లభిస్తాయి.

3. వృద్ధాప్యపు పెన్షను అశక్తత ప్రాప్తించినపుడు, కుటుంబ పోషకుడు చనిపోయినపుడు యిచ్చే భృతి, కొన్ని రకాలైన కార్మికులకు నిర్దిష్ట కాలంపాటు సర్వీసు చేసినందుకుగాను ఇచ్చే పింఛను దీనినుండే లభిస్తాయి.

ఫ్యాక్టరీ కార్మికులు, కార్యాలయోద్యోగుల చికిత్సకయ్యే ఖర్చులు, శానిటోరియంలు, ఆరోగ్య కేంద్రాలు, విశ్రాంతి గృహాలు మున్నగు వానిలో అయ్యే ఖర్చులు, బలవర్ధక ఆహారం సమకూర్చేందుకు, బాలసంఘ శిబిరాలను నిర్వహించేందుకు అవసరమైన ఖర్చులు ప్రభుత్వ సామాజిక భీమా నిధుల నుండే లభిస్తాయి. జబ్బువలన తాత్కాలిక అశక్తత ఏర్పడినప్పుడు చెల్లించే భృతి, అలాగే గాయాలు తగిలినందువల్ల, జబ్బువల్ల తాత్కాలికంగా తేలిక పనులకు బదలాయించినపుడు జీతంలో కలిగే లోటును పూడ్చేందుకు, ఇంట్లో జబ్బుగానున్న వ్యక్తి ఆలనా పాలనా చూచేందుకు, శానిటోరియం, ఆరోగ్య కేంద్రాలలో క్వారంటైన్ చికిత్స కల్పించేందుకు, అవసరమైనపుడు కృత్రిమ అవయవాలను సరఫరా చేసేందుకు సామాజిక భీమా నిధులే ఆధారంగా ఉంటాయి. ఈ చెల్లింపులు కార్మికుని మొత్తం వేతనానికి సమానంగా ఉంటాయి. జబ్బుచేసినపుడు, లేదా గాయపడినపుడు, అతడు పూర్తిగా కోలుకున్నదాకాగాని, అతని అశక్తత ఇక నయంచేయడానికి వీలులేనిదని తేలిందాకాగాని ఈ చెల్లింపులు జరుగుతుంటాయి. ఒక మహిళా ఉద్యోగి గర్భిణీగా వున్నప్పుడు, ఆమె ప్రసవించినపుడు యివ్వవలసిన ప్రసూతి శెలవు కాలమంతటికి 2/3 వంతు, లేదా పూర్తిజీతం చెల్లించబడుతుంది. * కార్మికులకు వృద్ధాప్య, అశక్తత పింఛనులకు పూర్తి హక్కు ఉన్నది.

కుటుంబ పోషకుడు చనిపోయినపుడు సోవియట్ దేశ ప్రభుత్వ పింఛను చట్టాల ప్రకారం ఆ కుటుంబ సభ్యులకు పింఛనులు పొందే హక్కు ఉన్నది.

కార్మిక శాసనాలు, శ్రామిక రక్షణా నిబంధనలు ఖచ్చితంగా పాటించేలా చూచేందుకై అనేక సంస్థలకు పర్యవేక్షక, నిర్దేశక అధికారాలు అప్పగించబడ్డాయి. ఆ సంస్థలు ఇవి :

1. అధికృతమైన ప్రభుత్వ సంస్థలు, ఇన్‌స్పెక్టరేట్లు తమ విధుల నిర్వహణలో ఆయా పారిశ్రామిక సంస్థలకు, వాటికి సంబంధించిన

---

* సాధారణంగా ఆ మహిళ భర్త, తండ్రి, తల్లి, లేదా కుమారుడు కూడా సంపాదనా పరులుగా ఉంటారన్న విషయం మనం గుర్తుంచుకోవలసి ఉన్నది.

ఉన్నతాధికార సంస్థలకు వీటిపై ఏవిధమైన అజమాయిషీ ఉండదు. వీటికి సంపూర్ణ స్వేచ్ఛ ఉంటుంది.

2. ట్రేడ్ యూనియన్లు, ట్రేడ్ యూనియన్ల ఆధ్వర్యంలోని సాంకేతిక, న్యాయశాస్త్ర సంబంధ శ్రామిక పర్యవేక్షక సంస్థలు కూడా ఈ పని చేస్తాయి. ఇవి రాజ్యాంగచట్టంలో యిందుకు సంబంధించిన నిబంధనల కనుగుణంగా పనిచేస్తాయి. అఖిల యూనియన్ ట్రేడ్ యూనియన్ల కేంద్ర సమితి వీటి కార్యకలాపాలను ఆమోదించవలసి ఉంటుంది.

ఈ విధంగా కార్మికులు తమ ట్రేడ్ యూనియన్లద్వారా వివిధ రంగాలలో పర్యవేక్షణ జరపడమేకాక, తమ సంక్షేమంకోసం జారీచేయ బడిన చట్టాలు వాస్తవంగా అమలుజరుగుతున్నదీ లేనిదీ పరీక్షించే అధికారం కలిగి ఉన్నారు.

వీటన్నిటికీ తోడుగా ప్రజాప్రతినిధుల సోవియట్, దాని కార్య వర్గము, తదితర పాలక సంస్థలు శ్రామిక శాసనాలు ఎలా అమలు జరుగు తున్నదీ పర్యవేక్షిస్తాయి. ఆయా మంత్రిత్వ శాఖలు, డిపార్టుమెంటులు ఈ విషయమై అంతశ్శాఖా పర్యవేక్షణాధికారాన్ని కలిగి ఉంటాయి. అన్ని మంత్రిత్వ శాఖలు, డిపార్టుమెంటులు, కర్మాగారాది సంస్థలు, వాటి అధికారులు కార్మిక శాసనాలను నిజాయితీగా అమలుజరుపుతున్నదీ, లేనిదీ పర్యవేక్షించే అత్యున్నత అధికారం సోవియట్ దేశ ప్రొక్యురేటర్ జనరల్‌కు ఉంది.

కార్మిక శాసనాలను, కార్మిక భద్రతా నిబంధనలను ఉల్లంఘించే అధికారులు, సమిష్టి ఒప్పందాలలో పేర్కొన్న నియమాలను ఉల్లంఘించే వారు, ట్రేడ్ యూనియన్ కార్యకలాపాలను నిరోధించేవారు అందుకు చట్టరీత్యా బాధ్యత వహించవలసి ఉంటుంది.

సోవియట్ యూనియన్, యూనియన్ రిపబ్లిక్కుల శాసనసభలు ఈ క్రిందివాటిని నిర్ణయించవలసి ఉన్నది :

1. సోవియట్ దేశ సుదూర ఉత్తర ప్రాంతంలోని జిల్లాలలో నివసించే కార్మికులకు, అదేవిధమైన వాతావరణ పరిస్థితులుగల ప్రాంతాలలో

నివసించేవారికి, అలాంటి మరికొందరు ఫ్యాక్టరీ కార్మికులు, కార్యాలయో ద్యోగులకు కల్పించవలసిన ప్రత్యేక సౌకర్యాలు;

2. రవాణా పరిశ్రమలో పనిచేసే ఉద్యోగులకు సంబంధించిన పనిగంటలు విశ్రాంతి వగైరాలకు వర్తించే ప్రత్యేక సూత్రాలు;

3. వివిధ రకాలైన పనులలో నిమగ్నమైఉన్న కార్మికులు ఉద్యోగులకు సంబంధించిన ప్రత్యేక పని పరిస్థితులు, వ్యక్తిగత కంట్రాక్టు (ఇంటిపనులలో తోడ్పాటు వగైరా) ప్రాతిపదికగా ఆయా వ్యక్తులవద్ద పనిచేసేవారి హక్కులు - వివిధ విషయాలకు సంబంధించి వారికి అనేక రాయితీలు కల్పించవచ్చు.

4. అతి సున్నితమైన పదవులలోఉన్న వ్యక్తులు — అనేక విధులు, లేదా బాధ్యతలను నేరుగా ఎరిగిఉన్న వ్యక్తులు, విద్యాబోధన బాధ్యతలో నియమింపబడినవారు — నీతిబాహ్యమైన ప్రవర్తనకు పాల్పడినప్పుడు, ఇలాంటివే మరికొన్ని ప్రత్యేక సందర్భాలలోను శ్రామిక ఒప్పందాన్ని రద్దుచేసేందుకు అదనపు ఆధారాలను నిర్ణయించడం.సోవియట్ సమాఖ్య యూనియన్ రిపబ్లిక్కుల మధ్య మౌలిక శాసనాల పరిధిలోకి వచ్చే విషయాల్లో అధికారాల కేటాయింపు గురించి ప్రత్యేకమైన నిర్దేశాలు ఉన్నాయి.

పైన పేర్కొన్న విధంగా కార్మిక శాసనాలన్నింటిని సింహావలోకనం చేసినట్లయితే, వారి పని గుణము, స్వభావము ఎలాంటివైనా సకల కార్మికులు, ఉద్యోగులయెడ అత్యధిక శ్రద్ధ కనపరుస్తూన్న విషయం ఎవరికైనా అర్థమవుతుంది. ఈ శాసనాలన్నిట్లో పూసల్లో బంగారు తీగలా కనిపించే అతి ప్రధానమైన ఒక లక్షణం మనకు గోచరిస్తుంది. అదేమంటే, ట్రేడ్ యూనియన్లకివ్వబడిన అపారమైన అధికారాలూ, బాధ్యతలునూ. వివిధ కర్మాగారాది సంస్థల మేనేజిమెంటులకు, వాటిలో పనిచేసే ఉద్యోగులకు మధ్య ఘర్షణ రాకుండా: నివారించేందుకై సాధ్యమైన జాగ్రత్తలన్నీ గైకొనబడ్డాయి. వివాదాల పరిష్కారానికై స్వతంత్రమైన, పటిష్టమైన యంత్రాంగాలు నెలకొల్పబడ్డాయి. సోవియట్ యూనియన్‌లోవలె

కార్మికుడి జీతభత్యాలు, పని పరిస్థితులు, ప్రమోషన్లు పాదార్థిక, సాంస్కృతిక ప్రగతివంటి దైనందిన వ్యవహారాలతోసహా అన్నివిషయాల లోను కార్మికునికి లభించినంత విస్తృతమైన ప్రజాతంత్ర హక్కులు మరే దేశంలోను కానరావు. కార్మికుని నడవడి, అతని విధి నిర్వహణపై గల పర్యవేక్షణయొక్క ప్రజాతంత్ర స్వభావం అన్నిరకాల శాసనాలలోను విస్పష్టంగా గోచరిస్తుంది కార్మిక సంక్షేమము, సామాజిక పురోగతి ఈ రెండూ పరస్పర ఆధారభూతాలని చట్టం ఉద్ఘోషిస్తోంది. ఈ లక్షణాలను దృష్టిలో ఉంచుకొని పరిశీలించినట్లయితే, సోవియట్ యూనియన్‌లో సమ్మెలు, పని నిలుపుదలలు ఎందుకు లేవో తేటతెల్లమవుతుంది. తనపై తానే యుద్ధం ప్రకటించుకొనేవాడు పిచ్చివాడుకాక మరేమవుతాడు? సోవియట్ యూనియన్‌లో సమ్మెలు లేకపోవడాన్ని గురించి సామ్రాజ్య వాదులు చేస్తున్న కాకిగోల, ప్రథమ సోషలిస్టుదేశంలో నెలకొనిఉన్న వాస్తవ సామాజిక పరిస్థితిని అర్థంచేసుకోలేని అమాయకులను తప్పుదారి పట్టించేందుకు ఉద్దేశించబడినట్టిదే. కార్మికుడి ప్రజాతంత్ర హక్కులకు కల్పించిన సుదృఢమైన హామీ, మహోన్నత శ్రామిక సాహసాన్ని, చొరవను చూపేందుకు ప్రతి కార్మికునికి, ఉద్యోగికి ఎనలేని తేజాన్ని యిచ్చితీరుతుంది. ప్రథమ సోషలిస్టుదేశం అత్యల్పకాలంలోనే అత్యద్భుత ప్రగతి సాధించేందుకు పునాదిగా నిలిచిందిదే. ఇచ్చటి సామాజికాభివృద్ధి కార్మికుల పాదార్థిక, సాంస్కృతిక స్థాయిని కనీవినీ ఎరుగని అత్యున్నత దశకు అభివృద్ధి పరచింది.

*4 వ ప్రకరణము*

# సోవియట్ భూ శాసనమూ, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు

సోవియట్ దేశ భూ శాసనాల మౌలిక సూత్రాలకు విశేష ప్రాధాన్యత ఉంది. వాటిని మనము జాగ్రత్తగా అధ్యయనం చేయవలసి ఉన్నది. అక్టోబరు విప్లవానంతరం భూసంబంధాలలో ఈ శాసనాలు అత్యద్భుతమైన మార్పులను కొనితెచ్చాయి. అనేక మాజీ, వలస, పరాధీన దేశాలలో అనాదిగా వస్తున్న గ్రామీణ పేదరికాన్ని, సాంఘిక అన్యాయాలను తుడిచిపెట్టి, మానవ శారీరక శ్రమపై ఆధారపడి ఉన్న సన్నకారు రైతు భూఖండాలను ఆధునిక భారీ వ్యవసాయక్షేత్రాలుగా మార్చడమెలా అన్న సమస్య ఈ దేశాల ప్రజలను, నాయకులను ఎదుర్కొంటూంది. ఈ శతాబ్దారంభంలో రష్యా రైతాంగం సరిగా ఇలాంటి సమస్యలనే ఎదుర్కొన్నది. అయితే ఈనాటి ప్రపంచ పరిస్థితిగాని, వివిధ దేశాలలోని నిర్దిష్ట పరిస్థితులుగాని సరిగా ఆనాటి రష్యా పరిస్థితులనే పోలిలేవు. ఈనాడు బ్రహ్మాండమైన శాస్త్రీయ, సాంకేతిక విప్లవ వెల్లువ ఉద్భవించింది. శరవేగంతో జరుగుతున్న పారిశ్రామికాభివృద్ధి ఆధునిక వ్యవసాయ తీరుతెన్నులనే సమూలంగా మార్చివేస్తూంది. ఇట్టి సాంకేతిక, పారిశ్రామిక విప్లవంతోపాటు సామాజిక సంబంధాలు మారనందువల్ల, ఈ దేశాల రైతాంగం యొక్క దుర్భర పరిస్థితులు భరించ శక్యం కానంతగా దిగజారాయి. రైతాంగ సమస్య ఈ నాడీ దేశాల వెదుర్కొంటున్న అతికీలక సమస్య. ఈ సమస్య పరిష్కారాన్నే మాత్రము

సాగుచేసేందుకు వీల్లేదు. అంచేత రష్యా రైతాంగ అనుభవం వర్ధమాన దేశాలన్నింటికి అత్యంత ఆసక్తిదాయకము, మార్గదర్శకమూ అయినట్టిది.

దాదాపు 1861 వరకు రష్యా దేశంలో భూబానిస వ్యవస్థ ఉండింది. ఆ సంవత్సరమే జార్ చక్రవర్తి ఈ వ్యవస్థను రద్దుచేశాడు. అయితే, రైతుకు లభించిన ఈ స్వేచ్ఛ కేవలం నామమాత్రమైనదే. ఎంచేతనంటే, రైతు ఇంకా ఆర్థికంగా తన పూర్వపు యజమానిపైనే ఆధారపడవలసి వచ్చింది. అందుకే అనేక రైతాంగ తిరుగుబాట్లు జరిగాయి. విప్లవాత్పూర్వపు రష్యా ప్రధానంగా ఒక వ్యవసాయిక దేశం. ఆ దేశ జనాభాలో దాదాపు 85 శాతం రైతులే. వారు తమకు కావలసిన ఆహారాన్ని, బట్టలను, పనిముట్లను తామే ఉత్పత్తి చేసుకొనేవారు. వారి కడుపుగొట్టి జార్ చక్రవర్తి భూస్వామ్య వర్గము భోగ భాగ్యాలతో తులతూగారు. నికృష్టమైన దోపిడీకి గురవుతూ, తనదన్న భూమి లేక రైతు క్రుంగిపోతూ, తన ఉత్పాదకశక్తిని ఏ మాత్రము పెంచుకోలేకపోయాడు. దేశ సాంఘిక పరిస్థితి నానాటదిగజార జొచ్చింది. ఆ విధంగా జారిస్టు రష్యాలో వ్యావసాయక సమస్య అతి తీవ్రమైన పరిస్థితికి చేరుకుంది. ఈ సమస్యా పరిష్కారానికి అనేక విధాలైన సూచనలు వచ్చాయి. అయితే అత్యంత నిర్దుష్టము, వాస్తవికమునైన పథకాన్ని 1894 లో లెనిన్ ప్రతిపాదించారు. అందులో ఆయన భూ బానిస వ్యవస్థ రద్దు సందర్భంగా రైతులనుండి భూస్వాములు స్వాధీనం చేసుకున్న భూమినంతా తిరిగి రైతులకే యిచ్చివెయ్యాలి, పెద్ద భూస్వాముల భూములన్నింటినీ జప్తుచేయాలి – అంటే దాదాపు భూములను జాతీయం చెయ్యాలి అని ఆయన ప్రతిపాదించారు. 1906 లో విస్తృతంగా జరిగిన భూస్వామ్య వ్యతిరేక రైతాంగ ఉద్యమాల అనుభవాన్ని విశ్లేషిస్తూ, భూస్వాముల అధీనంలో ఉన్నభూమినంతా స్వాధీనం చేసుకొని, జాతీయం చెయ్యమని బోల్షివిక్కుల వ్యావసాయిక కార్యక్రమం డిమాండ్ చెయ్యాలని లెనిన్ సూచించారు (కమ్యూనిస్టులనానాడు బోల్షివిక్కులని పిలిచేవారు). 1917 అక్టోబరు విప్లవవిజయానంతరం లెనిన్, బోల్షివిక్కులు నిర్వర్తించిన కర్తవ్యమిదే. ఆనాటికి రైతాంగం భూస్వాముల కులక్కుల పీడనలో క్రుంగుతుండినారు. కులక్కులనబడే వారు, భూబానిస వ్యవస్థ రద్దయిం

తర్వాత భూములను స్వాయత్తం గావించుకున్న ధనిక రైతులు. అతిపీడిత రైతాంగాన్ని భూస్వాముల, కులక్కుల పీడన నుండి విముక్తిచేసి వారి పైగల భారాన్ని రద్దు చేయడం జరిగింది.

అక్టోబరు విప్లవం విజయం సాధించిన మరునాడే సోవియట్ ప్రభుత్వం భూ చట్టాన్ని జారీ చేసింది. దీని ననుసరించి పెద్ద పెద్ద భూ కమతాలు ఎలాంటి నష్టపరిహారము లేకుండ జాతీయం చేయబడ్డాయి. ప్రథమ అఖిల రష్యా రైతు ప్రతినిధుల మహాసభ సమర్పించిన 242 స్థానిక రైతు నిర్దేశాల ప్రాతిపదిక పై ఈ చట్టంలో భూమిని గురించి సామాన్యీకరించబడిన ఒక రైతు నిర్దేశం చోటు చేసుకున్నది. దీని ననుసరించి నమస్త భూమి జాతీయ ఆస్తిగా ప్రకటించబడింది. ఇలా జాతీయం చేయబడిన భూమిని వ్యక్తులుగా గాని, బృందాలుగా గాని సాగుచేయదలచుకున్న రైతులకు స్వాధీనపరచడం జరిగింది. కూలీలను పెట్టుకోడం నిషేధించబడింది. ప్రారంభంలో భూమిదున్నే రైతాంగానికి భూములు సమానంగా పంచిపెట్టబడ్డాయి. అయితే, ఈ భూపంపకం కమ్యూనిస్టులకు పెద్దగా ఇష్టంలేదు. ఇలాంటి విడివిడి చిన్నచిన్న భూ కమతాలు రైతాంగ పరిస్థితిని మెరుగుపరచవని, వ్యవసాయరంగ పురోగతికి తోడ్పడవని వారికి బాగా తెలుసు. అయినా ఈ విధమైన పంపిణీని చేపట్టడానికి గల కారణాన్ని లెనిన్ క్రింది మాటలలో వ్యక్తీకరించారు: "ఒక ప్రజాతంత్ర ప్రభుత్వంగా మనము ఏకీభవించకపోయినా, ప్రజాబాహుళ్యం నిర్ణయాలను మనము త్రోసిపుచ్చజాలము. ఈ చట్టాన్ని అమలు జరుపుతూ, తమ నిత్య జీవితానుభవాన్ని గుండం స్థానికంగా దాని ఫలితాలను చవిచూస్తూ, పయనించిన రైతులు తమంత తామే నిజమేమిటో తెలుసుకుంటారు."

భూమిని జాతీయంచేసే చట్టం 1918, ఫిబ్రవరి 19 వ తేదీన ఆమోదం పొందింది. ఇందు సమిష్టి క్షేత్ర విధానాన్ని ప్రోత్సహించేందుకు ప్రాధాన్యత యివ్వబడింది. పూర్వపు భూ కామందులకు చెందిన భూములను, పనిముట్లను స్వాధీనం చేసుకొని, తగు విధంగా పంపిణీచేసే అధికారం సోవియట్లకు (అంటే స్థానిక ప్రభుత్వాధికార సంస్థలకు) అప్పగించబడింది. 1919, మార్చిలో ఆమోదించబడిన వ్యావసాయిక కార్యక్రమం, భారీ సోషలిస్టు వ్యవసాయ క్షేత్రాలను-సోవియట్ క్షేత్రాలను

వెలకొల్పేందుకు, భూమిని సమిష్టిగా సాగుచేసే వివిధ రకాల సహకార సంఘాలకు, వ్యవసాయ కమ్యూన్‌లకు పూర్తి మద్దతు నివ్వాలని పేర్కొన్నది.

అక్టోబరు విప్లవానంతరం రైతాంగం ఒక చిల్లిగవ్వ కూడా చెల్లించకుండా 150 మిలియన్ హెక్టారుల భూమిని పొందారు. అంతేకాక, సాలీన చెల్లించవలసిన రమారమి 700 మిలియన్‌ల బంగారు రూబుళ్ళ కౌలు భారాన్ని కూడా వారి మూపులనుండి తొలగించారు. అంతేకాదు, రైతాంగం వ్యవసాయ బ్యాంకులకు చెల్లించవలసిన 1400 మిలియన్ బంగారు రూబుళ్ళ రుణభారం కూడా తొలగిపోయింది. ఈ చర్యల ఫలితాన్ని గమనించేందుకు మనమొక ఉదాహరణను తీసుకొందాం. 1913 లో రైతాంగం మొత్తం 4500 మిలియన్ బంగారు రూబుళ్ళ విలువచేసే వ్యవసాయోత్పత్తులను భూస్వాములకు సమర్పించుకోవలసి వచ్చింది. రైతాంగం ఇంకే మాత్రము భూస్వాముల దోపిడీకి లొంగివసి ఉండనక్కరలేకుండా పోయింది.

తమ ప్రతినిధుల ద్వారా స్థానికంగా వారు స్వయంపాలన నిర్వహించుకుంటూ, కేంద్ర ప్రభుత్వ పాలనలో కూడా పాలుపంచుకున్నారు. ఈ చర్యలు గ్రామీణ రైతాంగం పరిస్థితిని సమూలంగా మార్చివేసేందుకు తోడ్పడ్డాయి. సామ్రాజ్యవాదుల జోక్యమూ, అంతర్యుద్ధంవల్ల, తరుణ సోవియట్ ప్రభుత్వం అనేక అనుభవాలను తదనుగుణమైన మార్పులు, చేర్పులను చేసుకోక తప్పని పరిస్థితిని కల్గించాయి. అయితే ఈ క్లిష్టదశ అంతటా సోవియట్ ప్రభుత్వం పేద రైతాంగం శక్తిపైనే పూర్తిగా ఆధారపడింది. ఎక్కువగా కులక్కులనుండి, కొంతవరకు మధ్యతరగతి రైతులనుండి అదనపు ధాన్యాన్ని రాబట్టే పనిని పర్యవేక్షించేందుకై వారు కమిటీలుగా సంఘటితులయ్యారు. తద్వారా ధాన్యాన్ని దాచివేసిన కులక్కుల, లాభసాటి వ్యాపారుల ఆటలు కట్టించారు. రైతాంగ కమిటీలు వ్యవసాయ కార్మికులను ఒకే సుసంఘటిత శక్తిగా ఐక్యం చేశాయి. 1921 లో మిగులు ధాన్య సేకరణ ఆపివేయబడింది. దానిస్థానే ధాన్య రూపంలో చెల్లించే ఆహారం పన్ను ప్రవేశపెట్టబడింది. మరికొంత కాలం తర్వాత అది కూడా చాలా వరకు ధనరూపంలోనే వసూలు చేయ

బడింది. అంతకుముందు రైతులు చెల్లించవలసిన దానిలో సగం మాత్రమే చెల్లించే విధంగా పన్ను తగ్గించబడింది కూడా. ఆ మీదట, అక్టోబరు విప్లవానంతరం వెలిసిన సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు, చిన్న చిన్న భూ ఖండాలపై చేసే వ్యవసాయానికంటే భారీ వ్యవసాయం లాభ దాయకమైనదని సాంకేతికంగాను, ఆచరణాత్మకంగాను నిరూపించాయి. సమిష్టిక్షేత్ర రైతుల ఆదాయాలు, జీవన ప్రమాణాలు, వ్యక్తిగత సాగు బడిచేసే రైతుల ఆదాయాలు, జీవన ప్రమాణాలకంటే ఎక్కువని రుజువు కాజొచ్చింది. గ్రామసీమలలో సోషలిస్టు నిర్మాణం సాగుతున్న దశలో, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు రైతులకు ఆదర్శ వ్యవసాయ సంస్థలుగా పనిచేశాయి. హేతబద్ధమైన ఉత్పత్తి నిర్వహణ పద్ధతులను రైతులు అనుసరించేలా, తమ ఆదర్శం ద్వారా ఉత్తేజ పరచేందుకు, రైతులు వ్యక్తి గత సాగుబడి దశను అధిగమించి సమిష్టి వ్యవసాయ క్షేత్ర విధానాన్ని చేబట్టేలా నచ్చజెప్పేందుకు ఇవి ఎంతగానో ఉపయోగపడ్డాయి. లెనిన్ తన సహకార పథకంలో ప్రతిపాదించిన సూత్రాల ప్రాతిపదికపై వ్యవ సాయ రంగంలో సమిష్టీకరణ కృషి కొనసాగింది.

సన్నకారు రైతాంగ క్షేత్రాలను సమిష్టి వ్యవసాయ క్షేత్రాలుగా పరిణతి చెందించి, దానికి విద్యుదీకరణను జోడించి వ్యవసాయంలో సోషలిస్టు పరివర్తనను గొనిరావడం జరిగింది. రైతులను క్రమంగా పని పాటలలోను, పనిముట్ల వినియోగంలోను పరస్పరం సహకరించుకొనేలా తరిఫీదు నివ్వడం జరిగింది. సహకార వ్యవసాయ క్షేత్రాల మౌలిక సూత్రం, రైతుల స్వేచ్ఛా పూర్వక సమీకరణయే. ఈ సందర్భంలో లెనిన్ ఇలా వ్రాశారు :

"అన్ని రకాల సహకార క్షేత్రాలను, మధ్య తరగతి రైతుల వ్యవసాయ కమ్యూనులను ప్రోత్సహించే సందర్భంలో సోవియట్ అధికార సంస్థల ప్రతినిధులు వాటిని నెలకొల్పడంలో చిన్న మెత్తు నిర్బంధాన్ని కూడా అనుమతించకూడదు. వీటివల్ల సమకూరే లాభాలను ఆచరణాత్మకంగా బేరీజు వేసుకుని-రైతులు తమంతట తామే తమ సొంత చొరవపై నెలకొల్పుకొన్నప్పుడే ఈ సమ్మేళనలకు నిజమైన విలువ

ఏర్పడుతుంది."* ఈ రకంగా, అనేక అనుభవాలను, దశలను గడిచి అంతిమంగా సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు అమల్లో కొచ్చాయి.

## సమిష్టి వ్యవసాయ క్షేత్రం

భూ శాసన మౌలిక సూత్రాలను పరిశీలిస్తే సోవియట్ దేశంలో భూమంతా ప్రభుత్వాధీనంలో వుందనేది విదితమవుతుంది. అయితే, ప్రభుత్వం దాన్ని వినియోగానికి సమిష్టి క్షేత్రాలు వగైరాలకు స్వాధీన పరుస్తుంది. సమిష్టి వ్యవసాయ క్షేత్రాల సభ్యులు, తమ కిచ్చిన చిన్న చిన్న భూ ఖండాల్లో ఉపాధార వ్యవసాయాన్ని కొనసాగించవచ్చు. అయితే యిందుకు కూలీలను నియమించుకునే అవకాశం లేదు. ఈ ఉపాధార వ్యవసాయ భూ ఖండాలు, అట్టి రైతుల ఆదాయానికి తోడుగా వుండేం దుకు సమిష్టి క్షేత్రాలే సమకూర్చిన సాధనాలు మాత్రమే. సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు ప్రగతి పథంలో వేసిన ముందంజ క్రింది పట్టికను చూస్తే విశదమవుతుంది:

### సమిష్టి వ్యవసాయ క్షేత్రాల అభివృద్ధి ప్రధాన సూచికలు

| | 1928 | 1934 | 1955 | 1971 |
|---|---|---|---|---|
| ఒక్కొక్క సమిష్టి క్షేత్రానికి ఉండిన కుటుంబాలు | 1.3 | 68 | 231 | 439 |
| సాగుభూమి విస్తీర్ణం (వేల హెక్టార్లలో) | 0.04 | 0.4 | 1.7 | 3.6 |
| పశువుల సంఖ్య | 5 | 44 | 308 | 1332 |
| ఆవులు | 2 | 13 | 115 | 426 |
| పందులు | 2 | 15 | 146 | 989 |
| ట్రాక్టర్లు (15 అశ్వశక్తి ప్రాతిపదికగా) | 0.2 | 0.8 | 16[2] | 63 |
| స్థిర ఉత్పత్తి పెట్టుబడి (సామాన్య ధర వరల లెక్కన వేల రూబుళ్ళలో) | 6.0 | 24.0[3] | 1625 | 1537 |

నేటి సోవియట్ సమాజంలో సమిష్టి క్షేత్రాల ప్రాధాన్యతను పైన కనబరచిన వివరాలు తెలియజేస్తాయి.

---

* లెనిన్ కలెక్టెడ్ వర్క్స్, సం. 29, పుట. 218

1917, నవంబరు 8 న జారీ చేసిన డిక్రీద్వారా, అఖిల రష్యా సోవియట్ల మహాసభ భూమిపై వ్యక్తిగత యాజమాన్యాన్ని శాశ్వతంగా రద్దుపరచింది. భూమినంతా సమస్త జనుల సంపదగా మార్చింది. దాన్ని శ్రామిక జనానికి ఉచితంగా వినియోగించుకుందుకు స్వాధీనపరచింది. "జాతీయకరణ ద్వారా భూమిపై యేర్పడిన ప్రభుత్వ యాజమాన్యం, సోవియట్ దేశంలో భూ సంబంధాలకు ప్రాతిపదిక అయింది. వ్యక్తిగత యాజమాన్యంలో మనిషిని మనిషి దోచుకుందుకు పనిముట్టుగా వుండే భూమి నేడు, సోవియట్ యూనియన్‌లో సమస్త ప్రజల ప్రయోజనాల దృష్ట్యా దేశ ఉత్పత్తి శక్తులను సర్వతోముఖంగా పెంపొందించేందుకు వినియోగపడుతోంది.

"భూమిపై ప్రభుత్వ యాజమాన్యం, సోవియట్ దేశంలో సోషలిజం విజయంలో ప్రముఖపాత్ర వహించింది. దేశ ఆర్థిక వ్యవస్థలోని సమస్త రంగాలను అత్యంత సమర్థవంతంగా మోహరించేందుకు యిందువల్ల వీలయింది. సోషలిస్టు భూ యాజమాన్య రూపాలకు పరివర్తన చెందేందుకు యిది చక్కని సోపానంగా పనిచేసింది."*

"చిందరవందరగా వుండిన వ్యక్తిగత క్షేత్రాలను సమీకరించి, సమిష్టి క్షేత్రాలుగా రూపొందించేందుకు అవసరమయిన పరిస్థితులు, సోషలిస్టు నిర్మాణ క్రమంలో ఏర్పడడంతో రైతాంగం, కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన, కార్మికవర్గ సహాయ, సహకారాలతో సోషలిస్టు పంథాను చేపట్టింది. లెనిన్ సహకార పథకాన్ని అమలు జరపడం ద్వారాను సమిష్టి వ్యవసాయ క్షేత్ర వ్యవస్థను నెలకొల్పడం ద్వారాను రైతాంగ సమస్యకు న్యాయ సమ్మత పరిష్కారం లభించింది.

"భూమిపై ప్రభుత్వ యాజమాన్యం, కమ్యూనిజానికి పాదార్థిక, సాంకేతిక పునాదుల నిర్మాణానికి దోహదం చేస్తుంది; కమ్యూనిస్టు సామాజిక సంబంధాలకు క్రమక్రమంగా పరివర్తన చెందేందుకు పట్టణాలకు, పల్లెలకు మధ్య గల వ్యత్యాసాలను నిర్మూలించేందుకు ప్రాతిపదిక అవుతుంది."

---

* సోవియట్ సమిష్టి వ్యవసాయ క్షేత్రం : ది. మొరొజోవ్, నొవొస్తి ప్రెస్ ఏజన్సీ ప్రచురణాలయం, 1978, పుట 31.

"సోవియట్ సమాజపు ముఖ్య సంపద అయిన భూమి వ్యవసాయోత్పత్తులకు ప్రధాన సాధనమే గాక, దేశ ఆర్థిక వ్యవస్థలోని సమస్త రంగాల అభివృద్ధికి, సమతూకపు మోహరింపుకు పాదార్థిక పునాది కూడా. భూమిని హేతుబద్ధ శాస్త్రీయ పద్ధతులలో వినియోగించడం, దాన్ని సంరక్షించి, భూసారాన్ని అత్యధిక స్థాయిలో అభివృద్ధి పరచడం సకల సోవియట్ ప్రజల సమిష్టి కర్తవ్యం." *

భూ శాసనం లక్ష్యం, భూ సంబంధాలను క్రమబద్ధం గావించి, తద్వారా భూ వినియోగాన్ని హేతుబద్ధం గావించడం, దాని సారాన్ని శక్తిని పెంపొందించడం, సామాజిక సంస్థల, వ్యక్తులహక్కులను పరిరక్షించడం, భూ చట్టాలకు సంబంధించిన శాసనాన్ని మరింత బలపర్చడం. భూ శాసనంలో, భూ చట్టాల మౌలిక సూత్రాలు, తదితర అఖిల యూనియన్, యూనియన్ రిపబ్లిక్కుల భూ చట్టాలు చేరి వుంటాయి. పర్వతాల, అడవుల, జలసంపదల వినియోగాన్ని క్రమబద్ధం గావించేందుకు ప్రత్యేక శాసనాలు గావింపబడ్డాయి (సోవియట్ యూనియన్, యూనియన్ రిపబ్లిక్కుల భూ చట్టాల మౌలిక సూత్రాల పీఠిక).

ఇంతకుముందే చెప్పినట్లుగా సోవియట్ దేశంలో భూమంతా ప్రభుత్వ ఆస్తి – అంటే రాజ్యాంగ చట్టం ప్రకారం భూమి సకల ప్రజానీకాని దన్నమాట. అట్టి భూమిని ప్రయోజనకరమైన వినియోగానికే ప్రభుత్వం కేటాయిస్తుంది. సోవియట్ దేశపు భూ, జలసంపద అంతా రాజ్య భూ నిధిగా వుంటాయి. ఇందు 1) సమిష్టి క్షేత్రాలకు, ప్రభుత్వ క్షేత్రాలకు, తదితర వ్యవసాయోత్పాదక సంస్థలకు కేటాయించిన భూములు, 2) పట్టణాలు, గ్రామీణ ప్రాంతాల వంటి జనావాసాలకు చెందిన భూమి, 3) పరిశ్రమలు, రవాణా, ఆరోగ్య కేంద్రాలు, తదితర వ్యవసాయేతర భూములు, 4) ప్రభుత్వపు అడవులు, 5) ప్రభుత్వ, జలాగారాలు, 6) ప్రభుత్వ రిజర్వు భూములు – చేరి వుంటాయి. భూ వర్గీకరణ, దాన్ని ఒక తరగతి నుండి మరో తరగతికి బదలాయించడం సోవియట్

* సోవియట్ యూనియన్, యూనియన్ రిపబ్లిక్కుల భూ శాసన మౌలిక సూత్రాల పీఠిక.

యూనియన్, యూనియన్ రిపబ్లిక్కుల భూచట్టాల ద్వారా నియంత్రిత మొనర్చబడింది. అఖిల యూనియన్ ప్రభుత్వానికి, ఆయా యూనియన్ రిపబ్లిక్కుల ప్రభుత్వాలకు వివిధ విషయాలలో భూ సంబంధాలను నియంత్రిత మొనర్చే అధికారముంది. భూ శాసనాల మౌలిక సూత్రాలలోని 5వ నిబంధన యిందు కవకాశం కల్పిస్తోంది.

సమిష్టి క్షేత్రాలకు, ప్రభుత్వ క్షేత్రాలకు, తదితర ప్రభుత్వ వ్యవసాయ, వ్యవసాయేతర సంస్థలకు, ప్రభుత్వ సహకార సంఘాలకు, ప్రభుత్వేతర పారిశ్రామికాది సంస్థలకు, పారిశ్రామిక, రవాణా, తదితర సంస్థలకు, సోవియట్ పౌరులకు సోవియట్ దేశ శాసనాలలో పేర్కొన్న యితర వ్యక్తులకు, సంస్థలకు – భూములు కేటాయించ బడతాయి. 8 వ నిబంధన ప్రకారం సమిష్టి క్షేత్రాలకు, ప్రభుత్వ క్షేత్రాలకు, ప్రభుత్వ సహకార సంస్థలకు, ప్రభుత్వేతర సంస్థలకు, సోవియట్ దేశ పౌరులకు ఉచితంగా భూమి కేటాయించబడుతుందన్న విషయం నొక్కి చెప్పాల్సి వుంది. సమిష్టి వ్యవసాయ క్షేత్రాల ఆధీనంలో గల భూమి వాటికి శాశ్వతంగా స్వాధీనపర్చబడింది. ఇతర సంస్థలు, వ్యక్తులకు సంబంధించి సంతవరకు భూమి తాత్కాలికంగా గాని, నిరవధికంగా గాని కేటాయించవచ్చు. ఏ కాలపరిమితీ విధించకపోతే అట్టి భూమి శాశ్వతంగా వాటి ఆధీనం చేయబడిందన్న మాట.

తాత్కాలిక భూ కేటాయింపన్నది స్వల్ప కాలానికి – అంటే మూడేళ్ళకు, దీర్ఘ కాలానికి అంటే 3 నుండి 10 సంవత్సరాల వరకు ఉండవచ్చు. ఉత్పత్తికోసం అవసరమైతే యీ కాలపరిమితిని, మళ్ళీ అంతే కాలానికి పొడిగించవచ్చు. కొన్ని రకాల భూ కేటాయింపుల కోసం యూనియన్ రిపబ్లిక్కులు చట్టాలను రూపొందించి దీర్ఘతర కాలపరిమితులు నిర్ణయించవచ్చు. అయితే అది 25 సంవత్సరాలకు మించరాదు.

10 వ నిబంధన ప్లాటు కేటాయింపుకు సంబంధించినది. రిపబ్లికు లేదా స్వయం పాలక రిపబ్లికు మంత్రి మండలి తీర్మానంపై యిలాంటి ప్లాటును కేటాయించవచ్చు. సోవియట్ దేశ, లేదా యూనియన్ రిపబ్లిక్ శ్రామిక ప్రజాప్రతినిధుల సోవియట్ కార్య నిర్వాహక వర్గం కూడా యీ

విషయమై నిర్ణయం గైకొనవచ్చు. అలాంటి తీర్మానం, లేదా నిర్ణయంలో భూమి కేటాయించబడిన సంస్థలు, వ్యక్తుల పేర్లు సూచిస్తూ, ఆ కేటాయింపుకు వర్తించే ప్రధాన షరతులను పేర్కొనాలి.

ఒక తూరి కేటాయించాక, ఆ ప్లాటునందలి ఒక భాగాన్ని ప్రభుత్వ లేదా సామాజిక అవసరాల కోసం యూనియన్ రిపబ్లిక్కుల, స్వయం పాలిత రిపబ్లిక్కుల మంత్రి మండలుల తీర్మానంపై గాని, గ్రామిక ప్రజా ప్రతినిధుల సోవియట్ కార్యనిర్వాహక కమిటీ నిర్ణయంపై గాని, చట్టంలో పేర్కొన్న తీరులో తిరిగి తీసుకోవచ్చు. మరీ అసాధారణ సందర్భాల్లోనే సమిష్టి క్షేత్రాలు, ప్రభుత్వ క్షేత్రాలు, వ్యవసాయ సంస్థలు, శాస్త్రీయ, సాంస్కృతిక ప్రాధాన్యతగల సంస్థలు ఉపయోగించుకొనే భూమి నుండి భాగాలను వెనక్కి తీసుకోవడం జరుగుతుంది. అందుకు ప్రబలమైన అవసరమున్నపుడే అలా జరుగుతుంది నీటి పారుదల వసతులు గల భూములను, సాగుయోగ్యము గావించిన భూములను, దీర్ఘ కాల వళ్ళు కాపునిచ్చే తోటలను, ద్రాక్ష తోటలను వ్యవసాయేతర ప్రయోజనాలకై తిరిగి తీసుకుందుకూడా యిలాంటి కఠినమైన షరతులే వర్తిస్తాయి. నీటి నిలుపుదల అడవులు, భూ రక్షణ, వృక్షవాటికలు, తదితర ప్రధాన అటవీ ప్రాంతాలుగా పేర్కొనబడిన (మొదటి రకం అటవీ ప్రాంతాలుగా వర్గీకరించబడిన) భూములను, మరీ ప్రత్యేక పరిస్థితుల్లోనే, యూనియన్ రిపబ్లికు మంత్రి మండలి తీర్మానంపైనే తిరిగి తీసుకునే అవకాశముంది.

ఒక సమిష్టి వ్యవసాయ క్షేత్రం నుండి భూమి తిరిగి తీసుకోవాలంటే, అట్టి సమిష్టి క్షేత్ర సభ్యుల సాధారణ సభ సమావేశం గాని, అధికార పూర్వక ప్రతినిధుల సమావేశం గాని అందుకు ఆమోదించాలి. ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల అఖిల యూనియన్ రిపబ్లిక్ ఆధ్వర్యాన గల యితర ప్రభుత్వ సహకార సంస్థల, ప్రభుత్వేతర సంస్థల విషయంలో ఆయా సంస్థలకూ, అందుకు సంబంధించిన అఖిల యూనియన్, లేదా యూనియన్ రిపబ్లిక్ మంత్రిత్వ శాఖలు, లేదా డిపార్టుమెంటుల మధ్య ఒడంబడిక కుదుర్చుకోవడం ద్వారా స్వాధీనం చేసుకోవచ్చు. ఒకరి వినియోగంలోనున్న భూమిని మరొకరికి బదలాయించాలంటే చట్టబద్ధంగా, ముందు దాన్ని మొదటివారి నుండి తీసుకోవాలి; అటు తర్వాతే రెండవ

వారికి కేటాయించే వీలుంటుంది. పారిశ్రామిక సంస్థలు, యిళ్ళు, రైల్వేలు, మోటారు రోడ్లు, విద్యుత్ ప్రసార తీగెలు, ట్రంక్ పైప్ లైన్లు, తదితర వ్యవసాయేతర ప్రయోజనాలకు భూమిని కేటాయించేందుకు అవసరమైన, వివరమైన నియమాలు మౌలిక శాసనం 10 వ నిబంధనలో పేర్కొన బడ్డాయి. సమిష్టి క్షేత్రాలు, ప్రభుత్వ క్షేత్రాలు, తదితర భూ వినియోగ దారులకు ప్రభుత్వ పట్టాలు ప్రదానం చేయవలసి వుంటుంది. వాటి స్వరూప, స్వభావాలను సోవియట్ దేశ మంత్రి మండలి నిర్ధారిస్తుంది. తాత్కాలిక భూ వినియోగాన్ని చట్టబద్ధం గావించే క్రమాన్ని రిపబ్లిక్కుల శాసనాలు నిర్వర్తిస్తాయి.

మౌలిక భూ శాసనంలోని 11 వ నిబంధన అనాశ్రిత రాబడికి సాధనంగా భూమిని వుపయోగించు కోవడాన్ని నిషేధిస్తోంది. సోషలిస్టు సూత్రాలకెల్ల యిది అతిమౌలికము, కీలకము అయినది. తమకు కేటాయించిన భూములను ఎవరైనా హేతుబద్ధంగా వినియోగించాలి. ప్రక్కనున్న వినియోగదారుల హక్కుల కేమాత్రమూ భంగం కలిగించరాదు. ఆ భూములు కేటాయించబడిన ప్రయోజనాలు నెరవేర్చేందుకే వాటిని వినియోగించాలి. ఆ ప్లాట్లలో నివాస గృహాలు నిర్మించుకోవచ్చు; పంటలు, చెట్లు నాటవచ్చు; అడవులు, పళ్ళతోటలు, అలంకారప్రాయమైన చెట్లు, పొదలు పెంచవచ్చు; పచ్చికబయళ్ళుగా, యితర క్షేత్రాలుగా వినియోగించవచ్చు; అందు లభించే సాధారణ ఖనిజాలు, నీటి వనరులు, యితర ఉపయోగకరమైన సంపదను వాడుకోవచ్చు. భూ వినియోగ దారులకు కలిగిన నష్టాలకు నష్టపరిహారం చెల్లించే విషయం కూడా 11 వ నిబంధనలో పేర్కొనబడింది. తమ స్వాధీనంలో లేని పరిస్థితుల మూలంగా కలిగిన నష్టాలు — తుఫానులు, పెనుగాలులు వగైరా — దీని క్రిందకు వస్తాయి. సోషలిస్టేతర దేశాల్లో యిటి నష్టాలను దైవేచ్ఛగా యెంచి, వారి మానాన వారిని విడిచి పెడతారు. దేశ ప్రయోజనాలను, యితర వినియోగదారుల ప్రయోజనాలను దృష్టియందుంచుకుని వినియోగదారుల హక్కులను పరిమితం గావించవచ్చు కూడా. కాని అలా పరిమితం గావించబడిన వినియోగ దారుల హక్కులను సోవియట్ యూనియన్, ఆయా యూనియన్ రిపబ్లి

క్కుల శాసనాలలో సూచించిన మేరకు తిరిగి యివ్వాలి. వ్యావసాయక, అటవీ భూములలో తమకు తాత్కాలికంగా కేటాయించినఓపన్ కాస్టు లేదా భూగర్భ పద్ధతుల ద్వారా ఖనిజ సంపదను వెలికి తీసే సంస్థలుగాని, భూగర్భ పరిశోధనా కృషి సాగించే సంస్థలుగాని, తాము నిర్మించిన భవనాలు, వగైరాలతో సహా, తమ స్వంత ఖర్చులతో వ్యవసాయ యోగ్యంగానో, అడవులుగానో, చేపల పెంపక కేంద్రాలుగానో-అనగా ఆ భూములు అంతకు పూర్వమున్న రూపంలోకి మార్చి మరీ స్వాధీనం చేయాలి.

పారిశ్రామిక, తదితర కట్టడాలు నిర్మించే సంస్థలు, ఓపన్ కాస్టు పద్ధతి ద్వారా గనులు త్రవ్వే సంస్థలు, తాము త్రవ్వి తీసిన సారవంతమైన భూమి పై పొరను జాగ్రత్తగా తరలించి, భద్రపరచ వలసి ఉంటుంది. ఎందుకంటె ఆ భూములను తిరిగి పేద్యయోగ్యం గావించేందుకు గాని, సారవంతమైన యీ మన్ను నుపయోగించి, తక్కువరకం నేలలను అభివృద్ధి పరచేందుగ్గాని దానిని వినియోగించాలి. ఈ నిబంధనలు పరిశీలించి నట్లయితే భూసారాన్ని, గుణాన్ని కాపాడేందుకు సోవియట్ శాసనాలు ఎంత శ్రద్ధ వహిస్తున్నాయో అర్థమవుతుంది. అలా చేయకపోతే మొత్తం దేశమే తీవ్రమైన నష్టానికి గురవుతుంది.

చట్టం అనుమతించినట్లయితే సమిష్టి క్షేత్రాలు, ప్రభుత్వ క్షేత్రాలు, యితర సంస్థలు సమిష్టి రైతులకు, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్ర కార్మికులకు, గ్రామీణ ప్రాంతాల్లో నివసించే ఉపాధ్యాయులు, వైద్యులు తదితర నిపుణులకు యిళ్ళకోసం, పెరటితోటల కోసం కొంత భూమిని కేటాయించవచ్చు. ప్రభుత్వ, సమిష్టి క్షేత్రాలు వగైరా తమ అధీనంలోగల వ్యవసాయ యోగ్యమైన భూమిలో కొంతభాగం నిరుపయోగంగా పడివుంటే, అవి తమ పొరుగునున్న క్షేత్రాలకు తాత్కాలికంగా వినియోగించుకుందుకై, జిల్లా ప్రజాప్రతినిధుల సోవియట్ కార్యవర్గ తీర్మానం ద్వారా కేటాయించవచ్చు. పారిశ్రామిక, రవాణా, తదితర వ్యవసాయేతర సంస్థలు తాముపయోగించని భూమిని, జిల్లా లేదా నగర ప్రజాప్రతినిధుల సోవియట్ల కార్యవర్గాల నిర్ణయం మేరకు సమిష్టి, ప్రభుత్వ, తదితర వ్యవసాయక్షేత్రాలకు, వ్యక్తులకు కూడా తాత్కాలిక ప్రాతిపదికపై

వ్యవసాయోత్పత్తులు సాగించేందుకు అప్పగించవచ్చు. ఇందుకై వారు అఖిల యూనియన్, రిపబ్లికు చట్టాలలో సూచించిన నిబంధనలను తప్పక పాటించవలసి వుంటుంది. రవాణా, అటవీశాఖ, కలప పరిశ్రమ, తంతి తపాలా, జలసంరక్షణ, మత్స్య, వేట, తదితర ఆర్థిక వ్యవస్థా రంగాలలో పనిచేసే కొన్నిరకాల కార్మికులకు భూములను కేటాయించవచ్చు. ప్రభుత్వ అటవీ సంస్థలు అడవుల పెంపకం ప్రయోజనాలకు భంగకరంకాని రీతిలో, జిల్లా లేదా నగర ప్రజాప్రతినిధుల సోవియట్ కార్యవర్గాల నిర్ణయం మేరకు తాము వినియోగించని తమ అధీనంలోగల భూములను తాత్కాలిక వ్యవసాయ ప్రయోజనాలకై సమిష్టి క్షేత్రాలకు, ప్రభుత్వ క్షేత్రాలకు కేటాయించవచ్చు. ఇందుకు సంబంధించిన క్రమమంతా అఖిల యూనియన్, రిపబ్లిక్ శాసనాలలో సవివరంగా పేర్కొనబడివుంది.

భూముల నుపయోగించేవారెవరయినా, వివిధ ప్రక్రియలద్వారా భూసారాన్ని కాపాడి, వృద్ధిపరచాలని చట్టం విస్పష్టంగా నిర్దేశిస్తోంది. ఈ లక్ష్యసాధనకై దేశ, రిపబ్లిక్ చట్టాలద్వారా పాదార్థిక ప్రోత్సాహకాలు కల్పించవచ్చు.

ఆయా సంస్థలకు కేటాయించిన భూముల వినియోగ హక్కును పూర్తిగాగాని, పాక్షికంగాగాని ఈ క్రింది సందర్భాల్లో రద్దుపరచవచ్చు :

1. ఆ భూమితో అవసరం తీరిన్నాడు;

2. ఆ భూమి కేటాయించబడిన కాలపరిమితి పూర్తి అయినపుడు;

3. అట్టి ఫ్యాక్టరీ, లేదా సంస్థ అంతరించినపుడు;

4. ఇతర ప్రభుత్వ, లేదా సామాజికావసరాలకు ఆ భూమిని ఉపసంహరించాల్సిన అవసరం యేర్పడినపుడు;

5. కేటాయించిన భూమిని వరుసగా రెండేళ్ళపాటు వుపయోగించకుండా వున్నప్పుడు.

తమకు కేటాయించిన పనికిగాక వేరే ప్రయోజనాలకు ఆ భూమిని వినియోగిస్తూన్న సందర్భంలో కూడా దాన్ని ప్రభుత్వం తిరిగి స్వాధీనపరచుకోవచ్చు. యూనియన్ రిపబ్లిక్కులు మరేవైనా చట్టబద్ధమైన కారణాలద్వారా చర్య గైకొనవచ్చు. వ్యక్తుల స్వాధీనంతోనున్న

భూఖండాలను పూర్తిగాగాని, కొంతభాగంగాని క్రింది పరిస్థితుల్లో తీసుకో వచ్చు:

1. తమంతతామే వారు భూ వినియోగాన్ని వదలిపెట్టినపుడు;

2. కేటాయింపు కాలపరిమితి ముగిసినపుడు;

3. ఆ కుటుంబ సభ్యులు మరో శాశ్వత నివాస ప్రాంతానికి వెళ్ళినపుడు;

4. తాము ఏ పనిలో వుంటూ ఆ భూఖండాన్ని పొందడానికి అర్హులయారో ఆ పని మానివేసినపుడు;

5. ఆ కుటుంబ సభ్యులందరూ మరణించినపుడు;

6. ప్రభుత్వ, సామాజిక అవసరాలకోసం ఆ భూమిని స్వాధీన పరచుకోవలసిన పరిస్థితి యేర్పడినపుడు.

ఆ పౌరుడు రెండేళ్ళపాటు వరుసగా ఆ భూమిని వినియోగించ జాలనపుడు, తనకప్పగించిన పనికిగాక వేరే పనికి దానిని వినియోగించినపుడు, భూ శాసనాల మౌలిక సూత్రాలలోని 50వ నిబంధనను ఆ పౌరుడు ఉల్లంఘించినపుడు, భూ సారాన్ని, గుణాన్ని పాడుచేసినపుడు, అటువంటి యితర సందర్భాల్లోనూ ఆ భూమిని అతన్నుండి లాగివేయవచ్చు. యూనియన్ రిపబ్లిక్కుల చట్టాలు యిట్టి విషయంలో యితర కారణాలను కూడా కల్పించవచ్చు.

ప్రభుత్వ, సామాజిక అవసరాలకోసం భూమిని తిరిగి తీసుకుందుకు గల క్రమాన్ని 16వ నిబంధనలో పేర్కొనడం జరిగింది. ఇలా తీసుకోవడం కేవలం ప్రభుత్వ, సమాజ అవసరాలకోసమే జరగాలి. ఇందుకోసం యూనియన్ రిపబ్లిక్, స్వయంపాలిత రిపబ్లిక్ మంత్రిమండలి లేదా ప్రజాప్రతినిధుల సోవియట్ కార్యవర్గ తీర్మానం వుండితీరాలి. చట్టంలో పేర్కొన్న నిబంధనలను తు.చ. తప్పక పాటించాలి. సమిష్టి క్షేత్రాలు, ప్రభుత్వ క్షేత్రాలు, వ్యవసాయ సంస్థలు, శాస్త్రీయ-సాంస్కృతిక ప్రాధాన్యతగల సంస్థలు మొదలైన వాటినుండి భూముల్ని తీసుకోవడం అత్యంత అసాధారణ పరిస్థితుల్లోనే అనుమతించబడుతుంది. నీటిపారుదల వసతులుగల భూములు, సేద్యయోగ్యం గావించిన భూములు, వ్యవసాయేతర కార్యక్రమాలనుద్దేశించిన దీర్ఘకాలం ఫలసాయాన్నిచ్చే పళ్ళతోటలు,

ద్రాక్షతోటలు, జలసంరక్షక అటవీ భూములు వగైరాలను మరీ ప్రత్యేక సందర్భాలలోనే యూనియన్ రిపబ్లిక్కుల మంత్రిమండలుల తీర్మానంపై నిమాత్రమే తీసుకుందుకు వీలవుతుంది.

వ్యవసాయేతర కార్యక్రమాల కై భూములను కోరే సంస్థలు, తమపథకాల రూపకల్పనకు ముందే, వినియోగ దారులతోను, భూ వినియోగాన్ని పర్యవేక్షించే ప్రభుత్వ సంస్థలతోను తమ ప్రాజెక్టు స్థలం విషయంలోను, దానిక్కావలసిన విస్తీర్ణం విషయంలోను ఒక ఒప్పందానికి రావలసి వుంటుంది. సమిష్టి క్షేత్రాలనుండి భూమిని తీసుకోవాలంటే, ఆ క్షేత్రసభ్యుల సర్వసభ్య సమావేశంగాని, అధికారపూర్వక ప్రతినిధుల సమావేశంగాని దాన్ని ఆమోదించాలి. ప్రభుత్వ క్షేత్రాలు, తదితర ప్రభుత్వ సహకార సంస్థలు, ప్రభుత్వేతర సంస్థలనుండి భూములు తీసుకోవాలంటే, వాటి అంగీకారంతోబాటు, అందుకు సంబంధించిన అఖిల యూనియన్ లేదా యూనియన్ రిపబ్లికు మంత్రిత్వ శాఖల, డిపార్టుమెంటుల అనుమతి కూడా గైకొనాల్సి వుంటుంది. 17 వ నిబంధనలో సర్వేకోసం ఉపయోగించే భూ ఖండాల సేకరణకు ప్రత్యేకమైన క్రమం నిర్దేశించబడింది. అట్టి భూ వినియోగదారులకు ఆ భూమిని తీసుకున్నందువల్లగాని, తాత్కాలిక స్వాధీనంవల్లగాని జరిగిన నష్టానికై నష్టపరిహారం చెల్లించడం జరుగుతుంది. అలాగే, వ్యవసాయేతర కార్యక్రమాలకై భూములను తీసుకున్న సందర్భంలో వ్యవసాయోత్పత్తులకు వాటిల్లిన నష్టాన్ని ఆ భూములు పొందిన సంస్థలు పూరించవలసి వుంటుంది. నష్టపరిహార మొత్తాన్ని, నష్టాలను అంచనాగట్టే క్రమాన్ని సోవియట్ దేశ మంత్రిమండలి నిర్ధారిస్తుంది.

భూ అమరకం, భూ కడస్టార్ (భూమిని హేతుబద్ధంగా వినియోగించి, సంరక్షించేందుకై ద్రవ్యసంబంధమైన విషయాల కోసమూ, మేనేజిమెంటు కోసమూ వుంచే భూముల రిజస్టరు) నిర్వహణలపై ప్రభుత్వానికి పూర్తి అధికారముంటుంది. అన్నిరకాల భూ వినియోగంపైనా ప్రభుత్వాధికారం ప్రజాప్రతినిధుల సోవియట్లద్వారాను, వాని కార్యవర్గాలు, పాలక సంస్థల ద్వారాను, సోవియట్ దేశ శాసనాలు నియమించిన విశిష్ట అధికారయుత సంఘాల ద్వారాను చెలాయించబడుతుంది.

మనమిప్పుడు భూముల కేటాయింపు, భూ సార పరిరక్షణ, అలాగే ఇంతకు ముందున్న వినియోగదారులనుండి మరొకరికి బదలాయింపు, అందుకవసరమైన రక్షణలు మున్నగు వానిని గురించి తెలుసుకున్నాం. ఇక వ్యవసాయాని కుద్దేశించిన భూముల గురించి ప్రత్యేకంగా అధ్యయనం చేద్దాం. వ్యవసాయ పనుల కుద్దేశించిన, అందుకోసం ప్రభుత్వం కేటాయించిన భూములన్నీ వ్యవసాయ భూములుగా పరిగణింపబడతాయి. అట్టి భూముల వినియోగదారులైన సోషలిస్టు వ్యవసాయ సంస్థలు, వ్యవసాయాభివృద్ధి పథకాలకు అనుగుణంగా, నానాటికి పెరుగుతున్న వ్యవసాయోత్పత్తుల అవసరాన్ని సమకూర్చే లక్ష్యంతో పనిచేయవలసి ఉంటుంది. ఇట్టి వ్యవసాయ భూముల విస్తీర్ణాన్ని, ఆయా రిపబ్లిక్కుల శాసనాలలో ప్రత్యేకంగా నిర్దేశిస్తేతప్ప ఏమాత్రము తగ్గించడానికి వీలులేదు.

సమిష్టి క్షేత్రాలు, ప్రభుత్వ క్షేత్రాలు, తదితర సహకార ప్రభుత్వేతర సంస్థలకు వ్యవసాయోత్పత్తులకోసం అనియమితకాలానికి, అంటే శాశ్వతంగా వ్యవసాయ భూములు కేటాయింపబడుతాయి. అలాగే, వ్యవసాయ పరిశోధన, విద్యాసంస్థలకు, క్షేత్ర అధ్యయనాలు జరిపేందు కోసమూ, విజ్ఞానశాస్త్రం సాధించిన విజయాలను ప్రయోగాత్మకంగా అమలు జరిపి ప్రచారం గావించేందుకోసమూ, ఆ విధంగా వ్యవసాయాభివృద్ధిని సాధించేందుకోసమూ కూడా ఈ భూముల కేటాయింపు జరుగుతుంది. వ్యవసాయేతర సంస్థలు భూములను ఉపాధార సేద్యానికై పొందవచ్చు. అలాగే, పౌరులు కూడా, ఇతరులను కూలికి పెట్టుకోకుండా సొంతంగా సాగుచేసుకుందుకు భూ ఖండాలను పొందవచ్చు. ఆయా రిపబ్లిక్కుల శాసనాల ననుసరించి సమిష్టి పండ్లతోటల, కూరగాయల తోటల పెంపకానికై సంస్థలకు భూములను కేటాయించవచ్చు. తాత్కాలిక వినియోగానికి కూడా భూములను కేటాయించవచ్చు. ఇలా కేటాయించిన భూముల హద్దులను, ఆయా క్షేత్రాల విస్తరణ, విభజన, వినియోగదారుల మధ్య పునర్విభజన జరిగే సమయంలో, చట్టబద్ధమైన శాస్త్రీయ భూ యాజమాన్య నిర్వహణకై మార్చవచ్చు కూడా. విజ్ఞానశాస్త్ర విజయాలను, ప్రగతిశీల అనుభవం ద్వారా సమకూరిన జ్ఞానాన్ని ఎప్పటికప్పుడు ఉత్పత్తి కార్యక్రమాలకు అన్వయించటం సమిష్టి క్షేత్రాల, ప్రభుత్వ క్షేత్రాల, యితర సంస్థల

విధి విహితమైన బాధ్యత. అంతేకాక వారీ క్రింది బాధ్యతలను కూడా చేబట్టాలి :

1. భూ సారాన్ని పెంపొందించేందుకు, భూములను హేతుబద్ధంగా వినియోగించేందుకు నిర్దిష్టమైన పథకాలను చేపట్టాలి.

2. అత్యంత సమర్థవంతమైన సేద్య పద్ధతులను ప్రవేశపెట్టి ప్రవేశపెట్టి, పంటల మార్పిడి పద్ధతి అత్యంత సమర్థవంతంగా ప్రయోగించాలి; బీడు భూములను వ్యవసాయోత్పత్తులకై సేద్యయోగ్యం గావించాలి.

3. నీటిపారుదల యేర్పాట్లు, మురుగుపారుదల యేర్పాట్లు అభివృద్ధి పరచాలి; పచ్చిక బయళ్ళను పెంచి, సున్నం, .... జిప్సం ఉపయోగించి భూసారాన్ని వృద్ధిచేయాలి;

4. భూమి కోతను, నీరు నిల్వవుండిపోవడాన్ని అరికట్టాలి, భూములు చౌడుబారకుండా చూడాలి; భూరక్షణ వృక్ష వాటికలను పెంచాలి; అడవుల పెంపకాన్ని కొనసాగించాలి; ఇసుక లేవకుండా నిరోధించాలి; వాలు ప్రదేశాలను గట్టిపరచాలి; భూమి కలుషితమవకుండా జాగ్రత వహించాలి;

5 వ్యవసాయ భూముల నుండి రాళ్ళను, పొదలను, చిన్న చిన్న చెట్లను, కలుపు మొక్కలను, చీడలను, వ్యవసాయ వృక్షవ్యాధులను తొలగించాలి.

ఈ నిబంధనలు చూచినట్లయితే, భూములను పెద్ద పెద్ద సమిష్టి క్షేత్రాలకు కేటాయించినందున ఆర్థికంగా గిట్టుబాటయ్యేందుకూ, ఉత్తమ, ప్రగతిశీల వ్యవసాయ పద్ధతుల ననుసరించేందుకు అవకాశముంటుందని తెలుస్తూంది.

1950 దశకం ఆరంభం నుండి సమిష్టి క్షేత్రాల మధ్యపరస్పరసహకారం పెంపొందించడం వల్లను, వాని ఆర్థిక పారిశ్రామికనిధులను, శ్రామికవనరులను సమీకృతం చేసినందువల్లను వ్యవసాయోత్పత్తులలో గణనీయమైన పెరుగుదల కన్పించింది. ఇదంతా విడివిడి సమిష్టి క్షేత్రాలకు అన్నింటికీ మొత్తంగాను లాభసాటి అయినందున యీ క్రమం, ఎవరి బలవంతమూ లేకుండా వాటి స్వేచ్ఛాయుత సహకారంతో అమలు జరుగుతూంది. ఈ

విధానంవల్ల సమిష్టి క్షేత్రాల ఉమ్మడి యాజమాన్యం మరింత ఉన్నత స్థాయికి అభివృద్ధి చెంది, సోషలిస్టు యాజమాన్యానికి మరింత దగ్గరవుతుందని మన మీ సందర్భంలో గమనించాల్సివుంది.

పెద్ద పెద్ద పెట్టుబడిదారీ భూస్వాములు కూడా, భారీయెత్తున సాగించే వ్యవసాయం చాలా లాభసాటియని గమనిస్తున్నారనేందుకు సందేహం లేదు. కాని, యీ విధమైన పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానం సంపద మరింత కేంద్రీకృతమయ్యేందుకు, దాంతోపాటు అధికసంఖ్యాకుల దారిద్ర్యం యిబ్బడిముబ్బడిగా పెరిగేందుకు, పారిశ్రామిక గుత్త సంస్థలు మరింతగా మార్కెట్లపై ఆధిపత్యం సంపాదించేందుకు, తద్వారా ధరలలో అనూహ్యమైన ఎగుడు దిగుడ్లు వచ్చి పడేందుకు దారితీస్తోంది. ఈ ఒడిదుడుకులు, వ్యవసాయోత్పత్తుల పెరుగుదలపట్ల రైతుల ఆసక్తిని దెబ్బతీస్తాయి. దాంతో పెరుగుదల వేగము ఆగిపోతుంది. సంక్షోభాలు, మాంద్యాలు వ్యాపిస్తాయి. సోషలిస్టు వ్యవసాయోత్పత్తి విధానంలో ధరలు, ఉత్పత్తులు కేంద్రీకృత ప్రణాళికా విధానానికి లోబడివుంటాయి. అందువల్ల అస్థిరతకు, ఒడిదుడుకులకు చోటుండదు. అంతేగాక, ఉత్పత్తిలో పెరుగుదలతోపాటు న్యాయమైన, సమానమైన పంపిణీ కూడా కొనసాగుతున్నందున, ఉత్పత్తి నిరంతరాయంగా వృద్ధిచెందుతుంది.

సమిష్టి క్షేత్రాలకు శాశ్వతంగా కేటాయించబడే భూమిలో, సమిష్టి వినియోగానికి కేటాయించే భూమితోపాటు ఇంటిస్థలాలు, పెరళ్ళకింద యిచ్చే భూములు కూడా చేరివుంటాయి. ఈ ఇంటి పెరళ్ళను మిగతా వాటి నుండి స్పష్టంగా వేర్పరచి చూపాలి. ఇళ్ళ స్థలాలకు తగినంతభూమి లభ్యం కాకపోతే సమిష్టి క్షేత్ర రైతుల సర్వసభ్య సమావేశ తీర్మానం ద్వారా గాని, అధికారయుత ప్రతినిధుల సమావేశ నిర్ణయం ద్వారాగాని దాన్ని పెంచవచ్చు. అయితే, యిందుకు ప్రాంతీయ ప్రజాప్రతినిధుల సోవియట్ కార్యనిర్వాహకవర్గ అనుమతి, స్వపరిపాలిత రిపబ్లిక్కు, లేదా యూనియను రిపబ్లిక్కు మంత్రిమండలి అనుమతికావాలి. దేశ భూశాసనాల, మౌలిక సూత్రాలు, తదితర శాసనాల కనుగుణ్యమైన సమిష్టిక్షేత్రసూత్రాల ప్రాతిపదికపై వీటికి కేటాయింపబడిన భూములను, నిర్దిష్టఆర్థిక ప్రయోజనాల సాధనకోసం వినియోగించాలి. ఇళ్ళ స్థలాలను పెరళ్ళకు కేటాయించినభూమిపై

కూలీలను వినియోగించే అవకాశం లేదని గమనించినట్లయితే, సోషలిస్టు భూ యాజమాన్య వ్యవస్థకిదియే మాత్రమూ విరుద్ధం కాదని తేటతెల్లమవు తుంది. సహజంగానే అవి చాలా చిన్నచిన్న భూ ఖండాలుగా వుంటాయి. కేంద్రీకృత సోషలిస్టు ఆర్థిక వ్యవస్థలో వీటి పాత్ర చాలా అప్రధానంగా మాత్రమే వుంటుంది. అయినప్పటికీ, ఇది వ్యవసాయకార్మికులకువ్యక్తిగత ప్రోత్సాహకాలుగా వుంటాయి. వారి వేతనాలు తోడుగా అదనపు వనరుగా వుంటాయి. ఆవిధంగా వారి ఆర్థిక పరిస్థితిని అవి మెరుగు పరుస్తాయి. అయితే అవి వారి మౌలిక ఆదాయవనరు మాత్రం కాజాలవు. సమిష్టి క్షేత్రాలు, ప్రభుత్వ క్షేత్రాలవలె సమాజానికంతటికీ కావలసిన వ్యావసాయకోత్పత్తుల్ని సరఫరా చేయడం యీ ఉప భూఖండాల పని కాదు. తామున్న సంస్థలు, క్షేత్రాలకు పరిమితంగా మాత్రమే ఇది తమ ఉత్పత్తులను సరఫరా చేయగలవు. అందువల్లనే ఆయా సంస్థలు, క్షేత్రాల కనుబంధంగా వున్న కాంటీన్లు, యీ ఉత్పత్తుల నుపయోగించుకుంటాయి. విశ్రాంతి గృహాలు, శానిటోరియంలు, కిండర్ గార్టన్లు, నర్సరీలు తమ కనుబంధంగా నున్న ఇట్టి ఉపక్షేత్రాల నుండి అదనపు ఆహార వస్తు సముదాయాన్ని పొందుతూంటాయి. ఈ ఉపక్షేత్రాలపై అమరకం స్వతంత్రమైనది కాదు. మొత్తము భూములపై ప్రభుత్వ యాజమాన్యము నుండి, ఆయా పని వారు పని చేస్తూన్న క్షేత్రాలు, సంస్థలు, మొదలైన వాటికి ఆ భూములపై గల హక్కు నుండీ మాత్రమే వారికి ఆ అమరకము సంక్రమిస్తుంది. ఈ భూములు ఏ ప్రయోజనం కోసము ఉద్దేశించబడతాయో వాటి కొరకే వినియోగించాల్సి వుంటుంది. అంతేగాక వాటిలో ఆ వుద్యోగి, అతని కుటుంబ సభ్యులు మాత్రమే పని చేయాలి: పరొకర్ని కూలికి పనిచేయించేందుకు వీల్లేదు. నివాస గృహాలు. కొట్టాలు, ఆ ఉపక్షేత్రాల్లో పండించిన ఉత్పత్తులు అవి కేటాయింపబడిన వాటిపై కష్టించిన రైతుల, కార్మికుల వ్యక్తిగత సంపత్తిగా వుంటాయి. చట్టము విధించే పరిమితులకు లోబడి అతడు పశువులు, కోళ్ళు కూడా పెంచుకోవచ్చు.

25వ నిబంధన ప్రకారం ప్రతి సమిష్టి క్షేత్ర రైతుకు సమిష్టి క్షేత్ర నియమావళి ప్రకారం తనకు కేటాయించిన పెరటి తోట పెంచుకునే హక్కు వుంది. ఆ ఇంటిలో నున్న పనిచేయ శక్తిగల యేకైక వ్యక్తిని

సైన్యంలోకి పిలిపించుకున్నా, అతను ప్రజాప్రతినిధిగా తన కర్తవ్య నిర్వహణలో నిమగ్నుడయినా. చదువు సాగించుతూన్నా తానున్న సమిష్టి క్షేత్రం అనుమతిపై వేరే పనేదైనా చేబట్టినా, ప్రభుత్వం పిలుపుపై శ్రామిక బలగంలో వెళ్ళిచేరినా, అట్టి పరిస్థితుల్లో ఇంటిలో సైనద్దు మాత్రమే వుండిపోయి ఆ ఉపక్షేత్రంపై హక్కు ఆ కుటుంబానికే వుండిపోతుంది. ఒక సమిష్టి క్షేత్ర సభ్యుని కుటుంబంలోని వారకదరూ ముసలితనము వల్ల గాని, అశక్తతవల్ల గాని పనిచేసేశక్తిని కోల్పోయిన సందర్భాల్లో సయితం ఆ ఉపఖండం వారి కిందనే వుంకి పోతుంది. సమిష్టి క్షేత్ర నియమావళి ననుసరించి రైతు కుటుంబాలకుతమ పశువులను మేపుకుందుకు పచ్చికబయళ్ళు కేటాయించబడతాయి. 26వ నిబంధన ప్రభుత్వ క్షేత్రాల,తదితర ప్రభుత్వ వ్యవసాయ సంస్థల కార్మిక కుటుంబాల కిచ్చిన ఉపక్షేత్రాలను గురించి వివరిస్తూంది. సమిష్టి క్షేత్ర రైతాంగానికి వర్తించే నియమాల వంటివే వీరికి వర్తిస్తాయి.

27వ నిబంధననుసరించిప్రభుత్వక్షేత్రాలుయితర ప్రభుత్వ వ్యవసాయ సంస్థలు ఇళ్ళ స్థలాలు, పెరటితోటల కోసం, యిందుకై ప్రత్యేకించిన భూములను, తమ కార్మికులకు, ఉద్యోగులకేగాక, గ్రామీణ ప్రాంతాల్లోపని చేస్తూ, నివసించే ఉపాధ్యాయులకు, వైద్యులకు, నిపుణులకు కూడా కేటాయిస్తాయి. ఇదే విధంగా గ్రామీణ ప్రాంతాల్లో నివసించే కార్మికులకు, ఇతర ఉద్యోగులకు, పింఛనుదార్లకు, అశక్తులైన వారికి కూడా ఇలాంటి ప్లాట్లు కేటాయించవచ్చు. ముసలితనం వల్లగాని, అశక్తతవల్లగాని పింఛను పుచ్చుకుని రిటైరయ్యే కార్మికులు. వుద్యోగులు యీ ఉపక్షేత్రాలను తమ క్రిందే వుంచుకోవచ్చు. అలాగే సైనిక సేవకు, విద్యాభ్యాసానికి వెళ్ళిన వారు, ఆ కాలపరిమితి మేరకు ఆ పెరటి తోటలను తమ క్రిందనే వుంచుకోవచ్చు.

పైన పేర్కొన్న వారం దరికి ప్రభుత్వ భూములు, అడవులు వ్యవసాయేతర భూముల నుండి పచ్చిక బయళ్ళను కేటాయించ వచ్చు. అలాంటి బీళ్ళు లేని పక్షంలో సమిష్టి క్షేత్రాలు, ప్రభుత్వ క్షేత్రాలు, తదితర వ్యవసాయ సంస్థలు పశువుల మేతకై చట్టబద్ధంగానే వేరే భూముల్ని కేటాయించ వచ్చు. అయితే ఆవశువుల యజమానులే పచ్చిక బయళ్ళను,

క్షేత్రాలను పెంచేందుకు, కాపాడేందుకు అయ్యే ఖర్చును భరించ వలసి వుంటుంది. పెకు నుద హరించిన తరగతులకు చెందిన పౌరులు ప్రభుత్వ రిజర్వ్ భూభాగాల నుండి, అటవీ భూముల నుండి రైలు మార్గాలు రోడ్ల వెంటగల భూ భాగాల నుండి, వ్యవసాయేతర భూముల నుండి ఎండు గడ్డి కోసు కొచ్చుకుందుకు తగుసహాయం లభిస్తుంది. సమిష్టి క్షేత్రాలు, తదితర సంస్థలు. తమ కవసరము లేని భూముల్ని తాత్కాలికంగా యితరులు వినియోగించుకుందుకు కేటాయించే అవకాశముండేది. ఈ కేటాయింపు జిల్లా ప్రజాప్రతినిధుల సోవియట్ కార్య వర్గము చేయవలసి వుంటుంది. ఒక నిర్దిష్ట కాలానికి కొంతభూభాగాన్ని తీసుకున్న వ్యవసాయ క్షేత్రం, దానిని ఇచ్చిన క్షేత్రానికి. తాను ఆ భూమిని వాడు కున్న కాలానికి సంపలి పరిహారం చెల్లించాలి.

## పట్టణ ప్రాంత స్థలాలు

భూ శాసనాల మౌలిక సూత్రాల్లో పట్టణ ప్రాంత స్థలాలకు సంబంధించి అనేక నిబంధనలున్నాయి. ఈ పట్టణ స్థలాల్లో యీ క్రిందివి చేరి వుంటాయి;

1. పట్టణ నిర్మాణ స్థలాలు;
2. సార్వజనికఉపయోగాని కుద్దేశించిన స్థలాలు;
3. వ్యవసాయ క్షేత్రాలు, తదితర భూములు;
4. ప్రభుత్వ అటవీ భూములు;
5. రైల్వేలు, నీటి సరఫరా, గొట్టపు మార్గాలు, గనుల పరిశ్రమ వర్గాలకు అవసరమైన భూమి.

నగర పొలిమేరల్లో వుండే భూమంతా పట్టణ ప్రాంత భూమిగా వర్గీకరింప బడుతుంది. అట్టి పట్టణ ప్రాంత భూమి ఆ నగర ప్రజా ప్రతినిధుల సోవియట్ అధికార పరిధిలో వుంటుంది. మొత్తం పట్టణ ప్రాంత భూముల నిర్వహణ, కేటాయింపులు, ఉపసంహరణలు, వాటి వినియోగానికి గల షరతులు, నగర సరిహద్దులను నిర్ధారించడం, మార్పు చేయటం వంటివి సోవియట్ దేశ, యూనియన్ రిపబ్లిక్కుల శాసనాల ద్వారా జరుగు

తాయి. నగర హద్దులలోగల భూమిని కూడా సమిష్టి క్షేత్రానికో, లేదా ప్రభుత్వ క్షేత్రానికో కేటాయించేందుకు అవకాశముంది. అలాంటి భూములు ఆయా క్షేత్రాలకు శాశ్వత వినియోగానికై కేటాయించ బడతాయి. నగర ప్రజా ప్రతినిధుల సోవియట్ కార్యనిర్వాహక వర్గంతో ఒప్పందం కుదుర్చు కోవడం ద్వారా యీ కేటాయింపులు జరుగుతాయి. అలాంటి ఒప్పందాలలో నివాసగృహాలు, సాంస్కృతిక కేంద్రాలు, ఉత్పత్తి భవనాల గురించి నిర్దిష్టంగా పేర్కొనాలి. నగర హద్దులకు వెలుపలగల మజరాలు, అటవీ ప్రాంతాలు నగర హద్దులను, ఆవాస ప్రాంతాలను యింకా పొడిగించేందుకు, నగర ప్రజోపయోగ సంస్థల నిర్వహణ— విస్తరణలకు, అడవుల పెంపకానికీ, రక్షక, ఆరోగ్య పరిరక్షణా లక్ష్యంతో చెట్ల పెంపకానికీ, విశ్రాంతి—వినోద కేంద్రాల నిర్మాణానికి ఉద్దేశించిన ప్రాంతాలు చేరి వుంటాయి. మజరాలు, చెట్ల పెంపక ప్రాంతాలు, చట్టప్రకారం కేటాయించబడతాయి. పట్టణ ఆవాస ప్రాంతాలకు కేటాయించిన భూమిలో కొంత భాగాన్ని కూడా అవసరమనుకుంటె సమిష్టి క్షేత్రాలకు, ప్రభుత్వ క్షేత్రాలకు, మజరాలు, చెట్ల పెంపక ప్రాంతాలుగా కేటాయించ వచ్చు. గ్రామీణ ఆవాస ప్రాంతాల భూముల కేటాయింపు ఆయా గ్రామ ప్రజా ప్రతినిధుల సోవియట్ల అధీనంలో వుంటుంది. ముమ్ముందు అభివృద్ధి పరచేందుకుద్దేశించిన భూమిని యితర భూములనుండి వేర్పరచి, వాటి లే-అవుట్, నిర్మాణ పథకాల ననుసరించి ఆయా నివాసప్రాంతాల హద్దులను నిర్ధారిస్తారు. గ్రామీణ ఆవాస ప్రాంతాల భూభాగాలు, వాటిలో మార్పులు-చేర్పులు యూనియన్ రిపబ్లిక్కుల గృహ నిర్మాణ సహకార సంఘాల చట్టం గ్రామీణ గృహ నిర్మాణ సంస్థల చట్ట పరిధిలోకి వస్తాయి. అలాగే తమ స్వంత యిళ్లు నిర్మించుకునే పౌరులకు జనావాస ప్రాంతాలలోను, ప్రభుత్వ రిజర్వు భూములలోను, నగర రక్షక, వృక్ష వలయానికి వెలుపల గల ప్రభుత్వ అటవీ ప్రాంతాలలోను యిళ్ళ స్థలాలు కేటాయించవచ్చు.

పారిశ్రామికోత్పత్తి, రవాణా సంస్థలకు, ఆరోగ్య, విశ్రాంతి కేంద్రాలకు భూమి కేటాయించ బడుతోంది. అయితే యివన్నీ వ్యవసాయేతర భూములే. ఇలాంటి సంస్థలకు భూములు కేటాయించేందుకు, అందుకై నిర్ణయించిన క్రమాన్ని అనుసరించాలి; అఖిల యూనియన్,

ఆయా యూనియన్ రిపబ్లిక్కుల మంత్రిమండలుల అనుమతిని పొందాలి. ఆరోగ్య పరిరక్షణ, చికిత్సా విలువ కలిగిన భూములను ఆరోగ్య కేంద్రాలకు, వైద్య సంస్థలకు కేటాయిస్తారు. అటి కేటాయింపులకు ప్రత్యేక రక్షణ వుంటుంది. ఈ ప్రాంతాలలో ఆరోగ్య సంరక్షక మండలాలు నెలకొల్పబడ్డాయి. వీటి ఆరోగ్య సంరక్షక ధర్మాలకుగాను, ప్రజల విశ్రాంతికి భంగకరమైన పారిశ్రామిక, తదితర సంస్థలకు యీ ప్రాంతాల్లో అనుమతి లభించదు. విశేష శాస్త్రీయ, సాంస్కృతిక విలువగల ప్రకృతి సంపద నిండివున్న ప్రాంతాలను– ఉదాహరణకు ముచ్చటైన, అపురూపమైన ప్రకృతి సౌందర్యంగల ప్రాంతాలు, అరుదైన వృక్షసంపద, జంతుజాలము, భూగర్భ నిర్మాణాలు గల ప్రాంతాలు– రక్షిత మండలాలుగా పరిగణించి, వానికి చట్టపరమైన రక్షణ కల్పించబడుతుంది. అలాంటి రక్షిత మండలాల సంపత్తికి నష్టదాయకమైన కార్యకలాపాలన్నీ నిషిద్ధాలు. పరిశ్రమలు, రవాణా, తదితర వ్యవసాయేతర సంస్థల క్రింద వుండే భూములను వ్యవసాయోత్పత్తులకై కేటాయించే అవకాశముంది. రవాణా, అటవీ శాఖ, కలప పరిశ్రమ, తంతి– తపాలా, జలాశయాలు, చాపల వేట వగైరా శాఖల్లో పనిచేసే కొన్నిరకాల కార్మికులకు కూడా ఉత్పాదక లక్ష్యాల కోసం భూములు కేటాయించే అవకాశముంది.

## అడవులు

ఇప్పటికే దట్టంగా అడవులు పెరిగివున్న భూములను అడవుల పెంపకం కోసం నిర్దేశించిన భూములను ప్రభుత్వ అటవీ భూములని పిలుస్తారు. జిల్లా లేక నగర ప్రజా ప్రతినిధుల సోవియట్ల కార్యవర్గాలు తీర్మానించినట్లయితే ప్రభుత్వ అటవీశాఖ తన భూములలో కొంతభాగాన్ని సమిష్టి క్షేత్రాలకు, ప్రభుత్వ క్షేత్రాలకు, ఇతర సంస్థలకు కేటాయించవచ్చు. అందుకోసం అనుసరించవలసిన క్రమం చట్టంలో స్పష్టంగా నిర్దేశించబడి వున్నది.

వ్యవసాయాన్ని, భూ సారాన్ని పరిరక్షించి, అభివృద్ధి పరచుటకు అనువుగా అత్యధిక స్థాయిలో హేతు బద్ధంగా, సమర్ధవంతంగా భూ విని

యోగాన్ని కొనసాగించే కర్తవ్యం ప్రభుత్వంపై ఉన్నది. ఇందుకోసం ఇప్పటికే సాగులో ఉన్న భూములను క్రొత్తవాటిని అభివృద్ధి పరచాలి. అలాగే సమిష్టి క్షేత్రాలు, ప్రభుత్వ క్షేత్రాలు తదితర వ్యవసాయ సంస్థల అధీనంలో గల భూములను సరైన పద్ధతులలో నిర్వహించేలా చూడాలి. పంటల మార్పిడి పద్ధతిని కూడా విస్తృతంగా ప్రవేశపెట్టాలి. భూమి కోత నివారణకు ప్రత్యేక చర్యలు గైకొనాలి. మరిన్ని ఎక్కువ భూములను వ్యవసాయయోగ్యం గావించేందుకు పాటుపడాలి. ఇందుకోసం భూఖండాలను కేటాయించేందుకు లేదా ఉపసంహరించేందుకు నగర పట్టణ, గ్రామీణ ఆవాస ప్రాంతాల హద్దులను నిర్ణయించేందుకు, మార్చేందుకు భౌగోళిక భూగర్భ, వృక్ష శాస్త్ర, భూ సంబంధమైన పరిశోధనలను, సర్వేలను జరిపించేందుకు ప్రభుత్వానికి అధికారమున్నది భూ వినియోగదారుల భాగ స్వామ్యంతో భూ నిర్వహణ పథకాలను ప్రభుత్వం రూపొందిస్తుంది. అందువల్ల స్థానిక స్థాయిలో ప్రజాతంత్ర పర్యవేక్షణ, ప్రజాతంత్ర పని విధానాలకు హామీ లభిస్తుంది.

సమిష్టి క్షేత్రాలు, ప్రభుత్వ క్షేత్రాలు, ఇతర ప్రభుత్వ, సహకార, ప్రభుత్వేతర సంస్థలకు మధ్య తలెత్తే వివాదాలను ఆయా రిపబ్లిక్కు భూ శాసనాలలో పేర్కొన్న పద్ధతిలో యూనియన్ రిపబ్లిక్కుల, స్వయంపాలిత రిపబ్లిక్కుల మంత్రి మండలులు, ప్రాంతీయ, మండల, క్షేత్ర, జిల్లా, నగర, గ్రామ ప్రజాప్రతినిధుల సోవియట్ల కార్యవర్గాలు పరిష్కరిస్తాయి. ఒక యూనియన్ రిపబ్లిక్కు, మరొక యూనియన్ రిపబ్లిక్కుతో వివాదం తలెత్తినప్పుడు, అందుకు సంబంధించిన రిపబ్లిక్కులకు సమాన ప్రాతినిధ్యంగల కమీషను ఆ వివాదాన్ని పరిశీలిస్తుంది. ఆ కమీషను ఒక నిర్దిష్ట నిర్ణయానికి రాలేక పోయినట్లయితే. అఖిల యూనియన్ మంత్రి మండలి దానిని చేబడుతుంది. నగరాలు, పట్టణాలు, గ్రామీణ నివాస ప్రాంతాలలోని భవనాల ఉమ్మడి యజమానుల మధ్య వివాదాలు తలెత్తినపుడు న్యాయస్థానాలు, చట్టప్రకారం వాటిపై తీర్పునిస్తాయి. ప్రభుత్వ భూ యాజమాన్య హక్కుకు ప్రత్యక్షంగా గాని, పరోక్షంగా గాని భంగకరమైన అమ్మకాలు, కొనుగోళ్ళు, తాకట్టులు, దానాలు, కవులు కివ్వడం వంటి చర్యలు చట్టవిరుద్ధమైనవి, అవి చెల్లనేరవు. ఇలాంటి చట్ట

విరుద్ధమైన లావాదేవీలలో పాల్గొనేవారు చట్ట విరుద్ధమైన భూ ఆక్రమణలు జరిపేవారు, భూ వినియోగం విషయంలో నిర్లక్ష్యపైఖరి నవలంభించే వారు, వ్యవసాయ తదితర రకాలకు చెందిన భూముల నుండి అనార్జితా దాయాలను పొందజూచేవారు, దుర్వినియోగపరచేవారు, మురుగుపారుదలను నిర్లక్ష్యంచేసేవారు, భూసార అభివృద్ధికై నిర్దేశించిన తప్పనిసరి విధులను పాటించనివారు, గాలి. నీరు వల్ల జరిగే భూమి కోతను నిరోధించజాలని వారు, అది ఉద్దేశింపబడిన పనులకు అనువైన స్థితిలో భూములనుంచ జాలనివారు, భూహద్దులను చెరిపివేసేవారు చట్టప్రకారం అందుకు బాధ్యత వహించవలసి వుంటుంది, శిక్షననుభవించవలసి వుంటుంది. తగిన అనుమతి పొందకుండా ఆక్రమించిన భూఖండాలను వాటి అధికారయుత వినియోగదారులకు తిరిగి ఇచ్చివేయడమేగాక, చట్ట విరుద్ధంగా తమవినియోగంలో వున్నకాలంలోతాముచేసినభూ అభివృద్ధికార్యక్రమాలకై నఖర్చులను పరిహారంగా పొందే హక్కు కూడా వారికుండదు. భూ వినియోగ నిబంధనలను ఒక క్రమపద్ధతిలో ఉల్లంఘించే వారెవరయినా తమ అధీనంలోగల భూఖండాలను కోల్పోక తప్పదు. భూ శాసనాలను ఉల్లంఘించినందు వల్ల జరిగిన నష్టాన్ని పూరించేందుకై ఆయా సంస్థలు నష్టపరిహారాన్ని కూడా చెల్లించ వలసి వుంటుంది.

భూ శాసనాల మౌలిక సూత్రాల సారాంశాన్ని యీ ప్రకరణంలో పొందుపర్చడం జరిగింది. ఈ శాసనాల ప్రధాన లక్ష్యం సమాజ ప్రయోజనాలను, ఆ భూమిపై పనిచేసే కార్మికుని వ్యక్తిగత ప్రయోజనాలతో మేళవించడమే. సోషలిస్టు సామాజిక వ్యవస్థవల్ల పరిస్థితులలో కలిగిన మార్పు వలనే యిది సాధ్యమయింది. తద్వారా జాతీయార్థిక వ్యవస్థలో అవిభాజ్య భాగంగా వ్యవసాయ రంగాన్ని మరింత అభివృద్ధి పరచి, అత్యున్నత స్థాయికి గొని పొయ్యేందుకు, ప్రజా సంక్షేమాన్ని నిరంతరాయంగా పురోగమింప జేసేందుకు అపారమైన అవకాశాలు ఆవిష్కరించ బడ్డాయి.

5 వ ప్రకరణము

# సోవియట్ పింఛను చట్టం

ఇక నిష్కృమ వ్యక్తులు పింఛను చట్టాన్ని, సమిష్టి క్షేత్ర సభ్యుల పింఛన్లు, భత్యాల చట్టాన్ని పరిశీలించడం సమంజసంగా వుంటుంది. పింఛను పొందే వయస్సుకు చేరుకున్నందువల్లగాని, మరేవిధంగా గాని పింఛను పొందే అర్హత గల వారంతా దాదాపుగా పీటి క్రిందికి వస్తారు.

నూతన రాజ్యాంగ చట్టం చిత్తు ప్రతిని సమర్పిస్తూ ఎల్. ఐ. బ్రెజ్నెవ్. పిల్లల పెంపకం మీద పౌరులకు గల బాధ్యతల విషయం తెలియజేసే నిబంధనను గురించి చెబుతూ, పిల్లలుకూడా తమ తల్లి దండ్రులమీద తమ బాధ్యతలను నిర్వర్తించవలసి ఉంటుందనీ, వారికి అన్ని విధాల తోడ్పడవలసి ఉంటుందని పేర్కొన్నారు. "ఈ అంశాన్ని చేర్చా లన్న ప్రతిపాదనలు పెద్దవారి నుండే కాక బాలలనుండి, యువకులనుండి కూడా రావడం ముదావహము"ని పేర్కొన్నారు. సోవియట్ దేశంలో తమ పెద్దలపట్ల పిల్లలకు అపారమైన ఆదరణ, ప్రేమాభిమానాలు ఉన్నా యని పేర్కొనడంలో అత్యుక్తి ఏమీ లేదు. వారి ముందు తరాల వారు విప్లవ కాలంలో నిస్వార్థంగా, తమ సర్వస్వము ఒడ్డి పోరాడమే కాక, సోషలిస్టు వ్యవస్థను కాపాడ్డానికి దేశభక్త మహాయుద్ధ కాలంలో రెండవ ప్రపంచ యుద్ధంలో) సోవియట్ మాతృదేశ స్వాతంత్ర్యాన్ని కాపాడ్డానికై అపారత్యాగాలు చేశారు. అంచేత సోవియట్ దేశం, తన పౌరులందరికి వారి జీవిత సంధ్యా సమయంలోను, వారు మరే కారణం చేతనైనా అశక్తులై ఉన్నప్పుడు, లేదా వారికి సహాయం కావలసి వచ్చినప్పుడు, వారి పట్ల విశేష శ్రద్ధ గైకొంటూంది. ఏ సోవియట్ పౌరుడైనా తన విద్యను

ఉద్యోగాన్ని గురించి ఎలా నిశ్చింతగా ఉండవచ్చో, అలాగే తన వృద్ధాప్యాన్ని గురించి కూడా బెంగ పెట్టుకో వలసిన అవసరం ఏమాత్రమూ లేదు. 1936 రాజ్యాంగ చట్టంలోనే సోవియట్ దేశం "తమ పౌరులందరికి వృద్ధాప్యంలోను, జబ్బు అశక్తత ప్రాప్తించినప్పుడు సంపూర్ణ పాదార్థిక భద్రత పొందే హక్కును" కల్పించింది ఇది అక్టోబరు సోషలిస్టు మహా విప్లవం సాధించిన మహత్తర విజయాలలో ఒకటి. ఈ విషయం రాజ్యాంగ చట్టంలోనే స్పష్టంగా పేర్కొనబడింది.

"సోవియట్ దేశంలో నెలకొల్పబడిన సోషలిస్టు వ్యవస్థలో, మనిషిని మనిషి దోచుకోవడం, నిరుద్యోగం, రేపంటే శ్రామిక ప్రజానీకంలో అనిశ్చిత స్థితిని శాశ్వతంగా తుడిచి పెట్టబడటం వారి పింఛను సౌకర్యానికి హామీ కల్పిస్తూంది. సోవియట్ దేశంలో పింఛన్‌లు పూర్తిగా ప్రభుత్వ నిధులనుండి సార్వజనిక నిధుల నుండి చెల్లింపబడుతున్నాయి."

"సోవియట్ ప్రజ కమ్యూనిష్టు పార్టీ నాయకత్వాన, ప్రవర్థిత సోషలిస్టు ఆర్థిక వ్యవస్థ నిర్మాణంలో సాధించిన విజయాలు పింఛను వ్యవస్థను మరింత పెరుగు పరచేందుకు అవకాశాల నిస్తున్నాయి." సోవియట్ దేశ సుప్రీం సోవియట్, 1956, జూలై 14 వ తేదీన ఆమోదించిన పింఛను చట్టంలోని పీఠికలోనున్న పై వాక్యాలు, ఈ పింఛను వ్యవస్థ ప్రాతిపదికను, దాని లక్ష్యాలను చాటి చెబుతున్నాయి.

ప్రభుత్వ పింఛనులు ఈ క్రింది తరగతుల వారికి చెల్లించబడతాయి:

1) కర్మాగార కార్యాలయ, తదితర పనివారు;

2) సైనికులు;

3) ఉన్నత, సెకండరీ, వృత్తి విద్యా సంస్థల ట్రెయినింగ్ పాఠశాలల ఉపాధ్యాయులు, ఇతర సిబ్బంది;

4) ప్రభుత్వ విధుల నిర్వహణలో అశక్తులైన ఇతర పౌరులు;

5) పైన పేర్కొన్న కుటుంబాలలో కుటుంబ పోషకుడు చనిపోయినప్పుడు వారి కుటుంబ సభ్యులకు (అ) ముసలితనం లోను, (ఆ) అశక్తత ప్రాప్తించినపుడు, ప్రభుత్వ పింఛన్‌లు చెల్లించబడతాయి.

ఒక వ్యక్తికి అనేక విధాల పింఛను పొందే హక్కు ఉన్నప్పుడు తనకు నచ్చిన పింఛన్ను ఎంపిక చేసుకునే హక్కు అతనికే ఉంటుంది. నగర, జిల్లా ప్రజాప్రతినిధుల సోవియట్ కార్యవర్గం నెలకొల్పిన పింఛను కమీషన్, అందుకు హక్కుగల పౌరులు దరఖాస్తు చేసిన మీదట పింఛనులను మంజూరు చేస్తుంది. ఇట్టి పింఛను దరఖాస్తులను పంపుకోడానికి నిర్దిష్ట కాలపరిమితి అంటూ లేదు. ఈ పింఛను కమీషన్‌వారి నిర్ణయాల పై అసంతృప్తి చెందినవారు, జిల్లా [పట్టణ] ప్రజా ప్రతినిధుల సోవియట్ కార్యవర్గానికి అప్పీలు చేసుకోవచ్చు. ఇందువల్ల పింఛనులు మంజూరు చేసే పద్ధతి ప్రజాతంత్రయుతంగా సాగేందుకు అవకాశముంటుంది.

పింఛనులను ప్రభుత్వమే చెల్లిస్తుంది. ఇందుకోసం సోవియట్ దేశ ప్రభుత్వ బడ్జెట్ నుండి నిధులు కేటాయించ బడతాయి. ఇదేగాక, వివిధ కర్మాగారాది సంస్థలు, ఇతర వ్యవస్థలు చెల్లించే నిధులతో కూడిన ప్రభుత్వ సామాజిక భీమా నిధులు కూడా ఉన్నాయి. వీటికోసం కార్మికుల, ఉద్యోగుల వేతనాలు, జీతాలలో ఏ విధమైన కోత విధించబడదు

కర్మాగార, కార్యాలయ తదితర కార్మికులు మగవారైతే 25 ఏండ్లకు తక్కువ కాకుండా సర్వీసు చేసి, 60 సంవత్సరాల వయస్సుకు చేరుకోగానే పింఛను లభిస్తుంది. ఆడవారైతే 20 ఏండ్లకు తక్కువగాని సర్వీసుతో, 55 సంవత్సరాల వయస్సు నిండితే చాలు. అయితే భూగర్భంలో పనిచేసేవారు, ఆరోగ్యానికి హానికరమైన పరిస్థితులలో పని చేసే వారు, ఉష్ణ విభాగాల్లో పనిచేసేవారు, మంత్రిత్వశాఖ ఆమోదించిన జాబితా ప్రకారం పురుషులయితే 20 ఏళ్ళకు తక్కువగాని సర్వీసుతో 50 యేళ్ళు నిండగానే పింఛను హక్కు పొందుతారు; మహిళలయితే 15 సంవత్సరాల సర్వీసుతో 45 సంవత్సరాల వయస్సు నిండగానే, పింఛను హక్కు పొందుతారు. సోవియట్ దేశ మంత్రిమండలి ఆమోదించిన పట్టికననుసరించి యితర కష్టమైన శాఖలలో పనిచేసే పురుషులు 25 సంవత్సరాలకు తగ్గని సర్వీసుతో 55 సంవత్సరాలు నిండగానే, మహిళలయితే 20 సంవత్సరాల సర్వీసుతో 50 సంవత్సరాల వయస్సు నిండగానే పింఛను హక్కు గడిస్తారు. పింఛను పొందేందుకు అవసరమైన సర్వీసులో సగం

మాత్రమే పూర్తి చేసి, మిగతా సగం కాలం యితర సాధారణ పనిలో గడిపినా పింఛను పొందే హక్కు వుంటుంది.

ఐదుగురు బిడ్డలను కని, వారిని 8 యేళ్ళ వయస్సు నిండే వరకు పెంచిన తల్లులు, 15 సంవత్సరాలకు తగ్గని సర్వీసు చేసి 50 యేళ్ళ వయసు నిండగానే పింఛను హక్కు పొందుతారు.

గుడి పనివారి విషయంలో పురుషులు 15 సంవత్సరాల తగ్గని సర్వీసు, 50 సంవత్సరాల వయసు చేరగానే పింఛను హక్కు పొందుతారు; మహిళలు 10 సంవత్సరాల సర్వీసు, 40 సంవత్సరాల వయసు నిండగానే ఈ హక్కు పొందుతారు. మరుగుజ్జులయిన పురుషులు 20 ఏళ్ళ సర్వీసు, 45 ఏళ్ళ వయసు నిండిన తర్వాత; మహిళలు 15 సంవత్సరాల సర్వీసు, 40 సంవత్సరాల వయసు నిండగానే పింఛను హక్కు పొందుతారు. పింఛను అర్హతకై అవసరమైన సర్వీసునంతా పూర్తి చేయని వారు కూడా తాము చేసిన సర్వీసు కనువైన అనుపాతంలో పింఛను పొందుతారు [అయితే పూర్తి పింఛన్‌లో యిది నాలుగో వంతుకు తగ్గరాదు.] అయితే పింఛను దరఖాస్తు పంపేటనే నాటికి ముందు మూడేళ్ళ సర్వీసుతో సహా 5 సంవత్సరాలకు తక్కువకాని సర్వీసు ఉండాలి.

శరీర పాటవంతో నిమిత్తం లేకుండా వృద్ధాప్య పింఛను జారీ చేయబడుతుందని వేరే చెప్పనక్కరలేదు.

ఇకనిప్పుడు, కార్మికులకు అశక్తతా పింఛన్ల విషయం చూద్దాం. పింఛను చట్టం 18 వ నిబంధనలో అశక్తత అంటే, శాశ్వతంగానాని, దీర్ఘకాలంగాని పనిచేసే శక్తి కోల్పోవడంగా నిర్వచించబడింది. అట్టి కార్మికులు పని కాలంలో అశక్తులయినా, పని ప్రారంభించక ముందే గాని, రిటైరయ్యాక గాని అశక్తులైనా, యీ అశక్తతా పింఛను మంజూరవుతుంది. కార్మికులు పొందిన అశక్తత తీవ్రతను బట్టి మూడు తరగతులుగా విభజింప బడతారు. సోవియట్ దేశ మంత్రిమండలి నిర్ధారించిన క్రమం మేరకు వైద్య - కార్మిక నిపుణుల ఉప సంఘాలు యీ వర్గీకరణ చేస్తాయి.

(అ) పారిశ్రామిక ప్రమాదాల, వృత్తి పరమైన జబ్బులవల్లగాని, (ఆ) సాధారణ వ్యాధుల, పనికి సంబంధంలేని ప్రమాదాల మూలంగా

సంభవించే అశక్తతవల్ల గాని పనిచేసే శక్తి నశించినప్పుడు అశక్తతా పింఛను మంజూరు చేయబడతాయి.

పారిశ్రామిక ప్రమాదాల, వృత్తిపరమయిన జబ్బుల మూలంగా అశక్తులైన వారికి వారి సర్వీసుతో నిమిత్తం లేకుండా పింఛను మంజూరవుతాయి. సాధారణ వ్యాధుల మూలంగా అశక్తులైనవారు ఇరవై ఏళ్ళు గాని, అంతకుపై బడ్డ వయస్సు గలవారు గాని అయితే, వారి వయస్సును బట్టి వారు పురుషులయినా, స్త్రీలయినా, వారు మామూలు పనే చేసినా, భూగర్భంలోను, ఆరోగ్యానికి హానికరమైన పరిస్థితులలోను, ఉష్ణవిభాగాలోను పనిచేసే వారయినా పింఛను లభిస్తుంది. ఆడవారికంటె మగవారికి సర్వీసు పరిమితి ఎక్కువగా ఉంటుంది. భూగర్భ పనులు వగైరా కష్టమైన పనుల్లో నియుక్తమైన వారికి తక్కువ సర్వీసు వుండవచ్చు. వీరి వయస్సు ఆడవారికివలె 41 సంవత్సరాలకు పైబడినా, తగ్గినా ఫర్వాలేదు.

ఇరవై యేళ్ళు నిండకముందే సాధారణ వ్యాధులలో అశక్తులయ్యే వారికి క్రింది పరిస్థితులలో పింఛను లభిస్తుంది:

(అ) వారి సర్వీసుతో నిమిత్తం లేకుండా, అశక్తత పనికాలంలో ప్రాప్తించినా, పని నిలుపుదల చేశాక ప్రాప్తించినా;

(ఆ) కనీసం ఒక సంవత్సరం సర్వీసు వున్నవారికి వారు పని ప్రారంభించక ముందే అశక్తత ప్రాప్తించినా పింఛను లభిస్తుంది.

సాధారణ వ్యాధుల మూలంగా అశక్తులయ్యే మొదటి, రెండవ తరగతులకు చెందిన కార్మికులకు పూర్తి పింఛనుకు అవసరమయ్యే సర్వీసు లేనప్పుడు, వారి సర్వీసుకు అనుగుణమయిన అనుపాతంతో పింఛను మంజూరవుతుంది. అయితే ఏ పరిస్థితుల్లోనూ పూర్తి పింఛనుతో అది నాల్గవ వంతుకంటె తక్కువగా వుండదు.

మొదటి రకం అశక్తతకు గురయిన వారికి (వారి అశక్తతకు కారణమేదయినా), వారిపై ఆధారపడివున్న వారి సంఖ్యను దృష్టియందుంచుకుని పింఛనులో కొన్ని ప్రత్యేక పెంపుదలను మంజూరు చేసారు. వారి వేతనంలో 15 శాతం వైద్య భృతిగా మంజూరు చేసారు. 10 లేక 15 సంవత్సరాలు నిరంతరాయమైన సర్వీసుగల వారికి పింఛనులో వరుసగా 10 శాతం, 15 శాతం పెరుగుదల వుంటుంది. అశక్తతా పింఛనులు, వారు

పనిచేయజాలని కాలానికే వర్తిస్తాయి. కాని, 60 సంవత్సరాలకు పైబడిన పురుషులకు, 55 సంవత్సరాలకు పైబడిన స్త్రీలకు వారి దరఖాస్తులపై తిరిగి పరీక్షించి, జీవితాంతం అశక్తతా పింఛను మంజూరు చేస్తారు

ఈ పింఛను నిబంధనలు, యింతకు ముందే మనం చూచిన యితర నిబంధనలు పరిశీలించినట్లయితే, కార్మికవర్గం రాజకీయాధికారం చేబూనిక సోషలిస్టు సమాజంలో, ముందుగా వూహించిన ఏ ఆకస్మిక పరిస్థితుల మూలంగానో కార్మికులు బాధ పడనక్కరలేదు

తమ కుటుంబ పోషకుణ్ణి కోల్పోయిన కార్మిక కుటుంబాలకు వర్తించే పింఛను నిబంధనల గురించి పింఛను చట్టపు నాల్గవ ప్రకరణంవివరిస్తూంది.

ఇలాంటి సందర్భాలలో పింఛనుకు అర్హతగల ఆధారితులు యీ క్రింది విధంగా వర్గీకరింపబడ్డాయి:

(అ) పదహారేళ్ళకు లోపు వయసు గల బిడ్డలు, సోదరులు. అప్పచెల్లెళ్ళు, మనవళ్ళు [అదే బడికెళ్ళే వారయితే 18 సంవత్సరాల వయసు వచ్చే వరకు], అంతకన్నా పెద్ద వయసు కలిగి, 16 సంవత్సరాల యీడు రాకముందే వారు అశక్తులయ్యే లాగుంటే [బడి పిల్లలయితే 18 సం॥ నిండేలోగా]ను; సోదరులు, అప్పచెల్లెళ్ళు, మనుమళ్ళ విషయంలో వారికి పనిచేయ శక్తిగల తలిదండ్రులులేని సందర్భంలోను.

(ఆ) తల్లి, తండ్రి, భార్య, భర్త–మగవారయితే 60 సంవత్సరాలు, ఆడవారయితే 55 సంవత్సరాలు వయస్సు నిండినా, అశక్తులయినా.

(ఇ) భార్యా భర్తల తల్లిదండ్రులలో ఒకరు – వారి వయస్సు, పని చేయగల శక్తి యెట్టిదయినా–అతడుగాని, ఆమెగాని చనిపోయిన సంపాదనాపరుడి 8 సంవత్సరాలు లోపు బిడ్డలను, సోదరులను. అప్పచెల్లెళ్ళను లేదా మనవళ్ళను కనిపెట్టి ఉంటూ పనిచెయ్యని వారైనచో వారికి యీ పింఛను లభిస్తుంది.

చనిపోయిన వ్యక్తికి బిడ్డలు పని చేయజాలని తలిదండ్రులు అతనిపై ఆధారపడేవారు కాకపోయినా, అటు తర్వాత వారు తమ జీవనోపాధిని కోల్పోయినట్లయితే వారికి కూడా ఈ పింఛను సూత్రం వర్తిస్తుంది.

తల్లిదండ్రులు ఇద్దరిమీద ఆధారపడుతూ ఉన్న పిల్లలకు. వారి తల్లిదండ్రులలో ఒకరు చనిపోయి రెండవ వారు పని చేస్తున్నప్పటికీ,

వారికీ పింఛను అర్హత ఉంటుంది. పాఠశాలలలో చదువుతుంటూ విద్యార్థిగా ఉపకార వేతనం పొందుతున్న చనిపోయిన వ్యక్తి బిడ్డలు, సోదరులు; అక్కచెల్లెళ్ళు. మనవళ్ళు కూడా ఇట్టి పింఛన్ పొందడానికి అర్హులౌతారు. కుటుంబ పోషకుడయిన బిడ్డ చనిపోయినపుడు అతని తల్లిదండ్రులు పింఛనుపొందే వయస్సు గలవారు కాక పోయినా, వారు అశక్తులు కాక పోయినా వారికీ పింఛను అర్హత వుంటుంది. చని పోయిన వారి భార్యగాని,భర్తగాని, ఆ మరణానికి అయిదు సంవత్సరాల లోపున ముసలి వారైనా, అశక్తులయినా వారికీ పింఛను పొందే అర్హత వుంటుంది. వారికి వయోజనులైన, పనిచేయ శక్తిగల బిడ్డలు లేనట్లయితే, వారికి పింఛను పొందే వయస్సుగాని,అశక్తతగాని ఎప్పుడు వచ్చాయనే దానితో నిమిత్తం లేకుండా భార్యనుగాని, భర్తనుగాని కోల్పోయినవారికీ పింఛను ఇవ్వబడు తుంది.

వివాహము-కుటుంబాలకు సంబంధించిన సోవియట్ చట్టం దత్త స్వీకారానికి అనుమతిస్తుంది. అట్టి దత్తపుత్రులు, లేక పుత్రికలు స్వంత బిడ్డలతో సమానంగా పింఛను పొందడానికి అర్హులౌతారు. కుటుంబ పోషకుడు చనిపోయినపుడు పింఛను పొందడానికి అర్హతగల పిన్న వయస్కులైన బిడ్డలు, వారు దత్తపుత్రులే అయినప్పటికీ పింఛను పొందే హక్కును కలిగి వుంటారు.

ఒక కార్మికుడు పారిశ్రామిక ప్రమాదం వల్లగాని, వృత్తి పరమైన వ్యాధి వల్లగాని మరణించినపుడు, అట్టి కుటుంబ పోషకుని సర్వీసు కాలంతో నిమిత్తం లేకుండా అతని కుటుంబానికి జీవన భృతి పొందే ఏర్పాటు చేయబడి ఉన్నది. అలాగే, భూగర్భంలోను, హానికరమైన పరిస్థితులలోను, కష్టతరమైన పని పరిస్థితులలోను పనిచేసే కార్మికుల కుటుంబాలకు, కుటుంబ పోషకుడు, పారిశ్రామిక ప్రమాదాలు, లేక వృత్తిపర మయిన వ్యాధులవల్ల మరణించి నట్లయితేకూడా పింఛను లభిస్తుంది. ఇట్టి సందర్భాల్లో లభించే కనీస గరిష్ఠ పింఛనులు చట్టంలో నిర్దిష్టంగా పేర్కొనబడ్డాయి. సాధారణ వ్యాధులతో మరణించే కార్మికుల విషయంలో కూడా ఇట్టి ఏర్పాటున్నది. అశక్తతా పింఛను పూర్తిగా పొందుటకు అవసరమైన సర్వీసులేని కార్మికులకు కూడా, అట్టి వారి సర్వీసు కాలానికి

అనుగుణమైన ప్రయాణంలో చనిపోయిన వారి వారసులకు పింఛను పొందే అర్హత ఉంటుంది. ఈ సందర్భంలో కూడా అట్టి పింఛను పూర్తి పింఛనులో నాల్గవ వంతుకు తగ్గరాదు. కొన్ని నిర్దిష్ట సందర్భాల్లో పింఛనులో పెరుగుదలను ఇవ్వవచ్చు. కుటుంబ పోషకుడు చనిపోయినప్పుడు పింఛను పొందనారంభించినవారు, వారికి ఇతర ఆదాయపు వనరులున్నప్పటికీ పూర్తి పింఛన్ను పొందుతారు.

పింఛను పొందే ఆ తర్వాతి వర్గంవారు సైనికులు. వారి కుటుంబాలు తాత్కాలికంగా కొంతకాలం సైన్యంలో పనిచేసిన వారికి, నాన్ కమీషను ఆఫీసర్లకు అశక్తత ప్రాప్తించినప్పుడు, పింఛను అర్హత వుంటుంది. కుటుంబ పోషకుడు మరణించినప్పుడు వారి కుటుంబ సభ్యులకు పింఛను పొందే అర్హత ఉంటుంది. ఇట్టి పింఛనులు సైనికులకు, వారి కుటుంబాలకు వారి సైనిక సేవాకాల పరిమితితోను, వారంతకు ముందు చేసిన పనితోను నిమిత్తం లేకుండానే లభిస్తాయి. దేశభక్త మహా యుద్ధంలో (రెండవ ప్రపంచ యుద్ధంలో) మాతృదేశం కొరకు గెరిల్లాలుగా పోరాడిన యోధులకు, వారి కుటుంబాలకు మామూలు సైనికులకు, వారి కుటుంబాలకు ఇచ్చిన విధంగానే పింఛనులు ఇవ్వబడతాయి.

పార్టిజాన్లు, లేక గెరిల్లాలు, అంటే సైన్యంలోను నావికా దళంలోను, విమాన దళంలోను క్రమబద్ధంగా చేరకనే, స్వయంగా ఆయుధాలు ధరించి దేశంకోసం పోరాడిన వీరయోధులు. వారు తమ సహయోధులతో కలిసి గెరిల్లా దళాలుగాను, ఇతర విధాలైన సైనిక నివహాలుగాను ఏర్పడి పోరాడినవారు. రెండవ ప్రపంచ యుద్ధకాలంలో సోవియట్ దేశం నలుమూలలా లెక్కకు మిక్కిలిగా పార్టిజాన్ల దళాలు ప్రభవించాయి. వారు, నరహంతక శత్రుమూకల వెనుక భాగంలో చేరి వారిని ముప్పుతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్ళు తాగించారు నమ్మశక్యంగాని వీరోచిత కృత్యాలను చేసి చూపెట్టారు. అందుకే సోవియట్ ప్రభుత్వం, ప్రజలు వారికెంతో ఋణపడి ఉన్నామని భావిస్తారు. వారి యెడ అపార గౌరవాదరాలను ప్రకటిస్తారు. ఈ ప్రజాదరణనే చట్టం ప్రతిబింబిస్తుంది అందుకే, వారు సైన్యంలోని తమ సహయోధులతో సమానంగా గౌరవించబడుతున్నారు. సిపాయీలు, తదితరుల విషయంలో వారి పింఛనుల పరిమా

జానికి, తత్సంబంధమైన మొత్తాలకు సంబంధించిన నిబంధనలు పింఛనుల చట్టం 5 వ ప్రకరణంలో పేర్కొనబడ్డాయి. జనరల్సు, అడ్మిరల్సు, ఆఫీసర్లు, పట్టీలో చేర్చిన సిపాయిలు, నాన్ కమిషన్డు ఆఫీసర్లు, అదే హోదాగల ఇతరులు, వారి కుటుంబాలు, సోవియట్ దేశ మంత్రిమండలి నిర్ధారించిన రేట్ల ప్రకారం, అట్టి క్రమంలో పింఛనలు పొందడానికి అర్హులౌతారని ఈ పింఛన్ల చట్టంలోని 52 వ నిబంధన నిర్దేశిస్తుంది. సైన్యం నుండి విరమించే నాటికి వారికి పింఛను పొందే అర్హత లేకపోయినా, వారికి, వారి కుటుంబాలకు 1956 వ సంవత్సరపు పింఛనుల చట్టానికి అనుగుణ్యంగా కార్మికులతో సమాన ఫాయాలో—వారంతకు ముందు కార్మికులుగా పనిచేసినా, చేయకపోయినా, పింఛను లభిస్తుంది.

పింఛనుల చట్టంలోని 6 వ ప్రకరణంలో, ఈ పింఛనులు లెక్కకట్టడానికి సంబంధించి 4 నిబంధనలున్నాయి. ఈ పింఛనులను సగటు, నెలసరి ఆదాయాల ప్రాతిపదికపై నిర్ణయిస్తారు. ఇందు భీమాపథకం క్రిందకి వచ్చే అన్నిరకాలైన చెల్లింపులు చేరిఉంటాయి. కాని, అవసరపుకాలం పనిచేసినందుకు యిచ్చే జీతాలు ఇతర పై ఆదాయాలు చేరి ఉండవు. దీర్ఘకాలం పనిచేసినందుకుగాను లభించే సౌకర్యాలు పింఛను లెక్కకట్టేందుకు పరిగణించే ఆదాయంలో కలుపుతారు. సగటు నెలసరి వేతనాన్ని, చివరి 12 నెలల సగటువేతనం ప్రాతిపదికపై నిర్ణయిస్తారు. దరఖాస్తుదారు కావాలని కోరుకుంటే, క్రితం 10 సంవత్సరాలలోను అతడు ఎంపిక చేసుకొన్న ఏకవరుస సంవత్సరాల సగటు వేతనాన్నైనా ప్రాతిపదికగా తీసుకొంటారు. ఏ కార్మికుడుగాని, సైనికుడుగాని పింఛను తీసుకున్న తర్వాత. ఎక్కువ వేతనంతో కనీసం రెండేళ్ళకు తగ్గకుండా పనిచేసినట్లయితే, అట్టి అధిక వేతనం ప్రాతిపదికపై పింఛను క్రొత్తగా లెక్కకట్టి చెల్లిస్తారు. అయితే ఈ పింఛను, ఆ తర్వాత కలిపే పెరుగుదలతోసహా గరిష్ఠ పింఛను మొత్తానికిగాని, దానిని లెక్కకట్టేందుకు ప్రాతిపదికగా తీసుకొన్న వేతనంలో 100 శాతానికిగాని మించరాదు. కాని, ఎట్టి పరిస్థితులలోను నిర్ణీత కనీస పింఛనుకంటే తగ్గించేందుకు వీలులేదు. మొదటి తరగతికి చెందిన అశక్తుల పింఛనులు తమ కుటుంబ పోషకుణ్ణి కోల్పోయిన కుటుంబాలు, పనిచేయజాలని ముగ్గురు, లేక అంతకంటే ఎక్కువమంది

ఆధారితులు చేరిఉన్న కుటుంబాలకు మాత్రం, అట్టి పింఛనుకు ప్రాతిపదిక అయిన వేతనంలో నూరు శాతానికంటే ఎక్కువే ఉండవచ్చునని ఉప నిబంధన చేర్చబడి ఉన్నది. గ్రామీణ ప్రాంతాలలో శాశ్వతంగా నివసిస్తూ వ్యవసాయంతో సంబంధం కలిగిఉన్న పింఛనుదారులకు చెల్లించే పింఛను రేట్లు 1959 వ సంవత్సరపు చట్టంలో పేర్కొనబడిన రేట్లలో 85 శాతం ఉంటాయి. ఏ పింఛను చట్టం రూపొందకమునుపే పింఛను అర్హత పొందినవారు, అటుతర్వాత వచ్చిన చట్టాలలో సూచింపబడిన రేట్ల ప్రకారం అధికతర మొత్తాలను పొందేందుకు అర్హులౌతారు. ఎట్టి పరిస్థితులలోను పింఛనులను కనీస మొత్తాలకంటే తగ్గించడంగాని, గరిష్ఠ మొత్తాలకంటే పెంచడంగాని జరిగేందుకు వీలులేదు.

ఉపాధ్యాయులు, వైద్యశాఖ కార్యకర్తలు, తదితర నిపుణులకోసం ప్రభుత్వం దీర్ఘకాల సర్వీసు పింఛనులను ఏర్పాటుచేసింది. అదే విధంగా, విజ్ఞానశాస్త్ర కార్యకర్తలకు పింఛనులు చెల్లించేందుకు ప్రభుత్వం ప్రత్యేక నిబంధనలను రూపొందించింది. అలాంటి విజ్ఞానశాస్త్ర కార్యకర్తలు వారి కుటుంబాలు ఆ ప్రత్యేక పింఛను నిబంధనల ననుసరించిగాని, లేదా సాధారణ పింఛను చట్టం ప్రకారంగాని తమకు నచ్చిన పద్ధతిలో పింఛనులు పొందవచ్చు. అలాగే, ఆయా పౌరులు దేశానికి చేసిన విశిష్ట సేవలకు గుర్తింపుగా ప్రత్యేకమైన వ్యక్తిగత పింఛనులు నిర్ధారించి వారికి, వారి కుటుంబాలకు చెల్లించే అధికారం మంత్రివర్గానికి ఉన్నది.

సమిష్టిక్షేత్ర రైతులకు చెల్లించే పింఛనులు, భత్యాలకు సంబంధించి ఒక ప్రత్యేక చట్టమున్నది. ఈ చట్టము తరచుగా సవరించబడుతూ, లేదా, క్రొత్తచట్టాలు జారీచేయబడుతూ ఉన్నాయి. సోవియట్ యూనియన్ కమ్యూనిజం నిర్మాణ దిశలో అనుదినం ముందంజవేస్తూ సాగిపోతున్నది. ఉత్పత్తి శక్తులు దిన దిన ప్రవర్ధమాన మవుతున్నాయి. అంచేత, పౌరుల పింఛనులు, జీవన ప్రమాణాలు కూడా పెరుగుతున్నాయి. ఉదాహరణకు, 1964 నాటికి సమిష్టిక్షేత్ర రైతులకు చెల్లించే పింఛనుల, భత్యాల విషయంలో పాత శాసనాన్ని రద్దుచేసి, క్రొత్త చట్టాన్ని ఆమోదించడం జరిగింది. ఆనాటికే శక్తివంతమైన సర్వతోముఖవికాసం పొందిన ప్రవర్తిత ఆర్థిక వ్యవస్థ నిర్మితమైంది. యుద్ధానంతరం ఈ క్రొత్తచట్టం ఆమోదింప

బిడటానికి ముందలి దశాబ్దంలో, సోవియట్ దేశం ఆర్థికరంగంలో గొప్ప పురోగతి సాధించింది. ఇందుమూలంగా ప్రజల జీవన ప్రమాణాలను మరింతగా పెంచి, ప్రజల జీవితావసరాలను మరింత పూర్తిగా తీర్చగల అవకాశం ప్రభుత్వానికి లభించింది. అందువల్ల, పూర్వంకంటే స్థిరమైన సామాజిక భీమా వ్యవస్థను, క్రొత్త పింఛను విధానంద్వారా సమిష్టి క్షేత్రాలలో ప్రవేశపెట్టేందుకు అవకాశం కల్గింది. సమిష్టిక్షేత్ర రైతులకు వృద్ధాప్య, అశక్తత పింఛనులు, కుటుంబ పోషకుడు చనిపోయినప్పుడు ఇచ్చే పింఛనులు, సమిష్టి క్షేత్రాలలో పనిచేసే స్త్రీలకు ప్రసూతి భత్యాలు అధికం చేయబడ్డాయి.

సమిష్టిక్షేత్ర రైతాంగానికి వర్తించే పింఛను పథకం యాంత్రిక సమానత్వానికి తావులేకుండా చేయవలసి వచ్చింది. సమిష్టి క్షేత్రాల శ్రామిక ఉత్పాదకశక్తి పెరిగేకొలది, హెక్టారు ఒకటికి వారి ఉత్పత్తులు, ప్రభుత్వానికి అమ్మే సరుకులు పెరిగేకొలది, వారి ఆదాయాలు పెరుగుతాయి. తద్వారా సమిష్టిక్షేత్రాలు మరింత ఎక్కువ నిధులను పింఛనులకోసం కేటాయించ గలుగుతాయి. అందువల్ల సమిష్టిక్షేత్ర రైతులు అధికతర పింఛన్లు లభిస్తాయి. అంతేగాక, బాగా పనిచేసి సామాజికోత్పత్తికి ఎక్కువగా తోడ్పడే సమిష్టి రైతులు, ఇతరులకంటే ఎక్కువ పింఛనులు పొందేందుకు హక్కుకల్గి ఉంటారు. సమిష్టిక్షేత్ర రైతులకు పింఛను రేట్లు నిర్ధారించే సందర్భంగా ఈ విషయాలన్నీ పరిగణనలోకి తీసుకోబడ్డాయి.

సమిష్టి క్షేత్రాలకు ప్రభుత్వ సామాజిక భీమా పథకాన్ని వర్తింపు చేయడం, సమిష్టిక్షేత్ర రైతుల శ్రమశక్తిని మరింత పెంపొందించేందుకు, వ్యవసాయోత్పత్తులను మరింత ఎక్కువ చేసేందుకు అత్యంత శక్తివంతమైన ప్రోత్సాహకంగా పనిచేసింది. ఆర్థికాభివృద్ధి దృష్ట్యా ఇది ఎంతో ప్రగతిశీల చర్య. ఏ ఆర్థిక వ్యవస్థకైనా తృప్తి, సంతోషాలు నిండుగాగల కార్మికులు అన్నిటికంటే మించిన సంపత్తిగా ఉంటారు. 1964 పింఛనుల చట్టపు పీఠిక క్రిందివిధంగా పేర్కొన్నది. "జాతీయాదాయం, ప్రత్యేకించి సమిష్టి క్షేత్రాల ఆదాయం గణనీయంగా పెరగడంతో, ప్రస్తుతచట్టం ప్రతిపాదించిన పింఛనులు, క్రమంగా కర్మాగార, కార్యాలయ, తదితర కార్మికులకు చెల్లించే ప్రభుత్వ పింఛనుల స్థాయికి ఎదుగుతాయి." సమిష్టి

క్షేత్రాల సభ్యులకు పింఛనుల చెల్లింపు విషయమై కర్మాగారాల కార్మికులకు, కార్యాలయోద్యోగులకు వర్తించే సవివరమైన నిబంధనలవంటివే రూపొందించబడ్డాయి. సమిష్టి క్షేత్రాల రైతులు వారి కుటుంబాల సభ్యులు వివిధ రకాల పింఛను పథకాలలో తమకు నచ్చిన పథకాన్ని ఎంపిక చేసుకోవచ్చు. సమిష్టి రైతాంగపు ఆదాయాల్లో యెలాంటి కోత విధించకుండానే, సమకూడిన సమిష్టిక్షేత్ర నిధులనుండే సమిష్టిక్షేత్ర సభ్యులకు పింఛనులు, భత్యాలు మంజూరు చేయబడుతున్నాయి. పింఛనులపై యెలాంటి పన్నులు విధించేందుకు వీల్లేదు. పింఛనుల చెల్లింపుకు సంబంధించిన యితర వివరాలన్నీ కార్మికులకు వర్తించే నిబంధనలనే పోలివుంటాయి. వివరాలలో మాత్రమే వుండే యీ తేడాలను ప్రత్యేకంగా పేర్కొనాల్సిన అవసరంలేదు.

మరుగుజ్జుతనంచే పీడితులయిన పౌరులకు వర్తించే ప్రత్యేక చట్టం వుంది. వారికి తక్కువ వయస్సులోనే పింఛనుపొందే సౌకర్యం వుంది. పురుషులకు 20 సంవత్సరాలకు తక్కువకాని సర్వీసుతో 45 సంవత్సరాలు నిండినతోడనే పింఛను లభిస్తుంది. మహిళలకయితే 15 సంవత్సరాల సర్వీసు, 40 సంవత్సరాల వయస్సువుంటే చాలు. వీరి విషయంలో అవివాహితులపైన, చిన్న కుటుంబాలు గలవారిపైన విధించే పన్నులు వర్తించవు.

6 వ ప్రకరణం

# సోవియట్ వివాహ - కుటుంబ శాసనం

## వివాహం, కుటుంబ శాసన మౌలిక సూత్రాలు

సోవియట్ యూనియన్‌లో పౌరుల కుటుంబాల విషయమై ప్రభుత్వం అత్యధిక శ్రద్ధాసక్తులను కనపరుస్తుంది. ఎందుకంటే, యీ కుటుంబ వ్యవస్థలోనే పౌరుల సామాజిక, వ్యక్తిగత ప్రయోజనాలు చక్కగా మేళవించబడి వున్నాయి.

ఈ చట్టపు పీఠిక ఇలా చెబుతూంది: "సోవియట్ యూనియన్‌లో కుటుంబాన్ని పటిష్ఠవంతము, సౌభాగ్యవంతము చేసేందుకు అత్యంత అనుకూల పరిస్థితులు ఉన్నాయి. సకల పౌరుల భౌతిక సంక్షేమము నిరంతరాయంగా అభివృద్ధి చెందుతూంది. కుటుంబ జీవితానికి అత్యంత మౌలికావసరాలైన గృహ, సాంస్కృతిక, తదితర సౌకర్యాలు దినదినాభివృద్ధి చెందుతున్నాయి. సోషలిస్టు సమాజం మాతృత్వాన్ని పరిరక్షించి ప్రోత్సహించేందుకు అత్యంతానందోత్సాహపూరితమైన బాల్యాన్ని గ్యారంటీ చేసేందుకు అశేష శ్రద్ధ చూపుతూంది."

సోవియట్ యూనియన్‌లో కుటుంబ ప్రధాన కర్తవ్యం వర్ధమాన తరాన్ని సరైన పద్ధతుల్లో పెంచడమే. ఈ నవతరంలో విశాలమైన కమ్యూనిస్టు దృక్పథాన్ని పాదుకొల్పి పెంపొందించాలి. కమ్యూనిస్టు దృక్పథం సారాంశం, అత్యున్నత సౌహార్ద భావాలకు, విశాల సామాజిక దృక్పథము. తమ వంతుగా ప్రభుత్వమూ, సమాజమూ, పిల్లల

పెంపకంలో కుటుంబానికి సకల విధాల తోడ్పడుతున్నాయి. ఇందుకోసం కిండర్ గార్డన్‌లను, క్రెచీలను, బోర్డింగ్ పాఠశాలలను, ఇతర బాలల సంస్థలను విరివిగా నెలకొల్పుతున్నాయి.

వివాహ కుటుంబ శాసన మౌలిక సూత్రాలు ఇలా తెలుపుతున్నాయి.

"సోవియట్ మహిళలు ఈనాడు సంతోషదాయకమైన మాతృత్వంతో, నానాట క్రియాశీలకము స్సృజనాత్మకము అయిన రీతిలో పారిశ్రామిక, సాంఘిక, రాజకీయ జీవన స్రవంతిని మేళవించేందుకు అవసరమైన సామాజిక పరిస్థితులు నెలకొని ఉన్నాయి."

"పాదార్థికమైన ఆలోచనల నుండి కుటుంబ సంబంధాలకు అత్యధిక విముక్తి, నిత్య జీవితంలో మహిళల అసమానత్వాన్ని రూపు మాపడం, ప్రజలఅతిప్రగాఢ వ్యక్తిగత భావాలకు సంపూర్ణ సంతృప్తి నిచ్చే కమ్యూనిస్టు కుటుంబాన్ని నెలకొల్పడం– వీటిని ప్రోత్సహించేదిగా సోవియట్ వివాహ కుటుంబ శాసనం ఉండాలి."

సోవియట్ వివాహ, కుటుంబ శాసన మౌలిక సూత్రాలలోని మొదటి నిబంధన ఈ శాసన లక్ష్యాలను ఇలా పేర్కొన్నది.

1. సోవియట్ కుటుంబ వ్యవస్థను మరింత పటిష్ఠం చేయడం; 2. ఇష్టపూర్వకమైన స్త్రీ, పురుష వైవాహిక సంబంధాన్ని, పాదార్థికమైన ఆలోచనలతో ఏమాత్రము నిమిత్తములేని పరస్పర ప్రేమను, కుటుంబ సభ్యులందరి పరస్పర స్నేహ, గౌరవాలను కుటుంబ సంబంధాలకు ఆధారం చేయడం; 3. పిల్లలకు కుటుంబ శిక్షణతో, సామాజిక విద్యను అంగాంగికంగా సమ్మిళితమొనర్చి, వారిలో మాతృదేశంయెడ అపార ప్రేమాభిమానాలను, పనియెడల కమ్యూనిస్టు దృక్పథాన్ని ప్రోదిచేసి, కమ్యూనిస్టు సమాజ నిర్మాణంలో వారు క్రియాశీలంగా పాల్గొనేలా సంసిద్ధమొనర్చడం; 4. తల్లి, బిడ్డలకు సంపూర్ణ రక్షణ; ప్రతి బిడ్డకు హాయిగొల్పే బాల్యాన్ని గ్యారంటీ చేయడం; గతకాలపు హానికరమైన అవశేషాలు, ఆచారాలు కుటుంబ సంబంధాల్లో లేకుండా నిర్మూలించడం; కుటుంబం పట్ల బాధ్యతాభావాన్ని పెంపొందించడం.

ఈ వివాహ, కుటుంబ శాసనం, వివాహ క్రమాన్ని, అందుకనువైన పరిస్థితులను సూచిస్తున్నది. భార్యా, భర్తల మధ్య తలెత్తే వ్యక్తిగత ఆస్తి సంబంధాలను క్రమబద్ధం గావిస్తున్నది. అలాగే, తల్లిదండ్రులకు, బిడ్డలకు మధ్య, ఇతర కుటుంబ సభ్యుల మధ్య వ్యక్తిగత ఆస్తి సంబంధాలను కూడా ఈ చట్టం నిర్వచిస్తున్నది. బిడ్డలను దత్తత తీసుకొన్నప్పుడు ఏర్పడే సంబంధాలు, ధర్మకర్తృత్వం, సంరక్షకత్వము, పెంపకము వగైరా సంబంధాలను. పెళ్ళిని రద్దుచేసుకోవలసిన పరిస్థితులను, దానికి సంబంధించిన కార్యవిధానాన్ని పెళ్ళి రిజిస్టరు చేయించే కార్యవిధానాన్ని ఇది నిర్దేశిస్తుంది. ఇతర విషయాలలో వలెనే కుటుంబ సంబంధాలలో కూడా స్త్రీ,పురుషులకు సంపూర్ణసమానత్వం, సమానమైన వ్యక్తిగత ఆస్తి హక్కులు వున్నాయి. వివాహ, కుటుంబ సంబంధాల్లో హక్కులకు జాతి,వర్ణవంశము, మతము కారణంగా ఎటువంటిఆంక్షలూ వుండటానికి వీల్లేదు. వాటికారణంగా ప్రత్యక్షంగా గాని, పరోక్షంగా గాని ఎటువంటి ప్రత్యేక ప్రయోజనాలూ లభించవు కూడా. సకల పౌరులు, కుటుంబ సంబంధాల్లో సమాన హక్కులు కలిగివుంటారు.

సోవియట్ యూనియన్‌లో మాతృత్వానికి దేశవ్యాప్త గౌరవ మర్యాదలు లభిస్తున్నాయి. ప్రభుత్వం దాన్ని గౌరవిస్తుంది, సంరక్షిస్తుంది, ప్రోత్సహిస్తుంది. ప్రసూతి వైద్యశాలలను, క్రెచీలను, కిండర్ గార్టెన్లను, బోర్డింగు పాఠశాలలను, ఇతర బాలల సంస్థలను విస్తృత వ్యవస్థగా నెలకొల్పబడుతూన్నాయి. పూర్తి జీతంతో ప్రసూతి సెలవులు లభిస్తాయి; గర్భవతులకు, తల్లులకు ప్రత్యేక సౌకర్యాలు ఇవ్వబడుతున్నాయి. పని శ్రమల్లో ప్రత్యేక శ్రామిక రక్షణ చర్యలు గైకొనబడుతున్నాయి; పెళ్ళి కాని తల్లులకు, ఎక్కువమంది బిడ్డల్ని కన్న తల్లులకు, ప్రభుత్వ పింఛన్లు ఇవ్వబడుతున్నాయి– వీటిద్వారానూ, ఇంకా ఇతర రూపాల్లో కుటుంబానికి ప్రభుత్వ, సామాజిక సహాయం అందించడం ద్వారానూ తల్లీ బిడ్డల ప్రయోజనాలను కాపాడడం జరుగుతూఉంది.

వివాహ చెల్లుబాటుకై, ప్రభుత్వ రిజిస్ట్రారు కార్యాలయంలో దానిని నమోదు చేసుకోవాలి. మతపరమైన వివాహాలకు ఇతర మత కర్మ కాండకు చట్టబద్ధమైన విలువ లేదు అయితే సోవియట్ రిజిస్ట్రారు కార్యాలయం నెలకొల్పకముందే గాని, వాటిని పునరుద్ధరించక ముందు గాని జరుపుకున్న

మత పరమైన వివాహాలకు ఇది వర్తించదు; అలాగే వారిచ్చిన పుట్టుక సర్టిఫికేటులు, విడాకులకు కూడా ఇది వర్తించదు. వివాహ, కుటుంబ శాసనాల మౌలిక సూత్రాలతో బాటు, ఇతర సోవియట్ దేశ శాసనాలు, యూనియన్ రిపబ్లిక్కుల చట్టాలు, మౌలిక సూత్రాలలోని 7, 8 వ నిబంధనలలో పేర్కొన్న వివిధ విషయాలలో వ్యవహరిస్తాయి.

వివాహాలు, ప్రభుత్వం రిజిస్ట్రారు కార్యాలయంలో జరగాలి. రాజ్య, సమాజ ప్రయోజనాల దృష్ట్యాను, భార్యా భర్తల, బిడ్డల వ్యక్తిగత. ఆస్తి, హక్కులూ, ప్రయోజనాల దృష్ట్యాను వివాహాన్ని చట్టబద్ధంగా నమోదు చేయడం చాలా అవసరం; ప్రభుత్వ రిజిస్ట్రారు కార్యాలయంలో నమోదు చేసిననాడే దంపతులకు హక్కులు, బాధ్యతలు సరిగా సంక్రమిస్తాయి. పెళ్ళి నమోదు చేయడానికి ఒక నెలరోజులు ముందుగా రిజిస్ట్రారు కార్యాలయానికి నోటీసు ఇవ్వాలి. యూనియన్ రిపబ్లిక్కులు ఇంకా యెక్కువ కాలపరిమితిని నిర్ధారించవచ్చు. ఇందుకు సంబంధించిన ఒకకార్యక్రమంలో పెళ్ళిని నమోదు చేస్తారు. ఈ సందర్భంలో ఇరుపక్షాల ఆమోదంపై రిజిస్ట్రారు కార్యాలయం చిన్నపాటి ఉత్సవాన్ని ఏర్పాటు చేస్తుంది. వివాహం నమోదు కావాలంటే, దంపతులు కాదలచినవారు తమ పరస్పరామోదాన్ని తెలియజేయాలి : వారి వివాహ యోగ్యమైన వయస్సు వారి కుండాలి. శాసన మౌలిక సూత్రాల ప్రకారం, వివాహానికి చట్టబద్ధమైన కనీస వయస్సు 18 సంవత్సరాలు. అయితే, యూనియన్ రిపబ్లిక్కులు దీన్నింకా తగ్గించవచ్చు. కాని, రెండేళ్ళకంటె యెక్కువ తగ్గించరాదు. 1. అప్పటికే స్త్రీ, పురుష లిద్దరిలో ఒకరికి పెళ్ళైవున్నా; 2. పై తరాల్లోనూ, కింది తరాల్లోనూ రక్త సంబంధీకుల మధ్య, పూర్తి లేదా అర్ధ అన్నా చెల్లెళ్ళ అయినవారి మధ్య దత్తు తలిదండ్రులకు దత్తులైన వారికి మధ్య, 3. ఇద్దరిలో ఏ ఒకరినైనా మానసిక వ్యాధి పీడితులుగా, మతిమాంద్యులుగా న్యాయస్థానం ప్రకటించినా వివాహాలు జరిగేందుకు వీల్లేదు.

ఇతర దేశాలలోవలెగాక, వివాహమయ్యాక దంపతులు తమ ఇద్దరి ఇంటి పేర్లలో యేదో ఒకదానిని యెంపిక చేసుకోవచ్చు. లేదా వివాహానికి ముందున్న తమ స్వంత ఇంటి పేర్లతోనే వ్యవహరించుకో వచ్చు.

యూనియన్ రిపబ్లిక్కుల చట్టాలు రెండు ఇంటిపేర్లను వినియోగించే అవకాశం కల్పించవచ్చు. బిడ్డల పెంపకం వంటి కుటుంబ సమస్యలను భార్యాభర్తలు సమిష్టిగా పరిష్కరించుకుంటారు. భార్యాభర్తలిరువురికి వ్యక్తిగతంగా తమ వృత్తిని, నివాస ప్రదేశాన్ని యెంపిక చేసుకునేందుకు పూర్తి స్వేచ్ఛ వుంది.

12 వ నిబంధన చాలా ముఖ్యమైనది. దీని ప్రకారం భార్యాభర్తలు వివాహానంతరం సంపాదించిన ఆస్తి ఉమ్మడి ఆస్తిగా వుంటుంది. అలాంటి ఆస్తి యాజమాన్యానికి, అనుభవించేందుకు, ఖర్చు చేసేందుకు, ఇద్దరికి సమాన హక్కులుంటాయి. వారిలో ఒకరు గృహనిర్వహణంలోనిమగ్నమై బిడ్డల్ని చూసుకుంటూ, సహేతుకంగా స్వంత సంపాదన లేనివారయినా, దంపతులిద్దరికీ ఉమ్మడి ఆస్తిపై సమాన హక్కులుంటాయి. ఒకవేళ అవసరమైతే ఇట్టి ఉమ్మడి ఆస్తిని ఇరువురు సమానంగా పంచుకోవాలి. అయితే, మైనర్ల ప్రయోజనాలు, దంపతులలో ఒక్కొక్కరి హేతుయుక్తమైన ప్రయోజనాల దృష్ట్యా కొన్ని మినహాయింపులు కూడా వుండవచ్చు. పెళ్ళికి ముందు సంక్రమించిన ఆస్తిగాని, వివాహ సమయంలో బహుమతిగా లేదా, వారసత్వ రీత్యా సంక్రమించిన ఆస్తిగాని యెవరిది వారికే హక్కు భుక్తమై వుంటుంది.

భార్యాభర్తలిరువురికీ, ఒకరినొకరు పాదార్థికంగా పోషించవలసిన బాధ్యత ఉంది. పాదార్థిక సహాయమవసరమైన అశక్త స్థితిలో ఉన్న జీవిత భాగస్వామికి, గర్భవతిగాను, బిడ్డపుట్టాక సంవత్సరం వరకుస్త్రీకి, తనజీవిత భాగస్వామి నుండి పోషణ పొందే చట్టపరమయిన హక్కుంది. ఇందుకు తగిన స్తోమత వారికివున్నట్లయితే ఈపోషణ హక్కును న్యాయస్థానాలద్వారా అమలు జరిపించుకోవచ్చు. విడాకులు పుచ్చుకున్నాక కూడా ఈ హక్కును అమలు జరిపించుకునే అవకాశముంది విడాకులు పుచ్చుకున్న భార్యాభర్తలకు, వారు అశక్తులయ్యేట్లయితే విడిపోయిం తర్వాత ఒక సంవత్సరంవరకు వారు రెండవ వారి సహాయాన్ని పొందే హక్కు కలిగివుంటారు. దీర్ఘకాలం వైవాహిక జీవితం గడిపిన భార్యాభర్తలకు పింఛనుపొందే వయస్సు వచ్చాక విడాకులు పుచ్చుకున్నట్లయితే ఐదేళ్ళ వరకు భరణంపొందే హక్కు కలిగివుంటారు.

చట్టం నిర్దేశించిన కొన్ని ప్రత్యేక సందర్భాల్లో దంపతులు, ఒకరు మరొకర్ని పోషించవలసిన విధినుంచి మినహాయింపు పొందవచ్చు; లేదా భరణమివ్వాల్సిన కాలపరిమితిని పరిమితం గావించుకోవచ్చు.

సాధారణంగా భార్యాభర్తల్లో ఒకరు మరణించినప్పుడో, అలా మరణించినట్లు న్యాయస్థానం నిర్ధారించినప్పుడో మాత్రమే వివాహబంధం రద్దవుతుంది. మరణానికి ప్రత్యక్ష సాక్ష్యం లేక, పరిస్థితులపై ఆధారపడి నిర్ధారించవలసి వచ్చినప్పుడే న్యాయస్థానం ప్రసక్తి వస్తుంది.

దంపతులిద్దరూ జీవించి వుండగా కూడా, వారిలో యెవరయినా దరఖాస్తు చేసినప్పుడు న్యాయస్థానం పెళ్ళిని రద్దుచేయవచ్చు. అయితే అలా చేసే ముందు భార్యాభర్తలకు రాజీకుదర్చడానికి వీలైన కృషినంతా న్యాయస్థానం చేసి తీరాలి. వారు ఇకనెంత మాత్రమూ కలిసివుండజాలరని, వారి మధ్య కుటుంబ జీవనం అసాధ్యమని స్పష్టంగా తేలాకనే విడాకులు మంజూరు చేయవలసి వుంటుంది. భార్య అనుమతి లేకుండా ఆమె గర్భవతిగా వున్నప్పుడో, బిడ్డకు ఒక సంవత్సరమైనా నిండక ముందో విడాకులకై దరఖాస్తు చేసే హక్కు భర్తకు లేదు. అవసరమైన సందర్భాల్లో విడాకులు మంజూరు చేస్తూకూడా మైనర్ల ప్రయోజనాలను అశక్తులైనా భర్తలేక భార్య ప్రయోజనాలను పరిరక్షించేందుకు న్యాయ స్థానం తగు చర్యగైకొంటుంది.

మైనరు పిల్లలు లేని దంపతులు పరస్పర అంగీకారంతో రిజిష్ట్రారాఫీసుకు వెళ్ళి, తమ వివాహాన్ని రద్దు చేసుకోవచ్చు. అలాంటి సందర్భాల్లో ఆ విడాకులను రిజిష్ట్రారు కార్యాలయంలో నమోదు పరచి, విడాకులకు దరఖాస్తు చేసిన 3 నెలల తర్వాత విడాకుల మంజూరు పత్రము జారీ చేయబడుతుంది. దంపతులు ఒకరినొకరు బహిరంగంగా దూషించుకొని, సమాజ వాతావరణాన్ని కలుషితం చేయకుండా ఉండాలనే లక్ష్యంతోనే ఇలా చేయడం జరుగుతుంది ఈ క్రింది సందర్భాల్లో కూడా రిజిష్ట్రారు కార్యాలయం వివాహాలను రద్దుపరచే అవకాశం ఉన్నది.

1. దంపతులలో ఒకరు కన్పించకుండా పోయినట్లు చట్టరీత్యా రుజువైనప్పుడు;

2. మానసికంగా బలహీనులుగాను, మానసిక వ్యాధిగ్రస్తులుగాను ఉండి, చట్టరీత్యా అశక్తులుగా నిర్ణయించబడినప్పుడు;

3. భార్యా భర్తల్లో ఎవరైనా మూడేళ్ళకు తక్కువ కాకుండా శిక్ష విధింపబడినప్పుడే.

పై సందర్భాల్లో వివాహ సంబంధాన్ని కొనసాగించడం భారముతో కూడుకున్న పని అవుతుంది. అంచేత పెద్ద తతంగమేమీ లేకుండా విడాకులు ఇచ్చేందుకు చట్టం అనుమతిస్తుంది.

వివాదం తలెత్తినపుడు న్యాయస్థానం వివాహాన్ని రద్దు పరచవలసి ఉంటుంది. వివాహానంతరం తన భాగస్వామి ఇంటిపేరును పెట్టుకున్న భార్య, లేక భర్త ఆ పేరును ఉంచుకుందుకు గాని, లేదా పెళ్ళికి ముందు తనకున్న ఇంటి పేరును తిరిగి పెట్టుకుందుకుగాని హక్కు ఉంటుంది.

చట్టవిరుద్ధమైన పరిస్థితులలో, ఉదాహరణకు దంపతులలో ఒకరికి అంతకు ముందే పెళ్ళయి ఉన్నా, నిషిద్ధబాంధవ్యం కలవారి మధ్య పెళ్ళి జరిగినా, చట్టరీత్యా అయోగ్యుడిగా ప్రకటించబడిన వ్యక్తితో పెళ్ళి జరిగినా. అట్టి పెళ్ళి చెల్లనేరదు. అయితే ఏది ఏమైనా పెళ్ళి చెల్లినా చెల్లకపోయినా అటి వివాహ బంధం వలన కలిగిన బిడ్డల హక్కులకు ఏ విధంగాను భంగం కలుగదు.

పిల్లల హక్కులను కాపాడ్డం, వారి సంక్షేమాన్ని నిరంతరం కనిపెట్టి ఉండడం సోవియట్ ప్రభుత్వం తన ప్రధాన లక్ష్యంగా ఉంచుకొంటుంది. అందుకే, పిల్లలపితృత్వాన్ని నిర్ధారించేందుకు చట్టం ప్రత్యేకమయిన ఏర్పాటు చేస్తుంది. బిడ్డలయెడ తల్లిదండ్రుల బాధ్యతలను విశిష్టంగా పేర్కొంటుంది. బిడ్డ వివాహానంతరం పుట్టి ఉండకపోతే. అట్టి తల్లిదండ్రుల ఉమ్మడి ప్రకటన ఆ బిడ్డ పితృత్వాన్ని నిర్ణయిస్తుంది. అట్టి సమిష్టి ప్రకటన ఏదీలేని సందర్భంలో, న్యాయస్థానమే ఆ బిడ్డ తండ్రి ఎవరైందీ నిర్ధారిస్తుంది. అట్టి సందర్భంలో న్యాయస్థానం స్త్రీ, పురుషులు కలిసి జీవించడాన్ని, బిడ్డ పుట్టక ముందు తల్లి ప్రతివాది ఇద్దరూ ఉమ్మడి గృహంలో నివసించడాన్ని సమిష్టి పెంపకాన్ని, ఆ ఇద్దరిచేతా బిడ్డపోషింపబడడాన్ని, ప్రతివాది తన పితృత్వాన్ని గుర్తించినట్లుగా నిరూపించే చట్టవిహితమైన సాక్ష్యాన్ని పరిగణనలోకి తీసుకోవాలి.

17 వ నిబంధన, బిడ్డపుట్టుకను గురించి, అతని తల్లిదండ్రుల పేర్ల నమోదును గురించి ఉన్న క్రమాన్ని పేర్కొంటుంది.

తల్లి తండ్రి ఇద్దరికీ బిడ్డ విషయమై సమాన హక్కులు, బాధ్యతలు ఉంటాయి. వారు తమ బిడ్డలకు నవసమాజపు అత్యున్నత నైతిక విలువల కనుగుణంగా విద్యాబుద్ధులు గరపాలి. వారి శారీరక, సాంస్కృతిక అభివృద్ధి యెడ అన్ని విధాల శ్రద్ధ గైకొనాలి. సామాజికంగా ఉపయోగకరమైన కార్యకలాపాలలో వారు సమర్థవంతంగా పాల్గొనేందుకు తగు శిక్షణ ఇవ్వవలసి ఉంటుంది. మైనరు, అశక్తులయిన బిడ్డలు తమ తల్లిదండ్రుల పోషణను పొందే హక్కు కలిగి ఉంటారు. బిడ్డల హక్కులను, ప్రయోజనాలను వారు పెద్దవారయ్యాక కూడా కాపాడవలసిన బాధ్యత తల్లిదండ్రుల కున్నది. బిడ్డల ప్రయోజనాలకు విరుద్ధంగా ఉన్నట్లయితే తల్లిదండ్రుల హక్కులు అమలు జరుగవు. భార్యాభర్తల మధ్య వివాహబంధం రద్దయినప్పుడు బిడ్డల విషయమై తల్లిదండ్రులిద్దరూ సమాన హక్కులను కలిగి ఉంటారు. అలాగే వారు సమానంగా వారి యెడ తమ బాధ్యతలను నెరవేర్చవలసి ఉంటుంది కూడా. బిడ్డల నివాస స్థలము, వారికి విద్యాబోధలు గురించి తల్లి దండ్రుల మధ్య తలెత్తిన వివాదాలు చట్టప్రకారం నిర్ధారించబడుతాయి.

తమ బిడ్డల పెంపకంలో తమకు గల బాధ్యతలను విస్మరించే తల్లిదండ్రులు, ఆ విషయమై తమకు గల హక్కులను దుర్వినియోగం పరిచే వారు, తమ నీతి బాహ్యమైన సమాజవిరుద్ధమైన ప్రవర్తన ద్వారా బిడ్డల పై హానికరమైన ప్రభావాన్ని కలిగించేవారు, త్రాగుడుకు,మత్తుమందులకుపూర్తిగా బానిసలైపోయినవారు బిడ్డల విషయంలో తమకున్న హక్కులన్నీ కోల్పోతారు. ఇట్టి పరిస్థితులలో ప్రభుత్వ లేక ప్రభుత్వేతర సంస్థల ద్వారా గాని, తల్లిదండ్రులలో ఎవరో ఒకరు గాని, ఆ బిడ్డ పోషకుడు గాని, ప్రాక్యూరేటర్ గాని ఫిర్యాదు చేసినప్పుడు, ఇరుపక్షాల వాదనలను పూర్తిగా విన్నాక న్యాయస్థానం తన నిర్ణయాలను ప్రకటిస్తుంది. తల్లిదండ్రులిద్దరికీ బిడ్డలపై గల పర్యవేక్షక హక్కులను తొలగించినట్లయితే న్యాయస్థానం ఆ బిడ్డలను పోషక, ధర్మకర్తృత్వ సంస్థల ఆధీనంలో ఉంచవచ్చు. ఆ విధంగా తల్లిదండ్రుల హక్కులను రద్దు చేయకపోయినా తన తల్లిదండ్రుల వద్ద ఉన్నట్లయితే బిడ్డ చెడిపోతాడని భావించినప్పుడు గూడా, ఆ బిడ్డను అట్టి పోషక, ధర్మకర్తృత్వ సంస్థలకు అప్పగించవచ్చు. బిడ్డల ప్రయోజ

నాలకు సానుకూలంగా ఉంటుంది అనుకొన్నప్పుడు, బిడ్డలు దత్తుపోనప్పుడు తల్లిదండ్రుల హక్కులను పునరుద్ధరించే అవకాశమున్నది. ఈ విధంగా తల్లిదండ్రుల హక్కులను తొలగించాలన్నా, పునరుద్ధరించాలన్నా ఒక్క న్యాయస్థానమే చేయగలుగుతుంది. బిడ్డలపై తల్లిదండ్రుల హక్కులను రద్దుపరచినంత మాత్రాన, బిడ్డల మీద తమకు గల బాధ్యతలను నిర్వహించకుండా వారు తప్పించుకుందుకు వీలులేదని మనము గుర్తించాలి. అలాగే, మేజరయిన బిడ్డలు, అశక్తులై, సహాయం కావలసి ఉన్న తల్లిదండ్రులను పోషించే బాధ్యత కలిగి ఉంటారు. అయితే, తమ పితృత్వ, మాతృత్వ విధులను నిర్వర్తించడంలో పూర్తిగా విఫలమైపోయిన తల్లిదండ్రుల పోషణ బాధ్యత బిడ్డలకు ఉండనక్కరలేదు.

21 వ నిబంధన, తల్లిదండ్రులుగాక ఇతర కుటుంబ సభ్యులకు పోషణ, చెల్లింపుల విషయంలో గల విధులను గురించి పేర్కొంటున్నది. తాత, అవ్వ, సోదరుడు, సోదరి, సవతితల్లి, సవతి తండ్రి, మనవళ్ళు, సవతి బిడ్డలు వగైరాలంతా, చట్టం ప్రకారం అలాంటి విధులను నిర్వర్తించవలసి ఉన్నది. భరణపు మొత్తాన్ని చట్టం నిర్ధారిస్తుంది.

అట్టి భరణం చెల్లించవలసి ఉన్న వ్యక్తి స్వయంగా తానేగాని, తాను పనిచేస్తున్న కార్యాలయం ద్వారా కాని, లేదా, తాను పింఛను, ఉపకారవేతనం పొందే సంస్థ ద్వారా గాని ఈ చెల్లింపులు అందజేయవచ్చు.

సోవియట్ న్యాయశాస్త్రం దత్తత హక్కును గుర్తిస్తున్నది. మైనర్ల విషయంలోనే, అది వారి ప్రయోజనాలకు పూర్తి అనుగుణంగా ఉన్నప్పుడే, దత్తత అనుమతించబడుతుంది. జిల్లా, నగర ప్రజా ప్రతినిధుల సోవియట్ కార్యనిర్వాహక వర్గ నిర్ణయానుసారం, బిడ్డను దత్తత తీసుకోదలచిన వ్యక్తి దరఖాస్తుపై దత్త స్వీకారం అమలులోకొస్తుంది. తమ పితృత్వ, మాతృత్వ హక్కులను కోల్పోని తల్లిదండ్రుల అనుమతి దత్తత వెళ్ళే బిడ్డకు 10 సంవత్సరాల వయస్సు ఉండి ఆ బిడ్డ అనుమతి కూడా దత్తతకే అవసరం. అయితే, బిడ్డ పెంపకంలో తల్లిదండ్రులు విఫలమైనప్పుడు వారి అంగీకారంతో నిమిత్తం లేకనే దత్త స్వీకారాన్ని అనుమతించవచ్చు. ఇందుకవసరమైన క్రమాన్ని చట్టం నిర్దేశిస్తున్నది. సాధారణంగా భర్త అనుమతి లేకుండా భార్య గాని, భార్య అనుమతి

లేకుండా భర్తగాని ఒక బిడ్డను దత్తు తీసుకుందుకు వీలుండదు. ఆయా యూనియన్ రిపబ్లిక్కుల శాసనాలు ఆమోదించిన అసాధారణ సందర్భాలలో అందుకు సంబంధించిన శాసన పరమైన పరిస్థితులను పూరించ గలిగినచో అట్టి భార్యా భర్తలలో ఒకరైనా దత్త స్వీకారం చేయవచ్చు. ఇట్టి దత్త స్వీకారాన్ని న్యాయ స్థానం మాత్రమే చట్ట విరుద్ధంగా ప్రకటించి రద్దు చేయగలుగుతుంది. దత్తు వెళ్ళినవారూ, వారి బిడ్డలు దత్తు పుచ్చుకొన్నవారు, వారి బంధువుల మధ్య, పుట్టుక వలన బంధువులైన వారి మధ్యగల వ్యక్తిగత, ఆస్తి హక్కులు, బాధ్యతల వంటివే నెలకొంటాయి. దత్తు వెళ్ళిన వారు తమ పూర్వపు వ్యక్తిగత, ఆస్తి హక్కును కోల్పోతారు. అదే సమయంలో వారు, తమ సహజ తలిదండ్రులు, వారి బంధువుల యెడ తమకు గల విధులనుండి కూడా విముక్తులవుతారు. ఆ బిడ్డ గనుక ఒక్క వ్యక్తిచేత దత్తు తీసుకోబడితే, దత్తు తీసుకొన్న వ్యక్తి పురుషుడైనప్పుడు బిడ్డ తల్లి కోర్కెపైన, దత్తు తీసుకొన్న వ్యక్తి స్త్రీ అయినప్పుడు తండ్రి కోర్కెపైన తన సహజ తల్లితండ్రులయెడ హక్కులు, బాధ్యతలు అలాగే ఉంచుకోవచ్చు.

దత్త స్వీకారం నాటికి కుటుంబ పోషకుణ్ణి కోల్పోయి, ప్రభుత్వ, లేదా ప్రభుత్వేతర సంస్థ నుండి భృతిని పొందుతూన్న మైనర్లు, అటు తర్వాత కూడా ఆ భృతిని పొందే హక్కును కలిగివుంటారు. దత్తు పుచ్చుకున్నవారు జనన రిజిస్టర్లలో తమ్ముతాము తల్లిదండ్రులుగా నమూదుచేసుకోవచ్చు.

మైనర్ల మంచి చెడు చూచే బంధువులెవరూ లేనపుడు అట్టి వ్యక్తిని, ఆస్తిని చూపేందుకు ధర్మకర్తగాని, పోషకుడుగాని నియమించబడవచ్చు. తమ ఆరోగ్య పరిస్థితి మూలంగా తమ హక్కులు, విధులను స్వతంత్రంగా నిర్వర్తించుకోజాలని మేజరుకు కూడా ధర్మకర్తను, లేదా పోషకుణ్ణి కలిగి వుండే హక్కుంది. ఈ ధర్మకర్తను లేదా పోషకుణ్ణి నియమించే హక్కు జిల్లా (నగర), పట్టణ, గ్రామ ప్రజాప్రతినిధుల సోవియట్ కార్య నిర్వాహక వర్గం నియమిస్తుంది. ఈ పోషకుల, ధర్మకర్తల హక్కులు, విధులు చట్టంలో నిర్దేశించబడ్డాయి.

14 సంవత్సరాల కంటె తక్కువ వయస్సు గల పిల్లలకు ధర్మకర్తృత్వంఏర్పరచబడుతుంది. ఆటు తర్వాత మేజరు అయ్యేవరకు పోషకుడి పర్యవేక్షణలో వుంచుతారు. తమకప్పగించబడిన మైనర్ల తరుపున వారి ప్రయోజనాల రక్షణ కోసం, వారి హక్కులను ధర్మకర్తలు తామే నిర్వహిస్తారు; అలాగే వారి బాధ్యతలను కూడా తమపై వేసుకుంటారు. పోషకులయితే మైనర్లకు తమ హక్కుల వినియోగంలోను, తమ బాధ్యతల నిర్వహణలోను తోడ్పడతారు.

పుట్టుక, చావులు, పెళ్ళిళ్ళు, విడాకులు, దత్తస్వీకారం, పితృత్వ నిర్ధారణ, పేర్ల మార్పు, పితృపక్షం నుండి సంక్రమించే నామావళి ఇంటి పేర్లు వగైరాలను నమోదు చేసేందుకు అవసరమైన నిబంధనలు చట్టంలో వున్నాయి. ఈ రిజిస్ట్రేషన్లు ప్రభుత్వ రిజిస్ట్రారు కార్యాలయంలో జరుగుతాయి. తగు కారణాలుంటే నమోదయిన పేర్లను సరిచేయవచ్చు. ఈ సందర్భంలో తలెత్తే వివాదాన్ని నిర్ధారించేందుకు న్యాయస్థానాల కెళ్ళవచ్చు. ఇందుకై అనుసరించవలసిన కార్యవిధానంసోవియట్ మంత్రిమండలి ఆమోదించిన నియమావళి ద్వారా నిర్ధారితమైవుంది. ఆయా యూనియన్ రిపబ్లిక్కుల చట్టాలు రిజిస్ట్రేషన్‌కు సంబంధించిన నియమావళిని నిర్వచిస్తాయి. వివాహాల, పుట్టుకల, రిజిస్ట్రేషన్, దంపతులవబోతున్న వారు తమ ఆరోగ్య పరిస్థితి, కుటుంబ స్థాయిలను గురించి భావి భార్యా భర్తలుగాను తలిదండ్రులుగను తమ హక్కులు, విధుల గురించి పరస్పరం తెలియజేసుకోవడం — వీటిని గురించిన నియమాలు కూడా వీటిలో ఉన్నాయి.

సోవియట్ దేశ, యూనియన్ రిపబ్లికుల వివాహ-కుటుంబ శాసనాల మౌలికసూత్రాల ఐదవ ప్రకరణం సోవియట్ శాసనాన్ని విదేశీయులు, పౌరసత్వరహితులైన వ్యక్తులకు వర్తింపజేయడాన్ని గురించి, విదేశీయులవివాహ చట్టాలను; అంతర్జాతీయ ఒప్పందాలను, ఒడంబడికలను వర్తింపజేయడం గురించి వివరిస్తుంది. వీటికి సంబంధించిన నియమాలను వివరంగా చర్చించాల్సిన అవసరంలేదు. ఇవి అత్యంత మానవతా యుతంగా వుంటా

యని, వివిధ పరిస్థితులకు తగు విధంగా అన్వయించేందుకు అనువుగా వుంటాయని చెబితే సరిపోతుంది. వీటిలో విదేశీయులు, పౌరసత్వం లేని వ్యక్తులు, సోవియట్ దేశం వెలుపలా, లోపలనివసించే సోవియట్ పౌరులు - వీరి మధ్య వివాహాలు, విడాకులకు సంబంధించిన నియమాలు, విదేశాల్లో వుంటున్న సోవియట్ పౌరులైన బిడ్డలను దత్తత తీసుకోవడానికి, సోవియట్ దేశంలో నివసిస్తూన్న విదేశీయుల పిల్లలను దత్తత తీసుకోవడానికి వర్తించే నిబంధనలు, అట్టి బాలల పౌరసత్వం గురించి యీ ప్రకరణం వివరిస్తోంది.

7వ ప్రకరణం

# పౌర విద్యనం గురించిన సోవియట్ యూనియన్, యూనియన్ రిపబ్లిక్కుల శాసన మౌలిక సూత్రాలు

అక్టోబర్ విప్లవం సోవియట్ యూనియన్‌లో పౌర విద్య, విజ్ఞాన శాస్త్రం, సంస్కృతుల అభివృద్ధికి అనువైన పరిస్థితులను ఏర్పరచింది. నిజంగా ప్రజాతంత్రయుతమైన పౌర విద్యా విధాన నిర్మాణానికి, సకల మానవజాతికి సోవియట్ యూనియన్ మార్గదర్శకమయింది. సోవియట్ యూనియన్‌లో ఈనాడు సెకండరీ ఉన్నత విద్యను పొందటానికి అవకాశాలు లేని పౌరుడు ఒక్కడైనా లేడు. అదే విధంగా, అతని వృత్తి విద్యా శిక్షణ, అర్హతలకు, అనుగుణమైన ఉద్యోగం అతనికోసం కాచుకొని ఉంటుంది. ఈ శాసన మౌలిక సూత్రాల పీఠికలో* ఇలా చెప్పబడింది. "సోవియట్ యూనియన్‌లో సోషలిజం విజయం, సోవియట్ ప్రజల జీవన ప్రమాణాలు, విద్యా, సాంస్కృతిక, ప్రమాణాలు త్వరితగతిని, నిరంతరాయంగా పెరగడానికి అవసరమైన హామీ కల్పించింది. క్రెచీలు, కిండర్

---

* ఒక శాసనం లక్ష్యాలను, దాన్ని చట్టంగా రూపొందించడానికి గల కారణాలను వివరిస్తూ చేర్చబడిన ముందు మాట. సోవియట్ యూనియన్‌లో ఇట్టి పీఠిక, ప్రస్తుత చట్టం రూపొందడానికి దారితీసిన చారిత్రక పరిస్థితులను కూడా క్లుప్తంగా వివరిస్తుంది. చట్టంలో పేర్కొనబడిన హక్కులు నిజ జీవితంలో వాస్తవ రూపం ధరించడానికి హామీగా నిలుస్తుంది.

గార్డెన్‌ల వంటి పాఠశాల పూర్వపు సంస్థలలో బిడ్డలను చక్కని, శిక్షణతో పెంచడానికి అవసరమైన పరిస్థితులు ఏర్పడ్డాయి. క్రమానుగతంగా ఎనిమిది సంవత్సరాల నిర్బంధ విద్యాబోధ ను ప్రవేశపెట్టి, అటు తర్వాత సార్వజనీన సెకండరీ విద్యాస్థాయికి పురోగమించేందుకు వీలు కలిగింది. వృత్తి విద్యాపరమైన ప్రత్యేక సెకండరీ, ఉన్నత విద్యాసంస్థలను దేశ వ్యాప్తంగా విరివిగా నెలకొల్పటం జరిగింది".

మానవజాతి ఇంతకు మునుపు ఏనాడు కనీవినీ ఎరుగని అత్యున్నత ఉత్పత్తి స్థాయిని సాధించి, సమాజ సభ్యులందరి. అవసరాలను పరిపూర్ణంగా తీర్చి, దినదినం మరింత విస్తృతమయ్యే సాంస్కృతిక దిగంతాలను చేరుకుంటూ, సర్వజన కళ్యాణమే తన లక్ష్యంగా పెట్టుకొని ముందుకు సాగే కమ్యూనిస్టు సమాజ నిర్మాణం అంత సులభమైన పని కాదు. ఇందుకోసం దేశ ఉత్పత్తి శక్తులను, శాస్త్రీయ, సాంకేతిక పురోగతిని నిరంతరం పెంపొందించాలి. ఇందుకోసంగా, యువతరాన్ని సర్వతో ముఖంగా సుశిక్షితుల నొనర్చాలి. జాతీయార్థిక వ్యవస్థకు అవసరమయిన ప్రత్యేక నిపుణులను. ఉన్నతమైన అర్హతలుగల కార్మికులను తరిఫీదు చేసు కొనేందుకు, సోవియట్ ప్రజల సాధారణ వృత్తి విద్యా శిక్షణలను ఉన్నత దశకు అభివృద్ధి చేసేందుకు తగు చర్యలు చేపట్టటం జరిగింది. అందువల్ల సోవియట్ ప్రజల సాంస్కృతిక విలువలు మరింత పెరగటం, వారిలో కమ్యూనిస్టు దృక్పథం చోటు చేసుకొనడం, ఉన్నత శ్రామికోత్పాదక శక్తి దినదిన ప్రవర్ధమాన మవడం మూలంగా మానసిక శ్రమకు, శారీరక శ్రమకు మధ్య, పట్టణాలకు పల్లెలకు మధ్యగల గణనీయమైన విభేదాలు క్రమంగా తగ్గిపోతాయి. ఈ లక్ష్యసాధనకే సోవియట్ దేశ పౌర విద్యా విధానం ఎక్కుపెట్టబడింది. నవ సోవియట్ మానవుని సాంస్కృతిక, మేధా సంబంధమైన అవసరాలన్నింటినీ సరైన-మార్గంలో పెంపొందించి, తీర్చ డమే సోవియట్ విద్యా విధాన లక్ష్యం.

ఈ మౌలిక సూత్రాల పీఠిక ఇలా పేర్కొంటున్నది: "సోవియట్ యూనియన్‌లో విద్య నిజంగా దేశవ్యాప్త కర్తవ్యం. ప్రభుత్వం, కుటుంబం, ప్రజా సంస్థలు తమ సమిష్టి కృషిద్వారా బాలల, యువకుల పెంపకంలోను, వారికి విద్యాబుద్ధులు గరపడంలోను అనూహ్యమైన శ్రద్ధ

కనబడుతున్నాయి. ప్రజా విద్యాభివృద్ధిలో ఉపాధ్యాయులు ప్రత్యేక పాత్ర వహిస్తున్నారు. వారు తమ వృత్తి పరమైన, సామాజిక బాధ్యతలను సంపూర్ణంగా గుర్తిస్తున్నారు. యువతరానికి కమ్యూనిస్టు పద్ధతిలో ఉత్తమ శిక్షణను అందించడానికి వారు శాయశక్తులా పాటుబడుతున్నారు.

"సోవియట్ పౌర విద్యా శాసనం, ప్రజా విద్యా వ్యవస్థను క్రియాశీలంగా పెంపొందించేందుకు ఈ సామాజిక సంబంధాల రంగంలో సోషలిస్టు పట్ల బద్ధతను అభివృద్ధి పరచేందుకు ఉద్దేశించబడింది."

ఈ మౌలిక సూత్రాలలోని మొదటి నిబంధనలోనే దీని లక్ష్యం స్పష్టంగా నిర్వచించబడింది. దీని లక్ష్యం ద్విముఖమైనది. ప్రవర్తిత సోషలిస్టు సమాజ అవసరాలను దృష్టిలో ఉంచుకొని విద్యా, కమ్యూనిస్టు శిక్షణ, ప్రతి ఒక్క సోవియట్ పౌరునికి క్రమబద్ధంగా అందించడమే ఈ శాసనం ప్రథమ లక్ష్యం. ఇక రెండవ లక్ష్యం, జాతీయార్థిక వ్యవస్థకు అవసరమైన నిపుణులయిన, కార్మికులను, సమర్థులయిన సాంకేతికజ్ఞులను అందించటం. నిపుణులయిన కార్మికుల, సాంకేతికజ్ఞుల అవసరం నిరంతరం, పెరుగుతూనే ఉంటుంది.

ఇంతకుముందే చెప్పినట్లుగా, సోవియట్ పౌరులకు విద్యాహక్కు గ్యారంటీ చేయబడింది. ఈ హక్కు కేవలం కాగితం మీదనే వుండి పోకుండా చేసేందుకై మూడవ నిబంధనలో తిరుగులేని హామీలు ఏర్పాటు చేయబడివున్నాయి. అవి ఇవి:

1. ఎనిమిదేళ్ళ నిర్బంధ పాఠశాల విద్య. దానితోబాటు యువజను లందరికీ సార్వజనీన విద్యా విధానం;

2. నిత్య జీవితంతోను, కమ్యూనిస్టు సామాజిక వ్యవస్థ నిర్మాణం తోను, సన్నిహిత సంబంధాల ప్రాతిపదికపై వృత్తి విద్య, ప్రత్యేక సెకండరీ, ఉన్నత విద్యా విధానాల అభివృద్ధి;

3. పాఠశాలల్లో మాతృభాషలో విద్యా బోధన;

4. పాఠశాల పూర్వపు విద్యా సంస్థల, విశ్వవిద్యాలయేతర విద్యా సంస్థల వ్యవస్థను విస్తరింపచేయడం;

5. అన్ని రకాల విద్యకు బోధనల రుసుములు రద్దు;

6. ప్రభుత్వ ఉపకార వేతనాల, ఇతర గ్రాంటుల వ్యవస్థను కొనసాగించడం;

7. శ్రామిక ప్రజలకు వివిధ రూపాల ఉత్పత్తి, సాంకేతిక శిక్షణనూ, పురోగామి శిక్షణనూ వ్యవస్థీకరించడం;

8. శిక్షణలోను, చదువులోను నిమగ్నమై వున్నవారికి అఖిల యూనియన్, యూనియన్ రిపబ్లిక్కుల శాసనాలలో ప్రత్యేక సౌకర్యాలు కల్పించబడాయి.

సోవియట్ దేశ ప్రజా విద్యా విధానపు మౌలిక సూత్రాలు యీ క్రింద పేర్కొనబడ్డాయి;

1. సోవియట్ దేశ పౌరులందరికి వారి నరవంశము, జాతి, ప్రాంతము, ఆస్తి, అంతస్థులతోనూ, స్త్రీ పురుష భేదంతోనూ, నిమిత్తం లేకుండా సమాన విద్యా హక్కులున్నాయి.

2. సకల బాలలకు, నవయౌవనులకు విద్య నిర్బంధం:

3. సకల విద్యా సంస్థలు ప్రభుత్వానికి, పౌరులకు చెందినట్టివి:

4. బోధనా భాషను ఎంపిక చేసుకునే స్వాతంత్ర్యం ప్రతి పౌరునికి వుంది—అంటే, తన మాతృభాషలో గాని, మరే సోవియట్ దేశంలో భాష గాని విద్యాభ్యాసం చేయవచ్చు;

5. అన్ని రకాల విద్యాబోధన సుచితం;

6. ప్రభుత్వం ఒక భాగం విద్యార్థుల ఖర్చులను ఉపకార వేతనాల ద్వారా పూర్తిగా భరిస్తుంది. వృత్తి శిక్షణ పొందేవారికి, ఇతర విద్యార్థులకు ఉపకార వేతనాలు, ఇతర విధాలైన పాదార్థిక సహాయము అందించబడుతుంది.

7. సోవియట్ ప్రజా విద్యా విధానం సమీకృతము, సమగ్రము అయినది. అన్నిరకాల చదువులలోను క్రమానుగతంగా క్రిందనుండి పై తరగతులకు వెళ్ళే అవకాశముంది;

8. బాలలను, యువకులను పెంచి, పెద్దచేయడంలో పాఠశాలలు, కుటుంబం, ప్రజలమధ్య పరస్పర సహకారం వుంది.

9. విద్యా విధానానికి, సోవియట్ నవతరం పెంపకానికి జీవితంతోను, కమ్యూనిస్టు వ్యవస్థ నిర్మాణంతోను గల విడదీయరాని బంధం;

10 విద్యావిషయ వస్తువు శాస్త్రీయత; విజ్ఞాన, సాంకేతిక శాస్త్రాల్లోనూ, సాంస్కృతిక రంగంలోనూ సాధించిన అత్యాధునిక విజయాల ప్రాతిపదికపై విద్యావ్యవస్థలో జరుగుతూన్న నిరంతరాభివృద్ధి;

11. సోవియట్ విద్యావిధానం, బాలల, యువకుల పెంపకాలకు గల మానవతాయుత, ఉన్నత నైతిక ప్రాతిపదిక;

12. యువతీ యువకుల సహ విద్య;

13. విద్యావిధానంపై మతప్రభావం యేమాత్రమూ లేకపోవడం, దాని లౌకిక స్వభావం;

వీటిని విద్యాచట్టపు మౌలిక సూత్రాలలో స్పష్టంగా పేర్కొనటం జరిగింది. సోవియట్ ప్రజా విద్యావిధానానికి మార్గదర్శకత్వం వహించే అంతిమ అధికారం, అత్యున్నత రాజ్యాధికార సంస్థలకు, ప్రభుత్వ కార్యాలయాలకు, స్థానిక ప్రజా ప్రతినిధుల సోవియట్లు, వాటి కార్య నిర్వాహక వర్గాలకు వుంటుంది. ఈ స్థానిక సోవియట్లు విద్యాసంస్థలను నెలకొల్పేందుకు అనువైన స్థలాలను యెంపికచేయడం, వాటి కవసరమైన పాదార్థిక సౌకర్యాలను యేర్పాటు చేయడం, విద్యాసంస్థల సముదాయాలను అభివృద్ధిపర్చడం, తమ ఆధ్వర్యంలోని వృత్తిశిక్షణ, బోధనా సంస్థలను సరైన పద్ధతులలో నడపడం వంటి చర్యలు గైకొంటాయి. ప్రతిశిక్షణాసంస్థ ప్రధానోపాధ్యాయుడు, నిర్దేశకుడు, రెక్టరు తమ కార్యకలాపాల నిర్వహణకై సమిష్టి అధ్యాపక సంస్థపైన, ప్రజాసంస్థలపైన ఆధారపడతారు. అధ్యాపకులూ, ప్రజా ప్రతినిధులూ సభ్యులుగా విద్యాసమితి యేర్పాటవు తుంది. ఈ సమితి ఆటి విద్యాసంస్థ విద్య, బోధన, పరిశోధనా కార్య క్రమాలకు సంబంధించిన మౌలిక సమస్యలను సమిష్టిగా చర్చించి, నిర్ణయిస్తాయి. ఆయా కర్మాగారాలు, ప్రభుత్వ, సమిష్టిక్షేత్ర సంస్థలు, ట్రేడ్‌యూనియన్లు విద్యాభివృద్ధి కృషిలోను, వృత్తివిద్యా బోధన, శ్రామిక ప్రజల శిక్షణలోను, కర్మాగార, కార్యాలయ, సమిష్టిక్షేత్ర కార్యకర్తలు ఉన్నత విద్య గడించడంలోను విశేష శ్రద్ధ గైకొనితీరాలి. అలాగే పౌరుల స్వాధ్యయనానికి, వారి సాంస్కృతిక ప్రమాణాల పెంపుదలకు ప్రభుత్వం తగు సౌకర్యాలను కల్పించాలి. ఇందుకోసం ప్రజా విశ్వవిద్యాలయాలు, ఉపన్యాస కేంద్రాలు, తరగతులు, కమ్యూనిస్టు కృషి పాఠశాలలు, తదితర

రాజకీయ, శాస్త్ర విజ్ఞాన ప్రచార కేంద్రాలు ఏర్పాటుచేయాలి. ప్రజా విద్యాశాఖ కార్యాలయాలు, సంస్థలు విద్యార్థులు తమంతతాము చదువుకుందుకు తగు విధంగా తోడ్పడాలి.

పాఠశాల పూర్వస్థాయిలోను, సెకండరీ విద్య, విశ్వవిద్యాలయేతర విద్య, వృత్తివిద్యా శిక్షణ, ప్రత్యేక సెకండరీ విద్య, ఉన్నత విద్యారంగాల నిర్వహణకై విస్తారమైన ఏర్పాట్లు జరిగాయి. ఆ వివరాలన్నింటిని యీ గ్రంథంలో చర్చించడం సాధ్యంకాదు అయినా, కొన్ని ప్రధాన విషయాలను స్పృశించడం జరుగుతుంది.

పాఠశాల పూర్వ విద్యా వ్యవస్థ ప్రధాన లక్ష్యం, కుటుంబాలతో సన్నిహిత సహకారంద్వారా బాలలను సరయిన పద్ధతులలో పెంచి, పెద్ద చేయడం, వారి ఆరోగ్యాన్ని పరిరక్షించి, పదిలపరచడం, వారిలో మౌలిక మైన మంచి అలవాట్లను, పనియెడ ప్రేమాభిమానాలను పెంపొందించడం, వారిలో సౌందర్య తృష్ణను అభివృద్ధిచేయడం, వారిని అటుతర్వాత పాఠశాలా విద్యాభ్యాసానికి అనువగురీతిలో సంసిద్ధుల నొనర్చడం, పెద్దలయెడ గౌరవం, దేశాభిమానం, తమతోటి ప్రజలపట్ల ప్రేమ, తమ ప్రాంతం అభివృదియెడ శ్రద్ధ పెంపొందించడమే. సెకండరీ విద్యాస్థాయిలో శాస్త్ర, సాంకేతిక రంగాలలో సాధించిన అభివృద్ధికి అనుగుణంగా సాధారణ విద్యాబోధన చేయడమేగాక, వారిలో జ్ఞానతృష్ణను రేకెత్తించి, అలా ఆర్జించిన జ్ఞానాన్ని ఆచరణయుక్త మొనర్చే విధంగా మలచడం కూడా యీ దశలో ప్రధాన లక్ష్యాలుగా వుంటాయి. దేశభక్తి, విశాల మానవతా దృక్పథం, యితర దేశాల ప్రజలయెడ స్నేహసౌహార్దాలు — వీటిని పెంపొందించడంయెడ విశేష శ్రద్ధ గైకొనబడుతుంది. కమ్యూనిజాన్ని నిర్మిస్తూన్నవారి నైతిక నియమాలకు అనుగుణమైన గుణాలు వీరిలో వుండాలి. పాఠశాలలను, ఇళ్ళకు వీలయినంత దగ్గరలో నెలకొల్పేందుకు, గ్రామీణ ప్రాంతాల్లోని బాలలకు పాఠశాలలకు రానుపోను ఉచిత రవాణా సౌకర్యాల కల్పనకు, పాఠశాలల కనుబంధంగా ఉచిత భోజనాలయాల యేర్పాటు వగైరా, చట్టం నిర్దేశించే కొన్ని ముఖ్యాంశాలు. సుదీర్ఘ వైద్య సహాయ మవసరమైవున్న పిల్లలకు సాధారణ ఆరోగ్య నిర్మాణ పథకాలు, శానిటోరియం పద్ధతిలో ఉన్న పాఠశాలలు, అటవీ పాఠశాలల వంటివి

ఏర్పాటు చేయబడతాయి. వారికి అట్టి వైద్యశాలలు, లాబొరేటరీలు, అవసరమైతే యిళ్ళలోనే విద్యాభ్యాస సౌకర్యాలు కలిగించబడతాయి. మానసిక దుగ్ధతలుగల బాలలకు, యువకులకు, వారు సాధారణ పాఠశాలలకు వెళ్ళజాలరు గనుక వారికై ప్రత్యేక పాఠశాలలు ఏర్పరచి, విద్యాబోధనతో వైద్యసదుపాయ కల్పన, సామాజికంగా ఉపయోగవంతమైన పనులలో శిక్షణను కూడా సమ్మిశ్రితం చేయడం జరుగుతోంది.

జాతీయార్థిక వ్యవస్థలోని వివిధ రంగాల్లో పనిచేస్తూ, సెకండరీ విద్యాస్థాయి లేనివారికి సాయంకాల పాఠశాలల ద్వారాను. ఉత్తర ప్రత్యుత్తర పద్ధతుల ద్వారాను సాధారణ సెకండరీ విద్య గరపబడుతోంది. యువ కార్మికులు. ఉద్యోగులు సాయంకాల పాఠశాలలో నమోదై తమ విద్యాభ్యాసంగాన్ని కొనసాగించేందుకు అనువైన పరిస్థితులను ఆయా పారిశ్రామిక సంస్థలు, కార్యాలయాలు కల్పించాలి; పాఠశాలలు మామూలుగా పనిచేసేందుకు తగు సౌకర్యాలు కల్పించాలి.

యువజన క్లబ్బులు, భవనాలు, యువ పర్యాటక కేంద్రాలు, యువ సాంకేతికుల, ప్రకృత్యోపాసకుల పరిశోధనాలయాలు, బాల గ్రంథాలయాలు, క్రీడా, కళా, సంగీత పాఠశాలలు, యువజన శిబిరాలు, తదితర పాఠశాలేతర బాలబోధనా సంస్థలను నెలకొల్పవలసి వుంటుందని వివిధ ప్రభుత్వ సంస్థలను. కార్యాలయాలను చట్టం ఆదేశిస్తోంది.

సాయంకాల వృత్తి విద్యాలయాలు, శిక్షణా సంస్థలు, భావి శిక్షణాలయాలు పనులలో నిమగ్నమై వున్నవారికోసం వారు పనిచేసే చోట్లలోనే నెలకొల్పాలని సాధారణ సెకండరీ విద్యను పూర్తిచేశాక వారికి యీ వృత్తి, సాంకేతిక శిక్షణ యివ్వాలనీ, అలాగే కొత్త వృత్తులను చేపట్టదలచిన వారికి, ఉన్నత శిక్షణను పొందదలచిన వారికి, తగు ప్రోత్సాహాన్నివ్వాలని ఆదేశింపబడింది.

ప్రత్యేక సెకండరీ విద్యా, సాధారణ సెకండరీ విద్యా స్థాయిగల వారిని ఉన్నత విద్యార్హతలుగల ప్రత్యేక నిపుణులుగా తరిఫీదు చేయుటకు ప్రత్యేక విద్యాసంస్థలు నెలకొల్పబడతాయి. ఆధునిక ఉత్పత్తి విధానము, విజ్ఞాన, సాంకేతిక శాస్త్ర ప్రమాణాలు, సంస్కృతీ విలువలను, ఉన్నత

నైతిక విలువల పెంపుదలను దృష్టియందుంచుకొని వారికి గుణాత్మకమైన శిక్షణను గరపుటకు ఏర్పాట్లు జరుగుతాయి.

ఉన్నత విద్యాసంస్థలు కూడా పగటి తరగతుల ద్వారానేగాక, సాయంకాల బోధన, ఉత్తర ప్రత్యుత్తర పద్ధతులద్వారా విద్యాబోధన గావిస్తాయి. పని మానకుండానే ఉన్నత విద్యాసంస్థలలో విద్యాభ్యాసం కొనసాగించడం, వివిధ రంగాలలో ప్రత్యేక నైపుణ్యాన్ని వృద్ధిపరచుకొని, ఉన్నత విద్యార్హతలను పొందే పద్ధతులలో ఒకటి.

ప్రజల, విద్యార్థుల హక్కులు, బాధ్యతలు చట్టరీత్యా నిర్వచింపబడ్డాయి. వారికీ క్రింది హక్కులున్నాయి :

1. శాస్త్రప్రయోగశాలలు మొదలైన వాటిని ఉచితంగా వినియోగించుకోవచ్చు.

2. చట్టంలో నిర్దేశించిన విధంగా విద్యాలయాలలో ఉపకార వేతనాలు, భృతులు, హాస్టలు, భోజనాలయ వసతులు, వైద్యసహాయం, ఉచితంగా గాని, తక్కువ రేట్లకు గాని రవాణా సౌకర్యాలు, యితరవిధాలైన పాదార్థిక సహాయం పొందుతారు.

3. ఉత్పత్తి కార్యకలాపాలలో పాల్గొనే వారికి పని మానకుండానే, అదనపు శెలవు సౌకర్యాలను, తక్కువ పని గంటలను, యితర సౌకర్యాలను కల్పిస్తారు.

4. వృత్తివిద్యా సంస్థలు, ప్రత్యేక సెకండరీ, ఉన్నత విద్యాలయాలనుండి పట్టభద్రులయ్యాక, తాము శిక్షితులయిన రంగాల్లోనే పై పదవులకు ప్రమోటయ్యే హక్కు వుంటుంది.

ఇంతేగాక, విద్యార్థులు, ప్రజలు తమ తమ ప్రజాసంస్థలద్వారా బోధనాక్రమాన్ని సిద్ధాంత, విద్యావిషయక కృషిని, మెరుగుపరచడం గురించి, విద్యాప్రగతికి, తమ చదువులు, దైనందిన జీవితము, క్రమశిక్షణ వగైరా విషయాలకు సంబంధించిన సమస్యలను గురించి చర్చించే హక్కు వున్నది. ఉపాధ్యాయ, ఉపాధ్యాయేతర బోధనా సిబ్బంది యొక్క వృత్తిపరమైన హక్కులను, గౌరవాన్ని, హోదాలను చట్టం పరిరక్షిస్తోంది.

చట్టం ప్రకారం విద్యారంగ కార్యకర్తలు ప్రభుత్వం కల్పించే దీర్ఘకాల శెలవు సౌకర్యాలు, గ్రామసీమలలో ఉచిత గృహవసతి, విద్యుత్, ఉష్ణ సరఫరాలు, పింఛన్లు, తదితర సౌకర్యాలు పొందుతారు.

పాఠశాలలు, శిక్షణాలయాలు, తదితర విద్యాలయాలలో తలిదండ్రుల సమితులున్నాయి. తలిదండ్రులు తమ బిడ్డలు చదివే పాఠశాలలు, విద్యా సంస్థలలో బోధనా సౌకర్యాలు, బోధనేతర కార్యకలాపాలు, ఆరోగ్యాభి వృద్ధి కార్యక్రమాలు వగైరాల గురించి జరిగే చర్చలలో పాల్గొనవచ్చు.

పై యేర్పాట్లు చూచినట్లయితే, సోవియట్ ప్రభుత్వం తన ప్రజల విద్యా, సాంస్కృతిక స్థాయిని పెంపొందించేందుకు అత్యధిక ప్రాధాన్యత నిస్తోందన్నది విదితమవుతుంది. ఈ లక్ష్యసాధనకై యే వయస్సులో నయినా విద్యాభ్యాసం సాగించేందుకు,ఉన్నత నైపుణ్యాలను సాధించేందుకు, తామెంచుకున్న జీవనరంగంలో ప్రగతి సాధించేందుకు ప్రతి సోవియట్ పౌరునికి హక్కు వున్నది. ఈ లక్ష్యాల కోసం సాగిన కృషి మూలంగా చారిత్రకంగా అతి స్వల్పకాలంలో సమస్త సోవియట్ ప్రజ అత్యంత సంస్కృతీ పరులుగను, ఉత్తమ నిపుణులుగను అభివృద్ధి సాధించారు. అందువల్లనే, అత్యంత ప్రవర్తిత దేశాలను అందుకుని, విజ్ఞానశాస్త్రం, సాంకేతిక విజ్ఞానం, తదితర జీవనరంగాలలో అత్యద్భుత ప్రగతిని సాధించారు.

8 వ ప్రకరణం

# ఆరోగ్య సేవల శాసన ప్రాతిపదిక సూత్రాలు

ఇతర జీవనరంగా లన్నింటిలోవలె, ఆరోగ్య విషయాల్లో కూడా వ్యక్తియెడ, సమాజంయెడ సోవియట్ ప్రభుత్వం గొప్ప శ్రద్ధాసక్తులు ప్రదర్శిస్తోంది. దైనందిన జీవితంలో మరింత మెరుగైన పని పరిస్థితులు, విశ్రాంతి సౌకర్యాల పరికల్పన యీ దిశలో గైకొన్న అతి ముఖ్యమైన చర్య. ఇవేగాక, సోవియట్ యూనియన్‌లో అత్యంత విస్తృతమైన సామాజిక-ఆర్థిక, వైద్య సంబంధమైన సౌకర్యాలు కల్పించబడి వున్నాయి. ప్రజారోగ్య సంరక్షణా ప్రమాణాలను పెంపొందించి, ఉత్తమోత్తమమైన వైద్యసేవలను ప్రతివారికి ఉచితంగా అందజేయడమే వీటి లక్ష్యం. పెద్ద యెత్తున వ్యాయామ, క్రీడా సౌకర్యాలు సమగ్ర పథకం రూపంలో ప్రవేశ పెట్టబడ్డాయి. తద్వారా ఆరోగ్యాభివృద్ధి, పరిశుభ్రత సాధించబడుతున్నాయి. తల్లీబిడ్డల సంరక్షణపట్ల విశేషశ్రద్ధ చూపబడుతోంది.

వైద్యరంగంలో శాస్త్రీయ పరిశోధనకు, పౌరుల ఆరోగ్య పరిస్థితిని బాగా మెరుగుపరిచి, వారి క్రియాశీల జీవనకాలాన్ని అధికాధికంగా పొడిగించేందుకు విశేష శ్రద్ధాసక్తులు చూపబడుతున్నాయి.

ఆరోగ్య సంరక్షణా వ్యవస్థ ప్రజల సాధారణ ఆరోగ్య పరిస్థితిని ఎంతో మెరుగుపరచింది. ముఖ్యంగా అంతకుముందు ఎంతో విస్తృతంగా వ్యాపించివున్న అంటువ్యాధులు పూర్తిగా నిర్మూలింపబడ్డాయి. పౌరుల ఆయుర్దాయాన్ని పెంచడంలో గణనీయమైన పురోగతి సాధించబడింది. వైద్యసేవల విషయంలో సోవియట్ శాసన లక్ష్యం, ప్రజారోగ్య వ్యవస్థను పటిష్ఠతరమొనర్చడము, యీ రంగంలో చట్టాల పాత్రను పదిలపర్చడ

ముమ్మా. ఈ చట్టాలు పౌరులలో సుసంబద్ధమైన శారీరక, మానసిక అభివృద్ధికి, ఆరోగ్యానికి, పనిచేయగల శక్తికి, సుదీర్ఘ క్రియాశీల జీవితానికి హామీకల్పిస్తాయి. రోగగ్రస్తతను నివారించడం, తగ్గించడం, అశక్తత సంప్రాప్తించకుండా వీలయినంత తగ్గించడం, మరణాల రేటును తగ్గించడం, పౌరుల ఆరోగ్యానికి భంగకరమైన ప్రభావం కల్గించే వాటిని, అటువంటి పరిస్థితులను నిర్మూలించడం యీ శాసనాల లక్ష్యం. ప్రజల ఆరోగ్య పరిరక్షణ సకల ప్రభుత్వ సంస్థల బాధ్యత

నాల్గవ నిబంధన ఇలా చెప్తున్నది: "ప్రతి సోవియట్ పౌరుడు ప్రభుత్వ ఆరోగ్యసంస్థ కల్పించే ఉచిత, నిపుణ వైద్యచికిత్సను పొందే హక్కును కలిగిఉంటాడు. ఈ వైద్యసంస్థలు ప్రతిఒక్కరికీ అందుబాటులో ఉంటాయి. ఇతర దేశాల్లో నెలకొనిఉన్న పరిస్థితులతో పోల్చిచూచినట్లయితే, ఈ హక్కుకు గల ప్రాధాన్యత ఏమిటో అర్థమౌతుంది. సోషలిస్టేతర దేశాలలో మధ్యతరగతి పేదప్రజలకు అతిభారమైన తప్పనిసరి ఖర్చుల్లో వైద్యచికిత్సకు అయ్యే ఖర్చు ముఖ్యమైనది. ఇలాంటి వారికి ప్రత్యేక నిపుణుల సలహాగాని, ఉత్తమ తరగతికి చెందిన చికిత్సగాని ఆకాశ కుసుమం వంటిది. సోవియట్ పౌరులు ఇలాంటి ఉత్తమ చికిత్సను పొందేందుకు చట్టపరమైన హక్కు కలిగి ఉన్నారు.

వైద్య పరిశ్రమ పూర్తిగా ప్రభుత్వం చేతిలో ఉంది. ప్రజావసరాలు తీర్చటమే దీని ఏకైక లక్ష్యం. లాభాల ప్రసక్తిలేదు. ప్రభుత్వం ప్రజారోగ్యాభివృద్ధికి, రోగ నివారణ చర్యలకు విస్తృతమైన చర్యలు చేపడుతూంది. అందునా యువతరం పట్ల శ్రద్ధ చూపబడుతూంది. దైనందిన జీవితంలో ఆరోగ్యప్రదమైన, పరిశుభ్రమైన పరిస్థితులను ఏర్పరచటము, పారిశ్రామిక ప్రమాదాలకు, వృత్తిపరమైన వ్యాధులకు గల కారణాలను నిర్మూలించడం గూడా ప్రభుత్వం తన విధిగా భావిస్తూంది. ప్రజారోగ్యానికి భంగకరమైన సకలవిధ కాలుష్యాలను పూర్తిగా నిర్మూలించటం కూడా ప్రభుత్వం తన కర్తవ్యంగా భావిస్తూంది. అన్ని విధాలయిన ఆరోగ్య సంస్థల వసతులను ఏర్పరచటం, ప్రజలకు అన్నిరకాలయిన వైద్యసేవలను సమకూర్చడం జరుగుతూంది. నిరంతర ఆరోగ్య పరీక్షా విధానాన్ని క్రమానుగతంగా వ్యాప్తిచేసి విశిష్ఠ వైద్యసేవలను ప్రతియింటి ముంగిటా

కల్పించేందుకు ప్రయత్నం జరుగుతోంది. అనేక విధాలయిన శానిటోరియంలు రోగ నిరోధక సంస్థలు, విశ్రాంతి కేంద్రాలు, సమిష్టి భోజన కేంద్రాలు, పర్యాటక సంస్థలు, వగైరా సంస్థలు శ్రామిక ప్రజల చికిత్సనూ, వినోదాన్ని చాలా విరివిగా కల్పిస్తున్నాయి. ప్రజలకు వ్యాయామ, పారిశుధ్య శిక్షణ నిస్తున్నారు.

సోవియట్ యూనియన్‌లో వ్యాయామ కళ, క్రీడలు పెద్ద యెత్తున పెంపొందించబడుతున్నాయి. ప్రభుత్వ, ప్రజాసంస్థలు, సమిష్టి శ్రామిక సంస్థలు, ఆరోగ్య సంరక్షణ చర్యల అమలులో చురుగ్గా పాల్గొనాలని చట్టం నిర్దేశిస్తూంది. ప్రజారోగ్య వ్యవస్థ యాజమాన్యం అత్యున్నత రాజ్యాధికార సంస్థల చేతుల్లో ఉన్నది. అఖిల యూనియన్‌స్థాయి మొదలు కొని స్థానిక సోవియట్ వరకు అత్యున్నతాధికారాలు గల ప్రభుత్వ సంస్థలు ఈ శాఖ పని విధానాన్ని పర్యవేక్షిస్తున్నాయి.

వైద్యసేవలో ప్రత్యేక శిక్షణపొంది, తగు అర్హతలుగలవారే వైద్య చికిత్సను, మందులను ఇవ్వటాన్ని చేపడతారు. వైద్యుల. ఇతర వైద్య రంగ కార్యకర్త. వృత్తిపరమైన హక్కులు, గౌరవము, హోదా చట్టరీత్యా పరిరక్షించబడుతున్నాయి. వైద్యనిపుణులకు, ఇతర వైద్యరంగ కార్య కర్తలకు ఎప్పటికప్పుడు ప్రపంచ వ్యాప్తంగా వైద్యశాస్త్రంలో వస్తున్న అభివృద్ధిని తెలియజేసి, వారి వృత్తిపరమైన విజ్ఞానాన్ని, ప్రత్యేక నైపుణ్యాన్ని పెంపొందించేందుకై ప్రవర్థిత వైద్య పరిశోధనా సంస్థలలోనూ, తదితర ఆరోగ్య సంస్థలలోను తరచుగా రిఫ్రెషర్ కోర్సులు నిర్వహించ బడుతున్నాయి. అట్టి నిపుణులు ఒక క్రమపద్ధతిలో తమ పరిశోధనలు కొన సాగించి, తమ విద్యార్హతలను పెంపొందించుకునేందుకు కావలసిన అవ కాశాలన్నీ కల్పించబడుతున్నాయి.

ఆరోగ్య శాసనం శానిటోరియంలు, అంటువ్యాధుల నివారణ కేంద్రాలు, రోగ నిరోధక సంస్థలు, మాతా శిశు ఆరోగ్యకేంద్రాలు, వినో దాత్మక పర్యాటక కేంద్రాలు, క్రీడా, వ్యాయామ మందిరాలు ఉన్నత వైద్య నిపుణులచే ఆరోగ్య పరీక్షలు, అత్యాధునిక వైద్యపరికరాల ద్వారా పరీక్షా చికిత్సా సౌకర్యాలు వగైరాల గురించి వివరంగా పేర్కొంటున్నది. ఇట్టి వాటిలో ముఖ్యమైన వానినే ఇక్కడ పేర్కొనే అవకాశం ఉన్నది. ప్రజల,

పరిసరాల పరిశుభ్రతను కాపాడి, అంటు వ్యాధుల వ్యాప్తిని అరికట్టి, ప్రభుత్వ ఆరోగ్య, పరిశుభ్రతా పర్యవేక్షకు వ్యవస్థను సక్రమంగా నిర్వహించటం ప్రభుత్వ విధి. వాతావరణ కాలుష్యాన్ని అరికట్టి, నిర్మూలించటం, నివాస స్థలాల్లోను, పని ప్రదేశాల్లోను ప్రజల నివాస సౌకర్యాలను, పరిశుభ్రతను అభివృద్ధి పరచటం ప్రభుత్వం విధి. అంటు వ్యాధులను వ్యాపింపచేసే పరిస్థితులను పూర్తిగా తొలగించటం, ఆరోగ్య, పరిశుభ్రతా నియమాలకు, ప్రమాణాలకు ఏ మాత్రం భంగం కలగకుండా చూడటం ఈ చట్టాల లక్ష్యం. పట్టణాల జనావాసాల రూపకల్పనా, నిర్మాణాలలో ప్రజల జీవన, ఆరోగ్య పరిస్థితులు అత్యుత్తమంగా ఉండేందుకు తగు జాగ్రత్తలు తీసుకోబడుతున్నాయి. ఇట్టి నివాస ప్రాంతాలలో నీటి సరఫరా మురుగు పారుదల, రోడ్లు వృక్షసముదాయాలు, వీధి దీపాలు, ఆరోగ్య మందిరాలు, పట్టణ పారిశుధ్య సేవలు వగైరాలకు చక్కని ఏర్పాట్లు చేయబడుతున్నాయి. ఆయా కర్మాగారాల, సంస్థల, భవన నిర్మాణ సంస్థల డైరెక్టర్లు, సమిష్టి వ్యవసాయ క్షేత్రాల యాజమాన్యాలు, తమ భవనాల ప్రణాళికలను తయారు చేయటంలోను, వాటి నిర్మాణంలోను, నిర్వహణలోను, వాతావరణ కాలుష్యం, భూగర్భ జలాలకు, భూసారానికి నష్టం జరుగకుండాను తగు జాగ్రత్తలు గైకొనాలని చట్టం నిర్దేశిస్తున్నది. ఈ నిబంధలను పాటించని వారిపై గట్టి చర్యలు తీసుకోబడతాయి. కొత్త పారిశ్రామిక సంస్థలు, ఫ్యాక్టరీలు, వర్క్‌షాపులు నిర్మించబడే సందర్భంలోను, అవి పాతవి పునర్నిర్మించబడే సందర్భంలోను విడుదల చేసేకాలుష్యాలను. పనికిరాని పదార్థాలను ప్రజారోగ్యానికి ఏ మాత్రం భంగకరం కాని విధంగా పరిశుభ్రపరిచేందుకు, వాటిని పోగు చేసి తగు విధంగా నిక్షిప్తంచేసేందుకు అవసరమయిన ఏర్పాట్లులేక పోతే అట్టిఫ్యాక్టరీలు వగైరాలను ప్రారంభించకుండానిషేధించేఅధికారం ఈ చట్టాలు కల్పిస్తున్నాయి. తీవ్రమైన, నిరంతర వ్యాధిపీడితులకుఅదనపునివాసస్థలాన్ని కేటాయించాలని చట్టంనిర్దేశిస్తున్నది. స్థానిక ప్రజా ప్రతినిధుల కార్యవర్గాలు, ఇతరప్రభుత్వ సంస్థలు,కర్మాగారాల, ఫ్యాక్టరీల పనివల్ల ఉత్పన్నమయ్యే శబ్దాలను కనీసస్థాయికి కుదించడానికి, వీలైతే పూర్తిగా లేకుండా చేయడానికి, తద్వారా జనావాసం, ఎక్కువగా

ఉన్న ప్రాంతాలలో శబ్ద కాలుష్య నివారణకు గట్టి చర్యలుచేబట్టాలి. ఈ శబ్ద కాలుష్య నివారణా నిబంధనలు సకల పౌరులకూ వర్తిస్తాయి.

ప్రజల ఆరోగ్యాన్ని పరిరక్షించి, అంటువ్యాధుల, వృత్తిపరమైన వ్యాధుల వ్యాప్తిని అరికట్టేందుకోసం ముఖ్యంగా ఆహార పరిశ్రమ, హోటళ్ళు, వ్యాపార సంస్థలు, నీటి సరఫరా వ్యవస్థలు, రోగ నిరోధక చికిత్సా కేంద్రాలు, శిశుమందిరాలు, పశు సంవర్ధక కేంద్రాలు మొదలైన వాటిలో పనిచేసే కార్మికులను, నియమించే ముందుగాను, అటు తరవాత తరచుగాను విధిగా వైద్య పరీక్షలకు గురి చేస్తారు. అంటువ్యాధుల వ్యాప్తిని అరికట్టడానికి, అవి ప్రారంభమయినపుడు వాటిని త్వరితగతిని నిర్మూలించడానికి సకాలంలో గట్టి చర్యలు తీసుకొనవలసిన బాధ్యత స్థానిక సోవియట్ల కార్యవర్గాలకు, ఆయా పారిశ్రామిక తదితర సంస్థల డైరక్టర్లకు ఇతర ఉద్యోగులకు అప్పగించబడింది.

అన్ని రకాల వైద్యశాలలు, చికిత్సా కేంద్రాలలో పౌరుల చికిత్సకు రోగ నిరోధక చర్యలకు తగు ఏర్పాట్లు ఉన్నాయి. అత్యవసర పరిస్థితులలో రోగికి ఇంటి వద్దనే తగు చికిత్సా సౌకర్యాలు కల్పించబడతాయి. జబ్బుపడిన పౌరులకు శెలవు మంజూరవడమే కాకుండా సామాజిక భీమా నిధుల నుండి నిర్దిష్ట విధానాన్ననుసరించి భృతి చెల్లించబడుతుంది. వ్యాధి నివారణకై ప్రభుత్వ చికిత్సా సంస్థలు పౌరులందరికీ వ్యాధి నిదాన పరీక్షలు, ఆరోగ్య సంరక్షక, పర్యవేక్షక విధానాలు విధిగా చేపట్టాలి. విదేశీయులకు పౌరసత్వం లేని వారికి, సోవియట్ పౌరులతోబాటు సమాన స్థాయిలో వైద్య సౌకర్యాలు కల్పించబడతాయి. ఇందుకై విస్తృతమైన ఏర్పాట్లు చేయబడి ఉన్నాయి. స్థానిక సోవియట్ల కార్యవర్గాలు, పారిశ్రామిక తదితర సంస్థల డైరక్టర్లు, ఇతర అధికారులు పౌరులకు అత్యవసర వైద్య సేవలకు అందించేందుకై ప్రయాణసాధనాలు, తదితర సౌకర్యాలను వైద్య రంగ కార్యకర్తలకు అప్పగించాలి. రోగి ప్రాణానికి ప్రమాదం ఏర్పడినప్పుడు అందుబాటులో ఉన్న ఎట్టి ప్రయాణసాధనాన్నయినా వైద్యుడుగాని, రోగిగాని అటు రోగి ఇంటికో లేక చికిత్సా కేంద్రానికో చేరేందుకై వినియోగించే హక్కు ఉన్నది. 37 వ నిబంధన దీన్ని గురించి ప్రత్యేకంగా పేర్కొంటున్నది.

సోవియట్ యూనియన్‌లో మాతృత్వానికి గొప్పరక్షణ, ప్రోత్సాహము లభిస్తున్నాయి. గర్భవతులకు మహిళా ఆరోగ్య సలహా కేంద్రాలు ప్రసూతి కేంద్రాలు, శానిటోరియంలు, విశ్రాంతి మందిరాలు, బిడ్డల తల్లుల కొరకు క్రెచీలు, కిండర్ గార్డన్‌లు, ఇతర బాలల సంరక్షణా కేంద్రాలు నెలకొల్పటం ద్వారాను, వారికి ప్రసూతి శెలవులు, ఇతర సౌకర్యాలు కల్పించటం ద్వారాను కార్మిక శాసన మౌలిక సూత్రాలు తల్లీ బిడ్డల ఆరోగ్య సంరక్షణకు గట్టి హామీలను కల్పిస్తున్నాయి. 39వ నిబంధన గర్భవతులకు, నవజీవ శిశువులకు మంచి వైద్య సేవలను కల్పిస్తున్నాయి. అదే విధంగా బాలలకు, యువజనులకు ఇవి చక్కని వైద్య వసతులు కల్పిస్తున్నాయి. ప్రత్యేక శిశు వైద్యశాలలు, విశిష్ట శిశు కేంద్రాలు, శానిటోరియంలు తదితర సంస్థలు ఇందు కోసమై విరివిగా నెలకొల్పబడుతున్నాయి. బాలల శానిటోరియంలో వసతి కల్పించినందుకు చిల్లిగవ్వ చెల్లించనక్కరలేదు శిశువులకు, బాలలకు తరుచుగా వైద్య పరీక్ష జరుపబడుతూ ఉంటుంది. బిడ్డల పెంపకంలో ప్రభుత్వం ఎంతో సహాయ పడుతూంది. క్రెచీలు, కిండర్‌గార్డన్, ఇతర శిశుమందిరాలలో ఈ పిల్లల పోషణకై అయే ప్రాథమిక వ్యయాన్ని ప్రభుత్వమే భరిస్తూంది. శరీరాభివృద్ధిలో లోపం ఉన్నవారి, మానసిక శారీరక సంబంధమైన వ్యాధులకు గురైన పిల్లల రక్షణకై బాల మందిరాలు. శిశు కేంద్రాలు, ఇతర శిశుసంస్థలు ప్రభుత్వ ఖర్చుపై నడపబడుతున్నాయి. జబ్బుపడ్డ శిశువును వైద్యశాలలో చేర్పించటం సాధ్యం కానప్పుడు, ఆసుపత్రిలోనే ఉంచి బిడ్డ బాగోగులు చూచే సౌకర్యం లేనప్పుడు, తల్లికిగానీ మరో కుటుంబ సభ్యుడికిగానీ సామాజిక భీమా నిధుల నుండి జీతమిచ్చి బిడ్డ సంరక్షణను చూచేందుకు ఏర్పాటు చేస్తారు. పన్నెండు నెలల కంటె తక్కువ వయస్సుగల పిల్లలకు గానీ, తీవ్రంగా జబ్బుపడి తల్లి దగ్గర ఉండటం అవసరమని వైద్యులు అభిప్రాయపడ్డప్పుడు అట్టి మాతృమూర్తికి సామాజిక భీమా నిధుల నుండి భృతి నిచ్చి, దగ్గరుండి బిడ్డను చూచుకునే అవకాశం కల్పిస్తారు. శానిటోరియంలు, ఆరోగ్య కేంద్రాలలో చికిత్స అవసరమైన వారికి సోవియట్ యూనియన్ ఆరోగ్య మంత్రిత్వశాఖ రూపొందించిన ఆరోగ్య నిబంధనలలో సూచించిన మేరకు వానిలో చేరిగానీ, లేదా బయట ఉండిగానీ చికిత్స పొందవచ్చు. యీ నిబంధనల

ప్రకారం యీ ఆరోగ్య. చికిత్సా కేంద్రాలలో చేరేవారు డబ్బేమీ చెల్లించ నక్కరలేదు. నిబంధనల మేరకు వారికి పూర్తి జీతాలు చెల్లించటంగానీ, లేదా ఇతర విధంగా అనుకూలమైన సౌకర్యాలు కల్పించంగానీ జరుగు తుంది. ప్రకృతి చికిత్సకు తగు వనరులుగల ప్రదేశాలను, చికిత్సకు ఉప యోగించే ఖనిజ ద్రవాలు, మృత్తికల ప్రదేశాలను, అనుకూల వాతా వరణము, తదితర పరిస్థితులుగల ప్రదేశాలను ఆరోగ్య కేంద్రాలుగా గుర్తించడము జరుగుతూంది. ఇట్టి ఆరోగ్య కేంద్రాలలోని వస తులను శానిటోరియంల కార్యకలాపాలతో సమన్వయపరచే బాధ్యత ఆరోగ్య కేంద్రాల నిర్వహణ బాధ్యత వహించే కేంద్రాలు చూస్తాయి. నిర్దేశిత నిబంధనల ననుసరించి సోవియట్ పౌరులకు విశ్రాంతి కేంద్రాలు, వినోదయాత్రా సంస్థలు, బోర్డింగ్ గృహాలలో తగు వసతులు పొందేందుకు హక్కు ఉన్నది. ప్రభుత్వ సంస్థలు, ఇతర ప్రజాసంఘాలు, వ్యాయామ క్రీడా, యాత్రా పర్యాటక సౌకర్యాలను ప్రోత్సహించి,పౌరుల ఆరోగ్యం. వినోదాలకు తోడ్పడాలని చట్టం నిర్దేశిస్తున్నది. ఈ సంస్థలు వ్యాయామ, క్రీడా పర్యాటక సంస్థలను విరివిగా నెలకొల్పి వానిని సుసంఘటితం చేయవలసిన బాధ్యతను కలిగి ఉన్నాయి. వైద్య, ఆరోగ్య సంస్థలలో పనిచేసే వైద్యుడు గానీ, వైద్యబృందంగానీ పౌరులకు సంభవించే తాత్కాలిక అశక్తతను అంచనా గట్టి శెలవు మంజూరుకు సిఫారసు చేస్తారు. ఇట్టి అశక్తత జబ్బు లేక గాయాలవల్లగాని గర్భం లేక ప్రసూతివల్లగానీ, శానిటోరియం, క్వారంటైన్, ఆరోగ్య కేంద్రాలలో చికిత్సవల్లగానీ జబ్బుపడిన బంధువుల సేవ వల్ల గాని సంభవించవచ్చు.

పౌరులకు కావలసిన మందులను ప్రభుత్వ ఔషధాగారాలు, ఆరోగ్య చికిత్సా కేంద్రాలు సమకూరుస్తాయి. వైద్యశాలలకు వెలుపల ఉండి చికిత్స పొందేవారికి మందులు వుచితంగాగానీ, సానుకూలమైన వెలకుగాని సరఫరా చేసేందుకు అనువైన పద్ధతిని చట్టం నిర్దేశిస్తూంది. సోవియట్ యూనియన్ ఆరోగ్య మంత్రిత్వశాఖ అధికార మిచ్చిన ఔషధాగారాలే మందులను సరఫరా చేయవలసి ఉంటుంది. అట్టి మందుల గుణాన్ని, యోగ్యతను నిర్ణయించే అంతిమాధికారం ఈ మంత్రిత్వ శాఖకే ఉంటుంది.

అవసరమైనప్పుడు కృత్రిమ అవయవాలు, ఎముకలు తదితర అంగాలను సరిచేసే పరికరాలు, శ్రావణ సహాయకాలు, వ్యాయామ చికిత్సా పరికరాలు, ప్రత్యేక వాహన సాధనాలు వగైరా పౌరులకు అందించబడతాయి. ఇట్టి సాధనాలను, పరికరాలను పొందే వ్యక్తులు వాటిని పొందడం ఉచితంగా లేక అనుకూలమైన షరతులపైనా అన్న విషయాలు - చట్టంలో నిర్దేశించిన మేరకు నిర్ణయింపబడతాయి.

*9 వ ప్రకరణం*

# సోవియట్ న్యాయవాదులు

నియంతలు, నిరంకుశ పాలకులు న్యాయవాదుల పట్ల ద్వేషాన్ని రోతనూ ప్రదర్శించుతూ వచ్చారు. ఫ్రెడరిక్ ది గ్రేట్ న్యాయవాదులను "జలగలు" గాను, "విషసర్పాలు" గాను పేరుపెట్టి నిందించాడు. ఒక సైనికుని క్షమా పత్రాన్నయినా సరే అందజేసేందుకు వచ్చే న్యాయవాదినైనా "నిర్దాక్షిణ్యంగా ఉరి తీసి, అతని పక్కను ఒక ఊరకుక్కను కూడా వేలాడ గట్టిస్తానని" బెదిరించాడు. నెపోలియన్ "ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఏ న్యాయవాది అయినా నోరు విప్పితే అతని నాలుకను కోసి వేయిస్తాన"ని బెదిరించాడు.

సోవియట్ యూనియన్ తన ఆరంభ దినాలనుండీ న్యాయవాదుల పట్ల ఇందుకు భిన్నమైన వైఖరిని అవలంభించింది. నవ సోవియట్ రాజ్యానికి పునాదులు వేసిన తొలినాళ్ళలోనే ప్రజాతంత్ర పద్ధతులలో న్యాయ వితరణకై సోవియట్ న్యాయవాద వ్యవస్థను ఏర్పరచ వలసిన ఆవశ్యకత గుర్తింపబడింది. అక్టోబర్ విప్లవ విజయానంతరం 17 రోజుల లోపుననే, అంటే 1917, నవంబర్ 24 వ తేదీన, న్యాయస్థానాల డిక్రీ జారీ చేయబడిందంటే, న్యాయ రక్షణా వ్యవస్థను ఏర్పరచేందుకు ఎంత ప్రాధాన్యమిచ్చారో విశదమవుతుంది. చిత్తు చట్టంలో న్యాయ రక్షణకు సంబంధించిన ఈ అంశాన్ని రాసినది లెనినే అన్న విషయం

---

* వై. కైత్సేవ్, ఎ. పొల్తోరాక్‌లు రచించిన "సోవియట్ న్యాయవాదులు" అన్న గ్రంథం (విదేశీ భాషా ప్రచురణాలయం, మాస్కో, 1959) ఈ ప్రకరణకు చాలావరకు ఆధారం.

ఎంతో గమనార్హం. న్యాయస్థానాల గురించి జారీ చేసిన రెండవ డిక్రీలో న్యాయ రక్షణకు సంబంధించిన ఒక సంఘాన్ని నెలకొల్పాలని ఆయన ఒక ప్రతిపాదన చేశారు. సోవియట్ న్యాయవాదుల పని విధానంలో, సమిష్టి సంస్థగా వ్యవహరించటం నేడు అతి ముఖ్యమైన అంశంగా ఉన్నది.

ప్రతి ప్రాంతంలోను పని చేసే న్యాయవాదులు ఒకే సంస్థగా ఏర్పడతారు. వాస్తవానికిది, న్యాయవాదుల సమిష్టి సంస్థగా, లేదా సంఘంగా పని చేస్తూంది. ఈ సంఘం న్యాయవాదుల హక్కుల పరిరక్షణకు పెట్టని కోటవలె ఉపయోగపడుతుంది. వారి పని విధానంలోని సాధారణాంశాలను సమిష్టిగాను, సమర్థవంతంగాగాను పర్యవేక్షిస్తుంది. ఈ సంఘాలు ఆయా మండలాల్లో, ప్రాంతాల్లో, యూనియన్ రిపబ్లిక్కుల్లో, స్వయంపాలిత రిపబ్లిక్కుల్లో ఏర్పడతాయి. అంతేగాని వేర్వేరు ప్రాంతాలుగా విభజింప బడవు. ఇట్టి సంఘాల నిర్మాణం, శాసన స్థాయిగల కొన్ని నిబంధనలకు లోబడి వుంటుంది. ఈ లాయర్ల సంఘ నిర్మాణము, పని విధానాలకు సంబంధించిన సమస్యలు ఈ సంఘ సర్వ సభ్య సమావేశంలో నిర్ణయింప బడతాయి. ఇట్టి సమావేశాలు కనీసం ఏడాదికి ఒక్క సారైనా జరుగుతాయి. సర్వ సభ్య సమావేశం, సంఘ అధ్యక్ష వర్గాన్ని రహస్య ఓటింగ్ పద్ధతిపై, రెండేళ్ళ కాలపరిమితి వరకు ఎన్నుకుంటుంది. అధ్యక్ష వర్గం న్యాయవాద సంఘ కార్య వర్గంగా పని చేస్తుంది. అన్ని విషయాలలోను ఇది సంఘానికి పూర్తి జవాబుదారీగా వుంటుంది. సంఘ ఆర్థిక వ్యవహారాలను నిర్వహించేందుకు ఇదేకాల పరిమితితో ఆడిటింగ్ కమిటీకూడాఎన్నుకో బడుతుంది. సర్వసభ్య సమావేశం అధ్యక్ష వర్గం, ఆడిటింగ్ కమిటీల కార్యకలాపాలపై నివేదికలను పరిశీలించి, వానిపై తగు చర్యను గైకొంటుంది. సర్వసభ్య సమావేశమే సంఘ కార్య నిర్వాహక సిబ్బంది నియామకాన్ని ఖర్చులను, వాని పని తీరుకు సంబంధించిన నిబంధనలను ఆమోదించవలసి ఉంటుంది. సర్వసభ్య సమావేశ కాలంలో సంఘ దైనందిన కార్యకలాపాల నన్నిటిని సంఘ అధ్యక్ష వర్గమే నిర్వహిస్తుంది. న్యాయవాదుల హక్కులకు భంగం వాటిల్లకుండా కాపాడుతుంది. ఎల్ల వేళలా కొన్ని సూత్రాలకు కట్టుబడి నందువల్ల గానీ, ఒక నిందితుడిని సమర్థించ

దంలో చూపిన సాహసానికిగాని, న్యాయాధిపతి, లేదా ప్రాక్యురేటరుల నుండి అన్యాయంగా దాడికి గురయినపుడు,న్యాయవాదులు ఒక సంస్థగాను, సంఘ అధ్యక్ష వర్గమూ తమ తోటి న్యాయవాదిని గట్టిగా సమర్థిస్తాయి. ఒక న్యాయవాది తన వృత్తి పరమైన విధులను న్యాయస్థానంలో నిర్వర్తించే సందర్భంలో చాకచక్యంతో వ్యవహరించాలి. అదే విధంగా, న్యాయస్థానమూ, ప్రాక్యురేటరూ, ప్రతివాది తనకే అన్యాయం జరిగిందని చెప్పడానికి చిన్నమెత్తు అవకాశం కలగకుండా వ్యవహరించాలి. ఈ విధంగా న్యాయవాద సంఘాలు న్యాయవాది స్వేచ్ఛను పరిరక్షిస్తాయి.

అంతేగాక, న్యాయవాద సంఘాల సభ్యులు ప్రభుత్వ, ప్రజాసంస్థల లోగాని, కర్మాగారాలలోగాని పని చేయలేదు. అయితే, కళాశాల ఉపాధ్యాయులు, విజ్ఞానశాస్త్ర కార్యకర్తల సంఘాలలో ఎన్నికోబడ్డ పదవులు నిర్వహించే వారికి దీన్నుండి మినహాయింపు ఇవ్వబడుతుంది. ఇందు మూలంగా న్యాయవాదికి తన వృత్తి పరమైన విధుల నిర్వహణ సందర్భంగా, బయటివారి వత్తిడికి లోనుకాకుండా ఉంటే అవకాశం లభిస్తున్నది. ఇందువల్ల అతని స్వేచ్ఛ కూడా బలపడుతుంది.

న్యాయవాద సంఘాల అధ్యక్షవర్గం ఒక న్యాయవాదికి జరిగే అన్యాయాన్ని ఎలా ప్రతిఘటించి నిలబడుతుందో, అదే విధంగా ఒక న్యాయవాది సోవియట్ సమాజ నైతిక ప్రమాణాలను ఉల్లంఘించి నప్పుడు, అతని ప్రవర్తనను ఖండించటానికి కూడా ఏ మాత్రం వెనుకాడదు. ఒక సోవియట్ న్యాయవాదిని ఖండించే చర్య, తగు దర్యాప్తు జరిగిన తరువాతనే చేబట్టబడుతుంది. జైత్సెవ్, పోల్యావక్‌లు ఈ సందర్భంగా ఇలా అన్నారు– "సోవియట్ న్యాయవాదుల గౌరవాన్ని అత్యున్నత స్థాయిలో నిలబెట్టేందుకు ఇది అత్యంత సమర్థవంతమైన మార్గం" (వై. జైత్సెవ్, ఎ. పోల్యావక్‌లు రచించిన "సోవియట్ న్యాయవాదులు" పుట. 87).

వ్యక్తిగతంగా పౌరులకు, కర్మాగారాలకు, సంస్థలకు, సంఘాలకు న్యాయపరమైన సలహా, సహకారాలందించేందుకై, ఆయా పట్టణాలలో న్యాయ సలహా కార్యాలయాలు నెలకొల్పబడ్డాయి; ఈ కార్యాలయాల స్థాపనను ఆ ప్రాంత న్యాయవాద సంఘ అధ్యక్షవర్గము నిర్ధారించాలి. ఆ నిర్ణయాన్ని

యూనియన్ రిపబ్లిక్ మంత్రిత్వ శాఖ ఆమోదించాలి. ఈ కార్యాలయాల న్యాయవాదులను న్యాయవాద సంఘ అధ్యక్ష వర్గం నియమిస్తుంది. ఇట్టి నియామకాల విషయంలో అనేక ముఖ్యమైన అంశాలు పరిగణనలోకి తీసుకోబడతాయి. ఇట్టి న్యాయసలహా కార్యాలయాలలో నియమింపబడే న్యాయవాదుల సంఖ్య ఆ ప్రాంత జనాభా అవసరాల నన్నింటినీ తీర్చ గలిగినంతగా వుండాలి. ఈ కార్యాలయాలలో అనుభవజ్ఞులయిన న్యాయ వాదులతో బాటు, యువకులు చురుకైన న్యాయవాదులు కూడా సభ్యులుగా వుంటారు. వృద్ధతరాల వారి నైపుణ్యము, అనుభవము, పాండిత్యము యువతరం వారికి అందించేందుకు ఇదెంతో అవసరం. చివరగా, యీ కార్యాలయాలలో సివిల్, క్రిమినల్ న్యాయశాస్త్రంలో నిపుణులైన వారితో బాటు, వివిధ న్యాయశాస్త్ర శాఖలలో ప్రత్యేక నిపుణులైనవారు సభ్యులుగా వుంటారు ప్రతి న్యాయసలహా కార్యాలయం ఒక అనుభవశాలియగు న్యాయవాది పర్యవేక్షణలో పని చేస్తుంది ఆయన్ను మేనేజరు అంటారు. ఆయన్ను న్యాయవాద సంఘ అధ్యక్షవర్గం నియమిస్తుంది. ఆయన ఆ అధ్యక్షవర్గానికి జవాబుదారీ వహిస్తాడు. న్యాయవాదులందరు తమ విధులను సక్రమంగా నిర్వర్తిస్తూందీ, లేనిదీ గమనిస్తారాయన. అలాగే, యే న్యాయ వాదికీ అధికార రీత్యా అనుమతించిన దాని కంటె ఎక్కువ గాని, తక్కువ గాని చెల్లింపులు జరక్కుండా కనిపెట్టి వుంటాడు. అధ్యక్షవర్గం నిర్ధారించిన వేతనాన్ని ఆయన పుచ్చుకుంటాడు. తన పాలనా నిర్వహణ సంబంధమైన విధులకు భంగకరం కాని రీతిలో ఆయన తన వృత్తిని కొన సాగించవచ్చు.

మేనేజరేగాక ప్రతి న్యాయ సలహా కార్యాలయానికి కోశాధికారిగా కూడా పనిచేసే ఒక కార్యదర్శి కైపిస్టు వుంటారు. ఈ కార్యదర్శి, కోశాధికారి, కార్యాలయంవద్ద కొచ్చే ఫిర్యాదీలతో ఆర్థిక లావాదేవీలను నిర్వహిస్తారు. వారికి న్యాయవాదులను సమకూర్చిపెడతారు. న్యాయ సలహా కార్యాలయాలలో, రోజువారీ న్యాయస్థాన కార్యకలాపాలని కనిపెట్టి వుండే గుమాస్తాలు కూడా వుంటారు. తమ కార్యాలయానికి చెందిన కేసుల పరిస్థితిని వారు కనిపెట్టి వుంటారు. ఆ కేసు ఎప్పుడు విచారణకొస్తుందో,

లేదా మరో విధంగా దాని విషయం పరిశీలించబడుతుందో, న్యాయవాదుల అవసరం ఎప్పుడుంటుందో వారు న్యాయవాదులకు తెలియబరుస్తారు.

పైన సూచించిన విధంగా కార్యాలయ సిబ్బంది సాంకేతిక వివరాలను జాగ్రత్తగా కనిపెట్టి వుండడంతో, న్యాయవాదులు తమ వృత్తిపరమయిన లోతు విషయాలపై కేంద్రీకరించేందుకు వీలవుతుందని వేరేచెప్ప పనిలేదు. న్యాయవాద సంఘంలో కొత్తసభ్యుల్ని చేర్చుకొనే బాధ్యతా, ఎవరినైనా బహిష్కరించే బాధ్యతా కూడా అధ్యక్ష వర్గానిదే.

న్యాయవాద సంఘ సభ్యుడుగా చేరి, న్యాయవాదిగా పని చేయాలంటే ఒక వ్యక్తి ఉన్నత న్యాయశాస్త్ర విద్యాభ్యాసం గావించి అయినా, లేదా, న్యాయమూర్తిగాగాని, ప్రొక్యురేటరుగాగాని, న్యాయ పరిశోధకుడుగాగాని, న్యాయశాస్త్ర సలహాదారుగాగాని మూడేళ్ళకు తక్కువ గాకుండా పనిచేసి అయినా ఉండవలసి ఉండేది. ఈ నియమం చాల పాతది. ఆ రోజుల్లో ఉన్నత న్యాయశాస్త్ర విద్యాభ్యాసం గావించిన పట్టభద్రుల కొరత ఎక్కువగా వుండేది. కాని, యీనాటి పరిస్థితి అది కాదు. సోవియట్ ప్రజ త్వరిత గతిని సాధారణ సాంస్కృతికాభివృద్ధి సాధించడంతో న్యాయశాస్త్ర శిక్షణలో కూడా చక్కని అభివృద్ధి పొడసూపింది; విశ్వవిద్యాలయాల్లో న్యాయశాస్త్ర శాఖలు ఏర్పాటయ్యాయి. మధ్యసియా రిపబ్లిక్కులతోసహా సోవియట్ దేశమంతటా అనేక మంది విద్యార్థులు న్యాయశాస్త్రాభ్యాసం గావిస్తున్నారు. ప్రతి యూనియన్ రిపబ్లికు తన స్వంత జాతీయ న్యాయ వాదులకు శిక్షణ నివ్వగలుగుతూంది. సాధారణ, సాయంకాల విశ్వవిద్యాలయ శాఖల ద్వారానేగాక, ఉత్తర ప్రత్యుత్తరాలద్వారా కూడా ఉన్నత న్యాయశాస్త్ర విద్యాభ్యాసం విరివిగా వ్యాప్తమవుతోంది. ఇందువల్ల అఖిల యూనియన్ న్యాయశాస్త్ర విద్యాలయాలకు చెందిన 13 ఉత్తర ప్రత్యుత్తర శాఖలు కలిసి న్యాయశాస్త్ర పరిశోధనా సంస్థలు, న్యాయశాస్త్ర పాఠశాలల 1947-1955 మధ్యకాలంలో ఉన్నత న్యాయశాస్త్ర పట్టభద్రు లను 15,000 మందిని తరిఫీదు చేశాయి. వీరందరు తమ పనులు చేసుకుంటూనే, తమ తీరిక సమయంలో ఉన్నతవిద్య నార్జించినవారే.

అంచేత నేడు ఉన్నత న్యాయశాస్త్ర విద్యాభ్యాసం గావించినవారే న్యాయవాద సంఘాలలో సభ్యులుగా చేర్చుకోబడుతున్నారు.

అయితే, న్యాయవాద సంఘ సభ్యత్వం పొందేందుకు కళాశాల విద్య ఒకటే చాలదు. న్యాయశాస్త్ర పట్టభద్రులైనవారు నిర్దిష్ట కాలంపాటు ప్రొబేషనర్లు (అప్రెంటిస్‌లు) గా పని చేయాల్సి వుంటుంది. ప్రత్యక్ష అనుభవం ద్వారా వారు తమ వృత్తి ఆనుపానులను గ్రహించవలసి వుంటుంది.

ఇంతకు మునుపే చెప్పినట్లుగా, న్యాయ వాద సంఘసభ్యులైనవారు ఉన్నత స్థాయి ప్రవర్తనా నియమావళిని పాటించవలసి వుంటుంది. న్యాయ స్థానంలో రుజువయిన నేరాలను చేసిన వారు, సోవియట్ న్యాయవాది స్థాయికి తగని పని చేసినవారు సంఘంనుండి బహిష్కరింప బడతారు. అయితే, కొద్దిపాటి నియమోల్లంఘనలకు మందలింపు, అభిశంసన, తీవ్ర అభిశంసన, ఆరు మాసాలకు మించకుండా న్యాయవాద వృత్తినుండి బహిష్కరణ వగైరా శిక్షలు విధించబడతాయి. న్యాయవాద సంఘ అధ్యక్ష వర్గ నిర్ణయంపై రిపబ్లిక్ న్యాయశాఖా మంత్రికి అప్పీలు చేసుకోవచ్చు. అట్టి మంత్రి, సర్వసాధారణంగా న్యాయశాస్త్రంలో అత్యంత నిష్ణాతుడై వుంటాడు. న్యాయవాద సంఘంలో సభ్యునిగా చేర్చుకోకపోయినా, సభ్యునిగా తొలగించినా, క్రమశిక్షణా చర్య గైకొన్నా యిదే విధంగా అప్పీలు చేసుకోవచ్చు. న్యాయవాద సంఘ ప్రాంగణంలో ప్రవేశానికై నిరీక్షించే వారికి, క్రమశిక్షణా చర్యకు గురయ్యేవారికి అదనపు రక్షణగా యీ అప్పీలు వుపయోగపడుతుంది. న్యాయవాదులు మొత్తంమీద తమ సహచరులు విధించే క్రమశిక్షణకు లోబడి వుంటారు.

ఈ విధంగా సోవియట్ న్యాయవాది తన స్వేచ్ఛను కాపాడు కుంటూ చట్టము, తన అంతరంగ ప్రేరణల ప్రాతిపదికపైనే తన విధులను నిర్వర్తిస్తాడు. ప్రతి సోవియట్ న్యాయవాదికి సోవియట్ యూనియన్ సుప్రీం కోర్టుతో సహా, యే న్యాయస్థానంలోనయినా, ఏ ప్రాంతంలో నయినా పని చేసేందుకు హక్కున్నది. న్యాయ సలహా కార్యాలయంలో అతడు తన కక్షిదార్లను కలుసుకొని, వారి కేసులను సిద్ధపరచుకొని, న్యాయస్థానంలో వాటిని నిర్వహిస్తాడు.

ప్రతి కక్షిదారుకు తనకిచ్చవచ్చిన న్యాయవాదిని ఎంపిక చేసుకునే హక్కున్నదని నొక్కి చెప్పవలసి వుంది. న్యాయ సలహా కోసం వచ్చినపుడు కూడా ఏ వ్యక్తి అయినా, తనకు నచ్చిన న్యాయవాదినే సంప్రదించవచ్చు; తనకు వ్యక్తిగతంగా తెలిసిన న్యాయవాదినే సిఫారసు చేయమని సంఘ నిర్వాహకులను కోరవచ్చు. ఫలానా న్యాయవాది కావాలని కక్షిదారు కోరనప్పుడు, ఆనాడు పనిచూస్తున్న ఏ న్యాయవాది అయినా అతని సమస్యను పరిశీలించి సలహా యివ్వవచ్చు. తమ కేసును ఎవ్వరి కప్పగించవచ్చునో యితరులను కూడా కక్షిదారు సంప్రదించవచ్చు. ఏదైనా కేసు చిక్కు సమస్యలతో కూడుకున్నదయితే, క్లిష్టమైనదైతే న్యాయసలహా కార్యాలయాధిపతి న్యాయవాది ఎంపికలో కక్షిదారుకు తోడ్పడతాడు.

ప్రతియేటా న్యాయవాదులు వేలాదిమంది పౌరులు అందజేసిన నిర్దిష్ట సమస్యల విషయమై మౌఖికంగాగాని, వ్రాతమూలకంగా గాని న్యాయసలహా ఇస్తుంటారు. వారు అనేక న్యాయశాస్త్ర పత్రాలను కూడా తయారు చేస్తుంటారు. ఇది అత్యంత బాధ్యతాయుతమైన పని. దీనిలో యేమాత్రం పొరపాటు దొర్లినా తీవ్రమైన దుష్ఫలితాలు కలుగుతాయి.

న్యాయసలహా కార్యాలయాల్లో మామూలు సమయాల్లో ఎప్పుడూ వివిధ శాఖల్లో నిష్ణాతులయిన నిపుణులు — అటు అనుభవజ్ఞులు, అంత అనుభవజ్ఞులు కానివారు కూడా — అందుబాటులో వుండే విధంగా ఒక పట్టీ తయారుచేసి, దాని ప్రకారం డ్యూటీలు నిర్వహిస్తుంటారు.

ప్రతి నెల న్యాయసలహా సంఘానికి అనుబంధంగానున్న న్యాయవాదుల సభ జరుగుతుంది. వారు న్యాయస్థానాల్లో తలెత్తే చిక్కు సమస్యలను చర్చిస్తారు. సీనియరు న్యాయవాదుల సలహాలకు సహజంగానే విలువ వుంటుంది ఈ సభల ద్వారానే గాక, క్లిష్టమైన న్యాయశాస్త్ర సమస్య నెదుర్కొనే యే న్యాయవాదయినా తన సహచరుల సహాయాన్ని కోరవచ్చు. లేదా, సలహా కార్యాలయం మేనేజరే అవసరమనుకుంటే, విస్తృత సలహా సంప్రదింపులకై తోటి న్యాయవాదుల సహాయాన్ని కోరవచ్చు. న్యాయవాదుల మధ్య పరస్పర సహాయ సహకారాలు, వారి మధ్య సోదర

భావాన్ని పెంపొందించడమే గాక, వారి సామర్థ్యాన్ని పెంపొందిస్తాయి కూడా.

సాధారణంగా న్యాయసహాయం పొందగోరే వారు అందుకు ఫీజు చెల్లించవలసి వుంటుంది. అయితే, మనోవర్తి దావాలకు, పింఛనులు మొదలైన సామాజిక సౌకర్యాల కోసం దరఖాస్తులు రాయడానికి, సోవియట్ సైన్యంలో పనిచేసే సైనికులకు, నావికాదళ సభ్యులకు అవసరమయిన న్యాయశాస్త్ర సంబంధ పత్రాలను తయారు చేసేందుకు ఎటి ఫీజు ఉండదు. సాధారణ స్వభావంగల న్యాయ సంప్రదింపులలో, ప్రత్యేక చట్టాలు, పత్రాలను పరిశీలించ నక్కరలేని సందర్భాల్లో ఫీజు వుండదు. గాయపడిన వారికి పరిహారం కోసం కేసు నడిపిన సందర్భంలో, అట్టి పరిహారం మంజూరయినపుడు న్యాయవాదికి నిర్ణీత మొత్తం ఫీజుగా లభిస్తుంది. లేక పోతే ఎలాంటి ఫీజు వుండదు.

ఒక వ్యక్తి తన కేసు నడిపేందుకు న్యాయవాదిని నియమించుకున్నపుడు, న్యాయ మంత్రిత్వ శాఖ నిర్ధారించిన పట్టిక మేరకు అతడు ఫీజు చెల్లించవలసి వుంటుంది.

ఫీజులను నిర్ధారించేందుకు క్రిమినల్ కేసులను సాధారణమైనవిగాను, సంక్లిష్టమైనవిగాను విభజిస్తారు.

500 రూబుళ్ళకు మించని ఫీజును న్యాయ సలహా కార్యాలయం మేనేజరే నిర్ణయించవచ్చు. మేనేజరు ఫీజు నిర్ణయించిన క్రిమినల్ కేసులలో, విచారణ మూడు రోజులకు మించినపుడు ఆటు తరువాతి ప్రతి రోజుకు దినానికి 75 రూబుళ్ళ చొప్పున అదనపు ఫీజు చెల్లించవలసి ఉంటుంది.*

ప్రాథమిక పరిశోధనా పత్రాలు ఎక్కువగా ఉండి, వాటి అధ్యయనం క్లిష్టంగా వున్నా, న్యాయస్థానంలో విచారణ యెక్కువ రోజులు కొనసాగినా, న్యాయవాదసంఘ అధ్యక్షవర్గం తన తరువాయి సాధారణ సమావేశంలో ఫీజును నిర్ణయిస్తుంది. ఫీజు నిర్ణయంలో న్యాయవాది నైపు

* ఈ సంఖ్యా వివరాలు, మాస్కో, న్యాయవాద సంఘానికి వర్తించేవిగా కన్పట్టుతున్నాయి.

జ్ఞానాన్ని, అతని పని పరిమాణాన్ని కూడా పరిగణనలోకి తీసుకుంటారు. ఒకరికంటె యెక్కువమంది తరపున వాదించినా, ఉన్నత న్యాయ స్థానాల్లో వారి తరపున హాజరయినా ప్రత్యేకమైన ఫీజులుంటాయి.

కొన్ని నిర్దిష్ట సందర్భాల్లో న్యాయవాదిని నియమించాల్సిన బాధ్యత న్యాయస్థానాలకుంది. రాజ్యాంగ చట్టంలోనే యిందుకు సంబంధించిన నిబంధన చోటు చేసుకుంది. ఇంతేగాక, మరికొన్ని యితర సందర్భాల్లో కూడా ఉచిత న్యాయ రక్షణకు అవకాశం కల్పిస్తోంది చట్టం. మైనరుగా గాని, శారీరకంగా లోప భూయిష్టంగా (చెవిటి, మూగ, గుడ్డి)నున్న వ్యక్తి గాని న్యాయస్థానపు కార్యకలాపాల్లో పూర్తిగా పాల్గొనజాలడు గనుక, కోర్టే అతనికి సహాయపడేందుకు న్యాయవాదిని నియమిస్తుంది. అలాగే కేసు నడుపుకుందుకయ్యే ఖర్చు భరించలేని వారికి కూడా కోర్టు న్యాయవాదిని నియమిస్తుంది.

న్యాయవాదులు ప్రజా, ప్రభుత్వ సంస్థల తరపున కూడా పని చేస్తారు. అలాంటి సందర్భాల్లో వారు నెలసరి ఫీజులు (ఇతర దేశాల్లో యీ పద్ధతినే రిటైనర్ విధానమంటారు) గాని, వారి పనినిబట్టి గాని చెల్లిస్తారు.

న్యాయ సలహా కార్యాలయానికి కక్షిదారు చెల్లించే సొమ్మును, అట్టి సలహా అందించే న్యాయవాది వ్యక్తిగత ఖాతాకు జమ వేస్తారు. ప్రతి నెలాఖరులోను ఒక్కొక్క న్యాయవాది, తాను ఆ నెలలో చేసిన సేవలను పేర్కొంటూ బిల్లు దాఖలు చేస్తాడు. సంఘ జమా ఖర్చుల నిర్వహణశాఖ న్యాయవాది ఖాతాలో జమయిన కక్షిదార్ల చెల్లింపులను కూడుతుంది. ఆ విధంగా న్యాయవాదుల నెలసరి ఆదాయం నిర్ధారింపబడుతుంది. సంఘ నిర్వహణ ఖర్చుల క్రింద కొంత భాగం మినహాయించబడుతుంది. ఇది 25-30 శాతం వుండవచ్చు. ఈ మొత్తాన్ని నిర్వహణ ఖర్చులకు మాత్రమే గాదు వెచ్చించేది. వాస్తవానికి ఈ విధంగా మినహాయింపబడిన మొత్తాల్లో యెక్కువ భాగం మరో రూపంలో ఆయా న్యాయవాదులకే ముడుతుంది.

ఇందుకొక ఉదాహరణ యిస్తాను. లెనిన్‌గ్రాడ్ మండల న్యాయవాద సంఘంవంటి మధ్యశ్రేణి సంఘాన్నే తీసుకుందాం (లెనిన్‌గ్రాడ్, మాస్కోలలో మండల, నగర న్యాయవాదుల సంఘాలు వేర్వేరుగా

ఏర్పడి వున్నాయి). 1957 లో యీ సంఘంలో 152 మంది సభ్యులుండే వారు. ఆ సంవత్సరం మొత్తం వార్షికాదాయంలో 12.5 శాతం సంఘ అధ్యక్షవర్గం, న్యాయ సలహా కార్యాలయాల నిర్వహణ క్రింద ఖర్చయింది. కార్యాలయ సిబ్బంది, అధ్యక్ష వర్గము న్యాయవాదులకు తమ విధి నిర్వహణలో గణనీయంగా సాయపడి, అనేక చిల్లర మల్లర పనుల భారాన్ని వారికి తప్పించారు. 1.9 శాతం న్యాయవాద సంఘ సభ్యులకు ప్రవర్తిత శిక్షణ నిచ్చేందుకు, 2.6 శాతం న్యాయస్థానాలు నియమించిన న్యాయవాదుల చెల్లింపులకు, 1.1 శాతం కార్యాలయ సామగ్రి కొనేందుకు, మరమ్మత్తులకు, 0.15 శాతం న్యాయశాస్త్ర గ్రంథాలయానికి, 0.2 శాతం సర్వసభ్య సమావేశాల నిర్వహణకు ఖర్చయింది. 6 శాతం శెలవు నిధి క్రింద మినహాయింప బడింది. దీన్నుండి ఏటా ప్రతి న్యాయవాదికీ అతని సగటు నెలసరి ఆదాయం చెల్లింపబడింది. చివరిగా 4.6 శాతం, సామాజిక భద్రతా వ్యవస్థకు చెల్లింపబడింది. జబ్బుపడిన న్యాయవాదికీ అతని సగటు నెలసరి వేతనం చెల్లించడానికే ఈ నిధులు వినియోగించబడతాయి. 1 శాతం పరస్పర సహాయ నిధిక్రింద చెల్లింపబడింది. దీన్నుండి న్యాయవాదులకు అవసరమైనపుడు అప్పులు, సహాయాలు అందుతాయి. ఈ పరస్పర సహాయనిధి క్రింద మినహాయింపబడిన మొత్తాలను ఆయా న్యాయవాదుల ఖాతాలకు - ఎవరిది వారికి - జమ చేయబడుతుంది. ఆయన మరణించినపుడు ఆయన వారసులకు గాని, సంఘ సభ్యత్వం నుండి విరమించబడినపుడు నేరుగా ఆ న్యాయవాదికే గాని యిట్టి మొత్తాలు ముడతాయి. ఇతర సోవియట్ పౌరులందరివలెనే న్యాయవాదులకు ప్రభుత్వం చెల్లించే వివిధ పింఛన్లు పొందే హక్కుంది.

సంఘ అధ్యక్ష వర్గం జబ్బుపడిన, ముసలి వారయిన న్యాయవాదులకు, వారి కుటుంబాలకు తగు సాంస్కృతిక, జీవన పరిస్థితులను కల్పించేందుకు ఎంతో శ్రద్ధ కనపరుస్తుంది. గొప్ప న్యాయవాదులుగా రాణించిన వారి స్మృతిని శాశ్వతం చేసేందుకు సంఘం ప్రయత్నిస్తుంది. కొన్ని సంఘాలు యిందుకై, పరస్పర సహాయ సంఘాలను నిర్వర్తిస్తున్నాయి. ఇతర సంఘాలు ప్రత్యేక నిధిని యేర్పాటు చేస్తున్నాయి.

1955–56 లో మాస్కో న్యాయవాద సంఘం ఈ ఖాతా క్రింద 8,50,000 రూబుళ్ళు ఖర్చు చేసింది. ఇవిగాక మరో పెద్ద మొత్తాన్ని సభ్యుల కుటుంబాలలోని బాలల వేసవి విడుదల కోసం, శానిటోరియంలు, విశ్రాంతి కేంద్రాలకు తక్కువ రేటుపై వెళ్ళేందు కోసం కేటాయిస్తారు. ఇందు కవసరమైన మిగతా మొత్తాలను సంఘ అధ్యక్షవర్గం భరిస్తుంది. సంఘ సభ్యులలో ప్రముఖులైన వారి రజిత, స్వర్ణోత్సవాల కోసం అధ్యక్షవర్గం బహుమతులు ప్రకటిస్తుంది.

ఇతర సోవియట్ జీవన రంగాలన్నింట్లో వలెనే ఈ రంగంలో కూడా సమిష్టి పని, వ్యక్తిగత పాదార్థిక ప్రయోజనాలు - ఈ రెండింటినీ సక్రమంగా సమ్మిళిత మొనర్చడం జరుగుతోంది. ఇందు మూలంగా సోవియట్ న్యాయవాదుల ఉన్నత పని ప్రమాణాలను పరిరక్షించడం జరుగుతోంది. ఇతర దేశాల్లోని న్యాయ వాదులవలెనే సోవియట్ న్యాయ వాది కూడా అనేక విధాలైన సమస్యలను ఎదుర్కొని, పరిష్కరించ వలసి వస్తోంది. అవి, ఒక విదేశీ సంస్థలో సేవ చేసేందుకు పంపబడిన ఉద్యోగికి ఏదేని ప్రమాదం వాటిల్లినపుడు అతని కుటుంబ సభ్యులకు చెల్లించవలసిన పరిహారం సమస్య గావచ్చు; వారసత్వంగా సంక్రమించే ఆస్తుల విషయంలో కుటుంబ సభ్యులమధ్య తలెత్తిన వివాదాలు కావచ్చు; ప్రమాదాలు వాటిల్లినపుడు చెల్లించాల్సిన నష్టపరిహారం గావచ్చు; పింఛను చెల్లించాల్సిన వయసు గురించి తలెత్తిన వివాదం గావచ్చు; ఒక వ్యక్తి చేసిన నేరం విషయం గావచ్చు; మంచి ప్రవర్తన పూచీపై విడుదల చేయమనే కోరిక కావచ్చు.

ప్రభుత్వ, సహకార, ప్రజాసంస్థల విషయంలో న్యాయవాదులు చేసే పని మరో ముఖ్యమైన రంగం. వీటిలో మొట్టమొదటి పేర్కొన దగినట్టిది, వ్యాపార ఒప్పందాలు సక్రమంగా వున్నాయో లేదో పరిశీలించడం. అదే విధంగా, వుద్యోగుల నియామకాలు, తొలగింపులు, వారి పై గొనే క్రమశిక్షణా చర్యలు చట్ట విహితంగా వున్నదీ లేనిదీ పరిశీలన జరిపే బాధ్యత కూడా న్యాయవాదులదే. ఈ సందర్భాల్లో కార్మిక చట్టాలకు ఆయా వుత్తర్వులు అనుగుణంగా వుండేలా చూడ్డం జరుగుతుంది.

ఈ పరిశీలక వ్యవస్థ ఎంత సమర్థవంతంగా పనిచేస్తే, న్యాయ స్థానాల ఎదుటికి వచ్చే వివాదాల, మధ్యవర్తిత్వాల సంఖ్య అంత తగ్గిపోతుంది; వ్యవహారాలు అంత, త్వరితంగాను, సాఫీగా జరిగిపోతాయి. ఈ విధంగా పోషలిస్టు చట్టబద్ధత నిది బలపరుస్తుంది.

ఒక న్యాయవాది ప్రమేయం లేకుండా ఏదైనా చేయడానికి ఒక అధికారి పూనుకున్నప్పుడు, న్యాయశాస్త్ర నిబంధనలకు భంగం వాటిల్లినట్లయితే అందుకతడు వ్యక్తిగతంగా బాధ్యుడవుతాడు. ఉదాహరణకు, ఎవరినైనా అక్రమంగా పనిలోనుండి తొలగిస్తే, అలా తొలగించబడిన కార్మికుడు పనిలో లేకుండా వుంచబడిన కాలానికి వేతనాలను అట్టి అధికారి తన జేబునుండి చెల్లించాలి.

న్యాయవాదులు సమిష్టి క్షేత్రాలకు కూడా గణనీయంగా తోడ్పడతారు. సమిష్టి క్షేత్రాలకు, యితర సంస్థలతో ఏర్పడే వివాదాలలో న్యాయవాదులు వాటికి తగు సలహాల నివ్వడమేగాక న్యాయవిచారణ సందర్భంగా వాటికి ప్రాతినిధ్యం వహిస్తారు కూడా. ఇందు చాల పెద్ద మొత్తాలకు సంబంధించిన వివాదాలుండవచ్చు. ఉదాహరణకు సమిష్టి క్షేత్రానికి సంబంధించిన చెట్లను చట్టవిరుద్ధంగా కొట్టి, కలప తయారుచేసే ఫ్యాక్టరీతో ఏర్పడవచ్చు.

న్యాయవాద సంఘ అధ్యక్షవర్గం, న్యాయసలహా కార్యాలయాలను నడపడంతోబాటు, సంఘ సాధారణ కార్యకలాపాలను నడపడం, న్యాయవాదుల వృత్తిపరమైన నైపుణ్యాన్ని పెంపొందించేందు కవసరమైన చర్యలను రూపొందించి, అమలు పర్చడం కూడా చేస్తుంది. న్యాయవాదులకు సక్రమమైన ప్రతిఫలం ముట్టేలా చూడడం, సంఘంలో సభ్యులను చేర్చుకొనడం, తొలగించడంవంటి పనులను కూడా అధ్యక్షవర్గం నిర్వహిస్తుంది న్యాయవాదులు చట్టవిరుద్ధంగా ప్రవర్తించినపుడు క్రమశిక్షణ సమస్యలను అది పరిశీలిస్తుంది. మన మింతకు ముందే చూచినట్లుగా సంఘ నిధులను అది ఒక క్రమపద్ధతిలో ఖర్చు చేస్తుంది.

న్యాయవాదుల పరిజ్ఞానాన్ని, నైపుణ్యాన్ని పెంపొందించేందుకు అనేక చర్యలు గైకొనబడుతున్నాయి. ప్రసిద్ధులైన న్యాయవాదులు, సంఘ సమావేశాలకు హాజరై, న్యాయనిర్వహణ విషయంలో విశిష్ట ఆసక్తికరమైన

విషయాలపై ఉపన్యాసాలిస్తారు. వివిధ న్యాయవాద సంఘాల అధ్యక్ష వర్గాలు చేయతలపెట్టిన అతిముఖ్యమైన మరోపని, న్యాయసహాయకబ్యూరోను వెలకొల్పి, "శాసన క్రోడీకరణ" అని దీని పనికి పేరుపెట్టారు. వివిధ న్యాయశాస్త్ర రంగాలకు—కాపీరైట్ చట్టము, పింఛనులు, ఆర్థిక వ్యవహారాలు, భూమి, నేరాలు, అంతర్జాతీయ వ్యక్తిగత పౌరశాసనము వంటి రంగాలలో విజ్ఞాతులైనవారు, ఇట్టి క్రోడీకరణ విభాగంలో ప్రతి దినము పని చేస్తారు. ప్రతి న్యాయసలహా కార్యాలయానికి ఈ నిపుణులు లభ్యమయ్యే కాలం తెలిసి ఉంటుంది. వారినుండి ముఖ్యమైన సమస్యలపై అవసరమైన న్యాయశాస్త్ర సలహాను నేరుగా కోర్టులనుండే టెలిఫోన్‌మీద కూడా పొంద వచ్చు. ఇట్టి అవసరం ఒక శాసన పాఠంతో కావచ్చు, లేదా సోవియట్ దేశ సుప్రీం సోవియట్ అధ్యక్షవర్గం జారీచేసిన డిక్రీ వాస్తవ ప్రతి అయినా కావచ్చు. లేదా, న్యాయవాదికి తన విధి నిర్వహణలో అవసరమైన మరే సాహిత్యమైనా కావచ్చు. అది అతనికి వెనువెంటనే సరఫరా చేయబడుతుంది. ఇట్టి క్రోడీకరణ కేంద్రం, వెలువడిన న్యాయశాస్త్ర సాహిత్యాన్నంతటిని సేకరిస్తుంది. అంతేకాక, న్యాయమంత్రిత్వశాఖ, సుప్రీమ్‌కోర్టు ఏర్పరచిన ప్రమాణాలను, నియమాలను ఎప్పటికప్పుడు సేకరిస్తుంది. అత్యంత ఆసక్తిదాయకమైన మౌలిక సమస్యలపై ఆయా న్యాయవాదుల ఉపన్యాసాలను గుదిగుచ్చి పెడుతుంది. అలాగే, న్యాయ సలహా కార్యాలయాలకు, క్రొత్తగా వెలువడిన న్యాయశాస్త్ర సాహిత్యాన్ని గురించి, అన్నిరకాల చట్టాలను గురించి ఎప్పటికప్పుడు తెలియపరుస్తుంది. ఇది మన పనిని సివిల్, క్రిమినల్ విభాగాలుగా విభజిస్తుంది. తమ తమ రంగాలలో విశిష్ట కృషి సల్పినవారు అందు సభ్యులుగా ఉంటారు. ఇట్టి అధ్యయన బృందాలలో యువ న్యాయవాదులు, ప్రొబేషనర్లు కూడా ఉంటారు.

ఆయా మంత్రిత్వ శాఖలు, పాలనా నిర్వహణ సంస్థలు కూడా, కొన్ని కొన్ని చట్టాల చిత్తుప్రతులపై అభిప్రాయాలను తెలియజేయమని ఇట్టి సివిల్ విభాగాలను కోరుతుంటాయి.

క్రిమినల్ విభాగం, క్రిమినల్‌చట్టం, కార్యవిధానాలకు సంబంధించిన వివిధ సమస్యలను, నివేదికలను, సమాచారాన్ని చర్చిస్తుంది. 1958 లో

మాస్కోలో "సోవియట్ క్రిమినల్ పని విధానంలో పాదార్థిక సాక్ష్యాలు, రుజువుల పరిశీలన, అంచనా" అను గ్రంథంపై చర్చలు జరిగాయి. న్యాయస్థానాల పరిశోధనా పద్ధతులు, సోవియట్ క్రిమినల్ పని విధానంలో ప్రతివాది సమస్యల మౌలికాంశాలు మొదలగు విషయాలపై పత్రాలు సమర్పించబడ్డాయి.

అప్రెంటిస్‌గా కొంతకాలం పని చేయనిదే ఏ వ్యక్తినీ న్యాయవాద వృత్తిలో చేర్చుకొనరు. ఈ అప్రెంటిస్ కాలాన్ని సోవియట్ న్యాయ శాస్త్ర పరిభాషలో ప్రొబేషన్ కాలము అంటారు. ప్రతి క్రొత్త అప్రెంటిస్‌ను ఒక సీనియర్ న్యాయవాదికి అప్పగిస్తారు. ఆయనను "ఉపదేశకుడు" అంటారు. ఈ ప్రొబేషనర్లు అటు క్రిమినల్ న్యాయవాది వద్ద, ఇటు సివిల్ న్యాయవాదివద్ద కూడా పని చేయవలసి ఉంటుంది. ఈ ప్రొబేషనర్లు తమ సీనియర్లకు కేసులను తయారు చేయడంలోను, విచారణకు హాజరవ్వడం లోను, న్యాయసలహా కార్యాలయాలకు వెళ్ళి కక్షిదారులను కలుసుకోవడం లోను సహాయపడతారు. సీనియర్ న్యాయవాది తన అప్రెంటిస్ తగిన శిక్షణ పొందాడని భావించినపుడు, అట్టి అప్రెంటిస్, సీనియర్ న్యాయవాది మార్గదర్శకత్వంలో ముందు చిన్నచిన్న కేసులను స్వయంగా నిర్వహిస్తాడు. ఈ ప్రొబేషనరు ఏదో ఒక న్యాయశాస్త్ర సమస్యపై సిద్ధాంత చర్చల సమావేశంలో తన పత్రాన్ని చదవడంతో అతని ప్రొబేషన్ కాలం పూర్తవుతుంది. కేసు నిర్వహణలోను సిద్ధాంత సభకు సమర్పించిన పత్రంద్వారాను ప్రొబేషనరు సంతృప్తికరంగా తన విధిని నిర్వర్తించి నట్లయితే, న్యాయవాద సంఘంలో చేర్చుకోవలసినదిగా అధ్యక్షవర్గానికి సిఫారసు చేయబడుతుంది. ఇట్టి క్రొత్త న్యాయవాదికి లభించిన శిక్షణ చాలదనుకొన్నప్పుడు, అధ్యక్షవర్గంవారు ప్రొబేషన్ కాలపరిమితిని ఇంకా పెంచవచ్చు.

ప్రొబేషన్ కాలంలో, అధ్యక్షవర్గం నిర్వహించే ప్రత్యేక నిధుల నుండి ప్రొబేషనర్‌కు నిర్ణీతవేతనం లభిస్తుంది.

తన అప్రెంటిస్ షిప్ ముగిశాక కూడా న్యాయవాదికి ఇతరుల సహాయ, సహకారాలు లభిస్తూనే ఉంటాయి.

ఉదాహరణకు లెనిన్‌గ్రాడ్ న్యాయవాదుల సంఘం ప్రతిఏటా న్యాయవాదుల వృత్తిసామర్థ్యాన్ని, ప్రమాణాలను పెంపొందించేందుకై అయిదు రోజుల పాటు సెమినార్‌లను నిర్వహిస్తుంది. ఈ సెమినార్‌లకు హాజరయ్యే న్యాయవాదులు, ఆ రోజులలో తమ మామూలు పనిని చేయనక్కరలేదు. అయినా అధ్యక్షవర్గం వారికి సగటు వేతనాలను చెల్లిస్తుంది. అనుభవజ్ఞులైన న్యాయవాదులు, లెనిన్‌గ్రాడ్ విశ్వవిద్యాలయానికి చెందిన ఆచార్యులు, అధ్యాపకులు ఉపన్యాసాలిస్తారు. ఈ సెమినార్‌లలో ఎంపిక చేసుకొనే విషయాలు, న్యాయవాదుల దైనందిన అవసరాలకు ఉపయుక్తమైనవిగా ఉంటాయి. దీర్ఘకాలంనుండి వృత్తిలోనున్న న్యాయవాదులు, తగినంత అనుభవం గలవారు కూడా ఇటి సెమినార్‌లకు హాజరై, వివాదాస్పదమైన సమస్యలమీద, అత్యంత సంక్లిష్ట విశ్లేషణ అవసరమైన సమస్యలమీద సమర్పించబడిన పత్రాలను శ్రద్ధగా విని చర్చిస్తారు.

న్యాయస్థానాలలో ప్రాక్టీసుచేసే న్యాయవాదులకు, న్యాయశాస్త్ర ఆచార్యులకు మధ్య సహకారం ఎల్లప్పుడు కొనసాగుతూనే ఉంటుంది. న్యాయవాదులు, తమ దైనందిన అనుభవంలో తలెత్తే ఆసక్తికరమైన న్యాయసమస్యలపై విశ్వవిద్యాలయాలలో పత్రాలను సమర్పిస్తారు. మరో వంప, న్యాయశాస్త్ర ఆచార్యులు, అధ్యాపకులు, న్యాయశాస్త్ర మౌలిక సమస్యలపై మాట్లాడతారు. ప్రత్యేక న్యాయశాస్త్ర ప్రచురణలు ఎల్లప్పుడు వెలువడుతుంటాయి. వివిధ న్యాయశాస్త్ర సంఘాల మధ్య పరస్పరం అభిప్రాయాల మార్పిడి జరుగుతుంది.

న్యాయవాదులు నిర్వర్తించే సంఘసేవ గురించి ప్రత్యేకంగా చెప్పవలసి వున్నది. న్యాయసలహా కార్యాలయాలలో సర్వసాధారణంగా ప్రజలందరికి న్యాయవాదులు ఉచితంగా తమ అభిప్రాయాలను, సలహాలను అందించే ఏర్పాటు ఉన్నది. అలాగే, స్థానిక సోవియట్ల కార్యాలయాలతోను, పెద్ద పెద్ద కర్మాగారాలు, మిల్లులు, సమిష్టి క్షేత్రాలతోను, మరమ్మత్తు కేంద్రాలతోను, ఆయా న్యాయవాద సంఘాలు, వ్యక్తిగతంగా న్యాయవాదులు సంబంధాలను పెట్టుకొని, ఉచిత సలహా కేంద్రాలను నిర్వహిస్తారు. వీరు నిర్దిష్ట సమయాలలో అచ్చటకు వెళ్ళి, ప్రజల సందేహాలకు, ప్రశ్నలకు సమాధానాలిస్తారు.

నవ సోషలిస్టు సమాజంలో నైతిక ప్రమాణాలను, నీతి సూత్రాలను విస్తృతంగా వ్యాప్తి చేసేందుకై న్యాయవాదులు, సోవియట్ చట్టాలను ప్రజలకు అర్థమయ్యే రీతిలో తెలియజెప్తారు. సోషలిస్టు చట్టబద్ధతను పదిలపరచేందుకు, నేరనిరోధకత్వాన్ని పెంపొందించేందుకు ఇదొక సాధనం. దీన్నెంతో గౌరవప్రదమైన బాధ్యతగా న్యాయవాద సంఘాలు భావిస్తాయి. క్రిమినల్ చట్టం, కార్మిక చట్టం, రాజ్యాంగ చట్టం, సమిష్టి క్షేత్ర చట్టాలు, కుటుంబ - వివాహ చట్టాలు, సోవియట్ రాజ్య వ్యవస్థ స్వరూపానికి, సోవియట్ ఎన్నికల వ్యవస్థ మున్నగువాటికి సంబంధించిన చట్టాలు మొదలైన వాటిపై సోవియట్ న్యాయవాదులు ఉపన్యాసాలిస్తారు. కర్మాగారాలు, కార్యాలయాలు సమిష్టి క్షేత్రాలలో ప్రశ్నలు సమాధానాలతో కూడిన సమావేశాలు జరుగుతుంటాయి. 1956 లో ఒక్క రష్యన్ ఫెడరేషన్‌లోనే ఇట్టి ఉపన్యాసాలు 62 వేలు జరిగాయట. 1957-58 సంవత్సరాలలో మాస్కో న్యాయవాద సంఘ సభ్యులలో 53 శాతం ఇట్టి ఉపన్యాసాలిచ్చారు. అసెస్సర్లుగా ఎన్నుకోబడినవారు న్యాయశాస్త్ర పరిజ్ఞానాన్ని సంపాదించుకుందుకు కూడా న్యాయవాదులు సహాయపడతారు.

చట్టాల ముసాయిదాలను రూపొందించే కృషిలో ఆయా స్థాయీ సంఘాల కార్యకలాపాలలో కూడా న్యాయవాదులు చురుగ్గా పాల్గొంటారు.

ఈ విధంగా సోవియట్ న్యాయవ్యవస్థ దాని అంతర్భాగమైన న్యాయవాద సంఘాలు, సోవియట్ పౌరుల దైనందిన జీవితంలో న్యాయశాస్త్రం పడుగు, పేకలవలె అల్లుక పోయేందుకు ఎంతో తోడ్పడుతున్నాయి. వివాదాస్పదమైన సమస్యలను న్యాయ బద్ధంగాను, సక్రమంగాను పరిష్కరించడంలో సోవియట్ న్యాయవ్యవస్థ పాత్రను గురించి ముందే మనం తెలిసికొనివున్నాం. సోవియట్ యూనియన్‌లో సోషలిస్టు సామాజిక సంబంధాలను సుస్థిర మొనర్చి, వాటిని నానాటికీ మరింత ఉన్నత స్థాయికి గొనిపోవడమే న్యాయవ్యవస్థ ప్రధాన లక్ష్యం. అందుకనే న్యాయవాద వృత్తి, ప్రజలలో న్యాయశాస్త్ర పరిజ్ఞాన పరివ్యాప్తి సమాజంలో అతి ముఖ్యపాత్ర వహిస్తున్నాయి. న్యాయశాస్త్రం ప్రజాసంక్షేమాన్ని, సోషలిస్టు సామాజిక వ్యవస్థను మరింత పదిలపర్చి, ముందుకు తీసుకెడుతుంది. అందువల్లనే న్యాయవ్యవస్థ పై రెంటిలో దేనికీ అడ్డురాదు. అది ఏ ఒక్క సామాజిక విభాగం యొక్క ప్రత్యేక హక్కులకు ఊడిగం చేయదు.

*10 వ ప్రకరణం*

# న్యాయస్థానాలు, పోలీసు, ప్రాసెక్యూటరు

"న్యాయస్థానాలా ? అసలు రష్యాలో న్యాయస్థానాలంటూ వున్నాయా ?"

సోవియట్ న్యాయ వ్యవస్థను గురించి మాట్లాడేవారికి సహృదయులు, వివేకశీలురు, సంస్కారవంతులునయిన వారినుండి కూడా తరచుగా ఎదురయ్యే ప్రశ్న యిది.

అసలిలాంటి ప్రశ్నలెందుకొస్తున్నాయి? వాటికి ఆస్కారం యేమిటి?

నిరంతర పాశ్చాత్య ప్రచార ప్రభావానికి లోనైనవారు కొందరున్నారు. అలాంటివారి దృష్టిలో అక్టోబరు విప్లవం క్రమబద్ధము, కల్మష రహితమునయిన దాన్నంతా తుడిచి పెట్టింది; అరాచకత్వమూ, గందర గోళానికి నాంది పలికింది. అయితే సోవియట్ న్యాయవ్యవస్థపై అనుమానం గలవారిలో కూడా పై అభిప్రాయం గలవారు అదృష్టవశాత్తూ చాలా కొద్దిమందే. సోవియట్ సమాజం అరవయ్యేళ్ళుగా వర్ధిల్లుతూంది. కోట్లాది ప్రజలు యింత సుదీర్ఘ కాలం గంద్రగోళంలో మనగలిగివుండేవారు కాదు. కనుక, ఒక్క క్షణంపాటైనా నింపాదిగా ఆలోచించే వారెవరయినా పాశ్చాత్య సామ్రాజ్యవాద ప్రచార సాధనాలు దిమ్మరించిన తప్పుడు ప్రచారాన్ని మింగి వూరుకోలేరు.

అయితే మరో తరహా వారున్నారు — వారే అత్యధిక సంఖ్యాకులు. అసలు సోవియట్ సోషలిస్టు సమాజంలో కోర్టుల అవసరం ఏముందంటారు.

వీరు. ఆ సిహక్కుల్ని పూర్తిగా రద్దు పరచారు గదా? అక్కడున్నది సమతా సమాజం గదా ? అట్టి సమాజ పౌరుల మధ్య వివాదా లెందుకు తలెత్తాలి ? సోవియట్ వ్యవస్థ నిర్మాణంలో ప్రభుత్వమే అత్యున్నతాధికార సంస్థ గదా? విషయాలన్నీ ప్రభుత్వమూ, సర్వాధికారయుత కమ్యూనిస్టుపార్టీ చేస్తున్నవే కదా ? అని అడుగుతారు వీరు.

సోషలిజం, సోషలిస్టు సమాజ లక్ష్యాలు అంటే వున్న యాంత్రిక అవగాహన మూలంగా ఏర్పడిన అమాయకపు, లోతుపాతులెరుగని అతి సామాన్య అభిప్రాయాలివని, యీ పుస్తకంలో యింతవరకు చెప్పిన విషయాలు గమనించిన వారెవరయినా గ్రహిస్తారు. సోషలిజం ఒక నూతన సామాజిక వ్యవస్థను స్థాపించింది. మానవజాతి యింతకు మునుపెన్నడూ కనీవినీ యెరుగనంతటి జటిలమూ, ఉన్నతమూ అయిన విలువలతో కూడిన వ్యవస్థ ఇది. ఇట్టి నవసమాజ ప్రధాన, స్థూల లక్షణా లన్నింటినీ సోవియట్ రాజ్యాంగచట్టం చిత్రిస్తోంది. సోవియట్ చట్టాలు వ్యక్తుల మధ్య, వ్యక్తికీ సమాజానికీ మధ్య గల, వివిధ జీవనరంగాల్లోను గల, సంబంధాలకు వర్తించే సూత్రాలను, ప్రమాణాలను, నియమ నిబంధనలను సూచిస్తున్నాయి. ఐక్యతా ప్రాతిపదిక ఒకటున్నా, శాఖోపశాఖలుగా న్యాయవ్యవస్థ అన్ని జీవనరంగాలకు విస్తరిస్తోంది; ఏ యితర సమాజంలో కంటె ఎక్కువగా, సమగ్రతరంగా ప్రభుత్వ, వ్యక్తుల చర్యలను శాసిస్తూంది అనే విషయం అందరికీ స్పష్టమవుతుంది. ఇంతకుముందే వివరించినట్లుగా, సోవియట్ దేశపు ప్రవర్ధిత సోషలిస్టు సమాజం, యితర సమాజాలన్నింటికంటె ఎక్కువగా చట్టబద్ధ పాలనకు లోబడి ఉంది.

అయినప్పటికి, సోవియట్ దేశాన్ని కళ్లారా చూచినవారి కెవరి కయినా ఆ దేశ సాధారణ జీవితంలో కోర్టులు అతి ప్రధాన పాత్రను నిర్వహించడం లేదనే అభిప్రాయం కలగవచ్చు. ఈ సందర్భంలో యీ రచయిత, తానూ కేరళకు చెందిన సీనియరు న్యాయవాది శ్రీ బాల గంగాధర మీననూ, న్యాయవాద ప్రతినిధివర్గ సభ్యులుగా 1973 లో సోవియట్ యూనియన్‌ని సందర్శించినప్పుడు కలిగిన ఒక చిత్రమైన అనుభవాన్ని ఉదహరించ గోరుతున్నాడు. మాస్కోలో వుండగా, డాక్టరేటు

పట్టాకోసం తయారవుతోన్న, తెలివైన మా దుబాసీ నగర ప్రజాకోర్టుకు తీసుకెళ్ళాడు. ఆ కోర్టు భవనాన్ని కనుగొనేందుకై ఆ వీధి పేరు, యింటి నంబరు వ్రాసుకుని వెదకి పట్టుకోవలసి వచ్చింది. భారతదేశంలో యిలాంటి పరిస్థితి మనకు తటస్థించదు. ఇక్కడ, కోర్టు తరచు పెద్ద వార్తా కేంద్రంగా వుంటుంది. గగుర్పాటు కలించే కేసులు అన్నివర్గాల, తరహాల ప్రజల్లోను ఆసక్తిని రేకెత్తిస్తాయి. అందుకే, అందరికి తెలిసిన ప్రదేశంగా వుంటుంది కోర్టు. కాని, సోవియట్ యూనియన్‌లో కోర్టుతో పనిబడేవారు కదాచిత్తుగానే వుంటారు. మిగతావారు తమ పనులలోను, తమ తమ క్రీడల్లోను పూర్తిగా నిమగ్నమై పోతారు. కోర్టు ఛాయలకే చాలమంది వెళ్ళరు. దీనర్థం కోర్టులకు వెళ్ళేందుకు వీల్లేదనికాదు. ప్రతి కోర్టులోను చూడవచ్చేవారికి కావలసినంత వసతి వుంటుంది. కుర్చీలు, బెంచీలు చాల వుంటాయి. లోపలి కెళ్ళేవాళ్ళని మీరెవరని అడిగే వారు కూడా వుండరు.

ఇంతకంటె కూడా కొట్టవచ్చినట్లగపడే మరో విషయమేమంటే, ప్రపంచంలోని అతి పెద్ద నగరాల్లో ఒకటయిన మాస్కోలో అతికొద్ది మంది పోలీసులు మాత్రమే కన్పించడం (వీరినక్కడ "మిలీషియా" అంటారు). సోవియట్ ప్రజకు వీరితో పెద్ద అవసరమున్నట్లు కన్పించదు. అయితే ఏం చెప్పినా నమ్మేవారున్నంతకాలమూ, సోవియట్ యూనియ నంటే ఒక పోలీసు రాజ్యమని పాశ్చాత్య రాజ్యాలు గొంతులు చించుకుని అరుస్తూనే వుంటాయి. పోలీసులు దాదాపు కన్పించక పోవడాన్నిబట్టే సోవియట్ సమాజ ఏకరూపత మనకవగతమవుతుంది. అక్కడ పరస్పర హారణోద్యోగం లేదని ద్యోతకమవుతుంది. అక్కడ పరస్పర విరుద్ధ వర్గాల్లేవు. అంతేగాక, శాసన పరిజ్ఞానం కూడా ఒక క్రమపద్ధతిలో పెంపొం దింపబడిన కారణంగా పౌరుల మధ్య తగాదాలు చాలవరకు నివారింప బడుతున్నాయి. ఈ మధ్య చాల విస్తృత ప్రచారంద్వారా పౌరులకు యీ చట్టాలను గురించిన పరిజ్ఞానం ఎక్కువగా కలిగించడం జరుగు తూంది.

సోవియట్ దేశ కోర్టులు ద్విముఖ ప్రయోజనాన్ని నిర్వర్తిస్తున్నాయి. ఈ రచయిత హాజరైన ఒక విడాకుల కేసు విచారణను యిందుకు ఉదా

హరణగా పేర్కొనవచ్చు. ఒక యువతి, యువకుడైన తన భర్త నుండి విడాకులు కోరుతూ కోర్టుకొచ్చింది. ఆయన రవాణాశాఖలో పనిచేస్తున్నాడు. తన భర్త బాగా తాగి తనను హింసిస్తున్నాడనేది ఆమె ఫిర్యాదు. ఇక భర్త, తన భార్యకు పనిలేకపోగా, ఆమె తన తల్లిని కూడా తీసుకురావటంతో యింటి ఖర్చులు పెరిగిపోయాయని ప్రతివాదం చేశాడు. ఈ కేసును ఒక న్యాయమూర్తి, యిద్దరు అసెసర్లు విచారించారు. బిడ్డను కనివున్న ఆ యువతిని పనికెలా పోమ్మంటావని న్యాయమూర్తి ఆ భర్త నడిగింది. అంతేగాక, బాలింతరాలికి తల్లి సహాయంగా రావడాన్ని మనసున్న వాడెవడూ కాదనజాలడని కూడా అన్నారామె. ఆ బాలింతరాలికి వేతనం రాకుండా పొయ్యే ప్రశ్నకూడాలేదు. ఆ మహిళా న్యాయమూర్తి ఆ యువతిని, నీ బిడ్డ పెరిగి పెద్దయ్యాక తోటివారంతా తమ తమ నాన్నలను గురించి మాట్లాడుకుంటూంటే ఆ పాప యింటికొచ్చి "అమ్మా, నాన్నేడే?" అంటుంది గదా, అప్పుడు యేం జవాబిస్తావు అని అడిగింది. అప్పుడీ రగడంతా ఆ పసిపాపకు చెప్పి ఓదారుస్తావా అని అడిగింది. అందువల్ల యిప్పుడే సర్దుబాటు చేసుకుని యిద్దరూ రాజీపడితే మంచిదిగదా అన్నారామె. ఇలా దంపతులిద్దరికీ ఓపిగ్గా సలహాలిచ్చి, బతిమాలి కోర్టువారు, ఆ కేసును మూడు నెలలపాటు వాయిదా వేశారు. మళ్ళీ మళ్ళీ ఆలోచించుకొమ్మని, తామిద్దరూ ప్రేమించే బిడ్డ భవిష్యత్తుదృష్ట్యా వీలయినంతవరకు తెగతెంపులు చేసుకోవద్దనీ కోరారు. ఈ విధంగా తమ న్యాయశాస్త్ర విధులను నిర్వర్తిస్తూనే, యిరుపక్షాలను బాధ్యులైన పౌరులుగా ప్రవర్తించమని, సుఖదాయకమైన కుటుంబ సంబంధాల్ని చేజేతులా పాడుజేసుకోవద్దని నచ్చజెప్ప యత్నించారు. ఈ విధంగా పౌరులను విజ్ఞానవంతుల్ని చేసే పాత్రకూడా నిర్వహించారు. ఈ కేసుల్లోనే కాదు, అన్ని సందర్భాల్లోను సోవియట్ న్యాయస్థానం యీ నిరంతర బాధ్యతను సంతోషంగా స్వీకరిస్తూంది. ఒక క్రిమినల్ కేసులో నిందితుడికి శిక్ష విధించే సందర్భంగా ఆ నేరం ఏ పరిస్థితుల్లో జరిగిందో దృష్టిలో వుంచుకోకుండా గుడ్డిగా శిక్ష విధిని నిర్వర్తించరు. ప్రతి కేసులోను చట్టబద్ధ ప్రవర్తన తనకు, సమాజానికి ఉభయత్రా యెలా శ్రేయస్కరమో, యీ రెంటికి మధ్య యెలా వైరుధ్యమన్నది లేదో తెలియజెప్తారు. నీతివర్తనం నుండి నిందితుణ్ణి

ప్రక్కదారి పట్టించిన పరిస్థితులు, కారణాలేమిటో, వాటిని నివారించడ మెలాగో ఈ విధంగా యితరులకు కూడా తెలియజెప్పడం జరుగుతుంది. ఈ విధంగా వ్యక్తుల తప్పులను దిదుబాటు చేయడమేగాక, సమాజ నిర్మాణంలో మరింత సామరస్యపూరిత వాతావరణాన్ని నెలకొల్పడం కూడా ధ్యేయంగా నిర్ణయాలు గైకొనబడతాయి. ఇందువల్లనే న్యాయమూర్తులు కూడా తమ నెన్నుకున్నవారికి తమ పనిని గూర్చి క్రమం ప్రకారం నివేదించవలసి వుంటుంది.

సోవియట్ న్యాయస్థానాలను సందర్శించే వారికెవరికయినా, తమ వద్దకొచ్చే కేసులకు తగినంత సమయాన్ని వెచ్చించే తీరిక, ఓపిక వున్నాయని అర్థమవుతుంది. అటు న్యాయవాదిగాని, యిటు కక్షీదారుగాని చేసే క్రాస్-ఎగ్జామినేషన్‌కు కాలపరిమితంటూలేదు. తన న్యాయవాది పరీక్షించాక కూడా, వాది ప్రతివాదులు కావాలనుకుంటే యింకా తామే ప్రశ్నలడగ వచ్చు. కోర్టువారు సమయం గురించిగాని, ప్రశ్నల సంఖ్య గురించిగాని యే విధమైన పరిమితులూ విధించరు. సాక్షులను ఒకరి తర్వాత మరొకర్ని విచారిస్తూ, ఒకరు చెప్పేది మరొకరికి వినపడకుండా, అసలు ఒకరినొకరు చూచుకోకుండా కూడా తగు జాగ్రత్త వహిస్తారు. అనేకమంది సాక్షులను విచారించాక కూడా వెనుకటి సాక్షులలో ఒకరిని మళ్ళీ పిలిపించి క్రాస్‌పరీక్ష చేయడం ఏమంత కష్టంకాదు. ఈ రచయిత లెనిన్‌గ్రాడ్ ప్రజాకోర్టుకు వెళ్ళినపుడు ఇలాంటి ఘటనే ఒకటి జరిగింది. ఐదవ సాక్షి విచారించబడ్డాక ఒక న్యాయవాది, తమ ఎదుటి పక్షంవారి మొదటి సాక్షిని క్రాస్ పరీక్ష చేయాలని కోరారు. ఎలాంటి పేచీ పెట్టకుండా ఆ మొదటి సాక్షిని మళ్ళీ పిలిపించడం జరిగింది. మాస్కోలో రష్యన్ ఫెడరేషన్‌కు చెందిన ఇద్దరు న్యాయమూర్తులను మా న్యాయవాది ప్రతినిధివర్గం కలుసుకొన్నప్పుడు, ఆయా కేసులకు కావలసినంత సమయం ఎలా కేటాయించబడుతున్నదో మాకు అవగతమైంది. మేమక్కడ న్యాయమూర్తి వదవ పోల్‌ను కలుసుకొన్నాము. ఆయన, నాజీ యుద్ధ నేరస్తులను విచారించిన న్యూరెంబర్గ్ అంతర్జాతీయ కోర్టులో ప్రాసిక్యూషన్ న్యాయవాదిగా పాల్గొన్నారు. ఆయన్ను మేము సోవియట్ కోర్టులలో కేసులు చాలా కాలంనుంచి పేరుకొనిపోయి ఉంటాయా ? అని అడిగినపుడు, సోవియట్

యూనియన్‌లో అలాంటి సమస్యే లేదు అన్నారు. తాను అలహాబాద్ హైకోర్టును సందర్శించినప్పుడు ఈ పేరుకుపోయే సమస్యను గురించి విన్నానని కూడా అయన చెప్పారు. సోవియట్ సమాజంలో తీవ్ర ఘర్షణలకు దారితీసే పరిస్థితులు లేవు గనుకనే అక్కడ ఎక్కువ కేసులు కాని, అవి పరిష్కారం కాకుండా పేరుకుపోవడంగాని ఉండదు. అందువల్ల ఏవైనా కేసులు విచారణకు వచ్చినపుడు, వాటిని సావధానంగా విచారించేందుకు కావలసిన సమయ ముంటుంది. నిస్సందేహంగా పరిస్థితి ఉండవలసింది యిలాగే. నియమబద్ధంగా పనిచేసే సమాజంలో, సమాజం నిర్దేశించిన ప్రవర్తనా నియమావళి నుండి ప్రక్కదారి పట్టడమన్నది అతి అరుదుగా, మినహాయింపుగా మాత్రమే ఉండాలిగాని, అది సార్వత్రికం కారాదు. అలాంటి ప్రక్కదారి పట్టే ఘటనలు జరిగినపుడు దానియెడ ప్రత్యేక శ్రద్ధ కనబరచాలి.అది పతనం చెందిన ఒక సాధారణవ్యక్తి పొరపాటు వైఖరియా? లేదా, అంతకంటే విస్తృతమైన రుగ్మతకు చిహ్నమా అన్న విషయాన్ని జాగ్రత్తగా పరిశీలించి తగు చర్య గైకొనాలి.

న్యాయ విచారణ ప్రజాప్రయోజనాల కోసం జరుగుతుంది. వారిని మరింత చట్టబద్ధవర్తన గలవారిగా రూపొందించేందుకు న్యాయపాలనా విధానం కృషిచేస్తుంది. ఈ లక్ష్యం నెరవేరాలంటే, అన్నిస్థాయిలలోను ప్రజా సహకారం లభించడం అత్యంత ప్రధానమని వేరే చెప్పనక్కరలేదు. ఈ సందర్భంలోనే మరో విషయం కూడా చెప్పవలసి ఉన్నది. "సోవియట్ సమాజంయొక్క ప్రజాతంత్ర పునాదులు నానాటికి బలపడుతున్నాయి. ఇందుమూలంగా ఇంతకుముందు కోర్టులు, పాలనా నిర్వహణ సంస్థలు నిర్వర్తిస్తున్న శాంతి భద్రతల పరిరక్షణ వంటి కొన్నిరకాల విధులను ప్రభుత్వేతర సంస్థలు ఈనాడు నిర్వర్తిస్తున్నాయి. ఈనాడిది చట్టబద్ధమైన రూపం తీసుకొంటున్నది."*

---

* సోవియట్ న్యాయస్థానాలు : వి. తెరెబిలోవ్, ప్రగతి ప్రచురణాలయం, మాస్కో, ప్రథమ ముద్రణ, 1978.

ఇట్టి విధుల నిర్వహణలో ప్రజలు, ప్రజాసంస్థలు పాల్గొనేలా చేసేందుకు వివిధ రూపాల్లో అనేక రకాలైన సంస్థలు ఏర్పాటవుతున్నాయి. వాటిలో కొన్నిటిని కొంత వివరంగా పరిశీలిద్దాం.

మొదటి విషయం : నేరస్థులను వెదకి పట్టుకొని నిర్బంధించేందుకు పరిశోధకులకు తోడ్పడమని ప్రజలను కోరతారు. ఇందుకు వారినుండి హృదయపూర్వకమైన సహాయం లభిస్తుంది. దొంగిలించబడిన వస్తువులను కనుగొనేందుకు, నేరాలు చేయడంలో ఉపయోగించబడిన పనిముట్లను, ఆయుధాలను వెలికి తీసేందుకు ఈ నేరాలు జరగడానికి దారితీసిన పరిస్థితులను, కారణాలను తొలగించేందుకు సర్వవిధాలా ప్రజా సహకారం తీసుకోబడుతుంది. అయితే, ఈ పరిశోధక సంస్థలు నేరస్థులను నిర్బంధించడం వంటి బాధ్యతలను వదలివేసి, వాటిని ప్రజల చేతికి అప్పగించజాలవు.

అయితే, సమిష్టి శ్రామిక సంస్థవంటి ప్రభుత్వేతర సంస్థలు, నిందితుణ్ణి విచారణాధికారి వద్దగాని, కోర్టులోగాని హాజరు పరచే బాధ్యత తీసుకొని, అతని ప్రవర్తనకు తామే హామీ యివ్వవచ్చు. అంటే, నిందితుడికి బెయిల్ మంజూరు చేసేందుకు హామీదారులుగా నిలబడవచ్చు.

కొన్ని ప్రత్యేక రకాలకు చెందిన నేరాల విచారణను సాధారణ కోర్టులు, కామ్రేడ్ల కోర్టులకు బదలాయించవచ్చు.* ఈ కోర్టులు 1919లో నెలకొన్నాయి. వీటినానాడు "కార్మిక క్రమశిక్షణ న్యాయస్థానాల" నే వారు. 1930 దశకం ఆరంభంలో కర్మాగారాలు, కార్యాలయాలు, ప్రభుత్వ, ప్రభుత్వేతర సంస్థల స్థాయిలో కామ్రేడ్ల కోర్టులను ఏర్పాటు చేయాలని యూనియన్ రిపబ్లిక్‌లు నిర్ణయించడంతో, వాటి కార్యపరిధి విస్తృతమైంది. ఈ కోర్టుల ప్రధాన కర్తవ్యం శ్రామిక క్రమశిక్షణా ఉల్లంఘనలను నివారించటం, పాతజీవన విధాన అవశేషాలను, త్రాగుబోతుతనం వగైరాలను నిర్మూలించడం. 1931 లో రష్యన్ ఫెడరేషన్‌లోని గృహనిర్మాణ సహకార సంస్థలలో కూడా ఈ కోర్టులు నెలకొల్పబడ్డాయి.

---

* కామ్రేడ్ల కోర్టులకు సంబంధించిన వివరాలను మొదటి అధ్యాయంలో తెలపడం జరిగింది.

1958లో ఇతర రిపబ్లిక్కు లన్నీ ఈ కామ్రేడ్ల కోర్టులకు సంబంధించిన క్రొత్తచట్టాలను ఆమోదించాయి. *

"కామ్రేడ్ల కోర్టులన్నవి, లాంఛన పూర్వకం కానట్టి, ఎన్నుకోబడ్డ సంస్థలు, పనిపట్ల పౌరులకు కమ్యూనిస్టు దృక్పథం అలవడేలా చేయటం, సోషలిస్టు సామాజిక జీవన నియమాలను పాటించేలా చూడటం, సమిష్టి తత్వం,పరస్పర సహాయ సౌహార్ద వైఖరి, తోటి పౌరుల గౌరవమర్యాదల పట్ల అచంచల శ్రద్ధ మున్నగు ఉత్తమ లక్షణాలను పెంపొందించటం-ఈ ఉద్దేశాలతోనే ఈ కోర్టులు ఏర్పడ్డాయి." ఈ కామ్రేడ్ల కోర్టులు కర్మాగారాల, కార్యాలయాల, విద్యా సంస్థల, సమిష్టి క్షేత్రాల, గ్రామీణ ఆవాసాల సర్వసభ్య సమావేశాలలో ఎన్నుకోబడతాయి. చేతులెత్తే పద్ధతి ద్వారా ఈ ఎన్నికలు జరుగుతాయి. వీటి కాలపరిమితి సాధారణంగా రెండు సంవత్సరాలు ఉంటుంది. ప్రతి సంవత్సరము, తమ నెన్నుకున్న వారి సర్వ సభ్య సమావేశంలో తాము నెరపిన కార్య కలాపాల గురించి ఇవి నివేదికలు సమర్పిస్తాయి. ఇవి సాధారణంగా, తగిన కారణం లేకుండా పనికి గైరుహాజరుకావటం, ఆలస్యంగారావడం, పని నాసిరకంగా ఉండటం, భద్రతా నియమాలను పాటించక పోవటంవంటి చిన్న, చిన్న విషయాలపై చర్య తీసుకుంటాయి. వీటి విచారణ క్రిందికివచ్చే అంశాలలో ప్రభుత్వ, సామాజిక ఆస్తులను కొద్దిపాటి దుర్వినియోగం చేయటం, మొదటిసారి చేసిన చిన్న, చిన్న రౌడీ చర్యలు వగైరా కూడా చేరి ఉంటాయి. ఇలాంటి కేసులను సాధారణంగా నేరస్తుల నివాస ప్రాంతాలలోగాని, పనిచేసే చోట్లలోనే గానీ బహిరంగంగా విచారిస్తారు. ఇట్టి విచారణ కనీసం ముగ్గురు సభ్యులైనా కలిసి జరుపుతారు. ఈ కోర్టుల కార్య కలాపాలు అత్యంత లాంఛన రహితంగా ఉంటాయి. అధ్యక్షుని అనుమతితో విచారణకు హాజరైనవారెవరైనా ఆ కేసునిగురించి ప్రశ్నలడగవచ్చు, తమ అభిప్రాయాలను వెల్లడించవచ్చు. అట్టి చర్యల ఫలితాన్ని మినిట్స్ పుస్తకంలో వ్రాస్తారు. ఆ విచారణలో పాల్గొన్న కోర్టు సభ్యులలో అధిక సంఖ్యాకుల అభిప్రాయాల ననుసరించి

---

* ఈ విషయంకూడా ముందే వివరించబడింది.

చెర్యాలు గై కొన బడతాయి. నిందితుని నేరం రుజువైనట్లయితే కోర్టు వారు బహిరంగ క్షమాపణ కోరవచ్చు. లేదా సౌహార్ధ పూరితమైన హెచ్చరిక చేయవచ్చు. బహిరంగ అభిశంసన, లేదా మందలింపు చేయవచ్చు.

సాధారణంగా 10 రూబుళ్ళ జరిమానా విధించవచ్చు. 50 రూబుళ్ళు అత్యధిక జరిమానాగా ఉంటుంది. నేరస్థుడని భావించిన కార్మికుణ్ణి తానున్న స్థాయినుండి క్రిందిస్థాయికి దింపవచ్చు. తానున్న యింటినుండి వెళ్ళగొట్టవచ్చు. స్థానిక ట్రేడ్ యూనియన్ కమిటీలు కొన్ని ప్రత్యేక పరిస్థితులలో, కామ్రేడ్ కోర్టుల తమ నిర్ణయాలను పునః పరిశీలించ వలసిం దిగా కోరవచ్చును.

కామ్రేడ్‌ల కోర్టుల నిర్ణయాలు జరిమానా విధింపు, నష్టపరిహారం చెల్లింపు మొదలయిన వాటితో కూడినవయినప్పుడు, ఆ నిర్ణయాలను ప్రజా న్యాయమూర్తికి పంపుతారు. ఆయన ఆ కేసు రికార్డునంతా పరిశీలించి, ఆ నిర్ణయం చట్ట విహితంగా ఉన్నదని తృప్తిపడితే దాని నమలు జరిపే అధికారాన్ని ఒక కోర్టు ఉద్యోగికి అప్పగిస్తాడు. నిందితులైనవారు చాలవరకు కామ్రేడ్ల కోర్టుల విచారణ తప్పించుకుందుకే చూస్తారు. ఎందు కంటే, తమ లోపాలు తమ పొరుగువారి ముందు, తోటి కార్మికుల ముందు బటబయలై, తమ పరువు పోతుందని వారి భయం దీన్నిబట్టి వారు, తమ పొరపాటకు చాల సిగ్గుపడుతున్నారని, తమ తోటివారిలో తమ పరువు, ప్రతిష్ఠలకు ఎంతో విలువ నిస్తున్నారని తెలుతుంది. చాల స్వల్ప విష యాలే యీ కామ్రేడ్ల కోర్టుల పరిధిలోకి వస్తాయని మరోతూరి నొక్కి చెప్పాల్సివుంది.

అంతేగాక, ఈ కోర్టులు, 18 సంవత్సరాలు నిండని మైనర్ల కేసు లను–అవి అతి తీవ్ర స్వభావం గలవి కాకపోతే—మైనర్ల కమీషన్లకు బదలాయించవచ్చు.

మనమిప్పుడు, యీ మైనర్ల కమీషన్ల గురించి కొద్దిగా తెలుసు కుందాం. ఇవి బాల, యువ నేరాలను అరికట్టడంలో ప్రజలు పాల్గొనేలా చూస్తాయి. జిల్లా, ప్రాంతీయ సోవియట్ల కార్యవర్గాల అధ్వర్యం కింద, స్వయంపాలిత రిపబ్లిక్కుల మంత్రివర్గాల పర్యవేక్షణలోను, కొన్ని

ప్రత్యేక సందర్భాలలో యూనియన్ రిపబ్లిక్ మంత్రిమండలి అధ్వర్యంలో కింద నెలకొల్ప బడతాయి. పిల్లల పట్ల నిర్లక్ష్యభావం ప్రదర్శితమవకుండా చూడడం, బాల నేరాలు జరక్కుండా జాగ్రత్త వహించడం, యువకుల హక్కుల పరిరక్షణ, బాలల సంక్షేమాన్ని కనిపెట్టి చూడడం, యువకులకు పనులను వెదుక్కోవడంలో తోడ్పడడం, వారికి విద్యావసతులను కల్పించడం వగైరాలు యీ కమీషన్ల ప్రధాన విధులుగా వున్నాయి. ఈ కమీషన్లు తమ విధి నిర్వహణలో ప్రజా సంఘాల, యితర ఔత్సాహికుల సహాయ సహకారాలను స్వీకరిస్తాయి. సోవియట్ల, ట్రేడ్ యూనియన్ల, యువ కమ్యూనిస్టు సంఘాల, సంరక్షక, తదితర సంస్థల స్థాయీ సంఘాలు వీటికి సహాయపడతాయి

ప్రభుత్వ, ప్రజా సహాయం అవసరమైన బాలలను, యువకులను కనుగొనడంలో తోడ్పడేందుకు ముందుకు వచ్చేవారిలో నుండి యీ కమీషన్లు స్వయంసేవకులైన పరిశీలకులను నియమిస్తాయి. అలాగే, శిక్షలనుభవించడం పూర్తయ్యాక అట్టి యువకుల ప్రవర్తనను కనిపెట్టి చూడడం, ఖైదుకాక, ఇతర శిక్షలు విధించబడిన వారి నడవడిని గమనించడం కూడా వీటి పరిధిలోకొస్తాయి. అవసరమైన సందర్భాల్లో ఉద్యోగాన్వేషణలోను, పాఠశాలా ప్రవేశంలోను యీ కమీషన్లు తగు చర్యలు గైకొంటాయి. బాల నేరస్థుల శ్రామిక శిబిరాలను, పోలీసు పర్యవేక్షణలో గల బాల నేరస్థుల శిబిరాలను, ఉపేక్షిత బాలుర సేవా కేంద్రాలను, తదితర బాల విద్యా, వైద్య కేంద్రాలను యీ కమీషన్లు పర్యవేక్షిస్తాయి. ఈ కమీషన్ల సభ్యులకు యీ శిబిరాలు, కేంద్రాలకు వెళ్ళి పరిశీలించేందుకు, తమకు అవసరమని తోచిన సమాచారాన్ని అందించమని అడిగేందుకు హక్కు వుంది. వారీ మైనర్లను వ్యక్తిగతంగా ఇంటర్వ్యూ చేసి, వారి ఫిర్యాదులను, దరఖాస్తులను పరిశీలిస్తారు.

నేరస్థుడైన బాలునికి, యువకునికి విధించదగిన శిక్ష యేమిటో వీరు కోర్టు వారికి తెలియజేయవచ్చు. అట్టి శిక్షలను తగ్గించమని, శిక్షా కాలం పూర్తికాకమునుపే విడుదల చేయమని సలహా యివ్వవచ్చు. కోర్టులు, ప్రాసిక్యూటర్లు నేరం చాల స్వల్పమయినదైనందువల్ల గాని, నేరస్థులు మరీ పిన్నవయస్కులయినందువల్ల గాని వదలివేసిన కేసులను

తమకు పంపినప్పుడు యీ కమీషన్లు పరిశీలిస్తాయి. అట్టి కేసులను జాగ్రత్తగా పరిశీలించాక, ఆ నేరస్థునివల్ల గాయపడిన, నష్టపోయిన వ్యక్తికి బహిరంగ క్షమాపణ యిమ్మని కోరవచ్చు; మందలించవచ్చు; అతని తలిదండ్రులు నివసించే పేటలోని ప్రజలకు అతని పొరపాటు పనులను గూర్చి తెలియపరచవచ్చు; కార్మిక సహకార సంస్థల పర్యవేక్షణలో ఆ మైనరునుంచవచ్చు; బాలలు, యువకుల కుద్దేశించిన ప్రత్యేక విద్యాలయానికి పంపవచ్చు. తలిదండ్రులు బిడ్డలపట్ల అక్రమంగా ప్రవర్తించిన విషయం ఋజువైతే అట్టి వారికి తలిదండ్రులుగా సంక్రమించే హక్కులను రద్దు పర్చమని కోరవచ్చు; తలిదండ్రులుగా తమ విధులను సరిగా నిర్వర్తించని చిన్నచిన్న కేసులలో వారిని మందలించవచ్చు; ఇలాంటి కేసులను కామ్రేడ్ల కోర్టులకు బదలాయించవచ్చు; ఆ బాల నేరస్థునివల్ల జరిగిన నష్టం కింద 20 రూబుళ్ళ వరకు పరిహారం రాబట్టవచ్చు; 20 రూబుళ్ళు జరిమానా విధించవచ్చు; వారి చెడు ప్రవర్తన గురించి తలిదండ్రులు పనిచేసే చోటుకు తెలియజేయవచ్చు. ఇవేగాక, కర్మాగారాల, కార్యాలయాల, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల యాజమాన్యాలు యువ కార్మికుల పని పరిస్థితులకు సంబంధించిన నిబంధనలను సరిగా పాటిస్తున్నదీ, లేనిదీ యీ కమీషన్లు పర్యవేక్షిస్తాయి. ఈ యాజమాన్యాలు 18 సంవత్సరాలలోపు వయసుగల కార్మికులను స్థానిక మైనర్ల కమీషను అంగీకారంలేనిదే, చట్టం నిర్దేశించిన విధానాన్ని అనుసరించకుండా పనిలో నుంచి తొలగించ జాలవు.

ఇక నిప్పుడు న్యాయస్థానాలకు, ప్రజలకు మధ్య సహకార రూపాలను గురించిన మన పరిశీలనను కొనసాగిద్దాం.

ఒక కేసు దాఖలు చేయబడిన తర్వాత కూడా ప్రజల కోర్కె మేరకు కోర్టువారు ఆ కేసును కొట్టివేయవచ్చు. అట్టి నిందితుణ్ణి కార్మిక సహకార సంఘం హామీపై విడుదల చేయవచ్చు. అయితే, అట్టి కేసు తీవ్ర స్వభావం గలదిగా వుండరాదు. అది అతడి మొదటి నేరమై వుండాలి. అందు కతడు నిజమైన పశ్చాత్తాపం ప్రకటించాలి.

కోర్టువారు ప్రజల అభ్యర్థనపై, ప్రజాసంఘాలు నియమించిన స్వచ్ఛంద ప్రాసిక్యూటరునుగాని, నిందితుని తరపు న్యాయవాదినిగాని ఆయా కేసుల వ్యవహారంలో పాల్గొనేందుకు అనుమతించవచ్చు.

ప్రజాసంఘాలు, షరతులతో కూడిన శిక్ష విషయమై తమ విజ్ఞప్తి లను దాఖలు చేయవచ్చు. ఆ సంఘాల హామీపై, నిందితుడిలో పరివర్తన గొనివచ్చేందుకై విడుదలకూడా సాధించవచ్చు. ఈ పద్ధతులు షరతులతో కూడిన శిక్షలలోను, వ్యక్తి స్వేచ్ఛకు భంగం కలుగని కేసులలో కూడా వర్తింపజేయవచ్చు.

శిక్షితులను, తమ శిక్షాకాలం ముగియకముందే కొన్ని షరతులపై విడుదల చేయమని – అనగా శిక్షాకాలాన్ని తగ్గించమని, లేదా ప్రొబేషను కాలాన్ని తగ్గించమని ప్రజాసంఘాలు కోరవచ్చు.

ప్రజా నిఘా కమీషన్లను గురించీ, ప్రజా గస్తీ దళాల గురించి కూడా చెప్పాల్సివుంది. న్యాయస్థానాలతో ప్రజా సహకార రూపాలను కొంతవరకు యివి తెలియజేస్తాయి. గనుక, వీటి గురించి కూడా తెలుసుకో వలసివుంది.

నిఘా కమిషన్లు జిల్లా, పట్టణ సోవియట్ల కార్యనిర్వాహక కమిటీల ఆధ్వర్యాన నెలకొల్పబడతాయి. వీటికి సంబంధించిన చట్టాలు, యూనియన్ రిపబ్లిక్కుల సుప్రీం సోవియట్ల అధ్యక్ష వర్గాలచేత ఆమోదించబడి, జారీ అవుతాయి. ఈ కమిషన్లలో ప్రభుత్వ, ప్రభుత్వేతర సంస్థల – ట్రేడ్ యూనియన్ల, యువజన సంఘాల, పెద్ద పెద్ద కర్మాగారాల, సంస్థల ప్రతినిధులు వుంటారు. వీటిలో 12 నుండి 15 వరకు సభ్యులుంటారు. ఈ కమిషన్ల సభ్యులను ప్రజాసంఘాలు, కార్మిక సహకార సంస్థలు నామినేట్ చేస్తాయి. అయితే సభ్యుల ఎంపికపై అంతిమ నిర్ణయం స్థానిక సోవియట్లదే. మిలీషియా అధికార్లు, ప్రొక్యురేటరు, న్యాయమూర్తులు, న్యాయవాద సంఘ సభ్యులు–వీరికి మాత్రం వీటిలో సభ్యత్వం యివ్వరు. ఎందుకంటే, వీరందరూ ఏదో ఒక రూపంలో దిద్దుబాటు సంస్థలలోనూ, దిద్దుబాటు శ్రమ సంస్థలలోనూ క్రమబద్ధమైన విధులను నిర్వహిస్తున్న వారే.

ఈ నిఘా కమిషన్ల ప్రధానవిధి దిద్దుబాటు శ్రమ సంస్థలు, తదితర న్యాయస్థానాలు విధించిన శిక్షల నమలుజరిపే సంస్థల కార్యకలాపాలను కనిపెట్టి వుండడమే. ఇట్టి దిద్దుబాటు సంస్థలలో విద్యా సౌకర్యాలను విస్తరింపజేయడం జరుగుతూ వుందో, లేదో చూడడం, కార్మిక సహకార సంస్థల హామీపై విడుదలైన వారూ జైలుశిక్ష గాక యితర శిక్షలు అనుభవిస్తూన్న వారూ పనిచేస్తూన్న పని ప్రదేశాలలో వుండే లోటుపాట్లను తొలగించడం వీటి కర్తవ్యాలుగా వుంటాయి. ఒకటికంటే ఎక్కువ కేసులలో చిక్కుకుని, ఖైదునుండి విడుదలైన వారికి పనులు, నివాస గృహాలు చూడడం, వారి ప్రవర్తనను గమనిస్తూండడం కూడా ఇవి చేస్తుంటాయి.

దిద్దుబాటు శ్రమ సంస్థలకు వెళ్ళి పరిశీలించే అధికారం వీటికుంది. శిక్షితులను ఇంటర్వ్యూ చేయవచ్చు. వారి ఫిర్యాదులను దర్యాప్తు చేయవచ్చు. వారి వ్యక్తిగత నడవడికి సంబంధించిన ఫైళ్ళను పరీక్షించవచ్చు. ఇంకా తమ కవసరమైన పత్రాలను, రిఫరెన్సులను, అందించమని ఆ దిద్దుబాటు సంస్థ పాలకవర్గం వారిని అడగవచ్చు. కోర్టువారు విధించిన శిక్షలు అమలుజరుగుతున్న తీరును, ఈ దిద్దుబాటు కార్యక్రమం పురోగమిస్తున్న విధానాన్ని అవి గమనించవచ్చు. ఈ సంస్థల పని విధానాన్ని మెరుగుపరచేందుకనువైన ప్రతిపాదనలను అవి చేయవచ్చు. అంతేగాక, శిక్షితులైన వారికి క్షమాదానానికి సంబంధించిన విజ్ఞప్తులను స్వీకరించి, ఈ విషయమై కోర్టువారికి సిఫారసు చేయవచ్చు. ఇందుకోసం దిద్దుబాటు శ్రమ సంస్థల పాలకవర్గ అభిప్రాయాలను కూడా సేకరించవచ్చు. శిక్షాకాలాన్ని తగ్గించి, ముందుగానే విడుదల చేయమని అభ్యర్థించవచ్చు.

జైలునుండి విడుదలైన వారికి ఉద్యోగాలివ్వ నిరాకరించిన సందర్భాలలో ఈ నిఘా కమిషన్ వారు అందుకు ఆధారాలున్నాయో లేదో పరిశీలించి, అట్టివారికి ఉద్యోగాలు కల్పించమని డిమాండు చేయవచ్చు.

ఈ కమిషన్లు అవసరమైనపుడు తమ సమావేశాలకు ప్రాసిక్యూటర్లను, దిద్దుబాటు శ్రమ సంస్థల నిర్వాహకులను, ప్రజా సంఘాల ప్రతినిధులను, కర్మాగారాల, కార్యాలయాల మేనేజర్లను పిలువవచ్చు. అవసరమైనప్పుడు ఒక కేసుకు సంబంధించిన పరిస్థితులను వివరంగా పరిశీలించేందుకు ఆ ఖైదీని కూడా రప్పించవచ్చు. ఈ కమిషన్ నిర్ణయాలను

తప్పనిసరిగా అమలు జరపాలి. రెండు వారాల లోపుగా యీ అమలుకు సంబంధించిన నివేదికలను కమీషన్‌కు పంపాలి. ఈ కమిషన్‌వారి నిర్ణయాలపై అప్పీళ్ళను జిల్లా సోవియట్ల కార్యనిర్వాహక కమిటీలకు పంపుకోవచ్చు.

స్వచ్ఛంద ప్రజాగస్తీదళాలు, సమాజ శాంతి భద్రతలను కాపాడేందుకు ఉద్దేశించబడ్డాయి. లెనిన్‌గ్రాడ్, స్వెర్డ్‌లోవస్క్ తదితర పట్టణాలలోని కర్మాగార, కార్యాలయాల సిబ్బంది చొరవపై 1959లో మొదటిసారిగా ఈ దళాలు ఏర్పడ్డాయి. యూనియన్ రిపబ్లిక్కుల మంత్రి మండలులు శాంతి భద్రత పరిరక్షణలో ఈ స్వచ్ఛంద గస్తీ దళాలు పనిచేసేందుకవసరమైన నిబంధనలను ఆమోదించి, జారీ చేశాయి. వీటి పని చట్టబద్ధమైనదని దీనితో ధృవపడింది. ఈ దళాల ఏర్పాటుకు సంబంధించిన చర్యలు ఏవో ప్రత్యేక పరిస్థితుల నెదుర్కొందుకు తీసుకున్నవేమీకాదు. ప్రభుత్వ విధుల నిర్వహణలో పౌరులు విస్తృతంగా పాల్గొనేందుకు సంబంధించిన భావాల సహజ పరిణామంగానే ఈ దళాలు ఏర్పడ్డాయి. పౌరులలో అత్యధిక సంఖ్యాకులు చిత్తశుద్ధితోను, నిజాయితీతోను తమ విధులను నిర్వర్తిస్తూ, చట్టబద్ధులుగా ఉంటారు. అత్యల్ప సంఖ్యాకులు మాత్రమే పౌరప్రవర్తనా నియమావళిని ఉల్లంఘించడం జరుగుతుంటుంది అలా పెడదారి పట్టేవాళ్ళను ప్రభావితమొనర్చేందుకు పౌరులే సకాలంలో చొరవతో పూనుకోవడం ఎంతో మంచిదని ఆ విధంగా సమాజ శాంతి భద్రతలను పై నుండి బలవంతంగా రుద్దడం వల్లగాక, ప్రజల స్వచ్ఛంద సహకారం ద్వారా పెంపొందించాలని భావించబడింది. వీలైనంతవరకు పోలీసుల (మిలీషియా) అనవసర జోక్యాన్ని నిరోధించడం కూడా దీని లక్ష్యం. ఈ స్వచ్ఛంద ప్రజా గస్తీదళాలలో కర్మాగారాల, కార్యాలయాల సిబ్బందిలోని అత్యుత్తములైన వారు, అలాగే ఉత్తమ సమిష్టి క్షేత్ర రైతులు, విద్యార్థుని తదితరులు వుంటారు. ఒక్కొక్క దళం తన కమాండరును ఎన్నుకుంటుంది. వీరి ప్రధాన కర్తవ్యం వీధులు, పార్కులు, ఇతర బహిరంగ ప్రదేశాలలో శాంతి, భద్రతలను కాపాడడం, పిల్లల యెడ నిర్లక్ష్యం ప్రదర్శించకుండా చూడడం, నేరస్థులను పట్టుకోవడం, అసలు నేరాలే జరగకుండా నిరోధించడం, అమలులో ఉన్న చట్టాల సారాన్ని

ప్రజలకు వివరించి చెప్పడం. ఈ విధమైన ప్రజాభాగస్వామ్యము, చొరవ, శాంతి భద్రతల పరిరక్షణలో ఎంతో విలువైన, విజ్ఞానప్రదమైన పాత్రను వహిస్తున్నాయి.

ఈ పౌరగస్తీదళాలు స్వచ్ఛంద స్వభావం కలిగినట్టివి. వాటికి న్యాయమూర్తుల ఆదేశాలేవీ వుండవు. అయితే, న్యాయమూర్తులు నిరంతరం వాటికి సలహాలనిస్తూంటారు. చట్టాలలోని నిబంధనలను వాటికి తెలియజెప్తారు. ఆ విధంగా న్యాయశాస్త్ర పరిజ్ఞానాన్ని పరివ్యాప్త మొనరుస్తారు.

ఇంతకుముందే మనం చూచినట్లుగా, న్యాయమూర్తులను, అసెస్సర్లను ప్రజలో, ప్రజాప్రతినిధులో ఎన్నుకుంటారు. ఇందుమూలంగా ప్రజలకు, న్యాయస్థానాలకు మధ్య బలమైన అనుబంధ మేర్పడుతుంది. ఒక ప్రజాకోర్టు న్యాయమూర్తిని 30,000 – 35,000 మంది ప్రజలుగల నియోజక వర్గం ఎన్నుకుంటుంది న్యాయమూర్తికి తోడ్పడేందుకై 70–80 మంది ప్రజా అసెస్సర్లను కూడా ఎన్నుకుంటారు జిల్లా (పట్టణ) ప్రజాకోర్టులో చేయ వలసిన పనిని బట్టి ఎందరు న్యాయమూర్తులుండాలో ఆ ప్రాంతపు సోవియట్లు నిర్ణయిస్తాయి. ప్రతికోర్టుకు బెయిలిఫ్, సలహాదారుగా వుంటాడు. ప్రధానగుమస్తా, సాధారణ గుమస్తా, కార్యదర్శులు, రికార్డులను భద్రపరచే గుమస్తా, టైపిస్టు, ఇతర నౌకర్లు ఉంటారు. న్యాయమూర్తు లనేకమంది ఉన్నప్పుడు, వారు తమలో నుండి ఒకరిని అధ్యక్షునిగా ఎన్నుకొంటారు. ఆయన కోర్టు సమావేశాలకు అధ్యక్షత వహిస్తాడు. లేదా మరొకరికి ఆ పని అప్పగిస్తాడు; న్యాయశాస్త్ర ఆచరణ అధ్యయనానికి ఏర్పాట్లు చేస్తాడు; కార్యాలయ పని విధానాన్ని పర్యవేక్షిస్తాడు. ఇతర వ్యవస్థాత్మక కార్య కలాపాలకు మార్గదర్శకత్వం వహిస్తాడు. ఆయన సహజంగానే సివిల్, క్రిమినల్ కేసులు రెంటినీ విచారిస్తాడు. కేసుల విచారణతోబాటు కోర్టు వారు న్యాయ విధాన ఆచరణ ఫలితాలను అప్పుడప్పుడు సమీక్షించాలి. న్యాయశాస్త్ర కార్యకర్తల అర్హతలను పెంపొందించేందుకు తగు చర్యల నమలుజరపాలి. తమనెన్నుకున్న వారికి ఎప్పటి కప్పుడు నివేదికలు అందించాలి; ప్రజా అసెస్సర్ల ప్రయోజనానికై న్యాయశాస్త్ర విషయాలపై ఉపన్యాసాలు, సెమినార్లు వగైరా నిర్వహించాలి. ఈ విషయాలకు

సంబంధించిన త్రైమాసిక పథకాలను తయారుచేయాలి. న్యాయమూర్తులు తమ మధ్య పనిని ప్రాంతీయ, శాఖా ప్రాతిపదికపై విభజించుకొంటారు. న్యాయమూర్తులు ముందుగానే ఏర్పాటు చేసుకొన్న కార్యక్రమం ప్రకారం కర్మాగారాలను, కార్యాలయాలను, సమిష్టి క్షేత్రాలను సందర్శిస్తారు. వారు న్యాయస్థానంలో ఫిర్యాదులు,దరఖాస్తులు తెచ్చిన ప్రజలను కలుసుకొంటారు. న్యాయస్థానాల సలహాదారు న్యాయశాస్త్ర గ్రంథాలయాన్ని, వివిధ చట్టాల, తీర్పుల ప్రతుల సూచికలను అడిగిన వెంటనే అందించేందుకు సిద్ధంగా ఉంటాడు.

90 శాతం కేసులు మొదటిసారిగా ప్రజా కోర్టులలోనే విచారించబడతాయి. అయితే ప్రాంతీయ కోర్టులు. రిపబ్లిక్, అఖిల యూనియన్ సుప్రీం కోర్టులు కూడా కొన్ని రకాలైన కేసుల్లో తొలి విచారణ జరుపుతాయి. ప్రాంతీయ కోర్టులు, రాజ్యాంగచట్టం నిర్దేశించిన కేసులను విచారించడమేగాక, రిపబ్లిక్ సుప్రీం కోర్టులు తమకు బదలాయించిన కేసులను కూడా విచారిస్తాయి. అలాగే, అతి ముఖ్యమైన సివిల్ కేసులను కోర్టు అధ్యక్షుని, లేదా, ప్రాసిక్యూటర్ చొరవపై తమకు కేటాయించిన సందర్భాలలో కూడా విచారిస్తాయి. ఒక రిపబ్లిక్కులో అంతర్భాగంగా స్వయం పాలిత ప్రాంతాలు, మండలాలు వగైరాలున్నప్పుడు, వాటికి గూడా ప్రాంతీయ కోర్టులుంటాయి. రిపబ్లిక్ సుప్రీమ్‌కోర్టు తన అధికార పరిధి లోకి వచ్చే సివిల్, క్రిమినల్ కేసులపై తొలి విచారణ జరుపుతుంది. అలాగే, కింది కోర్టు విచారణకు తగు ఆధారాలున్నాయని భావించిన కేసులు. తన దృష్టికి రావలసిన అవసరమున్నదని భావించినపుడు వాటి విచారణను కూడా తానే స్వీకరించవచ్చు.

అఖిల యూనియన్ సుప్రీంకోర్టు, రాజ్యాంగ చట్టం ప్రకారం తన అధికార పరిధిలోకి వచ్చే అత్యంత ప్రధానమైన సివిల్, క్రిమినల్ కేసులను తొలి విచారణకై స్వీకరించవచ్చు. ఆచరణలో సుప్రీంకోర్టు విభాగాలు మొత్తం సోవియట్ దేశ ప్రయోజనాలకు, రెండు లేక అంతకంటే ఎక్కువ యూనియన్ రిపబ్లిక్కుల ప్రయోజనాలకు సంబంధించే ముఖ్యమైన కేసులను విచారిస్తాయి. సోవియట్ దేశ సుప్రీంకోర్టు అధ్యక్షుని చొరవపై

గాని, ప్రొక్యురేటర్ జనరల్ సిఫారసుపై గాని అట్టి కేసులపై అవే తీర్పు చెబుతాయి.

పైన పేర్కొన్న న్యాయస్థానాలన్నింటిలోను తొలి విచారణ జరిపే కోర్టులుగా వీటిలో ఇద్దరు ప్రజా అసెస్సరతో సహా, ఒక అధ్యక్ష న్యాయమూర్తి కార్యభారాన్ని వహిస్తాడు. ఈ ప్రజా అసెస్సర్లు ప్రాంతీయ కోర్టులు, రిపబ్లిక్, అఖిల యూనియన్ సుప్రీం కోర్టులలో కూడా పని చేసేందుకై ఎన్నుకోబడతారు. కేసులపై తీర్పు చెప్పడం, అసెస్సర్లతో సహా అధిక సంఖ్యాకుల నిర్ణయం ప్రకారమే జరుగుతుంది. అసెస్సర్లకు న్యాయమూర్తితో సమానమైన హక్కులున్నాయి. చట్టానికి సంబంధించిన వివరాలను అసెస్సర్లకు తెలియజేసి, వారికి మార్గదర్శకత్వం వహించవలసిన విధి న్యాయమూర్తికుంటుంది. అలాగే తమ విస్తృత సమావేశాలలో న్యాయశాస్త్ర ఆచరణకు సంబంధించి సుప్రీంకోర్టు వారు జారీ చేసిన మార్గదర్శక సూత్రాలను కూడా వారి దృష్టికి తేవలసి ఉంటుంది. కేసు నిర్ణయంలో ప్రజా అసెస్సర్లు తమ అభిప్రాయాన్ని మొదట వెలిబుచ్చుతారు. అటు తర్వాతనే న్యాయమూర్తి తన అభిప్రాయాన్ని వెలిబుచ్చుతారు. న్యాయమూర్తి అభిప్రాయాలచే అసెస్సర్లు ప్రభావితులు గాకుండా ఉండేందుకే ఇలా చేస్తారు. ఒక కేసు విచారణ, దానిపై తీర్పు అంతా బహిరంగంగానే జరుగుతుంది.

ప్రాంతీయ కోర్టు రిపబ్లిక్, అఖిల యూనియన్ సుప్రీంకోర్టులు తమ కింది కోర్టుల రికార్డులను, నిర్ణయాలను సవివరంగా పరిశీలించి, అప్పీలు కోర్టులుగాను, రద్దుపరచే కోర్టులుగాను * వ్యవహరిస్తాయి. వీటికి పర్యవేక్షక అధికార పరిధి కూడా ఉంది. ప్రొక్యురేటర్ గాని, ప్రజా కోర్టుతో సహా ఏ ఇతర కోర్టు అధ్యక్షుడైనగాని, ఈ పర్యవేక్షకాధికార పరిధి కిందగల అధికారాన్ని వినియోగించవలసిందిగా కోరవచ్చు. ప్రాంతీయ కోర్టుల, రిపబ్లిక్ అఖిల యూనియన్ సుప్రీం కోర్టుల అధ్యక్ష వర్గాలు, తమ విభాగాలు చేసిన నిర్ణయాలను కోర్టు అధ్యక్షుని, లేదా ప్రొక్యురేటరు ప్రతిపాదనపై పునఃపరిశీలించవచ్చు. ఉన్నత న్యాయస్థానాలను సివిల్,

* రద్దు పరిచే కోర్టులంటే అప్పీలు కోర్టులే. అవి క్రింది కోర్టుల నిర్ణయాలను త్రోసిపుచ్చవచ్చు

క్రిమినల్ విభాగాలుగా విభజించారు. అఖిల యూనియన్ సుప్రీంకోర్టును సివిల్, క్రిమినల్, సైనిక విభాగాలుగా విభజించారు. ప్రజా కోర్టుకు ఎన్నుకోబడిన అధ్యక్షుడుండగా, ప్రాంతీయ కోర్టుకు, రిపబ్లిక్ సుప్రీం కోర్టుకు అధ్యక్ష ఉపాధ్యక్షు లుంటారు. రిపబ్లిక్ సుప్రీం కోర్టుల అధ్యక్షులందరూ అఖిల యూనియన్ సుప్రీమ్ కోర్టుకు ఎక్స్-అఫీషియో ఉపాధ్యక్షులుగా ఉంటారు. దాని కార్యకలాపాలలో పాల్గొనే సందర్భంలో, ఇతర న్యాయమూర్తులతో పాటు సమాన, సంపూర్ణ హక్కులను కలిగి ఉంటారు.

రిపబ్లిక్, అఖిల యూనియన్ సుప్రీం కోర్టులు సంపూర్ణ న్యాయ స్థానాల సమావేశాలు (విస్తృత సమావేశాలు) అప్పుడప్పుడు జరిపి, దేశంలోని కోర్టులన్నిటికి వర్తించే ఆచరణాత్మక మార్గదర్శక సూత్రాలను, వ్యాఖ్యానాలను రూపొందజేస్తాయి. అవి క్రింది కోర్టులన్నింటికీ విధిగా వర్తిస్తాయి. ఇట్టి సమావేశాలకు ఆయా కోర్టులకు సంబంధించిన ప్రొక్యూరేటర్ లేదా ప్రొక్యూరేటర్ జనరల్, న్యాయశాఖా మంత్రులు హాజరవుతారు. ప్రొక్యూరేటర్లు, న్యాయశాఖా మంత్రులు చర్చలలో పాల్గొంటారు. కాని, నిర్ణయాలన్నీ న్యాయమూర్తుల చేతనే గైకొన బడతాయి. న్యాయశాఖా మంత్రి నిర్దిష్ట విషయాలపై కొన్ని వివరణలు కోరుతూ, ప్రతిపాదనలు చేయవచ్చు.

ఈ నిర్ణయాలు క్రింది కోర్టులకు మార్గదర్శకంగా వుంటాయి. కాని, ఆయా ప్రత్యేక కేసులలో పై కోర్టులు తీసుకొనే నిర్ణయాలు ఆ కేసులకు సంబంధించిన క్రింది కోర్టులకు మాత్రమే వర్తిస్తాయి. తక్కిన కోర్టులకి వర్తించవు. ఈ విధంగా, బ్రిటన్, అమెరికా, ఇండియా వంటి దేశాలలో వున్న పూర్వోదంత ప్రమాణ విధానం సోవియట్ యూనియన్‌లో లేదు. అందువల్ల నిర్దిష్టమైన కేసులలో ఉన్నత న్యాయస్థానాలు తీసుకొనే నిర్ణయాలు, సోవియట్ యూనియన్‌లో సాధారణ శాసనం అంటే, అదివరకు జరిగిన తీర్పుల్లో నుంచి సంగ్రహించిన శాసనంగా చెల్లుబాటు కావు. న్యాయస్థానాలు, ప్రతి కేసులోను చేసిన నిర్ణయాల సూచికలను సిద్ధపరచి ఉంచుతాయి. అట్టి నిర్ణయాలను మరే కోర్టులోనైనా మార్గదర్శ కంగా సంప్రతించవచ్చు. అంతేగాని ఆ కోర్టులకు అవి ఎంతమాత్రమూ

శిరోధార్యం కావు న్యాయమూర్తులు క్రమశిక్షణను ఉల్లంఘించి ఏవైనా అపచర్యలకు పాల్పడితే, న్యాయమూర్తులతో కూడిన ప్రత్యేక సంఘాలు ఆ విషయాన్ని పరిశీలిసాయి.

రిపబ్లిక్ సుప్రీం కోర్టు, అఖిల యూనియన్ సుప్రీంకోర్టులకు తమ స్వంత శాస్త్రీయ సలహా సంస్థలున్నాయి. సో యట్ యూనియన్ సుప్రీం కోర్టు ఆధ్వర్యాన శాస్త్రీయ సలహా సంస్థను నెలకొల్పాలన్న అభిప్రాయం 1962లో రూపుదాల్చింది. అదే సంవత్సరం డిసెంబరు నెలలో జరిగిన సుప్రీం కోర్టు విస్తృత సమావేశంలో గైకొన్న నిర్ణయానుసారం ఈ శాస్త్రీయ సలహా సంస్థ నెలకొల్పబడింది. కోర్టు విస్తృత సమావేశాల్లో చర్చించడం కోసం న్యాయస్థానాల తీర్పులనుండి సమాచారాన్ని సేకరించి సిద్ధంచేసే పనిని మరింత మెరుగుపరచడం కోసం దీనిని ఏర్పాటు చేశారు. న్యాయస్థానాలకూ ఈ న్యాయశాస్త్ర బోర్డుకూ మధ్య సన్నిహిత సయోధ్యను పెంపొందించ తలపెట్టారు. ఈ బోర్డులో 30 మంది సభ్యులున్నారు. శాశ్వత న్యాయమూర్తులు ఇందు నాయకపాత్ర వహిస్తారు. వీరిలో ఐదుగురు విశిష్ట శాస్త్రీయ కార్యకర్తలుగా గుర్తింపుపొందినవారు. ఇద్దరు సోవియట్ విజ్ఞానశాస్త్ర అకాడమీ కరెస్పాండింగ్ సభ్యులు; ఇరవై ఒక్క మంది న్యాయశాస్త్రంలో డాక్టరు పట్టా పుచ్చుకొన్నవారు. సుప్రీం కోర్టు విస్తృత సమావేశం 1967లో శాస్త్రీయ సలహా బోర్డు చట్టాన్ని వివరంగా రూపొందించి, ఆమోదించింది. ఈ శాసనంలో ఈ బోర్డు లక్ష్యాలు, కర్తవ్యాలు నిర్దేశించబడ్డాయి. ఈ బోర్డు పని రూపాలు, పద్ధతులు, కార్య విధానాలు, బోర్డు సభ్యుల హక్కులు, అధికారాలు నిర్వచించబడ్డాయి.

ఈ శాస్త్రీయ సలహా బోర్డు నిర్మాణం సోవియట్ న్యాయ విధాన నిర్వహణలో ఎంత ప్రముఖపాత్ర వహిస్తున్నదో, అఖిల యూనియన్ సుప్రీంకోర్టు విస్తృత సమావేశం జారీ చేసిన చిత్తు నిర్ణయాలన్నీ ముందుగా ఈ బోర్డు వారిచే చర్చించబడినట్టివేననే విషయాన్ని బట్టి వివరించ కాగలదు. తన విస్తృత సమావేశాలలో ఆదేశాలను రూపొందించడంలోనూ, లేదా చట్టాలద్వారా పరిష్కరించవలసిన సమస్యల విషయంలో చట్టానికి అన్వయం చెప్పడంలో ఉత్పన్నమయ్యే సమస్యల

విషయంలో తాను చేయదలచిన ప్రతిపాదనలను రూపొందించడంలోనూ సోవియట్ దేశ సుప్రీం కోర్టు న్యాయశాస్త్రవేత్తల, న్యాయశాస్త్ర పరిషత్తుల సహాయాన్ని గైకొంటుంది. అలాంటి న్యాయశాస్త్ర ముసాయిదా పత్రాలను సాధారణంగా ఉన్నత న్యాయ శాస్త్ర పాఠశాలలకు, న్యాయశాస్త్ర సంస్థలకు సోవియట్ దేశ విజ్ఞాన శాస్త్ర పరిషత్తుకు చెందిన రాజ్య - శాసన పరిశోధనా సంస్థకు, ఇతర పరిశోధక సంస్థలకు, తమ అభిప్రాయాలను తెలియ చేయవలసిందిగా కోరుతూ పంపుతారు. విద్యా బోధన సంస్థలోని, సోవియట్ బోధనా శాస్త్ర పరిషత్తుకు చెందిన మన సత్వ శాస్త్ర సంస్థలోని శాస్త్రవేత్తలను, బాల నేరస్థులకు సంబంధించిన సమస్యలపై చర్చలలో పాల్గొనవలసిందిగా ఆహ్వానిస్తారు. అలాగే రచయితల కాపీరైట్ హక్కులపై సూచనలు రూపొందించేందుకు న్యాయవాదులను, సోవియట్ రచయితల కాపీరైట్ హక్కుల రక్షణ సంస్థ ప్రతినిధులను ముద్రణ, ప్రచురణా సంస్థలకు సంబంధించిన సోవియట్ మంత్రి మండలి ప్రతినిధులను ఆహ్వానిస్తారు.

సోవియట్ దేశ న్యాయమూర్తులు ప్రజలకు సంబంధంలేని ఒంటి స్తంభం మేడలలో గూడు కట్టుకొని కూర్చోవడం లేదనేది స్పష్టమే. సుప్రీం కోర్టు విస్తృత సమావేశం దేశ చట్టాలకు అన్వయం చెప్పే సందర్భంగా ఉత్పన్నమైన సమస్యల, కొత్త చట్టాల ద్వారా పరిష్కరించ వలసిన సమస్యల విషయమై సోవియట్ దేశ సుప్రీం సోవియట్ అధ్యక్ష వర్గానికి తన సిఫారసులను అందజేస్తుంది.

తన ఆదేశాలను పంపేముందు ప్రత్యేక నిపుణుల సంస్థలను సంప్రదించడం అవసరమని సుప్రీంకోర్టు ఎందుకు భావిస్తుందన్న ప్రశ్న యిక్కడ తలెత్తవచ్చు. ఇందుకుగల కారణాలకై పెద్దగా వెదకనక్కర లేదు. ఆయా వివాదాలకు పరిష్కారాలను కనుగొనడంతోపాటు సోవియట్ దేశ న్యాయస్థానాల, అత్యంత ప్రధానమైన సామాజిక విధులను నిర్వర్తించ వలసి ఉన్నది. సోవియట్ దేశ సుప్రీం సోవియట్ నిర్ణయాలను ప్రత్యేకించి అది అందచేసే ఆదేశ సూత్రాలను అన్ని కోర్టులు విధిగా శిరసావహించ వలసి ఉంది. అన్యాయాలకు ఘర్షణలకుగల కారణాలను - సోవియట్ సమాజంలో అవెంత అత్యల్పమైనవైనా తొలగించేందుకు అవి నిర్వ

హించవలసిన పాత్ర ఎంతో ఉంది. ఆ విధంగా అవి గొప్ప సామాజిక బాధ్యతను నిర్వహిస్తున్నాయి. సోషలిజాన్ని నిర్మించే, సుసంఘటితమైనదే లక్ష్యసాధనకై అవెంతగానో దోహదం చేస్తున్నాయి. కమ్యూనిస్టు సమాజావతరణకు మార్గాన్ని సుగమం చేస్తున్నాయి.

న్యాయస్థానాలు, న్యాయశాస్త్రము వహిస్తున్న సామాజిక పాత్ర గురించి సోవియట్ దేశ నాయకత్వానికి గొప్ప గౌరవభావమున్నది. 1972 వ సంవత్సరమునుండి సోవియట్ దేశ చట్టాలన్నిటినీ సంగ్రహించి ప్రచురించటం ఆరంభమైంది. ఈ పనిని న్యాయ మంత్రిత్వశాఖ నిర్వహిస్తోంది. ఈ సంకలనంలో 40 మొదలు 50 సంపుటాలు ఉంటాయి. 1922లో సోవియట్ యూనియన్ ఏర్పడినది. మొదలు ఈనాటి వరకు ఆమోదించిన శాసనాలు, ప్రభుత్వ నిర్ణయాలన్నీ ఇందులో చేరి ఉంటాయి. వివిధ న్యాయశాస్త్ర విభాగాలను వేర్వేరు సెక్షన్ల క్రింద విభజించి, ఈ శాసనాలను సంకలితం చేస్తారు. ఇందు రాజ్య వ్యవస్థ, కార్మికరంగం, ఆర్థికరంగం, పెట్టుబడుల సేకరణ, టవాణా వగైరా విభాగాలుంటుయి. ఇలాగే ప్రతి యూనియన్ రిపబ్లిక్కులోను ఈనాటి చట్టాలపై సంకలనాలు ప్రచురించబడుతున్నాయి. ఈ శాసన సంకలనాలకు ప్రత్యక్షంగా న్యాయవాద వృత్తిలో ఉన్నవారు, న్యాయ నిర్ణయాల అమలుతో సంబంధమున్నవారు మాత్రమే గాక అంతకుమించి కూడా విస్తృత పాఠకలోకం ఉంటుందంటే అందులో ఆశ్చర్య పడవలసినదేమీ ఉండదు. ఎందువల్లనంటే అక్కడ, కేవలం సాంకేతిక విషయాలతో కూడినదిగా భావించబడే గ్రంథాలనుకూడా ప్రజలు ఆసక్తితో చదువుతారు. ఈ రంగంలో ప్రజల ఆసక్తిని గమనించేందుకు ఒక ఉదాహరణనిస్తాను. "మనిషి-చట్టం" అనే పేరుతో సోవియట్ దేశ న్యాయమంత్రిత్వ శాఖ ప్రచురిస్తున్న న్యాయశాస్త్ర పత్రిక 30 లక్షల కాపీలు అమ్ముడు పోయింది. (సోవియట్ న్యాయస్థానాలు : తురెబిలొవ్, పుట 172). ప్రజాదరణ చూరగొన్న ఈ పత్రిక న్యాయశాస్త్ర, నైతిక వ్యాసాలను ప్రముఖంగా ప్రచురిస్తుంది. కొత్త చట్టాలను, ఆర్డినెన్సులను, ముద్రిస్తుంది. వివిధ న్యాయశాస్త్ర సమస్యలపై సలహాలను, సిఫారసులను ప్రచురిస్తుంది. అలాగే ప్రభుత్వ రేడియో, టెలివిజన్ కమిటీ న్యాయశాఖతో సహకరించి రాజ్యవ్యవస్థ,

న్యాయము, నీతి- వీటికి సంబంధించిన సమస్యలపై రేడియో, టెలివిజన్ ప్రసారాలను నిరంతర ప్రాతిపదికపై నిర్వహిస్తుంటాయి. క్రమం ప్రకారం జరుగుతున్న "మనిషి-చట్టం" అన్న రేడియో ప్రసారాలు, వివిధ న్యాయ శాస్త్ర విభాగాలకు వర్తించే సలహాలను ఎప్పటికప్పుడు అందజేస్తుంటాయి.

న్యాయశాస్త్ర పరిజ్ఞానాన్ని విరివిగా వ్యాప్తి చేయటం ప్రభుత్వ ప్రధాన కర్తవ్యాలలో ఒకటిగా ఉన్నది. 14 న్యాయశాస్త్ర సంస్థలు, ఉన్నత పాఠశాలలు, 35 ప్రభుత్వ విశ్వవిద్యాలయాల న్యాయశాస్త్ర విభాగాలు దేశానికి అవసరమైన న్యాయవాదులకు శిక్షణనిస్తున్నాయి. అంతేగాక, ప్రతి ఏటా సుమారు 60 వేల మంది పౌరులు సాయంకాల పాఠశాలలలోను, ఉత్తర ప్రత్యుత్తరాల ద్వారాను న్యాయశాస్త్రాన్ని అభ్యసిస్తున్నారు. ఉన్నత న్యాయశాస్త్ర సంస్థలలో 196?తో పోలిస్తే 1972 లో విద్యార్థుల సంఖ్య 50 శాతం పెరిగింది.

ఈ విద్యాలయాల న్యాయశాస్త్ర పాఠ్యాంశాలను ప్రణాళికను తయారు చేయటంలో సోవియట్ దేశ న్యాయ మంత్రిత్వ శాఖ, ప్రొక్యురేటర్ కార్యాలయం. సుప్రీం కోర్టు ప్రముఖ పాత్ర వహిస్తాయి.

సోవియట్ దేశంలో న్యాయ విద్య ప్రధాన లక్ష్యం. ప్రతి సోవియట్ పౌరుడు సోవియట్ దేశ చట్టాలను గురించ క్షుణ్ణంగా తెలుసుకొని, వాటి ఎడ గౌరవ భావాన్ని పెంచుకొని, తదనుగుణంగా నడిచేలా చేయటమే సోవియట్ దేశ చట్టాలు వ్యక్తి యొక్క, సమాజం యొక్క ప్రయోజనాలను వాస్తవ రూపంలో నెరవేరుస్తాయి, అందుచేత ఈ చట్టాలను గురించిన పరిజ్ఞానం ఈ లక్ష్య సాధనకు ఎంతో తోడ్పడుతుంది.

న్యాయశాస్త్ర పరిజ్ఞానాన్ని విస్తృతంగా వ్యాప్త మొనర్చాలనే ఈ ప్రయత్నం. చట్టబద్ధ పాలనను పదిల పర్చటంలో ప్రస్తుత సోవియట్ నాయకత్వానికి గల ఆసక్తికి చక్కని నిదర్శనం. ప్రజలకు న్యాయశాస్త్ర స్వరూపం, దాని లక్ష్యం పూర్తిగా అవగతమవ్వటమే చట్టబద్ధ పాలనకు నిజమైన హామీగా నిలుస్తుందని పదేపదే చెప్పనక్కర లేదు.

ఈ సందర్భంలో న్యాయవాదుల. న్యాయమూర్తుల విధి నిర్వహణా సామర్థ్యాల్ని పెంపొందించేందుకు నిరంతర కృషి జరుగుతోంది. న్యాయమూర్తులు, ప్రాసిక్యూటర్లందరికి ప్రతి 4, 5 ఏళ్ళకు అదనపు శిక్షణ

ఇవ్వబడుతూంది. ఈ లక్ష్యంతోనే సోవియట్ దేశ న్యాయమంత్రిత్వశాఖ, సోవియట్ యూనియన్ ప్రొక్యురేటర్ కార్యాలయము న్యాయశాస్త్ర అర్హతల పెంపుదలకై అఖిల యూనియన్ సంస్థ నొకదానిని నెలకొల్పాయి. ఆయా యూనియన్ రిపబ్లిక్కుల న్యాయమంత్రిత్వ శాఖలు పరిజ్ఞాన విస్తరణ ఉపన్యాసాలను ఏర్పాటు చేశాయి. ఈ అఖిల యూనియన్ న్యాయ విద్యా సంస్థ ఇతర కోర్టులు న్యాయవాదులకు, న్యాయమూర్తులకు నోటరీలకు, న్యాయ సలహాదారులకు, బెయిలిఫ్‌లకు, ఇతర న్యాయశాఖ కార్యకర్తలకు, వారితోపాటు న్యాయశాస్త్ర అధ్యాపకులకు ఉన్నత శిక్షణను కొనసాగిస్తాయి, వీటి పాఠ్యాంశాలలో తాజా శాసనాలు, తత్వశాస్త్రం, సమాజ విజ్ఞానశాస్త్రం. అర్థశాస్త్రం వగైరాలపై ఉపన్యాసాలు, సెమినార్‌లు చేరి ఉంటాయి. సోవియట్ యూనియన్‌లో న్యాయశాస్త్ర పరిశోధనా సంస్థలు గణనీయంగా ఉన్నాయి. ఇందు సోవియట్ శాసనాల సంస్థ రాజ్య వ్యవస్థ- చట్టాల సంస్థ నేరాలకుగల కారణాలను, వాటిని- నిరోధించే మార్గాలను అధ్యయనంచేసే సంస్థ. సామాజిక నిపుణుల కేంద్ర పరిశోధక సంస్థ వగైరాలు చేరివున్నాయి. కేసుల పరిశీలనలో అనుసరించే విధానం చాలావరకు భారతదేశంలోనూ, ఇతర దేశాలలోనూ అనుసరించే విధానంతో పోలి ఉంటుంది. సోవియట్ న్యాయ విధానపు ప్రత్యేక స్వభావంవల్ల ఉత్పన్నమయ్యే కొన్ని నిర్దిష్ట విషయాలలోనే కొద్దిపాటి తేడాలుంటాయి. క్రిమినల్ కేసుల విచారణలో ఇతర దేశాలలో వలెనే క్రమబద్ధ విచారణకు ముందు దశ ఒకటి ఉంటుంది. ఈ దశలో అధికారయుత న్యాయస్థానం ఆ వ్యక్తిపై చేయబడ్డ ఆరోపణలు నేరం క్రిందికి వస్తాయా, అతనిపై మోపిన నిందలు సరిగాను, స్పష్టంగాను ఉన్నాయా అన్న విషయాలను పరిశీలిస్తుంది ఈ విషయాలన్నిటినీ నిర్వహణ సమావేశం అనబడేదానిలో నిర్ణయిస్తారు. ఈ సమావేశానికి ప్రొక్యురేటర్ విధిగా హాజరు కావాలి విచారణ ప్రారంభమయ్యే ముందు స్వచ్ఛంద ప్రొక్యురేటర్‌లను, స్వచ్ఛంద డిఫెన్స్ న్యాయవాదులను అనుమతించే విషయంపైకూడా నిర్ణయం తీసుకోబడుతుంది. విచారణ స్థలము, కాలము నిర్ణయింపబడతాయి. నిందితుడూ, ఫిర్యాదు చేసినవారూ, వారి న్యాయవాదులు ఆ కేసుకు సంబంధించిన అన్ని వివరాలను సవివరంగా పరిశీలించేందుకు అన్ని అవకాశాలు కల్పించబడతాయి. నిందితునికి

నేరారోపణ పత్ర ప్రతిని అందజేస్తారు. అందు ఎలాంటి మార్పులైనా చేసే విషయంపై న్యాయమూర్తి గైకొన్న నిర్ణయాలను నిందితునికి తెలియబరుస్తారు. చట్టప్రకారం నేరస్తుణ్ణి నిర్బంధించేందుకు నిర్ణయం గైకొన్న 14రోజుల లోపునే న్యాయస్థానంలో క్రిమినల్ చర్యల అమలును చేపట్టవలసి ఉంటుంది. న్యాయస్థానాలలో కేసులను వడి, వడిగాను, క్రమబద్ధంగాను పరిశీలించి, నిర్ణయాలు గైకొనేందుకు ఈ పద్ధతి గట్టి హామీ నిస్తోంది.

న్యాయమూర్తిగాని, న్యాయవాదిగాని ప్రత్యేక దుస్తులు ఏవీ వేసుకోరు నల్లకోటు, గౌను ధరించే బ్రిటిషు పద్ధతి కొన్ని చారిత్రక కారణాలవల్లనే తలెత్తింది. ప్రజలకు న్యాయమూర్తులకు, న్యాయవాదులకు మధ్య ఇట్టి ప్రత్యేకతను ఏర్పరచటం కృత్రిమమైనదిగాను, అనవసరమైనదిగాను భావిస్తారు. న్యాయస్థానాలలో ఇతరులకంటె ఎత్తైన వేదికపై న్యాయమూర్తులు కూర్చుంటారు. న్యాయమూర్తులు, అసెస్సర్లు కోర్టులోకి ప్రవేశించే సమయంలో అక్కడున్న ప్రతివారు లేచి నిలబడి, వారు తమ స్థానాలను అలంకరించాకే కూర్చుంటారు. న్యాయస్థానంలో మాట్లాడే, ప్రశ్నలడిగే సాక్షులు, న్యాయవాదులు వగైరా నిలబడే మాట్లాడుతారు.

విచారణ ప్రారంభంకాగానే, సత్యాన్నే చెప్పవలసిన బాధ్యత సాక్షులకు గుర్తు చేయబడుతుంది. అంతట న్యాయమూర్తి న్యాయపీఠాన్ని అలంకరించేవారి పేర్లను ప్రకటిస్తాడు అట్టి న్యాయమూర్తి లేదా అసెస్సర్లు ప్రాసిక్యూటర్, ఇతర నిపుణులు, దుబాసి, న్యాయస్థాన కార్యదర్శి, మున్నగువారికి ఈ కేసులలో ప్రత్యక్షంగాను, పరోక్షంగాను సంబంధమున్న కారణం చూపి, వారు కేసు విచారణలో పాల్గొన తగరులు కాదేమోనని చెప్పమని అడుగుతాడు. అంతట కోర్టువారు నిందితుడిని వాది ప్రతివాది పక్షముల హక్కులు విధులను గురించి సవివరంగా తెలియజేస్తారు. అటు తర్వాత సాక్ష్యాలను, ఇతర పత్రాలను సరికొత్తగా అధ్యయనం చేసేందుకై కొత్త సాక్ష్యాలు, నిపుణులు పిలిపించవలసి ఉంటుందేమో కనుక్కుంటారు. ఈ సందర్భంలో తలెత్తిన సమస్యలపై కోర్టువారు నిర్ణయాలు గైకొంటారు. అంతట నేరారోపణ పత్రం చదువబడుతుంది. విచారణ ప్రారంభమవుతుంది. విచారణలన్నీ ఎలాంటి విఘ్నము లేకుండా పూర్తయ్యేవరకు కొనసాగి తీరాలి. విచారణలో పాల్గొనే న్యాయమూర్తులెవరైనా ఏ కారణం

చేతనైనా ఆ కేసు విచారణలో కొనసాగేందుకు వీలులేకపోతే అట్టి కేసు ఏ దశలో ఉన్నా సరే మొదటినుండి ప్రారంభించవలసి ఉంటుంది.

ఒక క్రిమినల్ కేసులో విధించబడే శిక్షలు మౌలిక శిక్షలుగాను, అప్రధాన శిక్షలుగాను వర్గీకరించబడతాయి. ఈ మౌలిక శిక్షలు ప్రధాన, స్వతంత్ర శిక్షణా చర్యలుగా ఉంటాయి. అప్రధాన శిక్షలన్నవి, అదే నేరానికి మౌలిక శిక్షలకు తోడుగా విధించబడేవిగా ఉంటాయి. ఈ మౌలిక శిక్షల్లో ఖైదుశిక్ష, ప్రవాసము నివాస, విహారాలపై నిర్బంధము జైలు శిక్షేతర దిద్దుబాటు శ్రమ, నిర్దిష్ట పదవులకు, కార్యనిర్వహణకు అనర్హత, జరిమానాలు, బహిరంగ అభిశంసన వగైరాలు చేరి ఉంటాయి. అప్రధాన శిక్షలలో ఆస్తిని జప్తు చేయటం, సైనికాధికారులైతే సైనిక విశిష్ట రాంకుల రద్దు, క్రమ శిక్షణా విభాగానికి బదలాయింపు వగైరాలు చేరి ఉంటాయి. రష్యన్ ఫెడరేషన్, ఉక్రేనియా, కజక్ రిపబ్లిక్కుల శాసనావళిలో స్వల్పమైన తేడాలున్నాయి.

ఉరిశిక్ష, తుపాకి కాల్పు ద్వారా చంపటమన్నది, మరీ ప్రత్యేక సందర్భాలలో తప్ప సాధారణంగా విధించబడదు. దీన్ని పూర్తిగా నిషేధించాలని అనుకొంటున్నారు. 18 ఏళ్ళు నిండని మైనర్లకు, నేరం చేసేటప్పుడుగాని, శిక్ష విధించేటప్పుడుగాని, దాన్ని అమలు జరిపే సమయంలోగాని, గర్భవతిగా ఉన్న మహిళలకు ఉరిశిక్ష విధించుటకు, అమలు జరుపుటకు వీలులేదు. ఖైదు శిక్ష సాధారణంగా 5 సంవత్సరాలకు మించదు. అత్యంత ప్రమాదకారులైన నేరస్థులకు విధించబడే శిక్ష 15 సంవత్సరాలు ఉంటుంది.

తాను నివసించే చోటినుండి తొలగించి, నిర్దిష్ట ప్రదేశంలో తప్పని సరిగా నివసించాలనే శిక్షను ప్రవాస శిక్ష అంటారు. ప్రవాస నివాస మన్న శిక్షలో, శిక్షితుడిని తన నివాస ప్రాంతంనుండి తొలగించి, ఒక ప్రత్యేక ప్రదేశంలో నివసించకూడదనే ఆంక్షను కూడా విధించటం జరుగుతుంది.

ఈ శిక్షను 5 ఏళ్ళకు మించకుండా విధించటం జరుగుతుంది. ఈ శిక్షను మైనర్లకు, గర్భవతులకు, 8 ఏళ్ళ లోపు వయసుగల పిల్లల తల్లులకు, వికలాంగులకు వర్తింప జేయరు.

ఖైము శిక్షేతర దిద్దుబాటు శ్రమ అన్నది ఎక్కువగా విధించబడే శిక్షలలో ఒకటి. ఇట్టి సందర్భాలలో శిక్షితులను సంస్కరించి, పునర్ విద్యావంతులను గావించడం ప్రధాన లక్ష్యంగా ఉంచుకుంటారు. ఈ శిక్ష ఒక నెల నుండి, ఒక సంవత్సరం వరకు ఉండవచ్చు. ఇది శిక్షితుడు పనిచేసే చోటున గాని, అతని నివాస ప్రాంతానికి దగ్గరలోగాని, ఆ శిక్ష విధించిన న్యాయస్థాన సూచనల ననుసరించి శిక్షల నమలు జరుపుతారు. దిద్దుబాటు శ్రమ శిక్ష విధించబడిన వ్యక్తి ఆదాయం నుండి ప్రభుత్వ ఉపయోగం కోసం 5 నుంచి 20 శాతం వరకు మినహాయిస్తారు. వికలాంగులైన వారికి దిద్దుబాటు శ్రమకు బదులుగా జరిమానా గాని, బహిరంగ అభిశంసన గాని శిక్షగా విధింపవచ్చు.

శిక్షితుడు తాను దిద్దుబాటు శ్రమశిక్ష ననుభవిస్తున్న కాలంలో శ్రమ పట్ల చైతన్యపూరిత వైఖరిని చూపి ఆదర్శప్రాయంగా ప్రవర్తించినట్లయితే ప్రజా సంఘాల విజ్ఞప్తి మేరకు కోర్టువారు అట్టి శిక్షా కాలాన్ని కూడా ఆ నిందితుని సాధారణ సర్వీసుకు పూర్తిగా కలిపి వేయవచ్చు.

ఒక నిందితుడు నిర్వహిస్తున్న పదవి, లేదా కార్య నిర్వహణ నుండి అనర్హత అన్న శిక్షాకాలం ఒకటి మొదలు 5 సంవత్సరాల కాలం ఉండవచ్చు. ఇట్టి శిక్షలు ఆ నిందితుని వృత్తి, లేక పదవీ నిర్వహణకు సంబంధించిన నేరాలకై విధించబడుతుంది ఉదాహరణకు, ఒక వ్యక్తి ఆ వృత్తి నిబంధనలను పదే, పదే ఉల్లంఘించినప్పుడు, ప్రభుత్వ స్టోర్సులో పని చేస్తూ కొనుగోలుదారులను మోసగించినప్పుడు కోర్టువారు అతనిని అంగళ్ళలో ఏమాత్రము పని చేయకుండా నిషేధించవచ్చు. అనారోగ్యకరమైన పరిస్థితులలో శస్త్రచికిత్స చేసిన నేరానికి పాల్పడ్డ వైద్యుణ్ణి, వైద్యవృత్తి చేయకుండా నిషేధించవచ్చు.

జరిమానా అన్నది, కోర్టువారు విధించే ద్రవ్య సంబంధమైన శిక్ష అని వేరే చెప్పనిలేదు. అయితే ఇది శిక్షితుని ఆర్థిక శక్తికి ఏ పరిస్థితులలోను మించి ఉండరాదు. దీనివల్ల అతని పదార్థిక, తదితర పరిస్థితులకు తీవ్రమైన నష్టం వాటిల్లరాదు.

ఒక వ్యక్తి, తానలంకరించిన పదవిని ఊతగాగొని నేరాలకు పాల్పడిన సందర్భంలో, ఆ పదవిలో అతనిని కొనసాగ నివ్వడం ఇంకెంతో

మాత్రమూ మంచిది కాదని భావించినపుడు కోర్టువారు అతనిని ఆ పదవి నుండి తొలగించవచ్చు. అయితే, దీనికీ ఒక నేరస్తుడిగా పేర్కొన్న వ్యక్తికి మరెక్కడా పని యివ్వగూడదన్న ఉత్తర్వు కూడా గల తేడా చూడాలి పదవి నుండి తొలగింపు అంటే, నిర్దిష్ట కార్యాలయంలో అతడు నిర్వహిస్తున్న పదవి నుండి తొలగింపు మాత్రమే. మరో సంస్థలోనో, కర్మాగారంలోనో అదేరకం పదవిలో అతను తిరిగి నియమింపబడడానికి యిది ఆటంకం కాబోదు.

తాను చేసిన తప్పువల్ల వాటిల్లిన దుష్ఫలితాలను, నేరం చేసిన వ్యక్తే తొలగించగలడని కోర్టువారు భావించినట్లయితే అతనిని అక్కడే తిరిగి నియమించవచ్చు. ఈ నేరస్తునివల్ల నష్టానికి గురయినవారికి పరిహారం చెల్లించమనడమో, బహిరంగ క్షమాపణ చెప్పడమో చేయిస్తారు. కోర్టువారు నిర్ణయాన్ని అమలు పర్చడంలో నిందితుడు విఫలమయ్యే పక్షంలో అతనికి దిద్దుబాటు శ్రమ, జరిమానా, బహిరంగ అభిశంసనవంటి శిక్షలు విధించవచ్చు.

బహిరంగ అభిశంసన అంటే, దోషిని కోర్టువారు అభిశంసించడమన్నమాట. అవసరమైన సందర్భాల్లో నిందితుని నేరాన్ని పత్రికా ప్రచురణ, లేదా మరోవిధంగా గాని ప్రజలందరి దృష్టికి తేవడం జరుగుతుంది.

ఆస్తి స్వాధీనం అంటే, ఎలాంటి నష్టపరిహారం లేకుండా వ్యక్తి ఆస్తిని స్వాధీన పర్చుకుని, ప్రభుత్వ ఆస్తిగా మార్చడం. అయితే, జీవితావసర వస్తువులను స్వాధీనం చేసుకోరాదు. స్వాధీనం చేసుకుందుకు వీల్లేని వస్తువుల జాబితాను చట్టం పేర్కొనింది.

తీవ్రమైన నేరాలకు పాల్పడిన వారి నుండి కోర్టువారు సైనిక, తదితర విశిష్ట హోదాలను, బిరుదులను గౌరవాలను, పతకాలను తొలగించవచ్చు.

అమలు జరపకుండా నిలిపి వుంచిన శిక్ష అనగా, శిక్షితుడైన వ్యక్తి కోర్టువారు నిర్ణయించిన కాలంలో అదే నేరాన్ని, లేదా అంతే తీవ్ర స్వభావంగల మరో నేరాన్ని చేయకపోతే అమలు చేయబడని శిక్ష.

ఒక నేరస్థుడి ప్రవర్తనను సరిదిద్దేందుకై ప్రజా సంఘానికి అప్పగించడం సోవియట్ కోర్టులు విధించే ప్రత్యేక తరహాకు చెందిన శిక్ష.

ఒక నేరం చేసి, మానసిక రుగ్మతవల్లగాని, లేదా, మరో విధమైన అసాధారణ స్థితివల్లగాని అందుకు కారణం చెప్పజాలని వ్యక్తికి వైద్య చికిత్స జరపవలసిందిగా కోర్టువారు నిర్దేశించవచ్చు.

మైనర్ల విషయంలో కోర్టువారు అతనికి హెచ్చరికగాని, మందలింపుగాని, గాయపరచిన వ్యక్తికి బహిరంగ క్షమాపణగాని శిక్షగా విధించవచ్చు; తల్లిదండ్రుల ప్రత్యక్ష పర్యవేక్షణలోగాని, కార్మిక దిద్దుబాటు సంస్థల ఆధ్వర్యంలోగాని వుంచవచ్చు; బాలలు యువకులపై ప్రత్యేకించబడిన వైద్య, విద్యా సంస్థలకు అప్పగించవచ్చు. ఈ చర్యలన్నీ విజ్ఞానదాయక చర్యలే. ఇవి క్రిమినల్ శిక్షలు కావు. సాధారణ శిక్షలకు బదులుగానే వీటని విధిస్తారు. కనుక ఈ విధమైన చర్యలు అట్టి బాలునికి నేరపూరిత చరిత్రను సృజించవు. అందువల్ల యితర న్యాయ సంబంధమైన చిక్కులేవీ కలుగవు.

ప్రజా కోర్టుల న్యాయమూర్తులు సివిల్, క్రిమినల్ కేసులు రెండింటినీ విచారిస్తారు. ఉన్నత న్యాయస్థానాల్లోనే సివిల్ క్రిమినల్ కేసుల తొలి విచారణ, లేదా అప్పీళ్ళకై ప్రత్యేక విభాగాలుంటాయి. సోవియట్ దేశ సుప్రీంకోర్టులో ఒక సైనిక విభాగం ఉంది.

కోర్టుల సివిల్ పరిధి కింది వాటికే వర్తిస్తుంది :

(అ) సివిల్, కుటుంబం, పని, సమిష్టిక్షేత్రం వీటికి చెందిన న్యాయ సంబంధాల మూలంగా తలెత్తిన వివాదాల్లో, కనీసం ఒక పక్షమైనా పౌరుడో, సమిష్టిక్షేత్ర రైతో అయివున్నపుడు;

(ఆ) అంతర్జాతీయ విమాన సరకు రవాణా కంట్రాక్టుల విషయంలో రవాణా కంపెనీకి, వాడకందారులకు మధ్య వివాదం తలెత్తినపుడు;

(ఇ) పాలక సంస్థలవల్ల ఉత్పన్నమయ్యే వివాదాలు—ఉదాహరణకు జరిమానాల విధింపు. ఓటర్ల జాబితాలో దొర్లే పొరపాట్లు, పన్నులు, సుంకాల వసూళ్ళకు సంబంధించిన ఫిర్యాదులు ;

(ఈ) ప్రత్యేక కార్యసరళికి సంబంధించిన నిబంధనల క్రిందగై కొనే చర్యలు (ఒక పౌరుడు కనబడటం లేదనో, చనిపోయినట్లో

ప్రకటించడం"; ఆ సీకి యజమాని లేడని ప్రకటించడము; పబ్లిక్ నోటరీల చర్యలపై ఫిర్యాదులు, పోగొట్టుకొన్న పత్రాలలో నమోదయిన హక్కులను పునరుద్ధరించడంపై చేసే ప్రకటనలు వగైరా.)

వరాయి దేశసులు, విదేశీ సంస్థలు పాల్గొనే సివిల్ కేసులను కూడా కోర్టులు సాధారణ ప్రాతిపదికపై విచారిస్తాయి. కొన్ని సందర్భాలలో యిట్టి వివాదాలను మధ్యవర్తిత్వ బోర్డులద్వారా - ఉదాహరణకు నౌకా రవాణా మధ్యవర్తిత్వ ఉపసంఘం, సోవియట్ దేశ పారిశ్రామిక, వాణిజ్య సంస్థ, విదేశీ వాణిజ్య మధ్యవర్తిత్వ ఉప సంఘాలద్వారా పరిష్కరించడానికి చట్టం అనుమతిస్తోంది. వీటన్నిటినిబట్టి వ్యక్తిగతంగా పౌరులు, సంస్థలు, కర్మాగారాలు, కార్యాలయాలు న్యాయశాస్త్ర పరమైన వ్యక్తిత్వ హక్కులను కలిగిఉన్న సందర్భాల్లో సివిల్ విచారణలలో వాదులుగాను, ప్రతివాదులుగను ఉండవచ్చు, కార్య విధానం విషయంలో వీటికి సమాన హక్కులు ఉంటాయి అనేది స్పష్టం.

ప్రొక్యురేటర్ కూడా అట్టి విచారణలో పాల్గొనవచ్చు. ఆయన ప్రభుత్వ, సామాజిక ప్రయోజనాలను కాపాడేందుకు, తన విచక్షణాధికారంతో వ్యక్తి ప్రయోజనాలను కాపాడేందుకు యిట్టి విచారణలో పాల్గొనవచ్చు. తాను విచారణలో పాల్గొన్న సందర్భంలో తాను వాదించేందుకు తగు చర్యలు గైకొందుకు పూర్తి హక్కును కలిగి ఉంటారు.

ఒక సివిల్ కేసుకుసంబంధించిన ఇరువక్షాలూ ఆ కేసులో తన తరఫున వాదించేందుకు న్యాయవాదితో సహా ఒక ప్రతినిధిని ఎవరినైనా నియమించుకోవచ్చు. తమ హక్కులను స్వయంగా కాపాడుకోజాలని పౌరుల, మైనర్ల ప్రయోజనాలను వారి తలితండ్రులు, పోషకులు సంరక్షించవచ్చు. ఇట్టివారికి ప్రాతినిధ్యం వహించేవారిని "చట్టబద్ధ ప్రతినిధులు" అంటారు.

చట్టంలో పేర్కొన్న నియమాలప్రకారం వాదిని లేదా ప్రతివాదిని, కోర్టుఖర్చులను చెల్లించమని న్యాయస్థానం కోరవచ్చు. (ఈ కోర్టు ఖర్చులలో ప్రభుత్వ పన్ను - యిది మన దేశంలో విధించే న్యాయస్థానపు సుంకానికి సమవాచకంగా పేర్కొనవచ్చు- విచారణ సందర్భంగా అయ్యే ఖర్చులు చేరి ఉంటాయి.) వాదులను కొన్ని సందర్భాల్లో కోర్టు ఖర్చులు

చెల్లించకుండా మినహాయింపు చేయవచ్చు. ఉదాహరణకు, భరణపుదావాలు కాపీరైట్ దావాలు, జీతాలు రాబట్టు కుందుకు వేసే దావాలు దీనికిందకు వస్తాయి.

సోవియట్ యూనియన్‌లో నేరాల దర్యాప్తు వేర్వేరు పోలీసుశాఖల ఉద్యోగులు జరిపిస్తారు. సోవియట్ యూనియన్ ప్రొక్యురేటర్ కార్యాలయ పరిశోధకులు సోవియట్ దేశగృహమంత్రిత్వ శాఖ పరిశోధకులు, ప్రభుత్వ భద్రతా కమిటీ పరిశోధకులు ఇలాంటి విధిని నిర్వహిస్తారు. వీరిని మన దేశపు సి. బి. ఇ. శాంతి భద్రతలకు బాధ్యత వహించే సి. ఐ. డి. పోలీస్‌తో పోల్చవచ్చు. అయితే కొన్ని విధినిర్వహణ భేదాలు ఉంటాయనుకోండి.

గమనించవలసిన ముఖ్య విషయం ఏమంటే, ప్రొక్యురేటర్ వ్రాతపూర్వకంగా ఉత్తర్వు చేయనిదే ఈ పరిశోధకులు అరెస్టులు, సోధాలు. ఉత్తర ప్రత్యుత్తరాల స్వాధీనం వంటి చర్యలను చేబట్టేందుకు వీలులేదు. కోర్టు ఉత్తర్వులపై అరెస్టులు జరిపించవచ్చు భారతదేశంతో గు ర్తింప దగిన నేరాలుగా పరిగణించబడే వాటిలో వారెంటు లేకుండానే పోలీసులు ఎవరైనా అరెస్టు చేయవచ్చు. సోవియట్ ప్రొక్యురేటర్‌కు పరిశోధనా సరళిపై పర్యవేక్షణాధికారం ఉంటుంది. ఆయన ఈ విషయాలలో బాధ్యత వహించే పరిశోధకుడికి, పరిశోధన తీరు, దిశను గురించిన సూచనివ్వవచ్చు. ఆయన వ్రాతమూలకంగా ఇచ్చే సూచనలను పరిశోధకులు విధిగా పాటించాలి. ఈ సూచనలతో పరిశోధకుడు విభేదించినట్లయితే, అంతకు పై హోదాగల ప్రొక్యురేటర్‌కు తన ఫిర్యాదును వ్రాతపూర్వకంగా సమర్పించవచ్చు. అట్టి పై అధికారియగు ప్రొక్యురేటర్ నిర్ణయాన్ని పాటించక తప్పదు ఈ పరిశోధనా ఫలితాలతో సంబంధమున్న వ్యక్తులు, సంస్థలు ఈ పరిశోధనా చర్యకు వ్యతిరేకంగా అప్పీలు చేసుకొనే అధికారం కలిగి ఉంటారు. ఈ అప్పీలు అందుకు సంబంధించిన పరిశోధక శాఖవారికి గాని, ప్రొక్యురేటర్‌కుగాని పంపుకోవచ్చు.

నేరారోపణ పత్రాన్ని రూపొందించే దశకు చేరుకున్న పరిశోధకుడు, నష్టపోయిన పక్షానికి, అంటే వాదికి, ప్రతివాదికీ కూడా ఆ కేసు వివరాలను అందజేయాలి. నిందితునికి, నిందితుని న్యాయవాదికి ఆ కేసుకు సంబంధించిన సమాచారాన్నంతా పరిశీలించుకొనే అవకాశం కల్పించాలి.

పరిశోధకుడు వారి విజ్ఞప్తులను తప్పనిసరిగా వినాలి. అవసరమైతే అదనపు పరిశోధనలు కూడా జరపాలి.

న్యాయస్థానము, న్యాయవాదుల వలెనే పరిశోధకుడికి కూడా సామాజిక విధులున్నాయి, ఒక నేరం జరగడానికి మూలకందమైన పరిస్థితులను, కారణాలను అతను లోతుగా పరిశోధించాలి. అట్టి వానిని తొలగించేందుకు అవసరమైన చర్యలు చేపట్టాలి. అతని పరిశోధనా కృషిలో ఇది అవిభాజ్య అంతర్భాగంగా ఉంటుంది.

అంతిమంగా ప్రొక్యూరేటర్‌ను గురించి కొద్ది మాటలు చెప్పాలి. ఇంతకుముందే పేర్కొన్నట్లుగా ప్రొక్యూరేటర్ జనరల్‌ను సోవియట్ దేశ సుప్రీం సోవియట్ నియమిస్తుంది. అతడు సుప్రీం సోవియట్ అధ్యక్ష వర్గానికి జవాబుదారీ వహించాలి. ప్రతి సంవత్సరము తన కృషిని గురించి సుప్రీం సోవియట్ అధ్యక్ష వర్గానికి నివేదికలను సమర్పించాలి. యూనియన్ రిపబ్లిక్కులు, ప్రదేశాలు, మండలాలు స్వయంపాలిత మండలాలు, జాతీయ ప్రాంతాలు – వీటిలో కూడా ప్రొక్యూరేటర్లుంటారు. వారు సోవియట్ దేశ ప్రొక్యూరేటర్ జనరల్‌కు లోబడి ఉంటారు. ఇతర స్థాయిలలో కూడా ప్రొక్యూరేటర్లు ఉంటారు. ఈ విధంగా ప్రొక్యూటర్ పదవి, ప్రొక్యూరేటర్ జనరల్ ఆధిపత్యంలో ఒకే కేంద్రీకృత వ్యవస్థగా ఉంటుంది. ఉన్నతస్థాయి ప్రొక్యూరేటర్లు తమ క్రింది స్థాయి ప్రొక్యూరేటర్లు చేసిన నిర్ణయాలను తిరగదోడేందుకు, మార్చేందుకు హక్కు కలిగి ఉంటారు. ఇట్టి ఉన్నతస్థాయి ప్రొక్యూరేటర్ తన క్రింది స్థాయి ప్రొక్యూరేటర్ కార్యాలయపు పనికి బాధ్యత వహిస్తాడు. ప్రొక్యూరేటర్ కార్యకలాపాలు క్రింది రూపంలో ఉంటాయి.

1. అన్ని మంత్రి వర్గాలు, శాఖలు, స్థానిక ప్రభుత్వ సంస్థలు, ఉద్యోగులు సాధారణ పౌరులు చట్టాలను తు. చ. తప్పక పాటించేలా పర్యవేక్షించడం;

2. ప్రాథమిక అన్వేషణలు, పరిశోధనలు జరిపే సంస్థలు, ప్రభుత్వాంగాలు చట్టబద్ధ పద్ధతులనే ఖచ్చితంగా అనుసరించేలా కనిపెట్టి ఉండడం;

3. న్యాయమూర్తి తీర్పులకు నిర్ణయాలకు, ఆదేశాలకు గల ఆధారాలను పరిశీలించి, ఉన్నత స్థాయిలో దానిపై తగు చర్య గైకొనేలా చర్యల నారంభించడం;

4. శిక్షితులైన వారిని నిర్దిష్ట ప్రదేశాలలో చట్టబద్ధంగా నిర్బంధించే కార్యక్రమాన్ని పర్యవేక్షించడం.

ప్రొక్యురేటర్‌కు క్రిమినల్ కేసుల విచారణలో పాల్గొనే హక్కుందని వేరే చెప్పనక్కరలేదు. సోవియట్ దేశ ప్రొక్యురేటర్ జనరల్ సోవియట్ దేశ సుప్రీంకోర్టు విస్తృత సమావేశాలలో పాల్గొంటాడు. వివిధ రిపబ్లిక్కుల ప్రొక్యురేటర్లు ఆయా రిపబ్లిక్కుల సుప్రీంకోర్టుల విస్తృత సమావేశాల్లో పాల్గొంటారు. ప్రొక్యురేటర్ జనరల్ సోవియట్ దేశ సుప్రీంకోర్టుకు, వాటి పరిశీలనలో ఉన్న సమస్యల సారాంశంపై తన సూచనలను ప్రతిపాదించవచ్చు.

శిక్షితులైన వ్యక్తుల విషయంలో ప్రొక్యురేటర్‌కు విస్తృతమైన అధికారాలుంటాయి. వారిని నిర్బంధించిన ప్రదేశాలలో శిక్షకను వైన విజ్ఞాన ప్రసార కార్యక్రమం సక్రమంగా అమలు జరుగుతున్నది లేనిది ఆయన పర్యవేక్షించవచ్చు, శిక్షితులైనవారి ఫిర్యాదులను వ్యక్తిగతంగా విచారించవచ్చు. తమకు అవసరమని తోచినపుడు వారిని నిర్బంధించి ఉంచిన ప్రదేశాలకువెళ్ళి పరిశీలించే అధికారం ప్రొక్యురేటర్ల కున్నది. అట్టి సంస్థల ఆవరణలలోకి బేషరతుగా వెళ్ళి పరిశీలించే అధికారమున్నది. ఖైదులో ఉంచబడిన వ్యక్తులకు సంబంధించిన పత్రాలను సవివరంగా పరిశీలించవచ్చు. ఖైదీలను వ్యక్తిగతంగా కలుసుకుని ఫిర్యాదుల విషయమై జైలు పాలకవర్గం వారి నుండి వ్యక్తిగతంగా సంజాయిషీ అడిగే అధికారం ఉంటుంది.

ఈ విధంగా ప్రొక్యురేటర్ కార్యాలయానికి ఒక రాజ్యాంగ పరమైన హోదా ఉన్నది. చట్టబద్ధతను కాపాడి సుస్థిర మొనర్చే ఒక స్వతంత్ర సంస్థగా దీనిని పేర్కొనవచ్చు. ఈ అధ్యాయానికి "న్యాయ స్థానాలు, పోలీసు ప్రాసెక్యూటర్" అని పేరు పెట్టాము. ఇది సోవియట్ యూనియన్‌లోని ప్రొక్యురేటర్‌ను, ఇ త ర దే శా ల లో ని పబ్లిక్ ప్రాసెక్యూటర్‌తో సమానుడుగా పరిగణించడంలాగా కనబడవచ్చు

అయితే నా ఉద్దేశం ఇది కాదు. ప్రొక్యూరేటర్ విధులపై దిజ్మాత్రమైన అవగాహన కలిగించడమే నా ఉద్దేశం.ఈ పౌలిక ప్రొక్యూరేటర్ విధులలోని ఒక భాగానికి మాత్రమే వర్తిసుంది. చాలా దేశాలలోని పబ్లిక్ ప్రాసెక్యూటర్లు ప్రభుత్వం తరపున క్రిమినల్ కేసులు నడిపే బాధ్యతను కలిగి ఉంటారు. అయితే, సోవియట్ యూనియన్‌లో అతడు సివిల్ కేసులలో కూడా పాల్గొనవచ్చు. అంతేగాక అతడు ఆంబుత్స్‌మన్ పాత్ర వహించవలసి ఉంటుంది కూడా. సాధారణంగా ఆంబుత్స్‌మన్‌కు ఉండే చట్టబద్ధ అధికారాలకంటే ఇతని కెక్కువ అధికారాలుంటాయి. ఒక్కమాటలో చెప్పాలంటే చట్టబద్ధతను నెలకొల్పి పెంపొందించే స్వతంత్ర, మార్గదర్శక సంచాలక అధికారిగా సోవియట్ దేశ ప్రొక్యూరేటర్ పని చేస్తాడు. అయితే ఇంత చేసినా చట్టబద్ధతకు భంగం వాటిల్లే పరిస్థితి ఉండదా? అని కొందరడగవచ్చు. అసలు న్యాయస్థానాలు, ప్రొక్యూరేటర్లు వగైరా లుండడమే పొరపాట్లు చేసే వ్యక్తులు, పొరపాటు ధోరణులు సోవియట్ యూనియన్‌లో ఇంకా పూర్తిగా అంతరించలేదనీ, వానిని సంస్కరించి సవరించాల్సిన అవసరముందనీ తెలియచేస్తాయి. పెట్టుబడిదారీ వ్యవస్థపై తన ఆధిక్యతను నిస్సందేహంగా నిరూపించుకొని, సమాజ పురోగతికి కనీవినీ ఎరుగని నూతన అవకాశాలను ఆవిష్కరించిన సోషలిస్టు వ్యవస్థ వర్ధిల్లుతున్న సోవియట్ యూనియన్ నానాటికి ఉన్నతోన్నత స్థాయి చట్టబద్ధతను సాధించేందుకే పురోగమిస్తూన్నదనేది నిస్సందేహం.